హైదరాబాదు - 500 004

# ఆధునిక భాషాశాస్త్ర సిద్ధాంతాలు

డా॥ పి.యస్. సుబ్రహ్మణ్యం



ప్రచురణ
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు - 500 004
1997

AADHUNIKA BHASHA SAASTRA SIDDHANTALU. - a book on the principles of Modern Linguistics, in Telugu by Dr P S Subrahmanyam



ప్రచురణ సంఖ్య . 139

ప్రథమ ముద్రణ 1984
ద్వితీయ ముద్రణ 1993
తృతీయ ముద్రణ 1997

ప్రతులు : 2000

వెల రూ. 50/-

ప్రతులకు :
డైరక్టర్, ప్రచురణల విభాగం,
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం,
పబ్లిక్‌గార్డెన్స్, నాంపల్లి, హైదరాబాదు - 500 004.

ముద్రణ :
పద్మశ్రీ గ్రాఫిక్స్,
గాంధీనగర్, హైదరాబాదు
ఫోన్ : 7612283

I.S.B N. No 81-86073-34-5

ఆచార్య నాయని కృష్ణకుమారి
ఉపాధ్యక్షులు
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

లలిత కళాక్షేత్రం, పబ్లిక్‌గార్డెన్స్,
హైదరాబాదు - 500 004

# సమర్పణ

బోధన, పరిశోధన, ప్రచురణ అనే మూడు విషయాలు లక్ష్యంగా, తెలుగు సాహిత్యం, భాష, చరిత్ర, కళలు - సంస్కృతి వంటి రంగాలలో కృషి సల్పడానికి 1985 వ సంవత్సరంలో పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఆవిర్భవించింది పూర్వం ఉన్న ఆంధ్రప్రదేశ్ సాహిత్య, నృత్య, సంగీత, నాటక, లలితకళా అకాడమీలు ఇందులో విలీనం కావడం వలన పైన పేర్కొన్న లక్ష్యాలతో పాటు మరెన్నో బాధ్యతలు దీనికి సంక్రమించాయి అన్ని విశ్వవిద్యాలయాల వలే కేవలం పఠన పాఠనాలతో సరిపెట్టుకునే అల్ప పరిధి కాదు దీనిది. మన సంస్కృతిని ప్రపంచం నలుమూలలకు వ్యాప్తి చేయడానికి ఉద్దేశింపబడిన "సాంస్కృతిక విశ్వవిద్యాలయు" మిది. ప్రచార సాధనకు పరికరమే ప్రచురణ

ప్రచురణ కార్యక్రమానికి అనుగుణంగా, ఈ విశ్వవిద్యాలయం యిప్పటికెన్నో ప్రముఖ గ్రంథాలను ప్రచురించింది. వ్యాఖ్యాస్రవంతి శీర్షికను సుప్రసిద్ధ పండితులచే ప్రాచీన కావ్య ప్రబంధాలకు వ్యాఖ్యానాలు వ్రాయించి ప్రచురించింది. ఇప్పటి వరకు ఈ ప్రణాళికలో కుమార సంభవం, కాశీ ఖండం, శివరాత్రి మహాత్మ్యం, ఉత్తరహరివంశం వంటి గ్రంథాలను వ్యాఖ్యా సహితంగా ముద్రించింది.

తెలుగులో పేరుపొందిన ప్రాచీన ఆధునిక గ్రంథాలను ఇంగ్లీషు, హిందీ భాషలలోనికి అనువాదం చేయించి ప్రచురించింది.

తెలుగులో విజ్ఞాన సర్వస్వ సంపుటాలను తయారుచేయించే కార్యక్రమంలో విశ్వసాహితిని 'హిస్టరీ అండ్ కల్చర్ ఆఫ్ ది ఆంధ్రాస్' అనే పేరుతో ఆంగ్లంలో ఒక సంపుటాన్ని ప్రచురించింది.

భాషాభివృద్ధి కృషిలో భాగంగా 'తెలుగు భాషా చరిత్ర', 'ద్రావిడ భాషలు' అనే గ్రంథాలను పునర్ముద్రించింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సాంఘిక సంక్షేమ శాఖవారి సహకారంతో డాక్టర్ బి. ఆర్. అంబేద్కర్ రచనలు ప్రసంగాలను పది సంపుటాలుగా ప్రచురించింది

ఆధునిక యుగంలో భాషా శాస్త్రం కొత్త మలుపు తిరుగుతుంది కొత్త కోణాల్ని ఆవిష్కరిస్తున్నది విజ్ఞాన శాస్త్రం తన రెక్కలు విప్పుకొని గగన పథంలోకి ఎగబ్రాకుతున్నది ఈ నేపధ్యంలో భాషా శాస్త్రం గురించీ, దాని మౌలిక స్వరూప స్వభావముల గురించీ, దాని కీలకమైన సిద్ధాంతాల గురించీ తెలుసుకోవలసిన అవసరం ఏర్పడుతున్నది సాహిత్య సిద్ధాంతాలకూ, భాషా శాస్త్ర సిద్ధాంతాలకూ సమన్వయాన్ని కుదిరించవలసిన ఆవశ్యకత కూడా ఉన్నది విజ్ఞాన పిపాసకులకూ ముఖ్యంగా విద్యార్థులకూ ఉపయోగపడే విధంగా భాషా శాస్త్రానికి సంబంధించిన పలు అంశాలను ప్రముఖ భాషా పండితులు ఆచార్య పి.యస్ సుబ్రహ్మణ్యంగారు "ఆధునికి భాషా శాస్త్ర సిద్ధాంతాలు" గ్రంథంలో వివరించారు. భాషా శాస్త్ర సిద్ధాంతాలనూ, ఇటీవలి ధోరణులనూ, సులభ తరంగా విశ్లేషించి గ్రంథితం చేసారు. ఇది పలువురు అధ్యయనశీలురకూ, పండితులకూ, విద్యార్థులకూ, ఉపయుక్తంగా ఉంటుందనే ఉద్దేశ్యంతో పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం దీన్ని పునర్ముద్రించి పాఠకులకందిస్తున్నది. గతంలో దీన్ని ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ, మొదటిసారిగా, తెలుగు విశ్వవిద్యాలయం రెండవ సారిగా ముద్రించడం జరిగింది. ఈ సందర్భంలో దీని రచయిత ఆచార్య పి.యస్ సుబ్రహ్మణ్యంగారికి కృతజ్ఞతలు తెలుపుతున్నాము.

హైదరాబాదు
21.12.1997

నాయని కృష్ణకుమారి

నాయని కృష్ణకుమారి

# పీ ఠి క

ఆసన్నం బ్రహ్మణ స్తస్య తపసా ముత్తమం తపః
ప్రథమం ఛన్దసా మఙ్గమాహు ర్వ్యాకరణం బుధాః

ప్రాప్తరూపవిభాగాయా యో వాచః పరమో రసః
యత్ తత్ పుణ్యతమం జ్యోతిస్తస్య మార్గో 2 యు మాంజసః
( వాక్యపదీయం, ప్రథమకాండం, శ్లోకాలు 11,12 )

"పండితులు వ్యాకరణాన్ని బ్రహ్మస్వరూపమనీ, తపస్సులలో ఉత్తమ మైనదనీ వేదాంగాలలో ప్రథమ మనీ అంటారు.

గవాది రూప విభాగం పొందిన వాక్కుసారం పుణ్యతమమైన జ్యోతి ; దాన్ని తెలుసుకోవడానికి దగ్గరదారి వ్యాకరణం "

మన పూర్వులు వాక్కును బ్రహ్మస్వరూపంగానూ దేవతగానూ ఉపాసించి దాన్ని తెలుసుకోవడానికి మార్గమైన వ్యాకరణశాస్త్రాన్ని అన్ని శాస్త్రాలలోకి ముఖ్యమైనదిగా పరిగణించారు. ఈ వ్యాకరణశాస్త్రమే బహుధా విస్తరిల్లి నేడు శాఖోపశాఖలతో వృద్ధి పొందుతున్న భాషాశాస్త్రమైంది. ఇటీవలి కాలంలో భాషా శాస్త్రం కొన్ని యూరప్ దేశాలలోనూ ముఖ్యంగా అమెరికాలోనూ వృద్ధి పొంది అనేక దేశాలకు వ్యాపిస్తోంది. అయినా ఇది కేవలం పాశ్చాత్యుల మేధాసంపద నించి మాత్రమే పుట్టినది కాదు. పాశ్చాత్య పండితులకు సంస్కృతంతో పాణిని అష్టాధ్యాయితో ఏర్పడిన పరిచయం వర్ణనాత్మక భాషాశాస్త్ర పద్ధతులని తీర్చిదిద్దడానికి సహకరించింది; ఇంకా సహకరిస్తోంది.

ఈ గ్రంథం తెలుగు భాషా సాహిత్యాలు, భాషా శాస్త్రం ప్రధాన పాఠ్యాంశాలుగా విశ్వవిద్యాలయాలలో చదివే విద్యార్థులు భాషాశాస్త్రాన్ని గురించి తెలుసుకోవడానికి ఉద్దిష్టమైంది. ఇందులో మొదటి విభాగంలో భాష, వ్యాకరణాల స్వరూపం, పరస్పర సంబంధం చర్చించబడ్డాయి. రెండో విభాగంలో వర్ణనాత్మక భాషా శాస్త్ర పద్ధతులూ మూడో విభాగంలో

తులన చరిత్రాత్మక భాషా శాస్త్ర పద్ధతులూ విపులీకరించబడ్డాయి. భాషా శాస్త్ర సిద్ధాంతాలని గూర్చి క్షుణ్ణంగా తెలుసుకొన్నాక, ఆదికాలం నించీ వీటి పరిణామం తెలుసుకోవడం మంచిదనే ఉద్దేశంతో భాషాశాస్త్ర పరిణామ చరిత్ర నాలుగో విభాగంలో సమీక్షించబడింది. ఈ గ్రంథంలో కొత్త విషయం ఏమీ లేదు. దీనికి ఆధారభూతాలైన గ్రంథాలు ముఖ్యాధార గ్రంథ పట్టికలో ఇవ్వబడ్డాయి. ఒక శాఖలో ప్రత్యేక పరిశోధన చెయ్యదలుచుకొన్న విద్యార్థులూ, అతి నవీన పరిణామాలు తెలుసుకోగోరేవారూ ఆంగ్ల గ్రంథాలు చదవవలసిందే. అయితే ఆ గ్రంథాలని తేలికగా అర్థం చేసుకోగలిగిన అధికారాన్ని విద్యార్థులకు ఈ గ్రంథం సమకూరుస్తుందని ఆశయం.

యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ వారు దేశ్యభాషలలో విశ్వ విద్యాలయ స్థాయి పాఠ్యగ్రంథాలను తయారు చేయించడం అనే ప్రణాళికలో దీని రచనకు నిధి ఇచ్చి ప్రోత్సహించారు. (**U.G.C. Scheme of Text bool writing**) ఇందుకు వారికి కృతజ్ఞతలు.

ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ఈ గ్రంథం ప్రచురణ భారాన్ని స్వీకరించి అనతికాలంలో ప్రచురించినందుకు వారికి నా ధన్యవాదాలు మిత్రులు, కార్యదర్శి డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు ఇది త్వరలో వెలుగులోకి రావడానికి తీసుకున్న శ్రద్ధకు ప్రశంసనీయులు. దీనిని సర్వాంగసుందరంగా ముద్రించిన ముద్రాపకులకు అభినందనలు.

దీని ప్రథమ ముద్రణ 1984లో జరిగింది. ఇది భాషా శాస్త్ర జిజ్ఞాసువుల ఆదరణకు పాత్రమవడం ముదావహం. తెలుగు విశ్వవిద్యాలయం అధికారులు దీన్ని పునర్ముద్రణ చెయ్యడానికి నేను అడగకుండానే ముందుకు వచ్చారు. అందుకు తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులకీ, మిగిలిన అధికారులకీ నాధన్యవాదాలు. ఈ పునర్ముద్రణలో తగిన చేర్పులూ మార్పులూ చేశాను. దీన్ని దోష రహితంగా ముద్రించిన ముద్రాపకులకి నా అభినందనలు.

పి.ఎస్.సుబ్రహ్మణ్యం

# విషయ సూచిక


**I. ప్రస్తావన**

1. భాష - స్వరూప స్వభావాలు 3-14
   - 1 1. మానవభాష - ఉత్పత్తి చర్చలు
   - 1 2. జంతువులలో వార్తా ప్రసారం
   - 1.3. మానవభాషాలక్షణాలు
   - 1.4. లిపి
2. భాష -వ్యాకరణం - భాషాశాస్త్రం 15-22
   - 2.1 భాష - వ్యాకరణం
   - 2.2. భాషాశాస్త్రం - మూలసిద్ధాంతాలు

**II. వర్ణనాత్మక భాషాశాస్త్రం**

3. ధ్వని నిర్మాణం 25-44
   - 3.1. భాషాధ్వనులు - పరిశీలనావిధానాలు
   - 3.2 ముఖయంత్రం - ఉచ్చారణావయవాలు
   - 3.3. హల్లులలో ప్రయత్నభేదాలు
   - 3.4. అచ్చులు
   - 3.5. పదసంహిత, శ్రుతి
   - 3.6. ధ్వన్యాత్మక లిపి
4. వర్ణ నిర్మాణం 45-60
   - 4.1. ధ్వని - వర్ణం
   - 4.2. వర్ణం - సవర్ణం
   - 4.3 వర్ణ ప్రవృత్తి
   - 4.4. మత భేదాలు
   - 4.5. ఉత్పాదక వర్ణనిర్మాణం
5. పద నిర్మాణం 61-91
   - 5.1. అర్థకం - సార్థకం
   - 5.2 పదనిర్మాణ వర్ణనా పద్ధతులు
   - 5.3. అర్థకాలలో రకాలు
   - 5.4. విభక్తి సంయోజన - నిష్పాదన
   - 5.6. పదభేదాలు
   - 5.7. పదనిర్మాణ వాక్య నిర్మాణ విభాగం
6. వాక్య నిర్మాణం 92-114
   - 6.1 వాక్య నిర్మాణ సంబంధాలు
   - 6.2. భాషా భాగాలు
   - 6.3. సన్నిహితావయవాలు
   - 6.4. వ్యాకరణ వర్గాలు
7. పరివర్తన వ్యాకరణం 115-159
   - 7.1. ముఖ్యోద్దేశాలు, లక్షణాలు
   - 7.2. పదబంధ నిర్మాణం

7.3. అర్థలక్షణాలు
7.4. అంతరంగ నిర్మాణం - బహిరంగ నిర్మాణం
7.5. పరివర్తన సూత్రాలు
7.6. విభక్తి వ్యాకరణం
7.7 కొన్ని ఇటీవలి పరిణామలు
8. అర్థనిర్మాణం 160-172
8.1. 'అర్థం' అంటే ఏమిటి?
8.2. అర్థాలలో రకాలు
8.3. అర్థక్షేత్రం
8.4. వ్యాకరణార్థం
9. భాష - సంఘం 173-197
9.1 భాషాభేదాలు - సాంఘిక కారణాలు
9.2. స్థల మండలికాలు
9.3. కులమాండలికాలు
9.4. ప్రమాణభాష
9.5. బహుభాషా వ్యవహారం
9.6. బహుభాషా ప్రదేశం
9.7. వ్యాపారభాషలు
III. తులన చారిత్రాత్మక భాషాశాస్త్రం
10. భాషల విభజన 200-217
10.1. విభజన పద్ధతులు
10.2. లక్షణాత్మక విభజన
10.3 జన్మాత్మక విభజన
11. తులన పద్ధతి 218-234
11.1 భాషల జన్మ సంబంధం
11.2. సజాతి శబ్దాలు
11.3. వర్ణపునర్నిర్మాణం
11.4. ప్రత్యయ పునర్నిర్మాణం
11.5. మూలాభాషా సంస్కృతిపై ఊహలు
11.6 ఉపకుటుంబాలు
12. అంతరంగిక పునర్నిర్మాణం 235-240
12.1 అంతరంగిక పునర్నిర్మాణ పద్ధతి
12.2 పరిమితి
13. వర్ణ నిర్మాణ పరిణామం 241-258
13.1. ధ్వని పరిణామం
13.2. వర్ణసమీకరణం
13.3. వర్ణ విభేదం
13.4. వర్ణవ్యత్యయం
13.5. వర్ణాధిక్యం
13.6 వర్ణలోపం
13.7 క్వాచిత్క ధ్వని పరిణామాలు

13.8 తారతమ్య చరిత్ర
14. వ్యాకరణ నిర్మాణ పరిణామం 259-274
14.1. వాక్యసంబంధ సూచకాలలో మార్పు
14.2. శబ్దావళిపరిణామాలు
14.3. సంవర్గసృష్టి
14.4. సంవర్గలోపం
14.5. వాక్యనిర్మాణ పరిణామం
14.6. సామ్యం
15. అర్థవి పరిణామం 275-282
15.1. అర్థవిపరిణామం – హేతువులు
15.2. పదసృష్టి – పదనాశం
15.3. అర్థవిపరిణామంలో రకాలు
15.4. లోకనిరుక్తి
16. ఆదానం 283-289
16.1. ఆదానానికి అనుకూల పరిస్థితులు – కారణాలు
16.2. ఆదత్తపదాలలో రకాలు
16.3. భాషానిర్మాణంపై ఆదానం ప్రభావం
IV. భాషాశాస్త్ర పరిణామం
17. పాశ్చాత్య దేశాలలో భాషాశాస్త్ర పరిణామం 291-313
17.1. గ్రీక్ వ్యాకరణాలు
17 2. లాటిన్ వ్యాకరణాలు
17.3. మధ్యకాల గ్రంథాలు
17 4. పందొమ్మిదో శతాబ్దిలో పరిణామాలు
17 5. ఇరవయ్యో శతాబ్దిలో పరిణామాలు
18. భారత దేశంలో భాషా శాస్త్ర పరిణామం 314-335
18.1. శిక్షా ప్రాతిశాఖ్యలు
18.2. నిరుక్తం
18.3 అష్టాధ్యాయి
18.4. అష్టాధ్యాయీవ్యాఖ్యలు, ఇతర సంస్కృత వ్యాకరణాలు
18.5. తొల్కాప్పియం
19. అష్టాధ్యాయి – ఆధునిక భాషాశాస్త్రం 336-354
19.1. ఉపోద్ఘాతం
19.2. వ్యాకరణ రచనలో లాఘవం
19.3. వర్ణం – సవర్ణం – సంధివర్ణం
19.4. సంధి
19.5. అర్థకం – సార్థకం
19.6 ఆర్థిక సంవర్గాల ప్రాధాన్యం
19.7. కారక సిద్ధాంతం
19.8 వాక్యనిర్మాణ పరిశోధన
19.9. సూత్రాల క్రమం
ముఖ్యాధారగ్రంథ పట్టిక 355-359
సాంకేతిక పద పట్టిక 360-374

# 1. భాష – స్వరూప స్వభావాలు

## 1.1. మానవ భాష – ఉత్పత్తి చర్చలు

"దేవీం వాచ మజనయంత దేవా
స్తాం విశ్వరూపాః పశవో వదంతి
సానో మంద్రేష మూర్జం దుహానా
ధేను ర్వా గస్మా నుప సుష్టుతైతు"
(ఋగ్వేదం, మండలం 8, సూక్తం 89, ఋక్కు 11)

(దేవతలు వాగ్దేవిని సృష్టించారు; ఆ వాక్కును వ్యక్తవాక్కులూ అవ్యక్త వాక్కులూ అయిన సర్వజంతువులూ మాట్లాడతాయి. బాగా స్తుతించబడిన ఆ వాగ్దేవి స్తుతిచే సంతోషించి (లేక వరాలిచ్చి సంతోషించేటట్టు చేస్తూ) అన్నాన్నీ, పాలూ నెయ్యీవంటి రసాల్నీ ఇచ్చే ధేనువై మమ్మల్ని పొందుగాక!)

మానవుడికి ఉన్న అమూల్యమైన శక్తి భాష మాట్లాడగలగడం, భాష మాట్లాడలేని మానవుడు లేనట్లే భాష మాట్లాడగలిగిన మానవేతర ప్రాణి ఏదీ లేదు. మెదడులో గాని ముఖయంత్రంలో గాని లోపాలున్న కొద్దిమందికి తప్ప మిగిలిన మానవులందరికీ మాట్లాడే శక్తి ఉంది. మానవుడు తన మనస్సులోని అభిప్రాయాలని బహిర్గతం చెయ్యడానికి నోటి ద్వారా చేసే ధ్వనులే భాష. మనకు తెలియని భాష ఒకరు వ్యవహరిస్తున్నప్పుడు మనం వినేవి ఆ వ్యక్తి నోటి ద్వారా చేసే రకరకాల ధ్వనులే.ఆ భాష తెలిసినవారికి ఆ ధ్వనుల అర్థం బోధపడుతుంది; తెలియనివారికి వాటి అర్థం బోధపడదు. కాబట్టి భాష అంటే కొన్ని ధ్వనుల సముదాయమేనని దీనివల్ల తెలుస్తుంది. కోతులు, పశుపక్ష్యాదులు కూడా భయం, ప్రేమ, కోపం, ఆకలి మొదలైన భావాలని సూచించడానికి అరుపులు అరుస్తాయి. అయితే మానవభాషకీ, పశుపక్ష్యాదుల అరుపులకీ మధ్య ఎంతో భేదం ఉంది. జంతువుల అరుపులలో ఏడెనిమిది లేక పది కన్న ఎక్కువ రకాలు ఉండవు.కాని మానవభాషలో రకరకాల ధ్వనులు కలిసి మాటలుగా

ఏర్పడడం, రకరకాల మాటలు కలిసి రకరకాల వాక్యాలు ఏర్పడడం ఉంది. అందువల్ల జంతువుల అరుపులలో కన్న మానవభాషలో వైవిధ్యం చాలా ఎక్కువగా ఉంది. ఈ రెండిటి మధ్య భేదం ఇంకా విపులంగా కింద 2, 3 భాగాలలో చర్చించబడుతుంది.

ప్రతి మానవుడికీ భాష మాట్లాడి అర్థం చేసుకోగలిగే శక్తి పుట్టుకతో వస్తుంది కాని ఏ భాషా మాత్రం పుట్టుకతో రాదు. పుట్టిన పిల్లవాడు (లేక పిల్ల) మొదట అవ్యక్త ధ్వనులు చేస్తూ పెరుగుతున్న కొద్దీ తన చుట్టూ ఉన్న వ్యక్తులు చేసే ధ్వనులు వింటూ అవి సూచించే అర్థాలు తెలుసుకుంటూ భాష మాట్లాడడమూ అర్థం చేసుకోవడమూ అలవాటు చేసుకొంటాడు. ఇలా అయిదారు ఏళ్లు వచ్చేటప్పటికి ప్రతి వ్యక్తీ ఒకటి లేక అంతకన్న ఎక్కువ భాషలు దైనందిన వ్యవహారానికి సరిపోయేటంత వరకూ నేర్చుకొంటాడు. నెలలి బిడ్డని నిర్జన ప్రదేశంలో వదిలివేస్తే వాడు (లేక అది) బతికి పెద్ద అయినా ఏ భాషా రాదు. అలాగే ఒక భాష మాట్లాడే తల్లిదండ్రుల పసిబిడ్డని మరొక భాష మాట్లాడేవారు తీసుకువెళ్లి పెంచుకొంటే ఆ బిడ్డ ఎదిగేక మాట్లాడేది తను పెరిగిన ప్రదేశంలోని భాషగాని అసలు తల్లిదండ్రుల భాషకాదు. దీనివల్ల భాష అభ్యాసవశం వల్ల వచ్చేది అనీ ఒక వ్యక్తికీ ఒక భాషకీ మధ్య జన్మ సంక్రాంత సంబంధం ఏదీ లేదనీ స్పష్టమవుతుంది.

ప్రతి మానవుడూ ఏదో ఒక భాష లేక ఒకటికన్న ఎక్కువ భాషలు మాట్లాడగలిగినా అందరికీ అన్ని భాషలూ రావు.ఇప్పుడు భూమి మీద మూడు వేలకిపైగా భాషలు ఉన్నాయి. ఇవి కాక సంస్కృతం వంటి కొన్ని భాషలు పూర్వకాలంలో వ్యవహారంలో ఉండి కాలక్రమేణ వ్యవహార భ్రష్టమయ్యాయని ఆ భాషలలో ఉన్న గ్రంథాలూ, శాసనాలూ వంటి ఆధారాలవల్ల తెలుస్తుంది. ఈ భాషలన్నిటినీ జన్మ సంబంధాలు ఆధారంగా కొన్ని భాషా కుటుంబాలుగా భాషా శాస్త్రజ్ఞులు విభజించారు. (దీనిపై విపులమైన చర్చ 10వ అధ్యాయంలో ఉంది). ఒక భాషా కుటుంబానికి చెందిన భాషలన్నీ ప్రాచీన కాలంలో ఉన్న ఒక మూలభాషనించి విడిపడినవి అన్న మాట. ఏ ఇతర భాషతోనూ జన్మ సంబంధం నిరూపించడం సాధ్యం కాని భాషలు కూడా కొన్ని ఉన్నాయి.కాబట్టి అన్ని మానవ భాషలూ ఒకే భాషనించి పుట్టేయని నిరూపించడం సాధ్యం కాదు. అందు

వల్ల మానవులు ఆది కాలంలో భాష లేకుండానే ఉండేవారనీ వారు కొన్ని తెగలుగా విడిపోయి భిన్న దేశాలలో స్థిరపడ్డాకే భాషలు ఉద్భవించాయనీ మనం ఊహించవచ్చు. మానవుడికి భాష అవసరం ఎందుకు వచ్చింది? భాషలు ఎలా పుట్టేయి? అనే ప్రశ్నలకి సమాధానాలు ఇంతవరకూ తెలియకపోయినా కొందరు పండితులు ఈ విషయంలో కొన్ని సిద్ధాంతాలు ప్రతిపాదించారు. వీటిలో మొదటిది బౌ – బౌ సిద్ధాంతం : ఆదిమ మానవులు పశుపక్ష్యాదుల అరుపులని అనుసరించి వాటికి పేర్లు పెట్టేరని దీని ప్రధానాశయం. తెలుగులో కాకి, మేక, ఇంగ్లీషులో cuckoo ఇటువంటివి. రెండవది పూ – పూ సిద్ధాంతం : మానవుడు నెప్పి, భయం, ఆశ్చర్యం మొదలైన మనోభావాలు ఏర్పడినప్పుడు చేసే ధ్వనుల ద్వారా భాష ఏర్పడిందని దీని ఉద్దేశం, ఇటువంటివి ఏర్పడినప్పుడు అప్రయత్నంగా ఎక్కువగా గాలి పీల్చడం, అది నోటి నించి బయటకి వచ్చేటప్పుడు నాదతంత్రులు కంపించి ధ్వని పుట్టడం సాధారణంగా జరిగేవే. కాని భాష అంతా ఇటువంటి ధ్వనులు కావు. పైగా ఆశ్చర్యాదులను సూచించేటప్పుడు వాడే ప్రత్యేక ధ్వనులు భాష సాధారణ శబ్దాలలో ఉండవు. మూడోది మాక్స్ ముల్లర్ ప్రతిపాదించిన డింగ్–డాంగ్ సిద్ధాంతం : ధ్వనికీ అర్థానికీ అజ్ఞాతమైన సంబంధం ఉందనీ, మానవుడ మనస్సుపై బయటివాటి వల్ల ఏర్పడిన అభిప్రాయమే ముఖధ్వనుల ద్వారా వ్యక్తమవుతుందనీ ఈ ప్రతిపాదన అర్థం. ఇది సమంజసమైనది కాదు. నాలుగోది న్వారే సూచించిన యో–హే–హెూ సిద్ధాంతం: శ్రమించి పనిచేసేటప్పుడు ఊపిరి గట్టిగా పీల్చి వదలడం వల్ల ఉపశమనం కలుగుతుంది.బయటికి వచ్చే ఊపిరివల్ల నాదతంత్రులు కంపించి ధ్వనులు పుడతాయి. ఈ రకరకాల ధ్వనులే ఆయా పనులకి పేర్లుగా నిలిచిపోయాయి. పై నాలుగు సిద్ధాంతాలూ భాషలో ఉన్న ఏవో కొన్ని ధ్వన్యనుకరణ శబ్దాల ఉత్పత్తిని వివరించడానికి ఉపయోగించినా మిగిలిన అనంతమైన శబ్దాల ఉత్పత్తిని ఇవి వివరించలేవు. భాష ముఖ్యంగా వార్తాప్రసార సాధనం అనే విషయాన్ని ఇవి స్పృశించలేదు. కాబట్టి ఈ సిద్ధాంతాలన్నీ అసమగ్రాలు అని పండితుల అభిప్రాయం.

ప్రముఖ భాషాశాస్త్రజ్ఞుడైన జస్పర్సన్ వివిధ భాషలలో కాలక్రమాన వచ్చిన పరిణామాలు తెలుసుకోవడం వల్లా, ఇప్పటికీ నాగరికతల వెనుకపడి ఉన్న

ఆటవికుల భాషలని పరిశీలించడం వల్లా ఆదిమ కాలంలో భాష స్వరూప స్వభావాలని కొంత వరకు ఊహించవచ్చని సూచించారు. సాధారణంగా భాషలలో పరిణామం వల్ల సౌలభ్యం ఏర్పడుతుంది. పూర్వకాలంలో ఉన్న క్లిష్టత తొలగి సారళ్యం వైపున భాష పరిణమిస్తుంది. ప్రాచీన భాషలలో కష్టమైన ధ్వనులూ, ధ్వని సముదాయాలూ అర్వాచీన కాలంలో నశించడమో లేక "సులభమైన ధ్వనులు"లుగా మారడమో జరుగుతుంది. ఒక పదంలో ధ్వనులు సంఖ్య తగ్గడం కూడా సర్వసాధారణం :

| సంస్కృతం | హిందీ |
|---|---|
| ఏకం | ఏక్ |
| ద్వే | దో |
| సర్వే | సబ్ |
| అగ్నిః | ఆగ్ |

అలాగే, సంస్కృతంలోని మూడు లింగాలకి బదలు హిందీలో రెండు లింగాలు అయ్యాయి. ప్రాచీన భాషలలో పదాలలో ప్రత్యయాలు ఎక్కువగా ఉండేవి. తరవాత కాంలో వీటి సంఖ్య తగ్గి మొదట్లో ఒక పదమే సూచించే అర్థాన్ని అర్వాచీన కాలంలో రెండు మూడు పదాలు కలిసి సూచిస్తాయి. ప్రాచీన కాలంలో కన్నా అర్వాచీన కాలంలో సార్వత్రికత (Regularity) ఎక్కువగా ఉంటుంది. నాగరికత హెచ్చినకొద్దీ కొత్త కొత్త వస్తువులకి పదాలు ఏర్పడి భాషలో పదజాలం విస్తృతమవుతుంది.కాబట్టి ఆదిమకాలంలో భాషలలో పదాలు ప్రత్యయ బహుళమై దీర్ఘంగా ఉండేవనీ, పదజాలం నిత్యావసరాలకి సరిపోయేటంత మాత్రమే ఉండేదనీ వ్యాకరణం క్లిష్టమై ఉండేదనీ దీనివల్ల తెలుస్తుంది. ఈ పరిణామం ఇప్పటికీ పూర్తికాలేదు. కాబట్టి ఇప్పటి భాషలలో కూడా క్లిష్టతా, తర్కాసహం గాని నిర్మాణమూ కొంత వరకూ ఉన్నాయి. భాష ప్రవాహిని అని పిండితార్థం.

## 1. 2. జంతువులలో వార్తా ప్రసారం

పశుపక్షికీటకాదులలో కూడా కొన్నింటిలో వార్తాప్రసారం జరుగుతుందని పైన చూశాం. ఒక రకం ఎండ్రకాయలలో ఒకటి ఇంకొకదాన్ని భయపెట్టడానికి

ముందు కాలుగాని వెనక కాలుగాని ఎత్తుతుంది. ముందుకాలు ఎత్తడమే వెనక కాలు ఎత్తడం కన్న శత్రువుని పారదోలడానికి ఎక్కువ సమర్థమైనదని పరిశోధనవల్ల తేలింది. చేపలలో stickle backs అనే రకం వసంతకాలంలో తమ ప్రాంతంలోకి ఇతర ప్రాంతాలలోని చేపలు రాకుండా రక్షించుకొంటాయి. పై ప్రాంతం నించి చేప రావడం దాని పొట్టా, గొంతుకలలో ఎర్ర రంగుని చూసి ఈ చేపలు గ్రహించి వెంటనే దాన్ని విరోధిస్తాయి. ఒక ప్రాంతంలో దొరికే ఆహారం అక్కడ ఉన్నవాటికీ, వాటి పిల్లలకూ సరిపోయేటట్టు చూడడానికి అవి ఇలా చేస్తాయి.పక్షులూ, కోతులూ భయం, అనురాగమూ కలిగినపుడు అరుపులు అరుస్తాయి. భయం కలిగినపుడు అరుపులు పెద్ద ధ్వనితో ఉంటాయి. అనురాగ ప్రదర్శన సమయంలో అరుపులు శ్రుతి మార్పులు కలిగి ఉంటాయి. ఇవి విన్న ఆయా జాతి పక్షులూ, కోతులూ పరిస్థితిని గ్రహించి దూరంగా పారిపోవడమో దగ్గరగా చేరడమో చేస్తాయి. కోతులలో vervet monkeys అనే తెగ అధమపక్షం ఆరు రకాల అరుపులు అరుస్తాయి. వీటికి అపాయం కలిగించే చిరతపులులు, పాములు, గద్దలు వంటి ఒక్కొక్క రకం జంతువును చూసినప్పుడు ఒక్కొక్క రకం అరుపు ఇవి అరుస్తాయి. ఈ అరుపులో రకాన్ని బట్టి మిగిలిన కోతులు వచ్చిన ప్రమాదకరమైన జంతువు ఏదో తెలుసుకొని తదనుగుణంగా ప్రవర్తిస్తాయి. అయితే అరుపులు అరిచే కోతి తన దగ్గరకు వచ్చిన జంతువు కలిగించిన భయం స్థాయి వల్ల రకరకాలుగా అరుస్తూ ఉండవచ్చు. కాబట్టి ఆ కోతి మిగిలిన కోతులకి ఫలానా జంతువు వచ్చింది అనే వార్త చెప్పే ఉద్దేశంతో రక రకాలుగా అరుస్తుంది అని చెప్పలేం.అది ఉత్పత్తి చేసే ధ్వని దాని మనస్సులో ఏర్పడిన భయానికి ప్రతిఫలం మాత్రమే. చీమలలో రసాయనిక సంకేతాలు ఉన్నాయి. చీమలు ఆహారం ఉన్న చోటు కనుక్కొని పుట్టకు తిరిగి వచ్చేటప్పుడు వాసనవేసే రసాయన పదార్థాన్ని దోవ పొడుగునా వదలుతాయి. మిగిలిన చీమలు ఈ పదార్థం ఉన్న దోవలో వెళ్ళి ఆహారాన్ని చేరుకొంటాయి. తేనెటీగలలో స్పర్శ సంకేతం ఉంది.మధువును చూసిన తేనెటీగలు పట్టుకు తిరిగివచ్చి నాట్యం చేస్తాయి. మిగిలిన తేనెటీగలు వీటిని రాసుకొంటూ నాట్యంలో చేరి, మధువు ఉన్న దిక్కూ, దూరమూ తెలుసుకొంటాయి. నాట్యం చేసే తేనెటీగ తోక ఉన్నవైపు మధ్య ఉన్న దిక్కు; అది నిర్ణీత కాలంలో చేసే

భ్రమణాల సంఖ్య వల్ల దూరం తెలుస్తుంది. కాని కొందరు ఇది స్పర్శ సంకేతం కాదనీ, మొదటి తేనెటీగ చేసే ధ్వనివల్లా, వాసనవల్లా మిగిలిన తేనెటీగలకి విషయం తెలుస్తుందనీ అంటారు.

పై ఉదాహరణ వల్ల మానవేతర ప్రాణులలో సంకేతాలు ఉన్నాయని తెలుస్తుంది. వీటిపై ఇంకా పరిశోధన ప్రాథమికావస్థలో ఉంది. ఈ సంకేతాలు ఒక విషయాన్ని తోటి జీవులకు తెలిపే ఉద్దేశంతో చేసేవి అనుకోలేం. అవి వాటిలో ఏర్పడిన మనోవస్థలకు అనుగుణంగా అప్పటికప్పుడు బయటికివచ్చిన సూచకాలు మాత్రమే. మానవభాషకీ వీటికి హస్తమశకాంతరం ఉంది కాబట్టి మానవ భాష ఉత్పత్తిని గురించిన పరిశోధనకు ఇవి సహాయపడవు. మానవ భాషలో కొన్ని ధ్వనులు కలిసి పదాలుగానూ, కొన్ని పదాలు కలిసి వాక్యాలు గాను ఏర్పడతాయి. ఏ జంతువుకీ రెండు మూడు అరుపులు కలిసి పెద్ద అరుపుగా ఏర్పడడం అనేది లేదు. మానవ భాషకి తత్క్షణ ప్రేరణ అక్కరలేదు. పులి రాకుండానే "పులి వస్తోంది" అనవచ్చు. ఇటువంటి సామర్థ్యం జంతువులకి లేదు. మానవులు భాష ద్వారా విషయ నివేదన చెయ్యడమూ, ప్రశ్నించడమూ, ఆజ్ఞాపించడమో, అర్థించడమూ మొదలైనవి చెయ్యగలరు. జంతు సంకేతాలకి ఇంతటి శక్తి లేదు.

## 1. 3. మానవ భాషా లక్షణాలు

మానవజాతి తనకి సన్నిహితమైన చింపాంజీ, గిబ్బన్ల వంటి కోతి జాతుల నుంచి, కోటి, కోటిన్నర సంవత్సరాలకి ముందే విడిపోయిందని శాస్త్రజ్ఞుల అభిప్రాయం. కాని భాష సుమారు 25 వేల సంవత్సరాల క్రితం మాత్రమే పుట్టి ఉంటుంది. ఈ మధ్య కాలంలో మానవుల మెదడు పరిమాణం పెరిగి ఒక తరాన్నించి మరొక తరానికి మొదట సంస్కృతీ తరువాత భాషా ప్రసరించడం మొదలై ఉండవచ్చు. మానవుడికి అన్నపానాలవలె ముఖ్యమైనది సంభాషణ. మాట్లాడుకోవడానికి ముఖ్య విషయాలు లేనప్పుడు కూడా మనం వాతావరణం, పరిసరాలు మొదలైన అముఖ్య విషయాలని గురించి మాట్లాడడమో లేక (అవసరమైన దానికన్న ఎక్కువ) యోగక్షేమాలు విచారించడమో చేస్తూ ఉంటాం. దీనివల్ల మానవ జీవనంలో సంభాషణకున్న ప్రాముఖ్యం తెలుస్తుంది. మానవేతర ప్రాణుల ప్రమాద సందర్భాలలో ఒక చోట చేరడమూ, గుంపులుగా

కలిసి జీవించడమూ ఉంది. అయినా అవి అవసరమైనప్పుడు తప్ప మిగిలిన సందర్భాలలో మన సంభాషణ వంటి ధ్వనులు చెయ్యవు.

మానవ భాషకి ఏడు ముఖ్య లక్షణాలు ఉన్నాయి. ఇవి మానవ భాషని మిగిలిన ప్రాణుల భాష వంటి వార్తా ప్రసారాన్నించి వేరు చేస్తాయి. కొన్ని జంతువుల వార్తాప్రసారంలో ఈ ఏడింటిలో కొన్ని లక్షణాలు ఉన్నా అన్ని లక్షణాలూ కలిసికట్టుగా ఏ మానవేతర ప్రాణి వార్తా ప్రసారంలోనూ లేవు. ఈ లక్షణాలు 1. నిర్మాణ ద్వైవిధ్యం (Duality), 2. ఉత్పాదనశక్తి (Productivity), 3. శబ్దార్థ సంబంధ కృత్రిమత (Arbitrariness), 4. వక్తృశ్రోతృ విపరిణామం (Interchangeability), 5. ప్రత్యేకత (Specialization), 6. ప్రేరణ దూరత (Displacement), 7. సాంస్కృతిక ప్రసరణ (Cultural transmissiion).

నిర్మాణ ద్వైవిధ్యం : మానవ భాషలో రెండు రకాల నిర్మాణం ఉంది. కొన్ని ధ్వనులు కలిసి ఒక పదంగా ఏర్పడడమూ, కొన్ని పదాలు కలిసి ఒక వాక్యంగా ఏర్పడడమూ అన్ని భాషలలోనూ ఉన్నాయి.

ఉత్పాదనశక్తి : మనం ఇంతవరకూ విన్న వాక్యాల నిర్మాణాన్ని అనుసరించి ఇంతకు ముందెప్పుడూ వినని వాక్యాలను కూడా తయారుచేసి వాడగలం. చిన్న పిల్లలు భాష నేర్చుకోవడం ఈ శక్తి వల్లనే సాధ్యమవుతుంది.

శబ్దార్థ సంబంధ కృత్రిమత : ఈ శబ్దానికి ఇది అర్థం అనే సంకేతం ఒకొక్కక్క భాషా సముదాయం ఏర్పరుచుకొన్నది. స్వల్ప సంఖ్యాకమైన అనుకరణ శబ్దాలలో తప్ప శబ్దానికీ అర్థానికీ సహజ సంబంధం లేదు.

వక్తృశ్రోతృ విపరిణామం : ప్రతి వ్యక్తికీ మాట్లాడగల శక్తి, ఇతరులు మాట్లాడింది అర్థం చేసుకోగల శక్తి – ఈ రెండూ ఉన్నాయి. తేనెటీగల నాట్యంలోనూ, కోతుల అరుపులలోనూ కూడా ఈ లక్షణం ఉంది.

ప్రత్యేకత : వార్తా ప్రసారంలో ప్రేరణ, ప్రతిక్రియా ఉంటాయి. ఈ రెండిటికీ సహజ సంబంధం లేకపోతే ఆ వార్తాప్రసారంలో ప్రత్యేకత ఉన్నట్లు లెక్క. ఉదాహరణకి వడ్డన జరుగుతూ ఉండడం చూసి మనం చేతులు కడుక్కొని

వంటింట్లోకి వెళ్ళి కూచుంటాం. ఈ రెండు క్రియలకీ సహజ సంబంధం ఉంది. కాబట్టి ఈ వార్తా ప్రసారంలో ప్రత్యేకత లేదు. కాని "వడ్డించేస్తున్నాను, రండి" అని గృహిణి చేసే ధ్వనులకీ మనం వంటింట్లోకి వెళ్లడానికి సహజ సంబంధం లేదు. వీటి మధ్య సంబంధం కృత్రిమమైన శబ్దార్థ సంబంధ సిద్ధి వల్ల వచ్చింది. గృహిణి వాడిన భాష తెలియనివారు ఈ మాటలు విన్నా దానికి తగిన ప్రతిక్రియ చెయ్యలేరు.

ప్రేరణదూరత : జంతువులు మనోవికారాలు కలిగినప్పుడే శబ్దాలు చేస్తాయి. కాని మానవులు వర్తమాన సంఘటనలని గురించే కాక భూత భవిష్యత్తులను గురించి కూడా మాట్లాడగలరు.

సాంస్కృతిక ప్రసరణ : మానవులు ఇతర ఆచార వ్యవహారాలలాగే భాష కూడా ఒకరినించి ఒకరు నేర్చుకొంటారు. అంతేకాక భాష ఒక తరం వారినించి ఇతర తరాలవారికి నేర్చుకొనడం ద్వారా సంక్రమిస్తుంది. ఇది మానవులకి ఉన్న అనుకరణ శక్తి వల్ల సాధ్యమవుతుంది. చిన్న పిల్లలు పెద్దలను అనుకరించి భాష నేర్చుకోవడం, పిల్లలు మాట్లాడే తప్పులు సవరించి పెద్దలు భాష నేర్పడం సర్వసాధారణం. కోతులలో అనుకరణ శక్తి ఉన్నా వాటిలో సాంస్కృతిక ప్రసరణ ఉన్నదా అనే విషయం విచారణీయం.

## 1.4. లిపి

భాష ముఖ్యంగా ధ్వన్యాత్మకమైనది. ధ్వనులని సూచించేది లిపి.భాషలు పుట్టిన తరువాత చాలా వేల ఏళ్లకి లిపులు పుట్టేయి. ఇప్పటికీ లిపి లేని ఆటవిక భాషలు వేలకొలది ఉన్నాయి. ఇప్పటి విద్యా విధానంలో లిపి నేర్చుకోవడం ఎంత ప్రధాన స్థానాన్ని ఆక్రమించినా, భాషకి లిపి కన్నా ధ్వని ముఖ్యమని గ్రహించాలి. ఏ భాషకైనా లిపి అసమగ్రమైనది. కొన్ని ధ్వనులకి ప్రత్యేక లిపి లేకపోవడం, అవసరమైన లిపి చిహ్నాలు ఉండడం, ఒక ధ్వని రెండు మూడు రకాలుగా సూచించబడడం, ఉచ్చారణలోని శ్రుతి భేదాలు లిపిలో సూచించబడకపోవడం లిపులలో సాధారణ లోపాలు. పైగా, ఒక భాషకీ దానిని రాయడానికి ఉపయోగించే లిపికీ సహజ సంబంధం లేదు. తెలుగు మాటలని

తెలుగు లిపిలోనే గాక హిందీ, ఇంగ్లీషు, తమిళం వంటి ఇతర భాషా లిపులలో కూడా రాసి చదవవచ్చు, కాని ఒక భాషకి ఒక లిపి పారంపర్య ప్రభావం వల్ల వాడుకలో స్థిరపడింది. లిపి పుట్టడం వల్లనే ప్రాచీన కాలంలోని భాషలని గూర్చి వాటికి సంబంధించిన శాసనాలూ, తాళపత్ర గ్రంథాలూ, మట్టిపలకలూ మనం చదవగలిగి తెలుసుకోగలుగుతున్నాం. కాబట్టి భాషల చారిత్రక పరిశోధనకి లిపి మూలాధారం.

లేఖన పద్ధతి మొదట ఎలా ఆరంభమయిందో సరిగా తెలియదు కాని చిత్రలేఖనం నుంచి లిపి ఉద్భవించిందని చెప్పవచ్చు. బొమ్మలు గియ్యడం ఒక కళగా గాని లేక పూజ కోసం గాని మొదలై ఉంటుంది. లిపి మొదట్లో ఈజిప్టు, సుమేర్, చైనా అనే మూడు దేశాలలో ప్రారంభమయింది. ఈ మూడింటిలో మొదట ఒకదానిలో ప్రారంభమై లిపి మిగిలిన రెండు చోట్లకి పాకి ఉండవచ్చు. కాని వీటితో ప్రాచీన కాలంలో రాకపోకలు లేని అమెరికా ఖండంలో మెక్సికో, మధ్య అమెరికా ప్రాంతాలలో కూడా ప్రాచీన కాలంలో లిపి ఉండేది అనడానికి ఆధారాలు ఉన్నాయి. కాబట్టి పై మూడు చోట్ల కూడా లిపులు పరస్పర సంబంధం లేకుండానే పుట్టి ఉండవచ్చు. ప్రపంచంలో లిపులు మూడు రకాలు. అవి :

1. పదలిపి (Logographic) : ఇందులో ఒక గుర్తు ఒక పదాన్ని అంతటినీ సూచిస్తుంది. ప్రాచీన ఈజిప్షియన్, చైనీస్ లిపులు ఇటు వంటివి. పదలిపి కొంతకాలానికి పదాక్షర లిపి (Logo - Syllabic) గా మారింది. ఇందులో ఒక గుర్తు ఒక పదాన్ని లేక ఒక అక్షరాన్ని సూచిస్తుంది. అర్వాచీన ఈజిప్షియన్ ఇటువంటిది.

2. అక్షరలిపి (Syllabic) : ఇందులో ఒక గుర్తు ఒక అక్షరాన్ని, అంటే హల్లు, అచ్చు కలిపినదాన్ని సూచిస్తుంది. దేవనాగరి, మిగిలిన భారత దేశ లిపులు ఇటువంటివి. పశ్చిమ సెమిటిక్ లో అక్షర ధ్వనిలిపి ఇందులో అంతర్భాగం. అక్షర ధ్వనిలిపిలో ఒక గర్తు ఒక హల్లును మాత్రం సూచిస్తుంది. దానితో కలిపి ఉన్న అచ్చు అలిఖితంగా ఉంటుంది.

3. ధ్వనిలిపి (Alphabetic) : ఇందులో అచ్చులకీ, హల్లులకీ గుర్తులు వేరు వేరుగా ఉంటాయి. గ్రీక్ మొదలైన పాశ్చాత్య భాషల లిపులు ఇటువంటివి.

ఏ కాలపు లిపిలోనైనా పై మూడు రకాలూ కొంతవరకైనా కలగలుపుగా ఉంటాయి. భారత దేశ లిపులు ముఖ్యంగా అక్షర సూచకాలే అయినా ముందు హల్లు లేని అచ్చులకి ప్రత్యేక చిహ్నాలు ఉన్నాయి. హల్లు తరవాత వచ్చే అచ్చు మాత్రం హల్లుతో కలిపి రాస్తారు. "2 మామిడిపళ్లు" అని రాసినప్పుడు ఒక అంకె 'రెండు' అనే పదాన్నంతనీ సూచిస్తుంది. కాబట్టి ఈ అంకె పదలిపికి ఉదాహరణ.

ఈజిప్షియన్‌కి ఆధారాలు క్రీస్తు పూర్వం నాలుగు వేల సంవత్సరాల నుండి లభిస్తున్నాయి. ఇందులో సుమారు 5 వేల గుర్తులు ఉన్నాయి. వీటిని హీరోగ్లిఫ్స్ (Hieroglyphs) అంటారు. వీటిలో చాలా వరకు బొమ్మలే ఉన్నాయి. అంటే 'తల' అనే పదాన్ని సూచించడానికి తలబొమ్మ, 'చెయ్యి'ని సూచించడానికి చెయ్యి బొమ్మ, ఇలా. కాని మరికొన్ని గుర్తులకీ పదాలకీ దూర సంబంధం ఉంది. 'తినడం' అనే క్రియని సూచించే గుర్తు నోటి దగ్గర చెయ్యి పెట్టుకొని కూచున్న మనిషి. నానార్థక శబ్దాలకి కూడా ఒకే గుర్తు వాడబడేది. 'పదివేల'కి, (చేతి) 'వేలు'కీ ఒకే మాట కాబట్టి ఈ రెండింటికీ వేలు గుర్తే వాడబడింది. రెండు హల్లులున్న మాటలో ఒక హల్లు తరవాత కాలంలో నశించినప్పటికీ మిగిలిన హల్లుకి పాత గుర్తే వాడబడి కొన్ని గుర్తులు ఏక హల్లుకి సూచకాలై ఇతర పదాలలో కూడా ఈ హల్లులకి గుర్తులు ఏక హల్లుకి సూచకాలై ఇతర పదాలలో కూడా ఈ హల్లులకి గుర్తులుగా వాడబడ్డాయి. ఈజిప్షియన్‌లో హీరాటిక్, డెమొటిక్ అనే రెండు రకాల కలిపి రాతలు కూడా ఏర్పడ్డాయి. 1799లో ఈజిప్టులో రోజెటా శిల దొరకింది. ఇందులో శాసనం గ్రీక్, హీరోగ్లిఫిక్, డెమొటిక్ అనే మూడింటిలోనూ ఉండడం వల్ల గ్రీకు భాష ఆధారంగా మిగిలిన రెండు లిపులూ చదవబడ్డాయి.రోజెటా శిల ఇప్పుడు లండన్‌లో బ్రిటిష్ మ్యూజియంలో ఉంది.

ఈజిప్షియన్ లిపినించి పశ్చిమ సెమెటిక్ లిపి పుట్టింది. పశ్చిమ సెమెటిక్ నించి గ్రీకు లిపీ, దానినించి లాటిన్ లిపీ, లాటిన్ లిపినించి మిగిలిన యూరోపియన్ భాషల లిపులూ పుట్టేయి. గ్రీకు లిపిలో అచ్చులకి ప్రత్యేక

చిహ్నాలు ఏర్పడి, అది ధ్వని లిపిగా మారడం ఇక విశేషం. గ్రీకులు మరికొన్ని కొత్త గుర్తులు కూడా చేర్చుకొన్నారు. క్రీస్తు పూర్వం తొమ్మిదో శతాబ్దిలో గ్రీకులు పశ్చిమ సెమెటిక్ లిపిని ఎరువు తెచ్చుకొన్నారు. కాని ఇటీవల క్రీస్తు పూర్వం 1450 కీ, దాని తరువాతకీ చెందిన గ్రీకు శాసనాలు బయల్పడ్డాయి. ఇవి లీనియర్ బి అనే లిపిలో ఉన్నాయి.

పశ్చిమ సెమెటిక్ లిపినించి గ్రీకు లిపేకాక అరమైక్ (తరువాత కాలంలో పెహ్లావీ), సిరియన్ (తరువాత కాలంలో మంగోల్, మంచూ), అరబిక్, బ్రాహ్మి లిపులు కూడా పుట్టేయి. బ్రాహ్మిలిపి భారత ఖండంలో అన్ని లిపులకీ మాతృక.

సుమేరియన్లు క్రీ.పూ. నాలుగు వేల సంవత్సరాల క్రితం క్యూనేఫారం లిపి ఏర్పరిచారు. ఇది కూడా బొమ్మల మీద ఆధారపడినదే.దీని నుండి క్రీ.పూ. 2500 ప్రాంతంలో అక్కాడియన్ లిపి ఏర్పడింది. అక్కాడియన్ నించి హిట్టైట్లూ, ఈలమైట్లూ మరి కొందరూ తమ భాషలకు లిపులు ఏర్పరుచుకొన్నారు. ఇరాన్‌లో బెహిస్తాన్ దగ్గర పర్షియన్ మహారాజు డేరియస్ (క్రీ.పూ. 521–486) వేయించిన పెద్ద శాసనం క్యూనే ఫారం లిపి చదవడానికి ఉపయోగించింది. ఇది ప్రాచీన పర్షియన్, ఈలమైట్, అక్కాడియన్ అనే మూడు భాషలలో ఉంది. అందులో ఉన్న రాజుల పేర్లు ప్రాథమికాధారంగా మొదట పర్షియన్, తరవాత అక్కాడియన్ ఆ తరవాత ఈలమైట్ భాషలని పండితులు చదవగలిగేరు. ఈజిప్షియన్, క్యూనే ఫారం లిపులు రెండింటిలోనూ నామవాచక పదాలలోపాటు అవి ఏ గణానికి (ఉదా. బహువచనం, దేవతలు, మనుష్యులు, నదులు, కర్ర సామాను మొద.) చెందినవో కూడా ఒక గుర్తుతో సూచించేవారు. ఈ గుర్తుల వల్ల ఈ లిపులు చదవడం కొంతవరకు సులభతరం అయింది.

ప్రాచీన లిపులలో మూడవది చైనీస్ లిపి. ఇది కూడా బొమ్మల మీద ఆధారపడిన పదలిపే. ఇది ఇప్పటికీ అలాగే మిగిలింది. చైనీస్ లిపి ఆధారంగా ఏర్పడిన జపనీస్ లిపి మాత్రం కొంత అక్షరలిపిగానూ కొంత పదలిపిగానూ మారింది. చైనీస్ లిపిలో ఒక పదానికి ఇక గుర్తేకాక కొన్ని పదాలని సూచించడానికి రెండు లేక అంతకన్న ఎక్కువ గుర్తులని కలిపి వాడడం కూడా ఉంది. 'తూర్పు'ని సూచించే గుర్తు చెట్టు గుర్తూ, ఉదయించే సూర్యుడి గుర్తూ కలిసి

ఏర్పడినది. చైనీస్ భాషలో ప్రత్యయాలు లేవు కాబట్టి పదలిపి దీనికి తగి ఉన్నా, వేలకొలది గుర్తులు ఉండడం వల్ల దీన్ని నేర్చుకోవడంలోనూ వాడడంలోనూ శ్రమ అధికం.

పై చర్చ సారాంశం : లిపి చిత్రాలనించి పుట్టింది. చిత్రలిపి మొదట పదలిపిగా మారింది. పదలిపి చాలా భాషలలో అక్షర లిపిగా మారింది. అక్షర లిపి నించి అచ్చులకూ, హల్లులకూ ప్రత్యేకమైన గుర్తులు ఏర్పాటు చేసి, ధ్వని లిపిని మొదటగా గ్రీకులు సాధించారు. రాతలోనూ చదవడంలోనూ సౌలభ్యానికి ధ్వనిలిపి పరాకాష్ఠ.

# 2. భాష – వ్యాకరణం – భాషాశాస్త్రం

## 2.1. భాష – వ్యాకరణం

"సక్తుమివ తితునా పునంతో
యత్ర ధీరా మనసా వాచ మక్రత
అత్రా సఖాయః సఖ్యాని జానతే
భద్రైషాం లక్ష్మీర్నిహితాధి వాచి"
(ఋగ్వేదం, మండలం 10, సూక్తం 71, ఋక్కు 2)

(విద్వాంసులు పిండిని జల్లెడతో జల్లించి శుభ్రం చేసినట్లు మనస్సుతో వాక్కును సృష్టించారు; అటువంటి జ్ఞానవంతులు వాక్కుకు సంబంధించిన జ్ఞానాన్ని తెలుసుకొని ఉంటారు; వారి వాక్కులో కల్యాణప్రదమైన లక్ష్మి ఉంటుంది.)

"ఉత త్వః పశ్యన్న దదర్శ వాచ
ముత త్వః శృణ్వన్న శృణోత్యేనాం
ఉతో త్వస్మై తన్వం విసస్రే
జాయేవ పత్య ఉశతీ సువాసాః"
(ఋగ్వేదం, మండలం 10, సూక్తం 71, ఋక్కు 4)

(అవిద్వాంసుడు వాక్కును చూసి కూడా (సరిగా) చూడలేడు; విని కూడా (సరిగా) వినలేడు; భర్తృసంయోగం కోరే మంచి వస్త్రం ధరించిన భార్య భర్తకిలాగా వాక్కు విద్వాంసుడికి మాత్రం తన స్వరూపాన్ని స్పష్టం చేస్తుంది.)

భాషలో వర్ణ నిర్మాణం, పద నిర్మాణం, వాక్య నిర్మాణం వంటి వివిధ స్థాయిలలో ఉన్న నియమాలని తెలిపేది వ్యాకరణం. 'వ్యాకరణం' అనే పదం సాధారణంగా ఒక కాలంలో ఉన్న ఒక భాషని వర్ణించే వర్ణనాత్మక వ్యాకరణానికి

(Descriptive Grammar) పర్యాయంగా వాడబడుతోంది. పూర్వకాలంలో వ్యాకరణాలు వర్ణనాత్మక వ్యాకరణాలు మాత్రమే. ఇటీవల భాషాశాస్త్రం అభివృద్ధి చెందిన తరవాత తులనాత్మక వ్యాకరణం (Comparative Grammar), చారిత్రక వ్యాకరణం (Historical Grammar) అనే మరి రెండు రకాల వ్యాకరణాలు కూడా వచ్చాయి. తులనాత్మక వ్యాకరణం ఒక భాషా కుటుంబంలో ఉన్న అన్ని భాషలనీ పోల్చి పరిశీలించి వాటి మూల భాషని వీలైనంతవరకూ పునర్నిర్మించి ఒక్కొక్క దుహితృ భాషలో ఏర్పడిన మార్పులని వివరిస్తుంది. ఒక భాషలో లిఖితాధారాలు దొరికినప్పటినించీ కాలక్రమంగా ఏర్పడిన మార్పులని చారిత్రక వ్యాకరణం వివరిస్తుంది.

వర్ణనాత్మక వ్యాకరణ రచన పాశ్చాత్య దేశాలలో గ్రీకుకీ, మన దేశంలో సంస్కృతానికీ, తమిళానికీ క్రీస్తుకి పూర్వమే ప్రారంభమయింది. గ్రీకు భాషలో వ్యాకరణం వేదాంతంలో భాగంగా ఆవిర్భవించి వృద్ధి పొందింది. అందువల్ల గ్రీకు భాషలో వ్యాకరణాలలో భాషని వర్ణించడం మాత్రమే కాక పదవ్యుత్పత్తి, భాష పుట్టుక, ప్రాచీన కవి ప్రయోగ చర్చ, అలంకారాలు మొదలైన వాటిని గురించిన పరిశీలన కూడా ఉంది. గ్రీకు వైయాకరణులు లిఖితాక్షరాలకీ ఉచ్చారిత ధ్వనులకీ మధ్య ఉన్న భేదం గ్రహించక, లిఖితాక్షరాలనే ప్రాతిపదికగా తీసుకొన్నారు. అంతేకాక వారు ప్రాచీన కవుల భాషే సాధువనీ తరవాత కాలంలో వ్యవహారంలో ఉన్న భాష అసాధువనీ అపోహపడ్డారు. గ్రీకులో 'వ్యాకరణం' అనే అర్థం ఇచ్చే పదం gramma దీని అసలు అర్థం 'లిఖితాక్షరం'; ఇది graphein 'గియ్యడం, రాయడం' అనే క్రియనించి ఏర్పడింది. దీని బహువచన రూపమైన grammata 'అక్షరాలు' అనేది అర్థ వ్యాకోచం పొంది క్రమం 'వర్ణమాల', 'లేఖన పద్ధతులు, 'భాషను నేర్చుకొనే పద్ధతులు' అనే అర్థాలు సంతరించుకొంది. ఇది లాటిన్‌లో grammaticus గా మారింది; ఈ లాటిన్ పదంనించి ఇంగ్లీషు grammar ఏర్పడింది. ఈ వ్యుత్పత్తి వల్ల కూడా గ్రీకుల దృష్టిలో 'వ్యాకరణం' అనే పదానికి విస్తృతార్థం ఉందని స్పష్టపడుతుంది.

సంస్కృతంలో 'వ్యాకరణ' శబ్దానికి 'వ్యాక్రియంతే శబ్దాః అనేన ఇతి వ్యాకరణ' (ఇది శబ్దాలని ప్రకృతి, ప్రత్యయం అనే రెండు అంశాలుగా విభజిస్తుంది) అని అర్థం. కాని సంస్కృత వ్యాకరణాలు కేవలం పద నిర్మాణాన్ని మాత్రమే

వర్ణించి భాషలో ఉన్న వాక్య నిర్మాణం మొదలైన వాటిని పరిశీలించ లేదు అని అపోహపడకూడదు. సంస్కృతంలో ధ్వని శాస్త్రమూ, వ్యాకరణమూ, వేద మంత్రాల ఉచ్చారణ మారకుండా యథాతథంగా ఉండడానికీ, వాటి అర్థాలు నిర్ణయించడానికీ మొదట్లో ఉద్దిష్టమయ్యాయి. పైన ఇచ్చిన ఋక్కులలో భాషా నిర్మాణం తెలిసిన పండితులు ప్రశంసించబడ్డారు. కాబట్టి వేదకాలంలోనే వ్యాకరణ పరిశీలన ఆరంభమయిందని మనం ఊహించవచ్చు. సంస్కృత వైయాకరణులు తమ ముఖ్యోద్దేశమైన వైదిక భాషా పరిశోధనని అధిగమించి వైదిక భాషకీ లౌకిక భాష (అంటే వారి కాలంలో వ్యవహారంలో ఉన్న సంస్కృత భాష)కీ కలిపి శాస్త్రీయమైన వ్యాకరణం రచించగలిగేరు. పాణిని అష్టాధ్యాయి (క్రీ.పూ. 6వశతాబ్ది) ఇప్పటి వరకూ ఏ భాషకయినా రచించబడిన వ్యాకరణాలు అన్నిటి కన్నా శాస్త్రీయమూ, సమగ్రమూ అయినదని భాషాశాస్త్రజ్ఞుల చేత ప్రశంసించ బడింది. ఆ కాలంలోనే సంస్కృత వైయాకరణులు ధ్వనుల ఉత్పత్తి క్రమం, విభాగం మొదలైన విషయాలలో శాస్త్రీయ జ్ఞానం సంపాదించి ధ్వని శాస్త్రాన్ని ప్రారంభించి దానికి పరిపూర్ణత చేకూర్చారు. సంస్కృత వైయాకరణులు గ్రీకు వైయాకరణుల కన్న ధ్వని శాస్త్రమూ, శబ్దాలలో ప్రకృతి ప్రత్యయ విభజన అనే రెండు అంశాలలో ఎంతో శాస్త్రీయతనీ, సమగ్రతనీ సాధించారు.

ఇప్పటి వ్యవహారంలో 'వ్యాకరణం' అనే మాట ప్రధానంగా ఈ కింద ఇచ్చిన నాలుగు అర్థాలలో వాడ బడుతోంది. (1) మానవుడు బాల్యావస్థలో తన మాతృభాష నేర్చుకొనేటప్పుడు అప్రయత్నంగా నేర్చుకొన్న పూర్తి భాషా నిర్మాణం; (2) ఇటువంటి భాషా నిర్మాణాన్ని శాస్త్రీయంగా వర్ణించే గ్రంథం; (3) ఒక భాషని ఇతరులకు నేర్పడానికి గాని లేక ప్రమాణ భాష ఇలా ఉండాలని చూపడానికి గాని తయారు చేసిన పాక్షిక భాషా వర్ణన; (4) భాషని సరిగా రాయడానికి గాని, మాట్లాడడానికి గాని ఉపయోగపడే ప్రమాణ గ్రంథం. ఈ నాలుగు అర్థాలలోనూ ముఖ్యమైనది మొదటిదే అని గ్రహించాలి. ప్రతి మానవుడూ పుట్టగానే తన చుట్టూ ఉన్న మనుష్యుల సంభాషణనీ చేష్టలనీ జాగ్రత్తగా గమనించడం ప్రారంభిస్తాడు. ఇలా గమనించడం వల్ల ఏ వస్తువుని ఏ పదం సూచిస్తుంది, పదాలు ఎలా కలియడం వల్ల వాక్యాలు ఏర్పడతాయి అని గ్రహించి నెమ్మదిగా తాను కూడా పెద్దలని అనుకరిస్తూ మాట్లాడడమూ, ఇతరుల ఆజ్ఞలకి

సరి అయిన ప్రతిక్రియ చెయ్యడమూ ప్రారంభిస్తాడు. ఇలా భాష నేర్చుకోవడంలో భాషలో ఉన్న నియమాలు లేక సూత్రాలు అజ్ఞాతంగానే మానవుడి మనస్సులో స్థిరపడతాయి. కాని సూత్రాలు ప్రతి మానవుడూ వ్యక్తంగా చెప్పలేకపోవచ్చు; భాషకి సమగ్రమైన వ్యాకరణం రాయడం వైయాకరణులకి కూడా కష్టసాధ్యమైన పనే. కాని అంగవైకల్యమున్న కొందరు తప్ప అందరు మానవులూ భాషని సరిగా మాట్లాడడమూ, ఇతరులు మాట్లాడిన దానిని అర్థం చేసుకోవడమూ చెయ్యగలరు. కాబట్టి ప్రతి మానవుడి మేధలోనూ అజ్ఞాతంగా అతడు మాట్లాడే భాష వ్యాకరణం ఉందన్నమాట. ఈ వ్యాకరణాన్ని కొంతలో కొంత వ్యక్తంగా వివరించేవి అష్టాధ్యాయి వంటి వ్యాకరణ గ్రంథాలు. వ్యాకరణ గ్రంథాలు లేని ఆటవిక భాషలు ఉన్నా వ్యాకరణ నిర్మాణం లేని భాష ఏదీ ఉండదు.

ఇక వ్యాకరణం ప్రమాణ భాషని నేర్చుకొనేందుకు ఉపయోగిస్తుంది లేక ఉపయోగించాలి అనే ఊహ మొదట్లో వ్యాకరణరచన చేసిన సంస్కృత గ్రీకు వ్యాకర్తలకి లేదు. కాని కాలక్రమంలో భాషలు మార్పులకు లోనవడం వల్ల ప్రాచీన భాషే ప్రమాణమైనదనీ అర్వాచీన భాష లోపభూయిష్ఠమనీ చాలా దేశాలలో వారు అభిప్రాయపడ్డారు. అందువల్ల ప్రమాణమైన ప్రాచీన భాష ఇలా ఉండాలి అని శాసించే వ్యాకరణాలు తరవాత కాలంలో ఏర్పడ్డాయి. పైగా ప్రాచీన భాషలైన గ్రీకు, లాటిన్‌లు యూరప్‌లోనూ, సంస్కృతం మన దేశంలోనూ వ్యవహార భ్రష్టమయ్యాయి. వాటిని నేర్చుకోడానికి వ్యాకరణలే ఆధారాలయి వ్యాకరణం భాషలో తప్పొప్పులని నిర్ణయిస్తుంది అనే అభిప్రాయం ప్రజలలో ఏర్పడింది. ప్రాచీన భాషల విషయంలో ఉన్న ఈ అపోహలే క్రమంగా దేశ భాషల విషయంలో కూడా ఏర్పడ్డాయి. అప్పకవి తెలుగులో నన్నయ వాడిన మాటలే తప్ప కొత్తవి ఏవీ వాడకూడదు అనడం దీనికి ఒక చక్కని ఉదాహరణ. ప్రాచీన కాలపు భాషే ప్రమాణమైనదనీ, వ్యావహారిక భాషకు వ్యాకరణం ఉండదనీ ప్రజలలో ఇప్పటికీ ఉన్న అపోహలని తొలగించడానికి భాషా శాస్త్ర జ్ఞానం ఎంతగానో తోడ్పడుతుంది.

## 2. 2. భాషాశాస్త్రం – మూల సిద్ధాంతాలు

ప్రాచీన కాలంలో పండితులు తమ తమ ప్రాచీన భాషలపై (అంటే సంస్కృతం, లాటిన్, గ్రీక్ వంటివి) మాత్రమే పరిశోధనలు చేస్తూ అవే సర్వాంగసుందరమైనవనీ దేవదత్తాలు కాబట్టి సమగ్రమైనవనీ నమ్ముతూ ఉండే వారు. కాని 16, 17, 18 శతాబ్దలలో పాశ్చాత్యులు వ్యాపారం కోసం లేక మత వ్యాప్తికి ఆసియా, ఆఫ్రికా, అమెరికా వంటి ఇతర ఖండాలకు వలస వెళ్లడం వల్ల ఆయా దేశాలలో వారు మాట్లాడే ఇతర భాషలతో వారికి పరిచయం అయింది. ఈ కొత్త భాషలలో చాలా యూరప్ భాషలకన్న భిన్న నిర్మాణం కలవి. అందువల్ల భాషలలో నిర్మాణం చాలా రకాలుగా ఉంటుందనే విషయం వారికి తెలిసింది. అన్నిటికన్న ముఖ్యమైనది పాశ్చాత్యులకు సంస్కృతంతో పరిచయం కలగడం. భారత దేశపు భాష అయిన సంస్కృతానికీ యూరప్ ఖండ ప్రాచీన భాషలయన లాటిన్ గ్రీకులకీ శబ్దాలలోనూ, వ్యాకరణంలోనూ పోలికలు కొట్టవచ్చినట్టు కనపడుతూ ఉండడం వారిని ఆశ్చర్యచకితుల్ని చేసింది. ఉదా॥ సం. భ్రాతృ – లా: frater సం. పితృ – లా: pater సం. అష్టౌ – లా: octo (మొ॥). ఇంతేకాక ఈ భాషలలో ధ్వనులలో ఉన్న పోలికలు చాలా మాటలలో తుల్యంగా ఉండడం వల్ల వీటిని సూత్ర రూపంలో చెప్పవచ్చునని వారు వెంటనే గ్రహించారు. ఈ ఆధారాలవల్ల 1786లో సర్ విలియం జోన్స్ సంస్కృతమూ, లాటినూ, గ్రీకూ మరి కొన్ని భాషలూ ఒకే మూలభాష నించి పుట్టేయని ప్రతిపాదించారు. ఈ ప్రతిపాదనే తులనాత్మక భాషా శాస్త్రానికి నాంది అయింది. (దీనిని గురించిన వివరాలు 12, 18 అధ్యాయాలలో ఉంటాయి). జన్మ సంబంధం గల భాషలలో మార్పులు సూత్రబద్ధంగా ఉంటాయని గ్రహించగానే భాషలో మార్పు సూత్రబద్ధంగా జరుగుతుందని పండితులు గ్రహించారు. దీనితో తులనాత్మక పద్ధతికి శాస్త్రీయత చేకూరింది. అనతి కాలంలోనే భాషా పరిణామంలోనే కాక ఒక కాలపు భాష నిర్మాణంలో కూడా క్రమమూ, సూత్రబద్ధతా ఉంటాయని పండితులు గ్రహించారు. వీరి ప్రథముడు ఫెర్డినాండ్ డెససూర్. ఈయనతో వర్ణనాత్మక భాషా శాస్త్ర పరిశోధన ప్రారంభమై భాషా శాస్త్రం తులనాత్మకం, చారిత్రకం, వర్ణనాత్మకం అనే మూడు శాఖలుగా వృద్ధి పొందడం ప్రారంభించింది. ఆధునిక భాషాశాస్త్రానికి ముఖ్యమైన మూల సిద్ధాంతాలు కొన్ని ఉన్నాయి. వాటిని ఈ కింద చూద్దాం.

## 1) ఉచ్చరిత భాషా ప్రాథమికత్వం

భాషలు వ్యవహారంలో మానవుడు పుట్టిన కాలంనించీ ఉన్నాయి. కాని లిపి మాత్రం ఆరు, ఏడు వేల ఏళ్ళ క్రితం నించి మాత్రమే ఉపయోగంలో ఉంది. ఇప్పటికీ లిపిలేని భాషలు వేల కొలది ఉన్నాయి. కాబట్టి భాషా పరిశోధనలో శాస్త్రజ్ఞులు ముఖ్యంగా చూడవలసింది ఉచ్చారణ కాని, లిపి కాదు. లిపి ఏ భాషకయినా అసమగ్రమైనదే (చూ. 1.4.).

## 2) వ్యాకరణం వర్ణనాత్మకంగా ఉండాలి

వ్యాకరణం ఒక భాషని వ్యవహర్తలు ఎలా మాట్లాడుతున్నారో వర్ణించాలి గాని ఇలా మాట్లాడాలి అని నిర్దేశించేదిగా ఉండకూడదు. వ్యవహారంలో లేని ప్రాచీన భాషల విషయం వేరు. కాని వ్యవహారంలో ఉన్న భాషలో ఇది తప్పు, ఇది ఒప్పు అని స్వాభిప్రాయానుసారంగా నిర్ణయించడం వైయాకరణుడి పని కాదు. ప్రాచీన భాషే సలక్షణమూ, వ్యావహారిక భాష విలక్షణమూ అనుకోవడం అపోహ మాత్రమే. కాబట్టి ప్రజలు ఎలా భాషని వ్యవహరిస్తున్నారు అన వివరించడమే వైయాకరణుడి పని. ప్రతి భాషలోనూ అపవాదాలు ఉంటాయి. కాబట్టి తార్కిక దృష్టితో వ్యవహారంలో ఉన్న నిర్మాణాలు తప్పు అని వైయాకరణుడు నిర్దేశించకూడదు. ఉదాహరణకి తెలుగులో 'పాలు' బహువచనం. పాలు ఉన్నాయి/లేవు. అయితే పాలతో చేసిన కాఫీ కూడా బహువచనంలోనే ఉండాలి కాబట్టి కాఫీ ఉన్నాయి/లేవు అనేదే సాధువని వాదించడం హాస్యాస్పదం. అయితే ఎక్కువ జనులు మాట్లాడే ప్రతి భాషకీ మాండలికాలు ఉంటాయి. ఏ మాండలికం గొప్ప దానిదే. కాబట్టి ఒక మాండలికం మంచిదనీ, మరొకటి చెడ్డదనీ అనుకోకూడదు. కాని అన్ని మండలాలవారూ విద్యాబోధన వంటి ప్రయోజనాలకి ఒక ప్రత్యేక మాండలికాన్ని ప్రమాణంగా అంగీకరించడం కూడా ఉంది. ఏది ప్రమాణం, ఏది అప్రమాణం అనేది సంఘంలో వారి మనః ప్రవృత్తి మీద ఆధారపడి ఉంటుంది. వైయాకరణుడికి అన్ని మాండలికాలూ సమానమే. కాబట్టి వాటిలో తరతమ భేద నిర్ణయం చెయ్యడం వైయాకరణుడి పని కాదు.

## 3) భాషా శాస్త్రజ్ఞుడికి అన్ని భాషలూ సమానమే

ప్రతి మానవ భాషా దానిని వ్యవహరించే సంఘంలో వారి ఆచారవ్యవహారాలు, అవసరాలు వ్యక్తం చెయ్యడానికి తగిన సామర్థ్యం కలిగి ఉంటుంది. కాబట్టి ఆటవికుల భాషలలో కొన్ని మాటలే ఉంటాయి. ఆ భాషలకు వ్యాకరణం ఉండదు అనుకొనేవారి ఊహ పొరపాటు.ఆటవికులు సంస్కృతిలో వెనుక పడి ఉన్నా వారి భాషలు నిర్మాణంలో గాని సౌందర్యంలో గాని వెనుక పడినవి కావు. సాధారణ మానవుడికి తన భాష చాలా సుందరంగానూ, స్పష్టంగానూ ఉండి ఇతర భాషలు సౌందర్య హీనంగానూ అస్పష్టంగానూ ఉన్నట్లు తోస్తుంది. ఇది కూడా అపోహ మాత్రమే. ఇతర భాషలతో పరిచయం పెరిగిన కొద్దీ ఈ అపోహ తొలగి అవి కూడా సౌందర్యవంతంగానూ సమర్థంగానూ ఉన్నాయనే అభిప్రాయం ఏర్పడడం సహజం. కాబట్టి భాషా శాస్త్రజ్ఞుడి దృష్టిలో అన్ని భాషలూ సమానమైనవే. అయితే భాషలలో ప్రత్యేక శాస్త్రాలకి తగిన పారిభాషిక పదాలు లేకపోవచ్చు. ఈ లోపం విజ్ఞానం అభివృద్ధి చెందుతున్న కొద్దీ అన్ని భాషలలోనూ కొద్దిగానో గొప్పగానో ఉంటూ ఉంటుంది. కాని ప్రతి భాషకీ అవసరానికి తగినట్లు ఈ లోపాన్ని సవరించుకోవడానికి వేరు భాషలో నించి పదాలు ఎరువు తెచ్చుకొని వాడుకోవడానికీ లేక అప్పటి వరకూ ఉన్న పదాలకు అర్థ విస్తృతి కలిగించుకోవడానికీ లేక కొత్త పదాలు సృష్టించుకోవడానికీ తగిన సామర్థ్యం ఉంటుందని గుర్తించాలి.

## 4) భాషా పరిణామం – భాషా స్థితి

భిన్న కాలాలలో ఒక భాష పొందిన పరిణామాన్ని తెలిపేవి తులనాత్మక, చారిత్రక వ్యాకరణాలు. వీటిలో మొదటిది ఒక భాషని సోదర భాషలతో పోల్చి అందులో వచ్చిన పరిణామాలని వివరిస్తుంది. రెండోది ఒక భాషలో ప్రాచీన కాలం నించీ ఉన్న లిఖితాధారాల మూలంగా ఆ భాషలో కాలక్రమంగా వచ్చిన మార్పుల్ని సమీక్షిస్తుంది. ఈ రెండిటికన్న భిన్నమైనది వర్ణనాత్మక వ్యాకరణం. ఇది ఒక కాలంలో ఒక భాష నిర్మాణం ఎలా ఉందో వర్ణిస్తుంది. వర్ణనాత్మక వ్యాకరణానికి చారిత్రక విషయాలతో నిమిత్తం లేదు. ఇప్పటి జనుల వ్యవహారం

ఆధారంగా ఇప్పటి భాషకు వ్యాకరణం రాయవచ్చు. లేక ప్రాచీన కాలపు కావ్యాలూ, శాసనాలూ ఇత్యాదులు ఆధారంగా ఆ కాలపు భాషని వర్ణించవచ్చు. ప్రతి భాషకూ కాలక్రమాన మార్పు కలగడం సహజం. కాబట్టి తగిన ప్రాచీనాధారాలు ఉంటే ప్రాచీన కాలంనించీ ఒక్కొక్క శతాబ్దికి ఒక వర్ణనాత్మక వ్యాకరణం రాయవచ్చు. ఈ వ్యాకరణాలని పోల్చి చూసి ఆ భాషకు సమగ్రమైన చారిత్రక వ్యాకరణం తయారు చేయవచ్చు.

కాని ఏ భాష అయినా ఏ ఒక్క కాలంలోనూ స్థిరంగా ఉండదు. ప్రతి భాషకీ మాండలిక భేదాలు ఉంటాయి. కాబట్టి వర్ణనాత్మక వ్యాకరణం రాసే వారు తమ పరిధిని ఒక్క ప్రాంతానికి, ఒక కులానికి లేక తెగకి పరిమితం చేసుకోవడం అనివార్యం. లేక ఒక మాండలికాన్ని ప్రధానంగా పరిశోధించి ఇతర మాండలికాలకి సంబంధించిన వివరాలని ఆయా సందర్భాలలో సూచించడం కూడా ఉంది.

వర్ణనాత్మక వ్యాకరణానికీ చారిత్రక వ్యాకరణానికీ భేదం ఉన్నా వర్ణనాత్మక వ్యాకరణ రచనకి చారిత్రక సత్యాలు ఒక్కొక్కప్పుడు తోడ్పడతాయి. ఈ కాలపు భాషా నిర్మాణంలో అస్పష్టంగా ఉన్న విషయాలు ఆ భాషా చరిత్రను మనం పరిశీలిస్తే ఈ అస్పష్టతకు కారణాలు గోచరిస్తాయి. ఇప్పుడు సాధారణ సూత్రాలకు అపవాదాలుగా ఉన్న రూపాలు ప్రాచీన కాలంలో అపవాదాలు కాకుండా ఉండి ధ్వని పరిమాణం వల్ల ప్రస్తుతం అపవాదాలుగా కనిపిస్తూ ఉండవచ్చు. కాబట్టి అవసరమైన చోట్ల చారిత్రక సత్యాలను దృష్టిలో పెట్టుకొని వర్ణనాత్మక వ్యాకరణ రచన చేస్తే అందులో సూత్రాలు తర్కసహంగానూ, సహజంగానూ ఉంటాయి.

# 3. ధ్వని నిర్మాణం

## 3.1. భాషాధ్వనులు – పరిశీలనా విధానాలు

ఏ భాషకైనా దాని ముఖ్య రూపం ధ్వన్యాత్మకంగానే ఉంటుందనీ, ఈ ధ్వనులని అసంపూర్ణంగా మాత్రమే సూచించే లిపి అముఖ్య రూపమనీ ఇంతకు ముందు అధ్యాయాలలో చూశాం. ఇతరులు మనకి తెలియని భాష మాట్లాడేటప్పుడు మనం వినేది కొన్ని ధ్వనులు సముదాయమే కాబట్టి భాష ముఖ్య రూపం ధ్వనులని మనకు స్పష్టమవుతుంది. కాబట్టి భాషల స్వరూప స్వభావాల్ని గురించి తెలుసుకొందుకు ధ్వనుల స్వభావాన్నీ ఉత్పత్తినీ గురించి తెలుసుకోవడం చాలా అవసరం. మానవులు మాట్లాడేటప్పుడు రకరకాల ధ్వనులు ఎలా ఉత్పత్తి చేయగలుగుతున్నారో వివరించేది ధ్వని శాస్త్రం (Phonetics). మానవులు తుమ్మినప్పుడు, దగ్గినప్పుడు, ఉమ్మి వేసినప్పుడూ ఇంకా ఇటువంటి సందర్భాలలో కూడా ధ్వనులు ఉత్పత్తి చేస్తారు. ఇటువంటి ధ్వనులు భాషకి చెందినవి కావు కాబట్టి ధ్వని శాస్త్రానికి వీటితో ప్రమేయం లేదు.

భాషా ధ్వనులని ముఖ్యంగా రెండు రకాలుగా పరిశీలించవచ్చు. ఇందులో మొదటి రకం ఒక ధ్వనిని ఉచ్చరించేటప్పుడు ముఖ యంత్రంలోని అవయవాలు ఏ విధంగా ప్రవర్తిస్తున్నాయి అనేది.ఇటువంటి పరిశీలన చేసే ధ్వని శాస్త్రశాఖని ఉచ్చారణాత్మ ధ్వని శాస్త్రం (Articulatory Phonetics) అంటారు. మనం ధ్వనులని ఉచ్చరించినప్పుడు అవి గాలిలో కలిగించే విభిన్న ధ్వనితరంగాలని యంత్రాల ద్వారా నమోదు చేసి వాటిలో గత భేదాలని పరిశీలించవచ్చు. ఈ శాఖని ధ్వనితరంగాత్మక ధ్వని శాస్త్రం (Acoustic Phonetics) అంటారు. ఈ విధమైన పరిశోధనకి యంత్రాలతోనూ అవి పనిచేసే తీరుతోనూ భౌతిక శాస్త్రంలోనూ పరిచయం అవసరం.కాబట్టి ఇది ఈ శాఖలో విశిష్ట పరిశోధన చేసే వారికే సాధ్యం. దీనివల్ల మన చెవులకి వినపడని సూక్ష్మ భేదాలు తెలుస్తాయి. అయినా ధ్వని శాస్త్రాన్ని గురించిన సామాన్య జ్ఞానానికి ఉచ్చారణాత్మక శాఖతో పరిచయం చాలు. ఉచ్చారణాత్మక శాఖలో ముఖ యంత్రంలోని అవయవాల

కదలికని మనం చూడడానికీ, అనుకరించి పరిశీలించడానికీ అవకాశం ఉంది. కాబట్టి ఉచ్చారణాత్మక శాఖని గూర్చి ముందు క్షుణ్ణంగా తెలుసుకోవడం అవసరం. ఈ కింద ఉచ్చారణాత్మక శాఖే వివరించబడుతుంది.

(ఈ రెండు శాఖలూ కాక శ్రవణాత్మక ధ్వని శాస్త్రం (Auditory Phonetics) అనే మూడో శాఖ కూడా ఉంది. ఉచ్చరితాలైన ధ్వనుల వాయు తరంగాలు చెవిలోకి ప్రవేశించి అవి కర్ణభేరి, దానికి సంబంధించిన ఎముకల మీద ఎటువంటి మార్పులు కలిగిస్తాయి అనే దాన్ని పరిశీలించవచ్చు. కాని ఇది కష్ట సాధ్యం. భాషా శాస్త్రానికి మిగిలిన రెండు శాఖలవల్ల తెలిసే జ్ఞానమే చాలు కాబట్టి భాషా శాస్త్రజ్ఞులు ఈ శాఖలో ఎక్కువ పరిశోధన చెయ్యలేదు).

## 3.2. ముఖ యంత్రం – ఉచ్చారణావయవాలు

ఉచ్చారణాత్మక ధ్వని శాస్త్రానికి పునాది వేసినవారు మన ప్రాచీన సంస్కృత వైయాకరణులు. పాణినికి ముందుకాలంలోనే వారు శిక్షాప్రాతి శాఖ్యలలో సంస్కృత ధ్వనులు ఎలా ఉత్పత్తి అవుతాయో శాస్త్రీయంగా వివరించారు.వారు చెప్పిన వివరాలు ఆధారంగా తీసుకొని ఇటీవలి కాలంలో పాశ్చాత్య పండితులు అన్ని భాషలకీ వర్తించేటట్లు ధ్వని శాస్త్రాన్ని విస్తృత పరచి పరిపుష్టం చేశారు.

మనం ధ్వనులని ఉత్పత్తి చేసేందుకు ఉపయోగించే అవయవాలు నోటిలో భాగాలూ, గొంతుక, ముక్కు (28వ పేజీలో పటం చూడండి). కాని ఈ అవయవాల ముఖ్యమైన ధ్వనులని ఉత్పత్తి చెయ్యడం కాదు. నోరు తినడానికి, ముక్కు గాలి పీల్చడానికి, గొంతుక ఆహారమూ, గాలీ లోపలికి పోవడానికీ ఉద్దిష్టమైనవి. ఇతర జంతువులలో ఈ అవయవాలు మాట్లాడడానికి కాక, పైన చెప్పిన వ్యాపారాలకి మాత్రమే ఉపయోగించ బడడం వల్ల ఈ విషయం స్పష్టమవుతుంది. మానవుడు మాత్రం ఈ అవయవాలని భాషా ధ్వనులని ఉత్పత్తి చెయ్యడానికి కూడా ఉపయోగించుకొనే నేర్పు సంపాదించు కొన్నాడన్నమాట.

సాధారణంగా ధ్వనులు ఊపిరితిత్తులలోంచి బయటకు వచ్చే గాలి గొంతుకలోనూ నోటిలోనూ పీడనకు లోనవడం వల్ల పుడతాయి (కొన్ని భాషలలో బయట నుంచి లోపలికి వచ్చే గాలి వల్ల పుట్టే ధ్వనులు కూడా ఉన్నాయని తరువాత చూస్తాం) ఒకొక్క ధ్వని పుట్టడానికి ఈ గాలి ఒక్కొక్క రకంగా మార్పుకి లోనవుతుంది. కాబట్టి ప్రతి ఒక్క ధ్వని ఏ విధంగా పుడుతుంది అనేది మనం గమనించవచ్చు. మనం విభిన్న ధ్వనులని ఉచ్చరించ గలగడం ముఖ్యంగా మూడు విషయాల మీద ఆధారపడి ఉంది. అవి (1) స్వర పేటిక (Larynx) లో కలిగే మార్పు, (2) గొంతుకలో గాని నోటిలో గాని గాలి నిరోధించబడే స్థానం (దీన్ని ఉచ్చారణ స్థానం (Point of articulation) అంటారు), (3) గొంతుకలో గాని నోటిలో గాని గాలిని నిరోధించే వ్యాపారంలో భేదం (దీన్ని ఉచ్చారణ ప్రయత్నం (Manner of articularion) అంటారు). ధ్వనుల విభజనకి ఈ మూడూ మూలాధారాలు అయినా కొన్ని ధ్వనుల విషయంలో అనుషంగికోచ్చారణ (Secondary articulation) కూడా ఉంటుందనే విషయం మనం గమనించాలి.




ఉచ్చారణావయవాలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | పెదవులు | 6. | కొండనాలుక | 11. | కంఠ బిలం |
| 2. | పళ్లు | 7. | జి హ్వోపాగ్రం | 12. | నాదతంత్రులు |
| 3. | వర్త్స్యం | 8. | జిహ్వామధ్యం | 13. | జిహ్వాగ్రం |
| 4. | కఠినతాలువు | 9. | జిహ్వా మూలం | | |
| 5. | మృదుతాలువు | 10. | సప్తపథ | | |

సర్వ పేటికలో నాదతంత్రులు (Vocal cords) ఉంటాయి. ఇవి వేళ్లాడే పొరలు లేక తెరలుగా గాలి పోయే మార్గానికి చెరొక వైపునా ఉంటాయి. వీటికి సాగే స్వభావం ఉంది కాబట్టి ఇవి కొంచెంగా వాయుమార్గాన్ని నిరోధించినప్పుడు కంపించడం వల్ల ధ్వనికి నాదత (Voicing) అనే గుణం వస్తుంది. నాదత ఉన్న ధ్వనులని నాదధ్వనులు (Voiced sounds) అనీ, ఇవి కంపించకుండా వాయు మార్గాన్ని పూర్తిగా తెరచి ఉంచినప్పుడు పుట్టే ధ్వనులని శ్వాస ధ్వనులు (Voiceless sounds) అనీ అంటారు. క–గ, చ–జ, ప–బ మొదలైన జంటలలో మొదటిది శ్వాసం, రెండవది నాదం. ఇది తప్ప ఈ ధ్వనులకి వేరే భేదం లేదు. నాద ధ్వనులని ఉచ్చరించేటప్పుడు నాదతంత్రుల కంపనం మనం గొంతుక మీద చెయ్యి పెట్టి చూస్తే తెలుస్తుంది. నాదతంత్రులు వాయు మార్గాన్ని కొంత సేపు పూర్తిగా నిరోధించి తరవాత వదిలితే పుట్టే ధ్వనిని కంఠ మూలీయ స్పర్శం (Glottal stop) అంటారు. దీనిని ఉచ్చరించేటప్పుడు వాయు మార్గ నిరోధం మరి ఎక్కడా ఉండదు. తెలుగులో మనం అ ఆ, ఇ ఈ, ఉ ఊ అని వర్ణమాలని ఉచ్చరించేటప్పుడు హ్రస్వ దీర్ఘాచ్చుల మధ్య ఈ ధ్వనిని ఉచ్చరిస్తాం. తెలుగు మాటలలో ఇది లేకపోయినా చాలా భాషలలో ఇది ఒక ముఖ్య ధ్వనిగా ఉంటుంది. దీనికి భాషా శాస్త్రజ్ఞులు (ʔ) అనే గుర్తు వాడతారు.

నాద తంత్రులు వాయు మార్గాన్ని అసమగ్రంగా నిరోధించినప్పుడు 'హ' అనే ధ్వని పుడుతుంది. గుసగుసలాడేటప్పుడు (Whisper) కూడా నాదతంత్రులు వాయు మార్గాన్ని అసమగ్రంగా నిరోధిస్తాయి. గట్టిగా అరవడం, వేరొకరి గొంతుకతో మాట్లాడ్డం మొదలైనవాటిలో గూడా నాద తంత్రుల చలనం ప్రధాన పాత్ర వహిస్తుంది.

ఊపిరితిత్తులలోనించి నోటిలోకి వచ్చిన గాలి సాధారణంగా ఏదో ఒక చోట నిరోధించబడుతుంది. ఈ నిరోధం పై భాగంలోని స్థానాన్ని కింద భాగంలోని ఏదో ఒక కదిలే అవయవం (నాలుక భాగం లేక కింద పెదవి) తాకడం వల్లగాని సమీపించడం వల్ల గాని ఏర్పడుతుంది. ఈ నిరోధం ఏర్పడిన స్థానాన్ని స్థానం అనీ దాన్ని తాకిన లేక సమీపించినఅవయవాన్ని కరణం (Articulator) అనీ అంటారు. ఈ నిరోధం హల్లుల (Consonants) ఉచ్చారణలోనే ఉంటుంది.

కాని అచ్చుల (Vowels) ఉచ్చారణలో ఉండదు. ఈ నిరోధంలో వైవిధ్యం వేరు వేరు రకాల హల్లుల ఉచ్చారణను కలిగిస్తుంది. కాబట్టి హల్లులలో అంతర్విభజనకి స్థానకరణ ప్రయత్నాలు మూడూ ఉపయోగిస్తాయి. (వాయు నిరోధంలో వైరుధ్యం ప్రయత్నంలో ఒక భాగం).

హల్లులు ఉచ్చరించబడే స్థానాలల్లో ముఖ్యమైనవి పై పెదవి (Upper lip), దంతాలు (అంటే పై పళ్ళ వెనక భాగం (Teeth), దంత మూలం (ఏక వర్త్స్యం – పై పళ్ళ వెనక ఉండే మాంస భాగం (Alveolus). తాలువు అగ్ర భాగం (అంటే దంత మూలం తరువాతి భాగం (Front of the Hard Palate), తాలువు మధ్య భాగం (Centre of the Hard Palate), ఈ చోట ఉచ్చరించబడే ధ్వనులకు మూర్ధన్యాలు (Retrflexes) అని వ్యవహారం), మృదుతాలువు (Soft Palate), ఈ చోట ఉచ్చరించబడే ధ్వనులకు కంఠ్యాలు (Velars) అని వ్యవహారం), మృదుతాలువు చివర భాగం (కొండ నాలుక (Uvula), ఈ చోట ఉచ్చరించబడే ధ్వనులకు పశ్చాత్కాంఠ్యాలు (Uvulars) అని వ్యవహారం), కంఠమూలం (Glottis) ఈ చోట ఉచ్చరించబడే ధ్వనులకు కంఠ మూలీయాలు (Glottals) అని వ్యవహారం).

కరణాలు కింది పెద్ద (Lower lip), నాలుక భాగాలైన జిహ్వాగ్రం (Apex, Tip of the tongue), జిహ్వా పాగ్రం (Lamina, Blade of the tongue), జిహ్వామధ్యం (Dorsum), జిహ్వామూలం (Root of the tongue), కింది పెదవీ, పై పెదవి కలియడం (అంటే తాకడం లేక సమీపించడం) వల్ల కలిగే ధ్వనులు ఓష్ఠ్యాలు (Bilabials), కింది పెదవీ దంతాలు కలియడం వల్ల కలిగే ధ్వనులు దంతోష్ఠ్యాలు (Labiodentals), జిహ్వాగ్రమూ దంతాలూ కలియడం వల్ల కలిగే ధ్వనులు దంత్యాలు (Dentals), జిహ్వాగ్రమూ దంతమూలమూ కలియడం వల్ల కలిగే ధ్వనులు దంతమూలీయాలు ( నాలుక మడతపడి తాలువు మధ్య భాగంలోకలియడం వల్ల కలిగే ధ్వనులు మూర్ధన్యాలు (Alveolars), జిహ్వాపాగ్రం తాలువు అగ్రభాగంలో కలియడం వల్ల కలిగే ధ్వనులు మూర్ధన్యాలు (Retroflexes), జిహ్వాపాగ్రం తాలువు అగ్రభాగంలో కలియడం వల్ల ధ్వనులు తాలవ్యాలు (Palatals),

జిహ్వా మధ్యం మృదుతాలువుతో కలియడం వల్ల కలిగే ధ్వనులు కంఠ్యాలు (Velars), జిహ్వామధ్యం మృదుతాలువు చివరభాగంతో కలియడం వల్ల కలిగే ధ్వనులు పశ్చాత్కంఠ్యాలు (Uvulars). పైన చెప్పిన స్థానాలు కాక కొన్ని భాషలలో మరికొన్ని కూడా ఉపయోగంలో ఉన్నాయి. ఉదాహరణకి ఇంగ్లీషులో పై పళ్ల చివరలకీ నాలుకకీ మధ్యనించి గాలి ప్రవహించడం వల్ల ఏర్పడే ధ్వనులు (θ,ð) ఉన్నాయి. వీటిని అంతర్దంత్యాలు(Inter-dentals) అంటారు. అలాగే అరబిక్ భాషలో సప్తపథ (Pharynx) దగ్గర పుట్టే ధ్వనులు ఉన్నాయి.

## 3. 3. హల్లులలో ప్రయత్న భేదాలు

ఇక ప్రయత్న భేదం వల్ల హల్లులలో భేదాలు ఎలా ఏర్పడతాయో చూద్దాం. ప్రయత్న భేదం వల్ల హల్లులని 1. స్పర్శాలు (Plosives or Stops), 2. అనునాసికాలు (Nasals), 3. పార్శ్వికాలు (Laterals), 4. కంపితాలు (Trills), 5. తాడితాలు (Flaps), 6. ఈషత్ స్పృష్టాలు (Fricatives), 7. అంతస్థలు (Frictionless continuants and semi-vowels) అని ఏడు రకాలుగా స్థూలంగా విభజించవచ్చు. ఈ ఏడు రకాలలో కూడా అంతర్విభాగాలు ఉన్నాయని కింద చూస్తాం.

స్థానకరణాలచేత వాయువు కొంత సేపు పూర్తిగా నిరోధించబడి ఆ తరువాత వదలబడినప్పుడు పుట్టే ధ్వని స్పర్శం. స్పర్శాల ఉచ్చారణలో మాత్రమే వాయువు పూర్తిగా నిరుద్ధమవుతుంది; మిగిలిన ధ్వనుల ఉచ్చారణలో పూర్తి నిరోధం ఉండదు. కాబట్టి స్పర్శాలకీ ఇతర ధ్వనులకీ ఇదే ముఖ్యమైన భేదమని గుర్తించాలి. ఇంగ్లీషులో స్పర్శానికి Stop అనీ Plosive అనీ రెండు పేర్లు ఉన్నాయి. ఈ రెండిటికీ చిన్న భేదం ఉంది. నిరోధించబడిన వాయువుని వెంటనే వదలకపోతే పుట్టే ధ్వనిని Stop (అస్ఫుటిత స్పర్శం) అనీ వెంటనే వదిలితే పుట్టే ధ్వనిని Plosive అనీ అంటారు. అస్ఫుటిత స్పర్శాలు కొన్ని భాషలలో పదాంతంలో ఉంటాయి. 'క' 'చ' 'ట' 'త' 'ప' వర్గాలలో చివరి అక్షరాలు తప్ప మిగిలిన 20 అక్షరాలూ స్పర్శాలు. తెలుగులో రక్తం, తృప్తి, ఉత్పలం మొదలైన మాటల్లో రెండు స్పర్శాలని కలిపి ఉచ్చరించేటప్పుడు మొదటి స్పర్శం అస్ఫుటితంగానే ఉంటుంది. స్పర్శాలలో చాలా రకాల భేదాలు

ఉన్నాయి. ఒక ధ్వనిని ఉచ్చరించేటప్పుడు నాదతంత్రులు కంపించకపోతే అదే శ్వాసమనీ, అది కంపిస్తే నాదమనీ ఇంతకు ముందు చూశాం. తెలుగులో కచట తపలు శ్వాస స్పర్శాలు. గజడదబలు నాదస్పర్శాలు. స్పర్శోచ్చారణలో ఎక్కువ గాలిని వదిలితే అవి మహా ప్రాణ స్పర్శాలు లేక మహా ప్రాణాలు (Aspirated Stops) అవుతాయి. తెలుగులో ఖ చ ఠ థ ఫ శ్వాస మహా ప్రాణాలు, ఘ ఝ ఢ ధ భ నాదమహా ప్రాణాలు. వీటి ఉచ్చారణలో ఎక్కువగా గాలి బయటికి వస్తుందని వీటిని ఉచ్చరిస్తూ నోటి దగ్గర చెయ్యి పెట్టుకొని చూస్తే తెలుస్తుంది. చ ఛ జ ఝ లకీ మిగిలిన స్పర్శాలకీ మధ్య ఒక చిన్న భేదం ఉంది. పై వాటి ఉచ్చారణలో నిరుద్ధమైన వాయువు ఆకస్మికంగా కాక మెల్లిగా వదలబడుతుంది. కాబట్టి వీటిని స్పృష్టోష్మాలు (Affricates) అంటారు. వాయువు పూర్తిగా నిరుద్ధమవుతుంది. కాబట్టి వీటిని స్పర్శాలలో అంతర్భాగంగానే పరిగణించవచ్చు. పై ధ్వనులు తాలవ్యాలు. ఇవి కాక తెలుగులో చల్లు, చుట్టం, జల్లు, జొన్న మొదలైన మాటలలో చ, జ లు ఉన్నాయి; ఇవి దంత మూలం దగ్గర ఉచ్చరించబడే స్పృష్టోష్మాలు. ఒక స్పర్శాన్ని ఉచ్చరించేటప్పుడు దాని ప్రధాన స్థానంలోనే కాక కంఠమూలం (నాదతంత్రుల) దగ్గర కూడా (రెండు చోట్లా ఒకేసారి) వాయువుని నిరోధించి వదిలితే పుట్టే ధ్వని కంఠమూలీకృత స్పర్శం (Glottalized Stop). కంఠమూలీకృత కకార తకారాలు కోయ భాషలో ఉన్నాయి. ఆఫ్రికన్ భాషలో పురోఽనునాసికృత స్పర్శాలు (Prenasalized Stops) ఉన్నాయి. వీటి ఉచ్చారణలో ముక్కు ద్వారానూ నోటి ద్వారాను బయటికిపోయే వాయువు ముందు నోటిలోనూ తరవాత ముక్కులోనూ నిరోధించబడుతుంది. ఈ ధ్వనులు మనకి ంబ, ంత అన్నట్లు వినపడతాయి. (ఇవి పదాదిన కూడా ఉంటాయి). అంతస్పర్శాలు (Implosive Stops) ఊపిరితిత్తుల నుంచి బయటికి వచ్చే గాలి వల్ల కాక బయటినించి నోట్లోకి వచ్చే గాలి వల్ల ఉత్పన్నమవుతాయి. నోటిలో ఒక స్థానంలో స్థాన కరణాలని కలిపి నాదతంత్రులను కూడా మూసి స్వరపేటిక (లేక కాకలకం)ను కిందకు లాగితే సర్వపేటిక పై భాగంలో శూన్య ప్రదేశం ఏర్పడుతుంది. ఆ తరవాత స్థానకరణాలను విడదీస్తే ఆ శూన్య ప్రదేశంలోకి బయటి నించి గాలి వస్తుంది. వీటిలో నాదధ్వనులని ఉచ్చరించేటప్పుడు మాత్రం నాదతంత్రులు

కొద్దిగా తెరుచుకొని ఉంటాయి కాబట్టి ఊపిరితిత్తులలోని గాలి కొంత నోటిలోపలికి వస్తుంది; బయటినించి కూడా కొంత గాలి లోపలికి వస్తుంది. అంతస్స్పర్శాలు కూడా ఆఫ్రికన్ భాషలలో ఉన్నాయి.

అనునాసికాలని ఉచ్చరించేటప్పుడు గాలి నోటిలోనించీ ముక్కులో నించీ కూడా బయటికి వస్తుంది. ఙ ఞ ణ న మ అనునాసిక స్పర్శాలు. వీటి ఉచ్చారణలో నోటిలో గాలి కొంత సేపు నిరోధించబడి, ఆ తరువాత వదలబడుతుంది. ముక్కులో నించి గాలి బయటికి పోతూ ఉంటుంది. ఇవి సాధారణంగా చాలా భాషలలో నాదాలుగా ఉంటాయి. కాని కొన్ని భాషలలో శ్వాసానునాసికాలు కూడా ఉన్నాయి. అచ్చులలోనూ స్పర్శేతర హల్లులలోనూ కూడా ముక్కులో నించి గాలిని వదలడం ద్వారా ఆనునాసిక్యం ఏర్పడుతుంది.

నాలుకకొనని పైభాగానికి తగిలించి గాలిని నాలుక పార్శ్వాల (పక్కల) ద్వారా వదలడం వల్ల పార్శ్వికాలు ఏర్పడతాయి. తెలుగులో ల, ళ అనే రెండు పార్శ్వికాలు ఉన్నాయి. వీటిలో మొదటిది దంతమూలీయం, రెండోది మూర్ధన్యం. చాలా భాషలలో ఇవి నాదాలే కాని శ్వాసపార్శ్వికాలు తొద, బ్రాహుయీలలో ఉన్నాయి.

కంపితాలు, తాడితాల ఉచ్చారణలో కరణం స్థానాన్ని స్పర్శాల ఉచ్చారణలో వలె ఎక్కువ కాలం స్పృశించి ఉండదు. ఒకే ఒకసారి కరణం స్థానాన్ని తేలికగా స్పృశించి వదలివేసినప్పుడు పుట్టే ధ్వని తాడితం. కరణం కంపిస్తూ స్థానాన్ని చాలా సార్లు తగిలి వదలివేస్తే పుట్టే ధ్వని కంపితం. సాధారణంగా వీటికి కరణం జిహ్వాగ్రం. తెలుగులో ర దంతమూలీయ తాడితం. కాని కర్ర, బుర్ర వంటి మాటలలో ద్విత్వమూర్ధన్య ర కంపితం. ప్రాచీనాంధ్రంలో ఆ ద్విత్వం కాని కంపితం. మూర్ధన్యతాడితం హిందీ, గోండీ వంటి భాషలలో ఉంది. ఫ్రెంచి, జర్మన్ భాషల ప్రమాణ మాండలికాలలో కొండనాలుక కంపించడం వల్ల పుట్టే కంపితం అధిజిహ్వాకంపితం (Uvular Trill) ఉంది. సాధారణంగా ఈ ధ్వనులు నాదాలు. కాని శ్వాసాలైన కంపితాలూతాడితాలూ కొన్ని భాషలలో ఉన్నాయి. అరకులోయ దగ్గరగల కొండ భాషలో శ్వాసకంపితం ఉంది.

ఈషత్ స్పృష్టాల ఉచ్చారణలో కరణం స్థానాన్ని స్పృశించక దగ్గరగా మాత్రం వస్తుంది. వాటి మధ్య నున్న అవకాశంలో నించి గాలి బయటకు పోతుంది. వీటిలో శ్వాసాలూ, నాదాలూ కూడా చాలా భాషలలో ఉన్నాయి. తెలుగులో వరి, వరుస, వాడు, వీడు వంటి మాటలలో వకారం దంతోష్ఠ్యమైన ఈషత్ స్పృష్టం. ఇది నాదం. దీనికి తుల్యమైన శ్వాసధ్వని ఇంగ్లీషు f ఆఫీసు, ఫిలాసఫీ వంటి మాటలలోనూ ఉర్దూ సఫా, ఫిర్యాదు వంటి మాటలలోనూ ఉంది. రోగం, మాగాయి వంటి మాటలలో అచ్చుల మధ్య వచ్చే అద్విరుక్త గ కారం నాద కంఠ్యేషత్ స్పృష్టం. దీనికి తుల్యమైన శ్వాసధ్వని తమిళంలో ఉంది. ఇంగ్లీషు వారి ఉచ్చారణలో thin, then లలో th అంతర్దంత్యేషత్ ఇది మొదటి మాటలో శ్వాసం, రెండవ మాటలో నాదం. ఈషత్ స్పృష్టాలలో సమేషత్ స్పృష్టాలు (Slit Fricatives) ద్రోణీకేషత్ స్పృష్టాలు (Groove Fricatives) అనే విభజం అవసరం. పైన చెప్పిన వన్నీ సమాలు, వీటి ఉచ్చారణలో కరణం సమస్థానంలోనే (అంటే బల్లపరుపు గానే) ఉంటుంది. కాని ద్రోణీకేషత్ స్పృష్టాలలో కరణమైననాలుక దొన్నె ఆకారంలో అంచులు పైకి లేచిమధ్య భాగం కిందకు పోయి ఉంటుంది. ఈ విధంగా స, శ, షలు ఏర్పడతాయి. స దంతమూలీయం, శ తాలవ్యం, ష మూర్ధన్యం. ఇవి శ్వాసాలు స, శ లకి సజాతీయమైన నాద ధ్వనులు ఇంగ్లీషులో zoo, has, measure, allusion వంటి మాటలలో ఉన్నాయి.

య కారమూ ఉభయోష్ఠ్యమైన వ కారమూ (ఉప్పు, ఓడ మొదలైన మాటలలో పదాది ఉ ఊ ఒ ఓ ల ముందు వైభాసికంగా వచ్చే వ కారం) అంతస్థలు వీటి ఉచ్చారణలో వాయు నిరోధం మిగిలిన హల్లులలో కన్నా చాలా తక్కువగా ఉంటుంది. అందువల్ల య-ఇ, వ-ఉ వీటి మధ్య భేదం చాలా స్వల్పం. య, వల ఉచ్చారణలో కొంచెం వాయు నిరోధం ఉంటుంది కాని ఇ, ఉలలోనూ మిగిలిన అచ్చులలోనూ అసలు వాయు నిరోధం ఉండదు. ఇవి నాదాలు.

హల్లులలో కూడా అచ్చులలో లాగే దీర్ఘోచ్చారణ ఉంటుంది. ఈ దీర్ఘ హల్లులనే మనం ద్విత్వ హల్లులు లేక ద్విరుక్త హల్లులు అంటాం. అక్క, అచ్చు, అప్ప మొదలైన వాటిలో దీర్ఘ హల్లులు ఉచ్చారణ కాలం రక్తం, అప్పులు వంటి

వాటిలో సంయుక్త హల్లుల ఉచ్చారణ కాలానికి సమాసం కాబట్టి వీటిని రెండు హల్లులుగా పరిగణిస్తాం కాని, ఉచ్చారణలో ఇవి దీర్ఘహల్లులుగానే ఉచ్చరించబడతాయి అనే విషయం గమనించాలి.

ఒక కొన్ని భాషలలోనే ఉండే అసాధారణమైన హల్లులను గురించి సంగ్రహంగా తెలుసుకోవాలి. ఇటువంటి వాటిలో ఒక రకాన్ని క్వణాలు (Clicks) అంటారు. ఇవి కంఠ స్థానంలోనూ దానికి ముందు ఏదో ఒక స్థానం (పెదవులు, దంతాలు మొ.)లోనూ ఒకేసారి వాయువును నిరోధించి నాలుక మధ్య భాగాన్ని కిందకు లాగి అలా ఏర్పడిన శూన్యంలోకి ఊపిరితిత్తులలోని వాయువును వదలడం వల్ల ఏర్పడతాయి. ఇవి ఆఫ్రికా భాషలలో ప్రచురంగా ఉన్నాయి. తెలుగువారు అనుతాపాన్ని సూచించే సమయంలో ఉచ్చరించే 'చుచు' అనే ధ్వని ఇటువంటిదే. ఇటువంటి ఉచ్చారణని ద్విస్థానోచ్చారణ (Double articulation) అంటారు. ఇందులో వాయు నిరోధం రెండు స్థానాలలో ఉంటుంది. కంఠ మూలీకృత స్పర్శాలలో ద్విస్థానోచ్చారణ ఉందని ఇంతకు ముందే చూశాం.

ఇంకొక రెండు రకాల ద్విస్థానోచ్చారణలు ఓష్ఠ్యీకరణం (Labialization), తాలవ్యీకరణం (Palatalization), ఓష్ఠ్యేతరమైన హల్లుని ఉచ్చరిస్తూ పెదవులని గుండ్రంగా చేస్తే ఆ హల్లు ఓష్ఠ్యీకృతం అవుతుంది. తెలుగులో కూర, తోట, దూడ మొదలైన పదాలలో ఉ, ఊ, ఒ, ఓ ల ముందు ఉన్న హల్లులు దీనికి ఉదాహరణలు. తాలవ్యేతర హల్లుని ఉచ్చరిస్తూ తాలుస్థానంలో కూడా వాయునిరోధాన్ని కలిగిస్తే ఆ హల్లు తాలవ్యీకృతమవుతుంది. తాలవ్యీకృత హల్లులు రష్యన్ భాషలో ఉన్నాయి.

## 3. 4. అచ్చులు

అచ్చుల ఉచ్చారణలో వాయు నిరోధం ఉండదని ఇంతకుముందే గమనించాం. అచ్చులు సాధారణంగా నాదాలు, కాని శ్వాసాచ్చులు కూడా ఉండడానికి అవకాశం ఉంది. గుసగుసలాడేటప్పుడు ఉచ్చరించే అచ్చులు శ్వాసాలుగా ఉంటాయి. జపనీస్ భాషలో శ్వాసాచ్చులు శ్వాసహల్లుల మధ్య ఉన్నాయి.

అచ్చులో అంతర్విభజన చెయ్యడానికి ఈ కింద ఇచ్చిన ఏడు విషయాలు తోడ్పడతాయి.

1. నాలుక ఎత్తు.
2. ఎత్తుగా ఉన్న నాలుక భాగం (పూర్వ భాగం లేక పశ్చాద్భాగం).
3. పెదవుల ఆకారం.
4. నాసామార్గం తెరుచుకొని ఉండడం లేక మూసుకొని ఉండడం.
5. నాలుక పై భాగం ఆకారం.
6. నాలుక నరాల దృఢత (Tenseness)
7. సప్తపథలోనూ కృకాగ్రంలోనూ జరిగే మార్పులు.

నాలుగు ఎత్తును బట్టి తెలుగులో అచ్చులను ఉన్నతాలు (High vowels), మధ్యమాలు (Mild vowels), నిమ్నాలు (Low vowels) అని మూడు రకాలుగా విభజించవచ్చు. ఇ, ఈ, ఉ, ఊ లు ఉన్నతాలు; ఎ, ఏ, ఒ, ఓ లు మధ్యమాలు; అ, ఆ లు నిమ్నాలు, ఇ, ఈ, ఉ, ఊ ల ఉచ్చారణలో నాలుక, కింద దవడకు సమాంతరంగా ఉన్న నోటి పైభాగానికి దగ్గరగా ఉంటుంది. అందువల్ల నోరు కొంచెమే తెరుచుకొని ఉంటుంది. ఎ, ఏ, ఒ, ఓ ల ఉచ్చారణలో అవి కొంచెం కిందకివచ్చి నోరు కొంచెం ఎక్కువ తెరుచుకొంటుంది; అ, ఆ ల ఉచ్చారణలో నాలుక బాగా కిందకి వచ్చి నోరు బాగా తెరుచుకొంటుంది. అందువల్లనే ఉన్నతాచ్చులని సంవృతాచ్చులు (Close vowels) అనీ మధ్యమాచ్చులని అర్ధ సంవృతాచ్చులు (Half-close vowels) అనీ నిమ్నాచ్చులని వివృతాచ్చులు (Open vowels) అనీ కూడా అంటారు.

ఇ, ఈ, ఎ, ఏ లు అగ్రాచ్చులు (Front vowels) వీటి ఉచ్చారణలో నాలుక అగ్రభాగం పైకి లేచి ఉంటుంది. ఉ, ఊ, ఒ, ఓ లు పశ్చిమాచ్చులు (Back vowels); వీటి ఉచ్చారణలో నాలుక వెనుకకు లాగబడి కుంచించుకొని ఉండడంవల్ల మృదుతాలువుకీ నాలుకకీ మధ్య సన్నని మార్గం ఉంటుంది. అ, ఆ లు కేంద్రాచ్చులు (Central vowels). కేంద్రాచ్చుల ఉచ్చారణలో నాలుక ముందుకు సాగక, వెనుకకు లాగబడక తటస్థంగా ఉంటుంది.

నాలుక ఎత్తునిబట్టి చేసిన ఉన్నతం, మధ్యమం, నిమ్నం అనే మూడు విభాగాలని గూర్చి తెలుసుకొన్నాం. ఇది ముఖ్య విభజన మాత్రమే. చాలా భాషలలో వీటిలో ఇంకా అంతర్విభజన అవసరమవుతుంది. ఈ అంతర్విభజన చాలా సూక్ష్మంగా చెయ్యవచ్చు. కాని మనదేశపు భాషలకు ఉన్నత, ఈషదున్నతం (Lower High), మధ్యమం, నిమ్నతర మధ్యమం (Lower Mid), ఈషన్నిమ్నం (Higher Low), నిమ్నం అనే ఆరురకాల విభజన సరిపోతుంది. ఈషదున్నతాచ్చుల ఉచ్చారణలో నాలుక ఉన్నతాచ్చుల ఉచ్చారణలో కన్న కొంచెం కిందగా ఉంటుంది. మధ్యమాచ్చు స్థానం కన్న నాలుక కొంచెం కిందగా ఉంచి ఉచ్చరిస్తే నిమ్నతర మధ్యమాచ్చు ఏర్పడుతుంది. తెలుగులో రెండో అక్షరంలో అకారం ఉన్నప్పుడు మొదటి అక్షరంలో ఇ, ఉ లు ఈషదున్నతంగానూ, ఎ, ఒ లు నిమ్నతర మధ్యమంగానూ ఉచ్చరించబడతాయి. పిల్ల – పిల్లి, గుడ్డ – గుడ్డు, వెన్న–వెన్ను, మొక్క – మొక్కు, ఈ జంటలలో మాటకి 'ఉంది' అనే క్రియ కలిపి అవ్యవహితంగా ఉచ్చరిస్తే ఈ భేదం స్పష్టమవుతుంది. అదే విధంగా హ్రస్వ అకారం ఈషన్నిమ్నం, దీర్ఘ ఆకారం నిమ్నం, కాని ఆకారం ముందు హ్రస్వ అకారం నిమ్నం: కప్ప–కప్పులకి 'ఉంది' చేర్చి ఉచ్చరిస్తే ఈ విషయం తెలుస్తుంది.

డేనియల్ జోన్స్ (Daniel jones) అనే ప్రఖ్యాత ధ్వని శాస్త్రవేత్త నాలుక ఎత్తును బట్టి అగ్రభాగంలో నాలుగు, పశ్చాద్భాగంలో నాలుగు మొత్తం ఎనిమిది అచ్చులను ప్రాథమికాచ్చులు (Cardinal vowels) గా పరిగణించి, మిగిలిన అచ్చులను వీటిలో ఒకదాని కంటె కొంచెం కింద ఉన్నది లేక పైన ఉన్నది అని చెప్పవచ్చునని ప్రతిపాదించారు.

అచ్చులలో హ్రస్వ దీర్ఘ భేదం మన భాషలో లాగే చాలా భాషలలో ఉంది.

మన భాషలో పశ్చిమాచ్చులు ఉచ్చరించేటప్పుడు పెదిమలు ముందుకు సాగి గుండ్రంగా అవుతాయి; అగ్రాచ్చుల విషయంలో పెదిమలు యథాస్థానంలోనే ఉంటాయి. కాబట్టి మన భాషలో పశ్చిమాచ్చులు వర్తులీకృతాలు లేక ఓష్ఠ్యీకృతాలు (Rounded), అగ్రాచ్చులు అనోష్ఠ్యీకృతాలు (Unrounded), కాని ఓష్ఠ్యీకృతమైన అగ్రాచ్చులూ, అనోష్ఠ్యీకృతమైన పశ్చిమాచ్చులూ కూడా కొన్ని

భాషలలో ఉన్నాయి. మొదటి రకం ఫ్రెంచి, జర్మన్ భాషలలో ఉన్నాయి. తమిళంలో పదాంతంలో ఉకారం అనోష్ఠ్యీకృతం.

అచ్చుల ఉచ్చారణలో నోట్లోనించే కాక ముక్కులో నించి కూడా గాలి వదలవచ్చు. ఇలా చేస్తే పుట్టే అచ్చును అనునాసికాచ్చు (Nasalized vowel) అంటారు. తెలుగులో అనునాసికాచ్చుల వాడకం లేదు కాని మనని ఎవరైనా పిలిచినప్పుడు మనం చేసే 'ఆఁ' అనే ధ్వనీ, ఊకొట్టేటప్పుడు చేసే 'ఊఁ' అనే ధ్వనీ, 'ఎందుకు' అనే అర్థం లో ఉచ్చరించే 'ఏఁ' అనే ధ్వనీ అనునాసికాలే. హిందీ, ఫ్రెంచి వంటి భాషలలో అనునాసికాచ్చులకీ మౌఖికాచ్చులకీ (Oral vowels) భేదం ఉంది. ఉదాహరణకి హిందీలో కహా అంటే 'చెప్పబడింది', కహాఁ అంటే 'ఎక్కడ?'.

ఇంగ్లీషు భాష అచ్చులలో దృఢ (Tense) - శ్లథ (Lax) భేదం ఉంది. దృఢాచ్చుల ఉచ్చారణలో నరాల బిగింపు (Musculr Tension) శ్లథాచ్చులో అది ఉండదు. bit, bet, boot, but శ్లథాచ్చులు; beat, bait, boot, bought, father వీటిలోవి దృఢాచ్చులు.

పైన చెప్పినవి కాక కొన్ని భాషలలో ఉదాత్తత (Stress), స్వరం (Pitch) అనే రెండిటివల్ల కూడా అచ్చులలో భేదాలు ఏర్పడతాయి. ఉదాత్తాచ్చులు గట్టిగా ఉచ్చరించబడతాయి. అనుదాత్తాచ్చులు మెల్లిగా ఉచ్చరించబడతాయి. ఇంగ్లీషులో Survey, Conduct వంటి మాటలు నామవాచకాలయితే ప్రథమాచ్చూ, క్రియలైతే ద్వితీయాచ్చూ ఉదాత్తంగా ఉచ్చరించబడతాయి. వైదిక సంస్కృతంలో ఉదాత్తానుదాత్త భేదం చాలా ముఖ్యమైనది. చైనీస్, థాయి (Thai) వంటి భాషలో ఒక పదంలోనే స్వర భేదం వల్ల అర్థభేదం ఏర్పడుతుంది. థాయి భాషలో 'మా' అనే మాటని ఉచ్చ స్వరం (High Tone) లో ఉచ్చరిస్తే దాని అర్థం 'గుర్రం', మధ్యమ స్వరంలో (Mid Tone) ఉచ్చరిస్తే అర్థం 'రా', ఆరోహి స్వరం (Rising Tone) లో ఉచ్చరిస్తే అర్థం 'కుక్క'.

ఇంగ్లీషు వంటి కొన్ని భాషలలో సంధ్యచ్చులు (Diphthongs) ఉన్నాయి. సంధ్యచ్చులో అచ్చు తరవాత (అరుదుగా అచ్చు ముందు) అంతస్థ

(య లేక వ) సహాలినమరొక అచ్చు ఉంటుంది. సంధ్యచ్చులో రెండు అచ్చులూ ఒకే అక్షరం (syllable)లో ఉంటాయి. ఇంగ్లీషులో high, how, boy వంటి మాటలలోని అచ్చుల సముదాయాలు దీనికి ఉదాహరణలు. తెలుగులో ఐ, ఔలు నిజానికి సంధ్యచ్చులు కావు; ఇవి అయ్, అవ్ తో తుల్యమే అయినా వీటిని సంధ్యచ్చులుగా పరిగణించరు. ఒక భాషలో ఇటువంటి సముదాయం సంధ్యచ్చా కాదా అనేది ఆ భాష నిర్మాణం మీద ఆధారపడి ఉంటుంది.

## 3.5 పదసంహిత (Word Juncture), శ్రుతి (Intonation).

సాధారణంగా మనం మాట్లాడేటప్పుడు ఒక మాటకీ వేరొక మాటకీ అర్థభేదం ఆ మాటలతో ధ్వనులవల్ల కలుగుతుంది. ఉదాహరణకి పాట–మాట, కలవ(పువ్వు) – కాలవ – వీటిలో మొదటి జంటలో పకార మకారలవల్ల, రెండో జంటలో హ్రస్వదీర్ఘ అకార ఆకారాలవల్లా అర్థభేదం సూచించబడుతోంది. కాని మనం ఒక వాక్యాన్ని ఉచ్చరించేటప్పుడు ఆ వాక్యంలో పదాలని వ్యవధానం లేకుండానే సాధారణగా ఉచ్చరిస్తాం. కాని కొన్ని సందర్భాలలో ఒకే ధ్వని సముదాయం మధ్యలో వ్యవధానం ఉంటే ఒక అర్థాన్ని అది లేకపోతే వేరొక అర్థాన్ని ఇస్తుంది. ఆకారం – ఆ కారం, ఆస్థానం – ఆ స్థానం, ఏకాకి – ఏ కాకి – పై జంటలు ఈ విషయాన్ని ధ్రువపరుస్తాయి. వీటిలో మొదటి పదంలో వ్యవధానం లేదు, రెండో దానిలో వ్యవధానం ఉంది. ఇటువంటి వ్యవధానాన్ని పదసంహిత అంటారు. ధ్వనులలాగే ధ్వని లేకపోవడం వల్ల ఏర్పడిన పదసంహిత కూడా అర్థభేదాన్ని కలిగించగలదు. కాబట్టి పద సంహిత కూడా ఒక భాష ధ్వని నిర్మాణంలో ప్రముఖ పాత్ర వహిస్తుంది. పద సంహితని రాతలో వ్యవధానం ఉంచడం వల్ల సూచిస్తాం. కాని రాతలో వ్యవధానం ఉన్నచోటల్లా ఉచ్చారణలో వ్యవధానం ఉండదు. రాతలో మనం ప్రతి పదానికీ తరువాత చోటు వదులుతాం. కాని ఉచ్చారణలో అవసరమైన చోట తప్ప పదాల మధ్య వ్యవధానం మాట్లాడడంలో వేగాన్ని బట్టి ఉంటుంది. నెమ్మదిగా మాట్లాడేటప్పుడు ప్రతి పదానికీ మధ్య వ్యవధానం ఉంటుంది; వేగంగా మాట్లాడేటప్పుడు ఈ వ్యవధానం స్పష్టంగా ఉండదు. పద సంహితకి ఇంకొక ఉదాహరణః ఆవిడ అన్నం వండి పెట్టింది –

ఆవిడ అన్నం వండి, పెట్టింది. వండి, పెట్టింది. ఈ రెండు మాటలకీ మధ్య వ్యవధానం లేకుండా ఉచ్చరిస్తే ఒకావిడ ఏ కారణం చేతనో అన్నం వండుకోలేని వారికి అన్నం వండి సహాయం చేసింది అని అర్థం. ఇవే మాటలు వ్యవధానంతో ఉచ్చరిస్తే ఆవిడ అన్నం వండి ఒకచోట పెట్టింది లేక వడ్డించింది అని అర్థం. మొదటి వాక్యంలో పెట్టు సహాయక క్రియ (Auxiliary verb) ప్రధాన క్రియకీ సహాయక క్రియకీ మధ్య వ్యవధానం ఉండదు. రెండో వాక్యంలో వండడం, పెట్టడం రెండూ ప్రధాన క్రియలే.

పదసంహితలాగే శ్రుతి కూడా వాక్యంలో ధ్వనులలో మార్పు లేకపోయినా అర్థభేదం కలిగించగలదు. కాని శ్రుతి వాక్యం కాని వాక్య భాగంకాని అయిన ధ్వని సముదాయం అంతటి మీదా ఉంటుంది. ఇటువంటి ధ్వని సముదాయంలో కొన్ని అక్షరాలు ఎక్కువ స్థాయిలోనూ (అంటే గట్టిగా) మరికొన్ని తక్కువ స్థాయిలోనూ (అంటే మెల్లిగా) ఉచ్చరించబడతాయి. దీనినే శ్రుతి క్రమంగా ఎక్కువగా అయితే దాన్ని ఆరోహి స్థాయి (Rising Pitch) అనీ, అది క్రమంగా తక్కువ అయితే దాన్ని అవరోహి స్థాయి (Falling Pitch) అనీ, అది మొత్తం అంతటా సమానంగా ఉంటే దాన్ని సమస్థాయి (Level pitch) అనీ అంటారు. మనం రాతలో వాక్యం చివర వాడే ? !, వంటి గుర్తులు ఈ శ్రుతినే సూచిస్తాయి. కాని ఈ గుర్తులు సూచించే వాటికన్న ఎక్కువ భేదాలు ఉచ్చారణలో ఉంటాయి. ఒక్కొక్క పదం మీద ఉండే స్థాయి 1, 2, 3, 4 అనే అంకెలతో సూచిస్తారు.

సాధారణంగా ఒక్కొక్క రకం వాక్యానికి ఒక్కొక్క రకం శ్రుతి ఉంటుంది. ఉదాహరణకి ప్రశ్నలు సాధారణంగా ఆరోహి స్థాయి ఉచ్చరించ బడతాయి: వాడు ఎప్పుడు వస్తాడు.↑ ఒక విషయాన్ని సూచించే వాక్యాలు అవరోహి స్థాయిలో ఉచ్చరించబడతాయి: వాడు రేపు వస్తాడు↓ . కాని ప్రశ్ననే సమాధానం మీద ఆసక్తి లేనప్పుడు సమస్థాయిలో ఉచ్చరించవచ్చు: వాడు ఎప్పుడు వస్తాడు!. అయ్యో !, ఓహో!, అలాగా! మొదలైన పదాలు సమ స్థాయితో ఉచ్చరించబడతాయి. కాని వీటినే ఆశ్చర్యాన్ని సూచిస్తూ ఆరోహి స్థాయితో ఉచ్చరించవచ్చు: అయ్యో ,ఓహో,↑ అలాగా,↓ విధి వాక్యాలు సాధారణంగా అవరోహి స్థాయిలో ఉచ్చరించబడతాయి: రేపు రా↓ . వస్తువులు లెక్క పెట్టేటప్పుడు లేక కొన్ని

వస్తువుల సముదాయాన్ని చెప్పేటప్పుడు సాధారణంగా చివరి మాట అవరోహి స్థాయిలోనూ దాని ముందు మాటలు ఆరోహి స్థాయిలోనూ ఉండడం మనం గమనించవచ్చు:

ఒకటి ↑ రెండూ ↑ మూడూ ↑ నాలుగు ↓
అన్నం ↑ పప్పూ ↑ కూరా ↑ పెరుగు ↓

చివరి మాటను కూడా ఆరోహి స్థాయిలోనూ, వేగంగా ఉచ్చరించేటప్పుడు అన్నీ అవరోహి స్థాయిలోనూ ఉచ్చరించడం కూడా ఉంది. కాబట్టి శ్రుతి కొంత వరకూ వక్తృమనః స్థితి, ఉచ్చారణ వేగం మొదలైనవాటి మీద ఆధారపడి ఉంటుంది. వాక్యంలో ఒక మాటని నొక్కి పలికేటప్పుడు ఆ మాట మిగిలిన వాటి కన్న ఎక్కువ స్థాయిలో ఉంటుంది (దీన్ని 4 సంఖ్యతో సూచించవచ్చు):

నువ్వు రేపు తప్పకుండా డబ్బు ఇవ్వాలి ↓
శ్రుతి వల్లే అర్థం భేదం ఏర్పరడానికి ఒక ఉదాహరణ :

రా రా ↓
రా రా ↑

వీటిలో మొదటి వాక్యం ఒక సన్నిహి తుణ్ణి రమ్మని పిలవడంలో ఉపయుక్తమవుతుంది; రెండో వాక్యానికి అర్థం ఆయన/మీరు వస్తారా? రారా? అని.

## 3.6. ధ్వన్యాత్మక లిపి (Phonetic Transcription)

ఏ భాషలోనయినా ఆ భాషా లిపి దానిలోని ధ్వనుల నన్నిటినీ సమగ్రంగానూ, నిర్దుష్టంగానూ సూచించదు. లిపి ఏర్పడిన తరువాత భాషలో కొన్ని ధ్వనులు నశించడం, కొత్తవి రావడం; లిపి ఏర్పరిచినప్పుడే అది ఆ భాషలో ధ్వనులని అనుసరించి ఉండకోవడం మొదలైనవి దీనికి కారణాలు. పైగా ప్రపంచంలో చాలా ఆటవిక భాషలకి ఇప్పటికీ లిపులు లేవు. కాబట్టి భాషా శాస్త్రజ్ఞులకి ఏ భాషలోనయినా ఉన్న ధ్వనులని నిర్దుష్టంగా సూచించగల ప్రమాణికమైన లిపి అవసరం. ఇటువంటి దానిని ధ్వన్యాత్మక లిపి అంటారు. అంతర్జాతీయ ధ్వని శాస్త్రజ్ఞుల సంఘం (International Phonetic

Association) వారు ఇటువంటి లిపి ఒకటి తయారు చేశారు. దీన్ని ( IPA Chart) అంటారు. అమెరికాలో భాషాశాస్త్రజ్ఞులు వాడే ధ్వన్యాత్మక లిపి దీని కంటె కొంచెం భిన్నంగా ఉంటుంది. ఈ రెండు రకాలకీ యూరోపియన్ వర్ణమాలలో లిపి సంకేతాలే ఆధారభూతాలు. యూరోపియన్ వర్ణమాలలో లేని ధ్వనులని సూచించడానికి వానికి దగ్గరగా ఉన్న అక్షరానికి ఒక గుర్తు చేర్చడమో లేక రెండు అక్షరాలని కలపడమో లేక దాని పెద్ద అక్షరాన్ని (Capital Letter) వాడడమో చేస్తారు. ఒక ధ్వనిని ఇలా సూచించడంలో కూడా భిన్న పద్ధతులు ఉన్నాయి. ఉదాహరణకి అకారానికి గుర్తు a; దీర్ఘ ఆకారాన్ని సూచించడానికి a పైన గీత (ā.) లేక ప్రక్కన ఒక చుక్క (a.) లేక రెండు చుక్కలు (a:) పెట్టడం లేక రెండు aa లు వాడడం చేస్తారు. అదే విధంగా మహా ప్రాణాన్ని సూచించడానికి అల్ప ప్రాణానికి h చేర్చడం (kh) లేక దాని తరువాత (kʰ) చేర్చడం చేస్తారు. వీటిలో ఏ పద్ధతి వాడాలి అనేది ఏది అచ్చులోనూ టైపులోనూ రాతలోనూ సులభం అనేదానిమీద ఆధారపడి ఉంటుంది. ఒక ధ్వనికి ఏ రకం సంకేతం వాడినా అదే నియతంగా వాడడమూ, ఈ సంకేతం ఈ ధ్వనికి సూచకం అని ఆ ధ్వనిని ఉచ్చారణాత్మక ధ్వనిశాస్త్రానుసారంగా నిర్వచించి మొదట్లో చెప్పడమూ అవసరం. ధ్వన్యాత్మక లిపిలో వాక్యారంభంలో పెద్ద అక్షరం వాడనక్కరలేదు: కాబట్టి. మామూలు ధ్వనికి చిన్న అక్షరాన్నీ దానికి సన్నిహితమైన ప్రత్యేక ధ్వనికి పెద్ద అక్షరాన్నీ వాడవచ్చు. ఉదాహరణకి t d లు దంతమూలీయాలని (దంత్యాలని కూడా) సూచిస్తాయి. మూర్ధన్యాలైన ట, డ లని సూచించడానికి వీటి కింద చుక్క పెట్టవచ్చు (ṭ, ḍ.) లేక వీటి పెద్ద అక్షరాలు వాడవచ్చు (T.D).

తరువాత పేజీలలో పట్టికలలో ప్రపంచ భాషలలో ముఖ్యమైన హల్లులకీ అచ్చులకీ సంకేతాలు ఇవ్వబడ్డాయి.

## ముఖ్య హల్లుల పట్టిక

| | | ద్వ్యోష్ఠ్యం | దంతోష్ఠ్యం | దంత్యం | దంతమూలీయం | మూర్ధన్యం | తాలవ్యం | కంఠ్యం | ఉపజిహ్వీయం | కంఠమూలీయం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| I. స్పర్శం | శ్వా. | p | p. | t̲ | t | ṭ | k̲ | k | q | ʔ |
| (i) సాధారణం | నా. | b | b. | d̲ | d | ḍ | g̲ | g | G | |
| (ii) మహాప్రాణం | శ్వా. | ph | | t̲h | th | | | kh | | |
| | నా. | bh | | d̲h | dh | | | gh | | |
| (iii) కంఠమూలీకృతం | శ్వా. | p' | | | t' | | | k' | | |
| | నా. | | | | | | | | | |
| (iv) స్పృష్టోష్మం | శ్వా. | | | | c | | č | | | |
| | నా. | | | | j | | ǰ | | | |
| (v) పురోనునాసికృతం | శ్వా. | mp | | | nt | | | | | |
| | నా. | mb | | | nd | | | | | |
| (iv) అంతస్స్ఫుర్శం | శ్వా. | b' | | | d' | | | | | |
| | నా. | | ƒ | θ | | | | x | | h |
| II. ఈషత్ స్పృష్టం | శ్వా. | ʋ | ʋ | ð | | | | ɣ | | ɦ |
| (i) నయం | నా. | | | | s | | š | | | |
| (ii) ద్రోణికం | శ్వా. | | | | z | | ž | | | |
| | నా. | | | | L | Ḷ | | | | |
| III. పార్శ్వికం | శ్వా. | | | | l | ḷ | | | | |
| | నా. | | | | ɤ | | | | | |
| IV. కంపితం | శ్వా. | | | | r | | | | R | |
| | నా. | | | | ř | ṛ | | | | |
| V తాడితం | శ్వా. | | | N̲ | N | Ṇ | | | | |
| | నా. | | | n̲ | n | ṇ | ñ | ṅ | | |
| IV. అనునాసిక | శ్వా. | | | | | | y | | | |
| | నా. | | | | | | | | | |
| VII అంతస్థ | శ్వా. | | | | | | | | | |
| | నా. | | | | | | | | | |

శ్వా = శ్వాసం ; నా. = నాదం

## ముఖ్యాచ్చు పట్టిక

| | అగ్రం అనో. | ఓ. | కేంద్రం అనో. | ఓ. | పశ్చిమం అనో. | ఓ. |
|---|---|---|---|---|---|---|
| ఉన్నతం | i | ü | ɨ | ʉ | ï (ɯ) | u |
| ఈషదున్నతం | I | | Ɨ | | | U |
| మధ్యమం | e | ö | | | | o |
| నిమ్నతరమధ్యమం | E | | ə | | | Ω |
| ఈషన్నిమ్నం | ɛ· | ɔ̈ | | | ʌ | ɔ |
| నిమ్నం | | | ɐ | | ɑ | |

[అనో. = అనోష్ఠీకృతం, ఓ. = ఓష్ఠీకృతం, అనునాసికీకరణానికి గుర్తు ~, ఉదా॥ ã ; దీర్ఘానికి గుర్తులకి ఉదా॥ ā /a·/a:/aa; ఉదాత్తతకి గుర్తుకి ఉదా॥ á; శ్వాసాచ్చును సూచించడానికి దానికి సన్నిహితమైన నాదాచ్చు కింద చిన్న సున్న పెట్టవచ్చు, ఉదా॥ ḁ , లేక దాని పెద్ద అక్షరం వాడవచ్చు ఉదా॥ A.]

# 4. వర్ణ నిర్మాణం

## 4.1. ధ్వని – వర్ణం

మూడో అధ్యాయంలో మానవ ముఖ యంత్రం అనేక విధాలైన ధ్వనులని పుట్టించగలదనీ అయినా ఒక్కొక్క భాషలో కొన్ని రకాల ధ్వనులే వాడుకలో ఉంటాయనీ చూశాం (ఇక్కడ ధ్వని అంటే మానవుడు భాషని మాట్లాడేటప్పుడు ఉపయోగించే ధ్వని అని మాత్రమే గ్రహించాలి). ప్రతి భాషలలోనూ కొన్ని మాటలలో ఒకే ఒక చోటులో స్వల్పమైన భేదం ఉన్న రెండు విభిన్నమైన ధ్వనులని వాడడం వల్ల ఆ మాటల అర్థం మారిపోతుందని మనకందరకూ తెలుసు. ఉదాహరణకి ఈ కింది జంటలని పరిశీలించండి.

| | |
|---|---|
| కోడలు – గోడలు | తడి – దడి |
| చుట్టు – జుట్టు | పుట్ట – బుట్ట |
| పేట – పేడ | కల – కళ |

పై ఉదాహరణలలో క, చ, ట, త, ప లు శ్వాసస్పర్శాలు గ జ డ ద బ లు నాదస్పర్శాలు. ఒక్కొక్క జంటలో ఈ ధ్వనులలో శ్వాసనాద భేదమే తప్ప వేరే భేదం లేదు. అలాగే చివరి ఉదాహరణలలో ల దంతమూలీయ పార్శ్వికం; ళ మూర్ధన్య పార్శ్వికం. క – గ మొదలైన జంటల మధ్య భేదం అతిస్వల్పమే అయినా ఈ భేదం వల్ల అవి ఉన్న మాటలలో అర్థ భేదం కలుగుతోంది. కాని ఒక భాషలో ఉన్న అన్ని ధ్వనులకీ అవి ఉన్న మాటలలో ఇలా అర్థ భేదాన్ని కలిగించే శక్తి ఉండదు. దీనికి ఉదాహరణగా తెలుగులో దంతమూలీయ చకారాన్నీ తాలవ్య చకారాన్నీ తీసుకోవచ్చు. తత్సమే తరాలయిన తెలుగు పదాలలో చకారం అగ్రాచ్చుల ముందూ, చకారం అనగ్రాచ్చుల ముందూ ఉంటాయి ఉదా:

| | |
|---|---|
| చెల్లి | చిల్లి |
| చాలు | చీర |

| | |
|---|---|
| చ̄ట్టం | చెట్టు |
| చ̄ూడు | చేమ |
| చ̄ెప్ప | |
| చ̄ోటు | |

కాబట్టి చ – చ̄ ల మధ్య భేదం తెలుగులో అర్థభేదన సమర్థం కాదు. జ – జ̄ ల మధ్య భేదం కూడా ఇటువంటిదే. కాబట్టి ప్రతి భాషలోనూ కొన్ని ధ్వనుల మధ్య భేదం అర్థ భేదనసమర్థమనీ, మరికొన్ని ధ్వనుల మధ్య భేదం అర్థం భేదనసమర్థం కాదనీ మనం గ్రహించాలి. కాని ఒక భాషలో ఏయేధ్వనుల మధ్య భేదం అర్థ భేదనసమర్థం, ఏయే ధ్వనుల మధ్య భేదం అర్థ భేదనసమర్థం కాదు అనే విషయం ఆ భాష మీద ఆధారపడి ఉంటుంది. కాబట్టి ఈ విషయం ఆ భాషతో పరిచయం లేకుండా ముందుగా నిర్ణయించడం సాధ్యం కాదు. ఉదాహరణకి క–గ మొదలైన స్పర్శాలలో శ్వాసనాద భేదం తెలుగు, కన్నడం, హిందీ, ఇంగ్లీషు మొదలైన అనేక భాషలలో అర్థ భేదనసమర్థం కాని తమిళంలో ఈ భేదం అర్థ భేదన సమర్థం కాదు. హిందీలో అనునాసికాచ్చులకీ అనునాసికాలు కాని అచ్చులకీ మధ్య భేదం అర్థ భేదనసమర్థం. కాని తెలుగులో ఇది అర్థ భేదన సమర్థం కాదు. (తెలుగులో అన్న, అమ్మ మొదలైన మాటలలో అనునాసికం తరువాత వచ్చే అచ్చు కూడా అనునాసిక మవుతుంది; కాని ఇటువంటి అనునాసి కాచ్చు అనునాసికం తరువాతనే ఉంటుంది). హిందీ, తెలుగు మొదలైన భాషలలో మహా ప్రాణస్పర్శం, అల్ప ప్రాణస్పర్శం – వీటి మధ్య భేదం అర్థభేదనసమర్థం, ఉదా. కరం – ఖరం. కాని ఇంగ్లీషులో ఈ భేదం అర్థ భేదనసమర్థం కాదు. ఇంగ్లీషులో k t p లు పదాదిని మహాప్రాణాలుగా ($k^h$ $t^h$ $p^h$) ఉచ్చరించబడతాయి. కానిs తరవాత (skin spin మొదలైన మాటలలో) అవి అల్ప ప్రాణాలుగా ఉచ్చరించబడతాయి. అరబిక్ లో కంఠ్య కకారం, పశ్చాత్కంఠ్య కకారం (q) అర్థ భేదనసమర్థాలు. ఇంగ్లీషులో కూడా పశ్చిమాచ్చు ముందు పశ్చాత్కంఠ్యంగానే ఉచ్చరించబడుతుంది. కాని పశ్చిమాచ్చు ముందు k కి కంఠ్యోచ్చారణ లేదు. కాబట్టి ఈ రెండూ ఇంగ్లీషులో అర్థ భేదనసమర్థాలు కావు. పై ఉదాహరణల వల్ల

ఏయే ధ్వనులు అర్థ భేదనసమర్థాలు అనే విషయంలో భాషకీ భాషకీ మధ్య భేదం ఉంది అనే విషయం స్పష్టమవుతుంది. ఒక భాషలో అర్థభేదన సమర్థాలైన ధ్వనులు ప్రత్యేక వర్ణాలు (Phonemes) అర్థ భేదనసమర్థాలు కాని సన్నిహిత ధ్వనులు ప్రత్యేక వర్ణాలు కావు. రెండో రకపు ధ్వనులని ఒకే వర్ణానికి చెందినవిగా పరిగణించవచ్చు. అర్థ బేదన సామర్థ్యాన్ని భేదకత్వం (Contrast) అని కూడా అంటారు. కోడలు – గోడలు వంటి ఒకే స్థానంలో సన్నిహితాలైన భిన్న ధ్వనులు ఉండడం వల్ల అర్థ భేదం కలిగి ఉన్న జంట మాటలని కనిష్ఠ భేదకయుగ్మం(Minimal Pair) అంటారు. కనిష్ట భేదక యుగ్మాలు ఒక భాషలో వర్ణాలని నిర్ణయించడానికి ఉపయోగపడతాయి. కాని ప్రతి రెండు వర్ణాలకీ కనిష్ఠ భేదక యుగ్మాలు ఉండాలనే నియమం లేదు. కనిష్ఠ భేదకయుగ్మాలు దొరకనప్పుడు రెండు స్థానాలలో స్వల్ప భేదమున్న యుగ్మాలని (ఉదా. కోట – గోడ) కూడా వర్ణనిర్ణయానికి ఉపయోగించవచ్చు. ఇటువంటి వాటిలో ఒక ధ్వని వల్ల దాని పక్క ధ్వని ప్రభావితం కాకుండా ఉండడం ముఖ్యం.

ఒక వర్ణానికే చెందిన సన్నిహిత ధ్వనులని సవర్ణాలు (Allophones) అంటారు. సవర్ణాల మధ్య భేదకత్వం ఉండదు కాబట్టి ఇవి సాధారణంగా భిన్న పరిసరాల (Different Environments) లో ఉంటాయి.*

---

* ఆధునిక భాషాశాస్త్రంలో వర్ణం, సవర్ణం అనే పదాలు ఇంగ్లీషులో Phoneme, allophone అనే పదాలకి తుల్యంగా వాడబడుతున్నాయి. సంస్కృత వైయాకరణులు ఈ పదాలని ఈ అర్థాలలో వాడలేదని గుర్తించాలి. వారు వర్ణం అనే మాటని ఇంచుమించు ధ్వని అనే అర్థంలోనే వాడారు; అచ్చులలో మాత్రం ఉదాహరణకి ఇ వర్ణం ఉండే దీర్ఘ హ్రస్వప్లుతాలైన మూడు ఇకారాలకీ గ్రాహకంగా వాడారు. వారి పరిభాషలో తుల్యాస్య ప్రయత్నం గలవి సవర్ణాలు (తుల్యాస్య ప్రయత్నం సవర్ణం, అష్టాధ్యాయి 1.1.9.). ఈ రెండు పదాలనీ పైన నిర్వచించిన అర్థాలలో మొట్టమొదట భద్రిరాజు కృష్ణమూర్తిగారు వాడారు. కొత్త పదాలని సృష్టించడం కన్న ఉన్న పదాలని కొంత అర్థ బేదంతో వాడుకోవడం మేలు కాబట్టి కృష్ణమూర్తి గారు చేసిన అర్థనియతి అంగీకారయోగ్యం. Phoneme కీ ప్రాచీనుల వర్ణానికీ కొంత సాదృశ్యం ఉందని మొదట సూచించినవారు *W.S. Allen (Phonetics in Ancient India, P. 15).*

## 4.2. వర్ణం – సవర్ణం

ఒక భాషలో అర్థభేదనసమర్థాలైన ధ్వనులు వర్ణాలనీ, అర్థభేదన సమర్థాలుకాని సన్నిహిత ధ్వనులని ఒకే వర్ణంగా పరిగణించవచ్చుననీ పైన చూశాం. పై నిర్వచనం ప్రకారం తెలుగులో క – గ, ట – డ, త – ద, ప– బ ప్రత్యేక వర్ణాలు. చ, చ లకి భేదకత్వం లేదు కాబట్టి అవి ప్రత్యేక వర్ణాలు కావు. వీటికి ఒకే వర్ణం యొక్క సవర్ణాలుగా గ్రహించాలి. వీటిలో చ అనగ్రాచ్యాల ముందూ, చ అగ్రాచ్యాల ముందూమాత్రమే వస్తాయని ముందు చూశాం. కాబట్టి /చ/అనే వర్ణానికి [చ], [చ] అనే రెండు సవర్ణాలు ఉన్నాయని చెప్పవచ్చు (వర్ణాలని ఏటవాలు గీతలమధ్యా, సవర్ణాలని ఇటు వంటి గీతల మధ్యా రాయడం సంప్రదాయం).* ఒక వర్ణాన్ని రాతలో సూచించడానికి దానికున్న సవర్ణాలలో ఏ ఒకదాని గుర్తునైనా వాడవచ్చు; సాధారణంగా రాయడానికి లేక అచ్చు వెయ్యడానికి ఏ గుర్తు సులభమో దాన్ని వాడతారు. వర్ణం అనేది భాషా నిర్మాణంలో అంశం; ఒక వర్ణం ఒక ధ్వనిచేతనే సూచించబడాలి అనే నియమం లేదు కాబట్టి అది ధ్వని నిర్మాణంలో అంశం కాదు. వర్ణం అనేది లిపిలో దానికి ఉపయోగించబడే గుర్తు కాదు అని వేరే చెప్పనక్కరలేదు. లిపి భాషని రాయడానికి ఉపయోగించే సాధనం మాత్రమే; ఈ సాధనం ఏ భాషకీ సమగ్రమైనది కాదు. వర్ణం రూపరహితం. ఒక భాషలో ప్రతివర్ణమూ ఆ భాషలో మిగిలిన అన్ని వర్ణాలకన్న భిన్నమైనదిగా ఉంటుంది. ఒక వర్ణానికి ధ్వని నిర్మాణంలో ప్రతీకగా ఒక ధ్వని ఉండవచ్చు లేక ఒకటి కన్న ఎక్కువ ధ్వనులు ఉండవచ్చు. ఉదాహరణకి తెలుగులో క వర్ణానికి ప్రతీకగా ఒకే ధ్వని ఉంది; అంటే దానికి ఒకే సవర్ణం ఉందన్నమాట. కాని చవర్ణానికి రెండు సవర్ణాలు ఉన్నాయి. కాని ధ్వని శాస్త్రజ్ఞులు ఒకే మాటని మనం ఒకటికన్న ఎక్కువ సార్లు ఉచ్చరించినప్పుడు ఆ మాటలో ధ్వనులు ఒకే రీతిగా ఉచ్చరించబడక సూక్ష్మమైన భేదాలతో ఉచ్చరించబడతాయి అని అంటారు; ఈ భేదాలు యంత్రాలకే గోచరిస్తాయి కాని మన చెవులకి వినపడవు. కాబట్టి ఒకే సవర్ణం ఉంది అని మనం అనుకొంటున్న

---

* జన్మరీత్యా తెలుగు మాటలైన వాటిలో మాత్రమే చ చేలకి భేదకత్వం లేదు. చంద్రుడు, చాపల్యం, చుంబుకం, చూర్ణం, చోరుడు మొదలైన సంస్కృత పదాలని కూడా పరిగణనలోకి తీసుకొంటే వీటిలో చకారం అనగ్రాచ్యాల ముందు కూడా ఉంది కాబట్టి అప్పుడు చ చేలని ప్రత్యేక వర్ణాలుగానే పరిగణించాలి. అందువల్ల మొత్తం తెలుగు భాష విషయంలో చ చేలు ప్రత్యేక వర్ణాలే; చూరు–చూర్ణం– ఈ పదాలలో చకారం

వర్ణానికి కూడా ఉచ్చారణలో భిన్న కాలపరిస్థితులలో సూక్ష్మ భేదాలు ఉన్న సవర్ణాలు ఉండవచ్చు కాని ఈ భేదాలు మనకు వినపడవు కాబటి వీటిని మనం పరిగణనలోకి తీసుకోం.

వర్ణ నిర్ణయం అన్ని భాషలలోనూ ఒకే రీతిగా ఉండదు. ఒక్కొక్క భాషలో ధ్వనుల మధ్య భేదకత్వం ఒక్కొక్క విధంగా ఉండడమే దీనికి కారణం. ఉదాహరణకి తెలుగులో కచటతపలకీ గజడదబలకీ మధ్య భేదకత్వం ఉంది కాబట్టి తెలుగులో ఇవి ప్రత్యేక వర్ణాలు. కాని తమిళంలో వీటి మధ్య భేదకత్వం లేదు. కాబట్టి తమిళంలో (క) (గ) ఒకే వర్ణానికి సవర్ణాలు. అదే విధంగా (చ) (జ) ఒకే వర్ణానికి సవర్ణాలు (ట) (డ), (త) (ద), (ప) (బ) ల విషయంలోనూ అంతే. ఈ జంటలలో శ్వాసధ్వని పదాదినీ, ద్విరుక్తంలోనూ ఉంటుంది; నాదధ్వని అచ్చులమధ్య అద్విరుక్తంగానూ,అనునాసికానికి తరవాతా ఉంటుంది. అదే విధంగా ఇంగ్లీషులో అల్పప్రాణ మహా ప్రాణాలకి భేదకత్వం లేదు కాబట్టి ఆ భాషలో అవి ప్రత్యేక వర్ణాలు కావు; అంటే ఇంగ్లీషులో (ph) (p) లు ఒక వర్ణానికి సవర్ణాలు. కాని హిందీలో ఇవి ప్రత్యేక వర్ణాలు.

సాధారణంగా ఒక భాషని వ్యవహరించేవారు ఆ భాషలోని వర్ణాను సారంగా ధ్వని భేదాలని విభజించి మనస్సులో గ్రహిస్తూ ఉంటారు. అంటే రెండు ధ్వనుల మధ్య భేదకత్వం ఉంటే వాటి భేదాన్ని ప్రయత్న రహితంగానే గుర్తించగలుగుతారు. రెండు ధ్వనుల మధ్య భేదకత్వం లేకపోతే వాటి మధ్య భేదం చెవులకు వినపడుతున్నా గుర్తించలేరు. అటువంటి రెండు ధ్వనులనీ ఒకటిగానే పరిగణిస్తారు. భేదకత్వం లేని ధ్వనుల మధ్య ఉచ్చారణ భేదాన్ని గుర్తించడం ఆ భాషా వ్యవహర్తకి ధ్వని శాస్త్రంలో ప్రావీణ్యముంటేనే సాధ్యమవుతుంది. కాబట్టి ఆంగ్ల భాషా వ్యవహర్త అల్పప్రాణ మహాప్రాణ భేదాన్ని తాను ఆ ధ్వనులని ఉచ్చరిస్తున్నప్పటికీ గుర్తించడు; కాని హిందీ వ్యవహర్త ఈ భేదాన్ని అతిసులభంగా గుర్తిస్తాడు. అలాగే తెలుగువారికి చ చల మధ్య ఉచ్చారణ బేదం గుర్తించడం కష్టం. కాబట్టి ప్రతి భాషా వ్యవహర్తా ఇతర భాషని నేర్చుకొనేటప్పుడు తన భాషలో ఉన్న వర్ణ విభజన సంప్రదాయం ప్రకారం ఆ కొత్త భాషలో మాటల్ని ఉచ్చరిస్తాడు. ఇది ఆ కొత్త భాష మాట్లాడేవారికి వింతగా ఉండి అంగీకారయోగ్యం కాదు. తమిళ

భాషా వ్యవహర్త తన అలవాటు ప్రకారం తెలుగులో 'పంతులుగారు' అనే మాటని 'పందులుగారు' అని ఉచ్చరిస్తే హాస్య పాత్రుడవుతాడు. ఇలా స్వభాషా ప్రభావాన్ని అన్యభాష మీద పడకుండా చేసుకోవడం సుశిక్షితులైన వారికే సాధ్యం.

పైన భేదకత్వం లేని సన్నిహిత ధ్వనులు ఒకే వర్ణానికి సవర్ణాలని చూశాం. ఒకే వర్ణానికి చెందిన సవర్ణాల మధ్య రెండు రకాల సంబంధం మాత్రమే ఉంటుంది. అటువంటివి (i) భిన్న పరిసరాలలో ఉంటాయి; ఇలా ఉంటే ఆ స్థితిని పరిపూరక ప్రవృత్తి (Complementary distribution) అంటారు; లేక అవి (ii) స్వేచ్ఛా ప్రవృత్తి (Free Variation) లో ఉంటాయి; అంటే అవి ఒకే పరిసరంలో ఉన్నా ఆ మాటలలో అర్థ భేదాన్ని కలిగించే సామర్థ్యం లేకుండా ఉంటాయి. కోత (నీలగిరి మీద ఉన్నది) లో చ స లు స్వేచ్ఛా ప్రవృత్తిలో ఉన్నాయి. అంటే ఏ మాటలోనైనా వ్యవహర్తలు చకారంగాని సకారంగాని యథేచ్ఛగా ఉచ్చరిస్తారు. కాబట్టి ఆ భాషలో (చ) (స) లు ఒకే వర్ణానికి సవర్ణాలు. అదే విధంగా ఇటాలియన్ భాషలో (s) (z) లు అచ్చుల మధ్య స్వేచ్ఛా ప్రవృత్తిలో ఉన్నాయి.

సవర్ణాలు స్వేచ్ఛా ప్రవృత్తిలో కన్న పరిపూరక ప్రవృత్తిలో ఉండడం సర్వసాధారణం. ఒక సవర్ణం ఒక ప్రత్యేక స్థానంలోనూ, మరొక సవర్ణం వేరొక స్థానంలోనూ ఉండడాన్ని పరిపూరక ప్రవృత్తి అంటారు. తెలుగు చే అనగ్రాచ్చుల ముందూ చ అగ్రాచ్చులముందూ ఉంటాయి. కాబట్టి ఇవి పరిపూరక ప్రవృత్తిలో ఉన్నాయి; జ జ లు విషయమూ అంతే. సవర్ణాల పరిసర నిర్ణయం అనేక విధాలుగా ఉంటుంది; వీటిలో ఈ కిందివి ముఖ్యం :

1. అవ్యవహితంగా ముందుగాని, వెనకగాని లేక రెండు స్థానాలలోనూ వచ్చే ధ్వనులు

2. వ్యవహితంగా (అంటే మధ్యన ఒకటి రెండు ధ్వనులుండి) ముందుగాని వెనకగాని ఉన్న ధ్వనులు; సాధారణంగా అచ్చులు ముందు అక్షరంలో గాని, వెనక అక్షరంలో గాని ఉన్న అచ్చులవల్ల ప్రభావితం అవుతాయి.

3. పదంలోగాని, అక్షరంలో గాని ఒక సవర్ణం ఉన్న స్థానం; అంటే పదాది, పదాంతం వంటివి.

4. ఉదాత్తత, దీర్ఘత, శ్రుతి వంటి లక్షణాలలో భేదం

5. పైన చెప్పిన అంశాలు మేళనం

పరిసర నిర్ణయం ఒక ప్రత్యేక ధ్వని మీద గాని ఒక ధ్వని సముదాయం మీద గాని ఆధారపడి ఉండవచ్చు. అంటే ఒక సవర్ణానికి పరిసరంగా ఏ అచ్చైనా హల్లైనా కావచ్చు లేక అగ్రాచ్చులు అన్నీ కావచ్చు లేక స్పర్శాలు అన్నీ కావచ్చు లేక కేవలం ఒక ధ్వని మాత్రమే కావచ్చు. ఇంగ్లీషులో మహాప్రాణ స్పర్శం పదాదినీ, అల్ప ప్రాణ స్పర్శం సకారం తరవాతా ఉంటుంది తెలుగు కోస్తా మాండలికాలలో మకారానికి ఉభయోష్ఠ్య స్పర్శానునాసికము [మ], ఉభయోష్ఠ్యైషత్ స్పృష్టానునాసికము [ఠ, వఁ] అనే రెండు సవర్ణాలు ఉన్నాయి. వీటిలో మొదటిది పదాదినీ (మాట) ద్విరుక్తంలోనూ (అమ్మ), ఓష్ఠ్యస్పర్శాల ముందూ (గంప, చెంబు, సంభవం), నకారంముందూ (ఆమ్నాయం) యకారం ముందూ (రమ్యం) రేఫ ముందూ (సామ్రాజ్యం)వస్తుంది; రెండోది అచ్చుల మధ్యా (మామ, చమురు), శ,శ,ష,హల ముందూ (సంవత్సరం సంశయం, సంసారం, సింహం), పదాంతంలోనూ (మేం, మనం, పాలం), వస్తుంది తెలుగులో అచ్చులు తరవాత అక్షరంలో అకారం ఉన్నప్పుడు కొంచెం కిందగా ఉచ్చరించబడతాయని ఇంతకుముందే చూశాం, 'చుట్ట'లో ఉకారం 'చుట్టు'లో ఉకారం కన్న కొంచెం కిందగా ఉంటుంది. ఇది రెండో అక్షరంలో అచ్చు మొది అచ్చును ప్రభావితం చేస్తుంది. ఇది రెండో అక్షరంలో అచ్చు మొదటి అచ్చును ప్రభావితం చేస్తుంది అనడానికి ఉదాహరణ. సంస్కృతంలో హ్రస్వ అకారం విమ్నతర మధ్యమం లేక ఈషన్నిమ్నం (దీనిని ప్రాచీనులు సంవృతమని వ్యవహరించారు). కాని సంస్కృతంలో హ్రస్వదీర్ఘాచ్చులకి (ఒ, ఓ లు తప్ప) బేదకత్వం ఉంది కాబట్టి ఇవి ప్రత్యేక వర్ణాలే కాని సవర్ణాలుకావు. కాని ఈ రెండూ మరొక భాషలో సవర్ణాలు కావచ్చు.

రెండు ధ్వనులని సవర్ణాలుగా పరిగణించడానికి అవి పరిపూరక ప్రవృత్తిలో గాని స్వేచ్ఛా ప్రవృత్తిలో గాని ఉండడమే కాక వాటి మధ్య సన్నిహితత్వం అంటే ఉచ్చారణలో సారూప్యం కూడా ఉండాలని పైన చూశాం. ఉచ్చారణ సారూప్యం స్థానకరణ ప్రయత్నాల మీద ఆధారపడి ఉంటుంది. వీటిలో కొంతవరకు భేదం ఉండవచ్చు కాని ఎక్కువ భేదం ఉండకూడదు. ఉదాహరణకి ఓష్ఠ్య ధ్వనినీ కంఠ్య ధ్వనినీ అవి పరిపూరక ప్రవృత్తిలో ఉన్నాసరే ఒక వర్ణానికి సవర్ణాలుగా తీసుకోలేం. కని ఉభయోష్ఠ్యదంతోష్ఠ్యాలూ, దంత్య దంతమూలీయాలూ, స్పర్శ ఈషత్ స్పృష్టాలూ, అల్ప ప్రాణ మహాప్రాణాలూ, శ్వాసనాదాలూ వంటి స్వల్ప భేదం గల ధ్వనులు ఒకే వర్ణానికి సవర్ణాలుగా ఉండే అవకాశం ఉంది. సాధారణంగా సవర్ణాల మధ్య భేదం పరిసరాల ప్రభావం వల్ల ఏర్పడేదిగా ఉంటుంది. ఉదాహరణకి అచ్చులు నాదాలు కాబట్టి రెండు అచ్చుల మధ్య మొదటో శ్వాసంగా ఉన్న కకారం తరువాత కాలంలో నాద గకారంగా మారడానికి అవకాశం ఉంది. కాబట్టి పదాది కకారమూ అచ్చుల మధ్య గకారమూ ఒక భాషలో సవర్ణాలు కావచ్చు. (ఇటువంటివి అన్ని భాషలకీ వర్తించవు అని గమనించాలి). తెలుగులో మ, వఁ భేదం ఇలా ఏర్పడినదే. అచ్చుల మధ్యా వ,శ,స,హ ల ముందూ, పూర్వకాలంలో ఉన్న మకారం శ్లథోచ్చారణ పొంది వఁ గా తరవాత కాలంలో మారింది. మానవుడు ఉచ్చారణలో సౌలభ్యానికి ప్రయత్నిస్తాడు. కాబట్టి ఒకధ్వని దాని పరిసర ధ్వనులకి సన్నిహితంగా మార్పు పొందుతూ ఉంటుంది. మకారోచ్చారణలో గాలి పూర్తిగా నిరోధించబడుతుంది. కాని అచ్చులు వ, శ, స, మల ఉచ్చారణలో గాలి పాక్షికంగానే నిరోధించబడుతుంది. కాబట్టి వీటి మధ్య లేక ప్రక్కన ఉన్న మకారోచ్చారణలో కూడా గాలి పాక్షికంగా నిరోధించబడి అది వఁగా మారింది. అలాగే పదాంతంలో కూడా చాలా భాషలలో శ్లథోచ్చారణ ఉంటుంది. జర్మన్ పదాంతంలో మకారం వఁగా మారడం కూడా ఇటువంటిదే. తెలుగులో అకారం కిందగా ఉచ్చరించబడేది కాబట్టి దాని ముందున్న అచ్చులు కూడా కొంచెం కిందగా ఉచ్చరించబడతాయి. ఇటువంటి వివరణ చాలా రకాల సవర్ణాలకి ఇవ్వడం సులభమేకాని కొన్ని సందర్భాలలో సవర్ణాల మధ్య భేదాలకి కారణం అంత స్పష్టంగా తెలియదు.

ఒక కొత్త భాషకి వర్ణ నిర్ణయం చేసేటప్పుడు ప్రతి భాషలోనూ ఉండే నియతి (Pattern) సహాయకారిగా ఉంటుంది. ఉదాహరణకి ఒక భాషలో క–ఖ, త–థ ఈ జంటల మధ్య అల్పప్రాణ మహాప్రాణ భేదానికి భేదకత్వం లేక అవి పరిపూరక ప్రవృత్తిలో ఉన్నాయని స్పష్టంగా తెలిసింది అనుకోండి. కాని ప–ఫ లకి పరిపూరక ప్రవృత్తి ఉందా లేదా అనే విషయం ఇంకా స్పష్టంగా మనం సేకరించిన ఆధారం వల్ల తెలియలేదు అనుకోండి కాని ప్రతి భాషకీ సాధారణంగా నియతి ఉంటుంది కాబట్టి ఆ భాషలో కంఠ్య దంత్యాలలో ఉన్న స్థితే ఓష్ఠ్యాలలో కూడా ఉంటుందని ముందుగా ఊహించవచ్చు. పరిశోధన ఇంకా కొంచెం సాగిన తరవాత ప–ఫలకి కూడా పరిపూరక ప్రవృత్తి ఉంది అని తెలిసి మన ఊహ నిర్ధరించబడుతుంది. సాధారణంగా ఒక భాషలో ఇటువంటి జంట ధ్వనులలో ఒక జంటలో ఉన్న స్థితే మిగిలిన జంటలలో కూడా ఉంటుంది.

## 4.3. వర్ణ ప్రవృత్తి (distribution of Phonemes)

వర్ణ ప్రవృత్తి అంటే వర్ణాలు ఒక పదంలో ప్రవర్తించే విధానం. ఏ భాషలో నయినా ఆ భాషావర్ణాలు పదంలో అన్ని స్థానాలలోనూ ఉండవు. అదే విధంగా ఒక భాషలో వర్ణాలు సంయోగం పొందే విధానంలో కూడా కొన్ని నియమాలు ఉంటాయి. ఉదాహరణకు తెలుగులో ణ, ళ లు పదాదిన రావు; పదాంతంలో మ, య లు తప్ప మిగిలిన హల్లులు ఉండవు. (ఉదా. మంచం, చెయ్/చెయ్యి, ఇరవై (=ఇరవయ్). వర్ణ ప్రవృత్తిలో ప్రాచీన భాషకూ ఆధునిక భాషకూ మధ్య భేదాలు ఉండవచ్చు. ప్రాచీనాంధ్రంలో క్రొత్త, ప్రాఁత, వ్రాను వంటి మాటలలో పదాదిని రేఫతో కూడిన సంయుక్తాక్షరాలు ఉన్నాయి. కాని ఇప్పటి భాషలో వీటిలో రేఫ లోపించింది; కాని కొన్ని ఊర్ల పేర్లలోనూ (ప్రత్తిపాడు,ప్రొద్దుటూరు), ఇంటి పేర్లలోనూ(ప్రక్కి, క్రొవ్విడి) ఇవి మిగిలి ఉన్నాయి.

ఇంగ్లీషులో జ కారం పదాదినీ మ కారం పదాంతంలోనూ రావు. జర్మన్ సంస్కృత భాషలలో పదాంతంలో నాదస్పర్శాలు ఉండవు. మూలద్రావిడంలోనూ ప్రాచీన తమిళంలోనూ దంతమూలీయ మూర్ధన్య వర్ణాలు పదాదిని ఉండవు. పదాది పదాంతాలలోనే కాక పదమధ్యంలో కూడా ధ్వనులు కలిసే విధానంలో

నియమాలు ఉంటాయి. ఈ నియమాలు కేవలం అచ్చులు హల్లులకే విడివిడిగా కాక అవి పరస్పరం కలిసి ఉండడానికి కూడా వర్తిస్తాయి. ప్రాచీన తమిళంలో పదాదియ కారం తరువాత ఆ కారమే వస్తుంది కాని మిగిలిన అచ్చులు రావు, ఉదా. య్యానై 'ఏనుగు'. అదిలాబాద్ గోండీ మాండలికంలో హ కారం ముందు హ్రస్వాచ్చు మాత్రమే ఉంటుంది. దీర్ఘాచ్చు ఉండదు. ఇలాగే హల్లుల సంయోగంలో కూడా నియమాలు ఉంటాయి. తెలుగులో అత్త, కుక్క, ఎద్దు, మొగ్గ వంటి పదాలలో ద్విరుక్తిలో రెండూ శ్వాసస్పర్శాలుగా గాని నాదస్పర్శాలుగా గాని ఉంటాయి; త్ద, క్గ వంటివి ఉండవు.

ఇటువంటి నియమాలు ప్రత్యయ రహితమైన ప్రకృతిలో ఒక రకంగానూ ప్రకృతీ ప్రత్యయమూ కలిసినప్పుడు ఇంకొక రకంగానూ ఉండవచ్చు. తెలుగు ప్రకృతులలో దీర్ఘాచ్చు మొదటి అక్షరంలో మాత్రమే ఉంటుంది; ఈ నియమాలు ప్రత్యయాలూ కలిసినపుడు ఉల్లంఘించబడతాయి; నాలుగో, నాలుగేసి, చేద్దాం చూద్దాం. వెళ్తాం, వెళ్దాంలలో ఉన్న సంయుక్తాక్షరాలు కేవలం ప్రకృతిలో ఉండవు.

ఒక భాషలో ఇటువంటి వర్ణ ప్రవృత్తి నియమాలు తెలుసుకోవడం వల్ల ఆ భాషలో ఎటువంటి పదాలు సాధ్యం, ఎటువంటివి సాధ్యం కావు అనే విషయం తెలుస్తుంది. ఉదాహరణకు తెలుగులో ఙ, ళ లు మొదట ఉన్న పదాలూ, మకార యకారేతర హల్లులు చివరనున్న పదాలూ అంగీకారయోగ్యాలు కావని చెప్పవచ్చు. కొత్త యంత్రాలకూ, పదార్థాలకూ, భావాలకూ పేర్లు సృష్టించడానికి శాస్త్రజ్ఞులకూ, కంపెనీల వారికీ ఇది సహాయకారిగా ఉంటుంది. అంతేకాక, మన నిత్య జీవితంలో వ్యవహారానికి కూడా వర్ణ ప్రవృత్తి నియమాలు తోడ్పడతాయి. ఉదాహరణకుఎక్కువ గొడవగా ఉన్న రైలు స్టేషన్ల వంటి చోట్ల ఒక వ్యక్తి మాట్లాడేటప్పుడు ఆ వ్యక్తి ఉచ్చరించిన ధ్వనులన్నీ మనకు సరిగా వినపడకపోయినా వినపడిన కొన్ని ధ్వనులవల్లనే ఆ వ్యక్తి-చెప్పేభావం మనం గ్రహించవచ్చు.

వర్ణానికి పైన ఇవ్వబడిన నిర్వచనం ప్రకారం ఒక భాషలో భేదకత్వం కలిగి ఉన్న ధ్వనులన్నీ ప్రత్యేక వర్ణాలే కాబట్టి దీర్ఘత, ఉదాత్తత, స్వరం, శ్రుతి

(వీటి వివరాలకి మూడో అధ్యాయం చూడండి) అనే వాటికి కూడా వర్ణత్వం సిద్ధిస్తుంది. కాని ఇవి అచ్చులు హల్లులతో కలిసి ఉంటాయిగాని అవి లేకుండా ఇవి ఉండలేవు. పైగా ఇవి (దీర్ఘత తప్ప) అక్షరం లేక పదం లేక వాక్యభాగం లేక వాక్యం అంతా వ్యాపించి ఉంటాయి కాబట్టి వీటిని అచ్చులు, హల్లులలా చిన్న చిన్నముక్కలుగా విడతీయలేం. కాబట్టి అచ్చులనీ హల్లులనీ అంశికవర్ణాలు (Segmental phonemes) అనీ, పైన చెప్పిన దీర్ఘత మొదలైన వాటిని అధ్యాంశిక వర్ణాలు (Supra-segmental phonemes) అని అంటారు. అధ్యాంశిక వర్ణాలలో అంతర్విభేదాలు కూడా ఉంటాయి. అన్ని భాషలలోనూ మూడు నాలుగు రకాల శ్రుతి భేదాలు ఉన్నాయి. సెర్బో-క్రోషియన్ భాషలలో అచ్చులో హ్రస్వం, అర్ధ దీర్ఘం, దీర్ఘం అని దీర్ఘతలో మూడు విభేదాలు ఉన్నాయి. చైనా భాష వంటి స్వరభేదం ఉన్న భాషలు కొన్నిటిలో మూడు రకాల భేదాలు మరి కొన్నిటిలో నాలుగు నించి ఆరు రకాల విభేదాలుఉన్నాయి.

## 4.4 మత భేదాలు

పైన చర్చించిన వర్ణ నిర్ణయ విధానాన్ని సమగ్రం చేసి అనుసరించిన వారు అమెరికన్ భాషా శాస్త్రజ్ఞుడు లియొనార్డ్ బ్లూమ్‌ఫీల్డ్ (Leonard Bloomfield), ఆయన అనుయాయులు హారిస్ (Z.S. Harris), హాకెట్ (Hockett), పైక్ (K.L. Pike) మొదలైనవారు. కాని మనప్రాచీన వైయాకరణులకి వర్ణ సిద్ధాంతంలో కీలక పాత్ర వహించే భేదకత్వాన్ని గురించి తెలుసు. వారు శకలం౼సకలం, సకృత్౼శకృత్ వంటి జంటలలో శసల భేదానికున్న ప్రాముఖ్యాన్ని గుర్తించారు. అలాగే వారుధ్వనులు పరిసరధ్వనుల వల్ల ప్రభావిత మౌతాయని కూడా గుర్తించారు. వారు విసర్జనీయ జిహ్వామూ లీయోపధ్మానీయాను స్వారాను నాసిక్యయమాలని "పరాశ్రయాలు' లేక 'అయోగ వాహాలు' అని వ్యవహరించి వాటిని వర్ణ సమామ్నాయంలో ప్రవేశం ఇవ్వలేదు. కాబట్టి ఇవి కొన్ని నిర్ణీత స్థానాలలోనే వచ్చే ధ్వని వికారాలని వారు గుర్తించారు. అయితే ఆధునిక భాషాశాస్త్రజ్ఞులలో వర్ణనిర్మాణాన్ని గురంచి భిన్నాభిప్రాయలు ఉన్నాయి. కొందరి దృష్టిలో వర్ణం మానసికమైనవి. అంటే భాషా వ్యవహర్త ఒక వర్ణాన్ని అన్ని సందర్భాలలోనూ ఒకే విధంగా ఉచ్చరించాలని అనుకొంటాడు; కాని పరిసర

ధ్వనుల వలనా ఇతర కారణాల వలనా ఒకే వర్ణాన్ని భిన్న విధాలుగా ఉచ్చరిస్తాడు. అని వీరి మతం. మరికొందరి దృష్టిలో వర్ణం అంటే సజాతీయత కలిగి భిన్న పరిసరాలలోవచ్చే ధ్వనుల సముదాయం. మరి కొందరి మతంలో భేదకత్వం కలిగిన ధ్వనులు వర్ణాలు, మరికొందరి అభిప్రాయంలో వర్ణం రూపరహితం; వర్ణానికీ దానితో కూడిన ధ్వనుల లక్షణాలకీ అవినాభావ సంబంధం లేదు. బ్లూమ్ ఫీల్డ్, తదనుయాయులు అనుసరించిన వర్ణ నిర్మాణాన్ని Classical Phonology అంటారు. ఇందులో ప్రాధాన్యం ఇవ్వబడని అంశాలని ప్రధానంగా తీసుకొని వర్ణ నిర్మాణ సిద్ధాంతాలని ప్రతి పాదించిన శాఖలు మూడు ఉన్నాయి. వాటిని గురించి సంగ్రహంగా కింద చూద్దాం.

(i) ప్రాగ్‌శాఖా వర్ణ నిర్మాణం (Prague School Phonology): ప్రాగ్ నగరంలో ట్రుబెట్జ్‌కోయ్ (Trubetzkoy), యాకోబ్‌సన్ (Jakobson) ప్రభృతులు 1920–1930 మధ్య భాషల వర్ణ నిర్మాణాన్ని గురించి ముఖ్యమైన పరిశోధనలు చేశారు. వీరి ఉద్దేశంలో వర్ణం మానసికమైనది. వీరు వర్ణాలకీ ధ్వనులకీ తుల్య ప్రాధాన్యం ఇచ్చారు. బ్లూమ్‌ఫీల్డ్ మొదలైనవారు భాషలలో ధ్వనులకి ప్రాధాన్యం ఇవ్వలేదు. కాబట్టి ఈ విషయంలో యీ రెండు పక్షాలకి భేదం ఉంది. వీరు ధ్వనులకి కూడా ప్రాధాన్యం ఇవ్వడం వల్ల ధ్వనులని స్థాన కరణ ప్రయత్నాలు ఆధారంగా కొన్ని సముదాయాలుగా విభజించవచ్చునని అన్ని భాషలలోనూ ధ్వనుల విషయంలో కొన్ని సారూప్యాలు ఉన్నాయనీ గుర్తించారు. ఒక భాషలో భిన్న వర్ణాలకి అన్ని స్థానాలలోనూ భేదకత్వం ఉండదని వీరు గుర్తించారు. ఉదాహరణకి జర్మన్‌లో పదాంతంలో శ్వాసస్పర్శాలేగాని నాదస్పర్శాలు ఉండవు. కాబట్టి జర్మన్‌లో శ్వాసనాదభేదం పదాంతంలో ఉండదు, మిగిలిన స్థానాలలోనే ఉంటుంది. జర్మన్‌లో పదాంతంలో ఉండే శ్వాస వర్ణాన్ని వీరు 'వర్ణకల్పం' (Archiphoneme) అని అన్నారు. వర్ణ కల్పాలు ఇతర స్థానాలలో ఉండే రెండు భిన్న వర్ణాలకి ప్రతీకలు అని వీరి అభిప్రాయం. వీరి మతంలో వర్ణ కల్పానికి ఎక్కువ ప్రాధాన్యం ఉంది.

(ii) బహువ్యాపక వర్ణనిర్మాణం (Prosodic Phonolovy) : ఈ శాఖని స్థాపించినవారు బ్రిటిష్ భాషా శాస్త్రజ్ఞుడైన ఫర్త్ (J. R. Firth). వర్ణాలు తమ

పరిసర వర్ణాలవల్ల ప్రభావితమౌతాయి. అనే విషయానికి ఈ శాఖలో ప్రాధాన్య మివ్వబడింది. తెలుగులో అడుగు, కడుగు, ఉతుకు, బతుకు, నడుచువంటి త్రిస్వర క్రియలలో రెండో, మూడో అచ్చులు ఉకారంగానే ఉంటాయి. (తెలియు, కలియు వంటి యకారోపధ క్రియలు దీనికి అపవాదం) పై వాటికి ఇకారం చేరినప్పుడు రెండో అచ్చు కూడా ఇకారంగా మారుతుంది. (అడిగి మొ.) అకారం చేరినప్పుడు రెండో అచ్చుకూడా అకారంగా మారుతుంది. (అడగ మొ.) (రెండిటిలోనూ రెండో ఉకారం లోపిస్తుంది). అదే విధంగా సంయుక్తాక్షరాలలో రెండో స్పర్శం శ్వాసమైతే మొదటి స్పర్శం కూడా శ్వాసమూ (అడక్కు), రెండోది నాదమైతే మొదటిది కూడా నాదమూ (పాతది >పాద్ది) గా ఉంటాయి. ఇటువంటి వాటి వలన ధ్వనులు పరిసరధ్వనుల వలన ప్రభావిత మౌతాయని స్పష్టమవుతుంది. కొన్ని అంశాలు పదంలో లేక వాక్యంలో ఒకే స్థానానికి పరిమితం కాక చాలా స్థానాలు ఆక్రమించుకొని ఉంటాయి. ఇటువంటి అంశాలని వీరు 'బహువ్యాపకాలు' (Prosodies) అని అన్నారు. పై తెలుగు ఉదాహరణలలో (u-prosody, i-prosody, a-prosody, voicing prosody ఉన్నాయి. వీరి సిద్ధాంతం ప్రకారం ఒక పదంలో వర్ణాలని విడివిడిగా విభజించడం కృత్రిమమైనది. కొన్ని స్థానాలని సూచించే ధ్వనులని కూడా వీరు Prosodies గా పరిగణించారు. అంటే ఇంగ్లీషులో స్పర్శాలలో మహాప్రాణత పదాదిలోనే ఉంటుంది. కాబట్టి పదాదిని సూచించే మహా ప్రాణత కూడా వీరి మతంలో ఒక Prosody. ఈ శాఖలో ధ్వనుల బేదకత్వానికి కాక వరుసగా ఉచ్చరించబడే ధ్వనులలో సారూప్యానికి ప్రాధాన్యం ఉంది అని సంగ్రహంగా చెప్పవచ్చు.

## 4.5. ఉత్పాదక వర్ణనిర్మాణం

ఉత్పాదక వర్ణనిర్మాణం (Generative phonology) అనేది చోమ్‌స్కీ (N. Chomsky) స్థాపించిన ఉత్పాదక వ్యాకరణం (Generative Grammar, చూ. 7 వ అధ్యాయం) లో శాఖ. ప్రాగ్ (Prague) భాషా శాస్త్రజ్ఞుల మతానికీ వీరి మతానికీ కొంత సాజాత్యం ఉంది. వారు ప్రతిపాదించిన అంశాలనే చోమ్‌స్కీ, హాలే (M.Halle) తదితరులు విస్తృతం. సమగ్రం చేశారు. వీరి సిద్ధాంతం ప్రకారం ధ్వని నిర్మానానికీ, వర్ణ నిర్మాణానికీ భాషలో సమప్రాధాన్యం ఉంది. వీరిలో

కొందరు భాషలో ధ్వనులే ప్రధానం కాని వర్ణం ప్రధానం కాదు అనీ వ్యాకరణంలో వర్ణ స్థాయి (Phonomeic Level) అనావశ్యకమనీ వాదించారు. భాషకు ముఖ్యమైన అంగాలు రెండు; మానవుడు వ్యక్తీకరించవలసిన భావ సముదాయం ఇందులో మొదటిది, దీన్ని 'ఆర్థికాంగం' (Semantic Component) అనవచ్చు. రెండవది భావాన్ని వ్యక్తీకరించడానికి మానవుడు ఉపయోగించే ధ్వనులు, ఈ భాగాన్ని 'ధ్వన్యంగం' (Phonetic Component) అనవచ్చు. వ్యాకరణం చేసేపని ఆర్థికాంగానికీ దానికి సంబంధించిన ధ్వన్యంగానికీ గల పరస్పర సంబంధాన్ని సూత్రాలద్వారా వ్యక్తీకరించడమే. కాబట్టి ధ్వన్యంగం కూడా వ్యాకరణంలో ప్రధానపాత్ర వహిస్తుంది. బ్లూమ్‌ఫీల్డ్ వంటి కొందరు అర్థనిర్మాణానికీ ధ్వనులకీ ప్రాధాన్యం ఇవ్వలేదు. కాబట్టి ఈ విషయంలో రెండు మతాల వారికీ ముఖ్య భేదం ఉంది. ఉత్పాదక వర్ణ నిర్మాణం ఉత్పాదక వ్యాకరణం (Generative Gramar) లో భాగంగా వృద్ధి పొందింది.

ఉత్పాదక వర్ణనిర్మాణంలో ధ్వనులను కొన్ని ధ్వని లక్షణాల (Phonetic features) సముదాయాలుగా విభజిస్తారు. కాబట్టి ఇందులో ధ్వనులకన్న ధ్వని లక్షణాలే మూలమైనవి. ఒక ధ్వనికి ఉన్న ధ్వనిలక్షణాలు దాని స్థానకరణ ప్రయత్నాలు ఆధారంగా నిర్ణయించబడతాయి. ధ్వని లక్షణాలు ఒక ధ్వన్ని ఇతర ధ్వనులకీ మధ్య ఉన్న భేద సాదృశ్యాలని స్పష్టం చేస్తాయి. ధ్వని లక్షణాలకు ఉదాహరణలు అక్షరత (Syllabicity), మంద్రం (Sonorant), దీర్ఘీకరణం (Continuant), నాదం (Voice) ఓష్ఠ్యం (Labial), జిహ్వాగ్రం (Apical), ఎత్తు (Height), పశ్చిమం (Back), వర్తులం (Round) దీర్ఘం (Long) మొ. ఒక ధ్వనికి వీటిలో ఒక లక్షణం ఉన్నదని సూచించడానికి ఆ లక్షణం ముందు+గుర్తు, లేదని సూచించడానికి–గుర్తూ వాడతారు. ఉదాహరణకి అచ్చులన్నీ[+ అక్షరత], చాలా హల్లులు [–అక్షరత] (అక్షరత అంటే అక్షరంలో ప్రధాన భాగంగా ఉండే అర్హత) అచ్చులనీ, హల్లులనీ ఈ ఒక లక్షణమే వేరుచేస్తుంది. ఇదే విధంగా అచ్చులలోనూ హల్లులలోనూ లక్షణాల మూలంగా అంతర్విభజన చెయ్యవచ్చు. ఓష్ఠ్య ధ్వనులన్నీ [+ఓష్ఠ్యత] కలిగి ఉంటాయి. ఓష్ఠ్య ధ్వనులు కానివి [–ఓష్ఠ్యత] కలిగి ఉంటాయి. అలాగే పశ్చిమం అనే లక్షణం ఉ, ఊ, ఒ, ఓ [పశ్చిమం] లను మిగిలిన అచ్చుల [–పశ్చిమం] నుంచి విడతీస్తుంది. ప.బ.మలు [+ఓష్ఠ్యం] ఈ మూడిటి మధ్యా చూపించడానికి

ప ని $\begin{bmatrix} + \text{ఓష్ఠ్యం} \\ - \text{మంద్రం} \\ - \text{నాదం} \end{bmatrix}$ అనీ, బ ని $\begin{bmatrix} + \text{ఓష్ఠ్యం} \\ - \text{మంద్రం} \\ + \text{నాదం} \end{bmatrix}$ అనీ,

మ ని $\begin{bmatrix} + \text{ఓష్ఠ్యం} \\ + \text{మంద్రం} \\ + \text{నాదం} \end{bmatrix}$ అనీ భిన్న లక్షణాల కలయిక ద్వారా సూచించవచ్చు.

ఇలా సూచించడంవల్ల (1) ప్రపంచ భాషలలో ధ్వనులలో సారూప్యాన్ని నిరూపించడం, (2) ధ్వనులని సముదాయాలుగా వర్గీకరించడం, (3) సంధి విధానంలో లాఘవం సాధించడం అనే మూడు ప్రయోజనాలు ఉన్నాయి. మూడో దానికి ఒక ఉదాహరణ చూద్దాం. ప్రాచీనాంధ్రంలో ద్రుతసంధి అందరికీ పరిచితమే. అందులో నకారం తరవాత కచటతప లు (పరుషాలు), గజడదబ లు (సరళాలు) గా మారతాయి. దీనినే ధ్వని లక్షణంలో చెప్పాలంటే నాదమైన నకారం తరవాత [–నాదం], [+నాదం] అవుతుందని చెప్పవచ్చు. దీన్నే సూత్ర రూపంలో ఈ కింది విధంగా రాస్తారు :

[–నాదం] → [+ నాదం]/న్–

లేక

[న్] [–నాదం] → [న్] [+నాదం]

పరుషాలు, సరళాలు అన్న సంజ్ఞలు ఆయా ధ్వనులకి విధించడంలోనే కొంత లాఘవం ఉంది. వీటిమధ్య భేదమైన ధ్వని లక్షణాన్ని తీసుకొని ఒక సముదాయంలో అది + అనీ, మరొక సముదాయంలో అది – అనీ సూచించడంవల్ల మరికొంత లాఘవం ప్రాప్తించింది. పై విధంగా సూత్రం రాయడం వల్ల ధ్వనులలో పరిసర ధ్వనుల ప్రభావం వల్ల జరిగే మార్పులలో ఉన్న సహజత్వం వ్యక్తీకరించబడుతుంది. ఉదాహరణకి, పై సూత్రం నాదమైన నకారం తరవాత వచ్చిన నాదం కాని ధ్వని నాదంగా మారడమనే సహజపరిణామాన్ని స్పష్టంచేస్తుంది. ధ్వని లక్షణాలు ధ్వన్యుత్పత్తి శాస్త్రం ప్రకారం ఏర్పరచబడతాయి కాబట్టి ఇవి అన్ని భాషలకీ తుల్యమే. కాని ఒక భాషలో కొన్ని ధ్వని లక్షణాలు మాత్రమే ఆవశ్యకమౌతాయి.

చోమ్‌స్కీ, హాలే (The Sound Pattern of English, 1968,

అధ్యాయం 7 లో) చాలా ధ్వని లక్షణాలు అచ్చులకీ హల్లులకీ తుల్యంగా ఉంటాయని ప్రతిపాదించారు. వీటిలో మంద్రం అనేది ఒకటి. మంద్ర ధ్వనుల ఉచ్చారణలో వాయువు నోటి ద్వారా కాని ముక్కు ద్వారా కాని ఎక్కువ నిరోధం లేకుండా ప్రవహిస్తుంది. అచ్చులు, ల, ర, య, ఉభయోష్ఠ్యవకారం అనునాసికాలూ మంద్రాలు, అంటే ఇవి [+ మంద్రం]. మిగిలిన హల్లులు, అంటే స్పర్శాలూ, స్పృష్టోష్మాలూ, ఊష్మాలూ [-మంద్రం], ఇ, ఉ, య, ఉభయోష్ఠ్యవకారం, చవర్గ, కవర్గలు [+ఉన్నతం], మధ్యాచ్చులూ (ఎ, ఒ), పశ్చాత్కంఠ్యా ?? [-ఉన్నతం, - నిమ్నం], నిమ్నాచ్చులూ (అ), కంఠ మూలియాలూ (హ, ? కంఠమూలీయస్పర్శం) [+నిమ్నం], నోటిముందు భాగంలో దంతమూలం వరకూఉన్న స్థానాలలో ఉచ్చరించబడే ధ్వనులు [+పురస్త్యం, Anterior], ప వర్గ, త వర్గ, సకారాలు అటువంటివి. క వర్గ, చ వర్గల వంటి ధ్వనులు [-పురస్త్యం]. నాలుక కొన తన సహజ స్థానం నించి పైకి లేచి ఉండగా ఉచ్చరించబడే ధ్వనులు [+జిహ్వాగ్రీయం, Coronal],తవర్గ, చవర్గలు ఇటువంటివి. ఇటువంటి లక్షణంలేని ప వర్గ, కవర్గల వంటి ధ్వనులు [-జిహ్వాగ్రీయం]. చ, జల వంటి స్పృష్టోష్మాల ఉచ్చారణలో గాలి కొంతసేపు నిరోధించబడిన తరవాతనే వదలబడుతుందని పైన (3.3) చూశాం, కాబట్టి ఇవి [+ నిరుద్ధ స్ఫోటనం, ], స్పర్శాలు [-నిరుద్ధ స్ఫోటనం] మహాప్రాణాలైన ఘ, ఛ, ఠ, ఢ, థ, ధ, ఫ, భ లు [+ మహాప్రాణం], ఇతర స్పర్శాలు [-మహాప్రాణం].

# 5. పద నిర్మాణం

## 5.1. అర్థకం (Morpheme) – సార్థకం (Allomorph)

ఒక భాషని వ్యవహర్తలు మాట్లాడేటప్పుడు ఉచ్చరించిన ధ్వనులని భిన్న వాక్యాలుగా విడగొట్టవచ్చు. ఈ వాక్యాలు చాలా పెద్దవి కావచ్చు లేక 'అవును', 'కాదు', 'లేదు' వంటి చాలా చిన్నవి కావచ్చు. వాక్యం (Sentence) అంటే ఏమిటో అందరికీ తెలుసుకాని దీనికి నిర్వచనం ఇవ్వడం చాలా కష్టం (వాక్యాన్ని గురించిన చర్చపై ఆధ్యాయంలో ఉంటుంది). వాక్యాన్ని కూడా మనం చిన్న చిన్న ముక్కలుగా అంటే అందులో ఉన్న మాటలుగా విడగొట్టవచ్చు. 'మాట' లేక 'పదం' అంటే కూడా ఏమిటో అందరికీ తెలుసు. కాని వాక్యానికి లాగే దీనికి కూడా నిర్వచనం ఇవ్వడం కష్టం ('పదం'పై వివరణకి 5. 7 చూడండి). ప్రస్తుతానికి 'మాట' లేక 'పదం' (Word) అనేదాన్ని సాధారణంగా జనులు ఏ అర్థంలో వాడతారో ఆ అర్థంలోనే వాడుతూ, దీన్ని ఇంకా చిన్న ముక్కలు చెయ్యడానికి అవకాశం ఉందా అనే విషయం పరిశీలిద్దాం. ఇల్లు, ఊరు, పని, చొక్కా, చెట్టు – ఇవి మాటలు. వీటిని భాగాలుగా విడగొడితే ఇ, ల్, ల్, ఉ; ఊ, ర్, ఉ; ప్, అ, న్, ఇ–ఇలా వాటిలో ఉన్న ధ్వనులు ప్రత్యేకంగా తెలుస్తాయి. కాని ఈ ధ్వనులకి అర్థాలు లేవు. ఇవి కలియడంవల్ల ఏర్పడిన మాటలకి అర్థాలు ఉన్నాయి. ఈ ధ్వనులకి విడివిడిగా అర్థాలు లేకపోవడమే కాకుండా ఒక పదంలో ఉన్నవాటిని కొన్నింటిని కలిపినా, ఉదాహరణకి 'ఇల్' లేక 'లు' ఇలా కలిపిన వాటికి కూడా అర్థం రాదు. దీనివల్ల విడి ధ్వనులకి అర్థం లేకపోయినా అవి కొన్ని విధాలుగా పరస్పరం కలియడం వల్ల ఏర్పడిన మాటలకి అర్థాలు ఉంటాయని మనం గ్రహించవచ్చు. ఒక ధ్వనే కొన్ని సందర్భాలలో మాటగా ఉండవచ్చు. ఆ చెట్టు, ఈ చెట్టు, ఏ చెట్టు అనే వాటిలో ఆ, ఈ, ఏ లకి అర్థాలు ఉన్నాయి కాబట్టి ఇవి మాటలుగా పరిగణించాలి. కాని ఆకలి, ఈగ, ఏనుగు లలో ఆ ఈ ఏ లకి అర్థం లేకపోవడంవల్ల అవి మాటలు కావు. అర్థాలు లేని ధ్వనులు కొన్ని కలిసి అర్థవంతమైన మాటలని ఏర్పరచడం విడివిడిగా ప్రయాణ యోగ్యం కాని చక్రం, కాడి మొదలైనవి కలిసి ప్రయాణయోగ్యమైన బండిగా ఏర్పడడం వంటిదని

పతంజలిమహర్షి చెప్పేరు. పైన ఇచ్చిన మాటలని అర్థవంతమైన చిన్న ముక్కలుగా మనం విడగొట్టలేకపోయినా మరికొన్ని రకాల మాటలని అర్థవంతమైన ముక్కలుగా విడగొట్టవచ్చు. ఏనుగులు, అమ్మకు, వంట, చెప్పేను వంటి మాటలకేకాక వాటిలో ఉన్న కొన్ని భాగాలకి కూడా అర్థం ఉందని మనం గమనించవచ్చు. 'ఏనుగులు' లో ఉన్న 'లు' 'కప్పలు' 'కాకులు' 'కోతులు' వంటి మాటలలో కూడా ఉందనీ, వీటన్నిటిలో ఇది బహుత్వాన్ని సూచిస్తుందనీ స్పష్టం. కాబట్టి 'ఏనుగులు' అనే మాటలో 'ఏనుగులు' 'లు' అని రెండు అర్థవంతమైన ముక్కలు ఉన్నాయని స్పష్టమవుతుంది. ఇక్కడ అర్థం రెండు రకాలుగా ఉంటుందని మనం గమనించాలి. ఒకటి నైఘంటుకార్థం (Lexical Meaning) అంటే నిఘంటువులో సూచించదగినది. రెండవది వ్యాకరణార్థం (Grammatical Meaning). ఏనుగు, కప్ప, కాకి మొదలన వాటికున్న అర్థం నైఘంటుకం; లు మొదలైన ప్రత్యయాల అర్థం వ్యాకరణార్థం. 'అమ్మకి' అనే మాటలో 'కి' 'కప్పకి' 'ఏనుగుకి' వంటి మాటలలో కూడా అదే అర్థంలో ఉంది కాబట్టి ఇందులో కూడా 'అమ్మ' 'కి' అనే రెండు అర్థవంతమైన భాగాలు ఉన్నాయి. 'వంటలో 'ట' కూడా అర్థంవంతమైనదే. 'వండు' అనే ధాతువుకి 'ట' అనే ప్రత్యయం చేరటం వల్ల 'ట'కూడా అర్థవంతమైనదే. 'వండు' అనే ధాతువుకి 'ట' అనే ప్రత్యయం చేరటం వల్ల 'వంట' ఏర్పడింది. ఈ 'ట' క్రియా వ్యాపారాన్ని గాని ఫలితాన్ని గాని సూచిస్తుంది. మండు – మంట, పండు – పంటలలో కూడా 'ట' ఇదే అర్థంలో ఉంది. ఇక 'చెప్పేను' అనే మాటలో 'చెప్పు', 'ఏ', 'ను' అనే మూడు అర్థవంతమైన భాగాలు ఉన్నాయి. 'చెప్పు' ఒక క్రియా వ్యాపారాన్నీ, 'ఏ' భూతకాలార్థాన్నీ, 'ను' నేను అనే అర్థాన్ని సూచిస్తాయి. ('చెప్తాను'లో 'తా' భవిష్యదర్థకం, 'చెప్పేము 'లో' ము' మేము అనే అర్థాన్ని సూచిస్తుంది). మన ప్రాచీన వైయాకరణులు నామవాచకంలో ప్రధాన భాగాన్ని 'ప్రాతిపదిక' అనీ క్రియలో ప్రధాన భాగాన్ని 'ధాతువు' అనీ వ్యాకరణార్థం గల అస్వతంత్రాంశాన్ని 'ప్రత్యయం' అనీ వ్యవహరించారు. ఈ మూడూ కూడా అర్థవంతమైనవే కాక అర్థమున్న చిన్న ముక్కలుగా విడదీయడానికి వీలుకానివి కాబట్టి వీటిని సంగ్రహంగా కనిష్ఠార్థవంతమైన అంశాలు అనవచ్చు. (కృత్తద్ధిత సమాసాలకి కూడా ప్రాతిపదిక సంజ్ఞ వ్యాప్తి చేయబడింది. కాబట్టి అటువంటి

ప్రాతిపదికలని మాత్రం అర్థవంతమైన భాగాలుగా విడదీయవచ్చునని గమనించాలి). ఈ మూడిటినీ ఇంకా ఇటువంటి వాటినీ అంటే అర్థవంతమైన భాగాలుగా విడదీయడానికి వీలులేని అర్ధవంతమైన అంశాలని కలిపి వ్యవహరించడానికి మన ప్రాచీన వ్యాకరణాలలో సంజ్ఞ లేదు. కాని ఆధునిక భాషాశాస్త్రజ్ఞులు ఇటువంటి అంశానికి 'morpheme' అనే సంజ్ఞ ఏర్పరిచారు. తెలుగులో దీనికి సమానంగా 'అర్థకం' అని వాడవచ్చు•. అర్థకం (Morpheme) అనేది "అర్థవంతమైన అంతరాలు లేని అర్థవంతమైన అంశం" అని నిర్వచించవచ్చు.••

---

• 'Morpheme' కి తుల్యంగా తెలుగులో 'పదాంశం' అని కొందరి వాడుక; 'పదం' అని నేను ఇంతకుముందు వాడాను. ఈ రెండూ కూడా భిన్న కారణాలవల్ల సంతృప్తికరంగా లేవు. 'పదాంశం' అంటే పదంలో అంశం అనే అర్థం వస్తుంది. కాబట్టి morpheme ఎప్పుడూ పదంలో అంశమే అనే భ్రమ దీనివల్ల ఏర్పడుతుంది. ఇల్లు, ఊరు, ఏనుగు మొదలైనవి morphemes, పదాలూ, (words) కూడా. కాబట్టి పదంలో అంశాలుకాక పదాలే అయిన morphemes కి ఇది వర్తించదు. ఇక 'morpheme' కి తుల్యంగా పదం అనే మాటే వాడితే morpheme కీ పదానికీ (word) ఉన్న తేడా స్పష్టం కాదు. 'పదం' అనేది word అనే అర్థంలోనే రూఢిలో ఉంది కాబట్టి దానిని ఆ అర్థంలోనే వాడడం సముచితం. 'morpheme' కి అర్థం ప్రధానం కాబట్టి 'అర్థంకం' అనే పూర్వవ్యాకరణంలోనే ఉన్న సంజ్ఞ దీనికి వాడడం సముచితమని తోస్తుంది.

•• Morpheme కి ప్రసిద్ధ భాషా శాస్త్రజ్ఞులు ఇచ్చిన రెండు నిర్వచనాలు: "A linguistic form which bears no partial phonetic semantic resembalance to any other form, "is a *simple* form or *morpheme*". (Leonard Bloomfield. 1933 Language P. 161) (ధ్వనిలోనూ అర్థంలోనూ ఏ ఇతరాంశంతోనూ పాక్షికమైన పోలికలేని భాషాంశం అర్థకం)

"any form, whether free or bound, which cannot be divided into smaller meaningful parts is a MORPHEME" (B. Blo h and G.L.Trager 1942. Outline of liuguistic

analysis, P. 54). అర్థంవంతమైన భాగాలుగా విభజించడానికి వీలులేని స్వతంత్రం కాని అస్వతంత్రం కాని అయిన అంశం అర్థకం).

(పూర్వవ్యాకరణాలలో "అర్థకం" అనేది "అర్థం గలది", 'ప్రత్యయం' అనే అర్థాలలో వాడబడింది. కాని ఇప్పుడు మనం దీన్ని పైన ఇచ్చిన నిర్వచనం ప్రకారం ప్రత్యయాలకే కాక ధాతువులకీ ప్రాతిపదికలకీ కూడా వర్తించేటట్టు విస్తృతార్థంలో వాడుతున్నామని గమనించాలి). అర్థకాల సమ్మేళనం వల్ల పదాలు ఏర్పడతాయి; పదాల సమ్మేళనం వల్ల వాక్యం ఏర్పడుతుంది. అర్థకాలు ఏ విధంగా కలిసి పదం ఏర్పడుతుంది అని చర్చించేది 'పద నిర్మాణం' (Morphology) పదాలు ఏ విధంగా కలిసి వాక్యం ఏర్పడుతుంది అని చర్చించేది "వాక్య నిర్మాణం" (synatax). కాని పద నిర్మాణానికీ వాక్య నిర్మాణానికీ మధ్య పెద్ద అడ్డు గోడలేదనీ కొన్ని నిర్మాణాలు దేనికిందకి వస్తాయి అనేది ఇదమిత్థంగా చెప్పడానికి వీలులేదనీ తరవాత అధ్యాయాలలో చూస్తాము.

ఉదాహరణకి "రైతులు పంటలు పండిస్తారు" అనే మూడు పదాలు (మాటలు) ఉన్న వాక్యంలో తొమిది అర్థకాలు ఉన్నాయి. అవి రైతులు (బహువచనార్థకం), పండు, ట (భావార్థం) లు, (బహువచనార్థకం), పండు, ఇన్ (సకర్మకార్థకం), తా (తద్ధర్మ భవిష్యదర్థకం), రు (మనుష్య బహు వచనార్థకం).

అర్థకం ఎప్పుడూ ఒకే రూపంతో అంటే ఒకేరకం ధ్వని సముదాయంగా ఉండదు. సందర్భాన్ని బట్టి ఒక అర్థకం వేరు అర్థకాలతో కలిసినప్పుడు అందులో ఉన్న ధ్వనులు మారడం లేక కొన్ని పూర్తిగా లోపించడం జరుగుతూ ఉంటుంది. ఒకొక్కొక్కప్పుడు అర్థకం స్వరూపం పూర్తిగా మారిపోవడం కూడా జరుగుతూ ఉంటుంది. తెలుగులో బహువచనాన్ని సూచించడానికి ఏనుగులు, బొమ్మలు, ఆకులు వంటివాటిలో లు ఉంది. కాని ఇళ్లు, పళ్లు, గోళ్లు కొడవళ్లు వంటి వాటిలో – ళు ఉంది. ఇవన్నీ "బహుత్వం' అనే ఒకే అర్థాన్ని సూచిస్తాయి. కాబట్టి వీటిని ఒకే అర్థకం రూపాంతరాలుగా గ్రహించవచ్చు. ఇటువంటి రూపాంతరాలని "సార్థకాలు" (Allomprphs) అంటారు. అర్థకం – సార్థకం – వీటి మధ్య ఉన్న సంబంధం వర్ణం–సవర్ణం మధ్య ఉన్న సంబంధం వంటిది. అర్థకం, వర్ణం వాటి రూపాంతరాలైన సార్థకాలు, సవర్ణాలు వీటిన్నిటిలో ఉన్న సామాన్య ధర్మాన్ని

కలిగి ఉన్న అమూర్త రూపాలని లౌకికంగా ఆవిష్కరించే మూర్తరూపాలు. అర్థసందిగ్ధత లేనప్పుడు సార్థకాని కూడా అర్థకం అని వ్యవహరించడంతో దోషం లేదు. కాని అర్థకం సార్థకాల సముదాయం అనీ సార్థకం అర్థానికి ఉన్న అనేక రూపాలలో ఒకటి మాత్రమే అనీ వీటి మధ్య ఉన్న భేదం గ్రహించడం అవసరం. కొన్ని అర్థకాలకి సర్వత్రా ఒక రూపం అంటే ఒకే సార్థకం మాత్రమే ఉండవచ్చు. అటువంటప్పుడు అర్థకానికీ సార్థకానికీ మధ్య భేదం లేదనవచ్చు.

ఒకే అర్థకానికి చెందిన సార్థకాలు ఒకే వర్ణానికి చెందిన సవర్ణాలులాగా స్వేచ్ఛా ప్రవృత్తిలో గాని పరస్పర పరిపూరక ప్రవృత్తిలో గాని ఉంటాయి. అయితే సవర్ణానికి పరస్పర పరిపూరక ప్రవృత్తి వర్ణాత్మకం (Phonological) గానే ఉంటుంది. కాని సార్థకాలకి ఇది వర్ణాత్మకంగా గాని పదాత్మకం (Morphological) గా గాని ఉండవచ్చు. అంటే ఒక సార్థకం ఫలానా వర్ణం లేక వర్ణాల పరిసరంలో వస్తుందనిగాని అలా చెప్పడం సాధ్యం కాకపోతే ఫలానా పదం లేక పదాల పరిసరంలో వస్తుందనిగాని చెప్పవచ్చు. దీనికి ఉదాహరణలు కింద చూపబడతాయి.

అర్థకాలు పరస్పరం కలిసి పదాలు ఏర్పడడంలోనూ, పదాలు పరస్పరం కలిసి వాక్యాలు ఏర్పడడంలోనూ వాటిలో ధ్వనులు మార్పులు చెందుతాయి. ఇటు వంటి ధ్వనుల మార్పులను సంధి అంటారు. సంధి 5, 6లో సవిస్తరంగా చర్చించ బడుతుంది.

నైడా ఒక భాషలో పదాలని విశ్లేషించి అర్థకాలని గుర్తించడానికి సహాయ కారులుగా ఉండే ఆరుసూత్రాలు ఇచ్చారు. వాటిని సంగ్రహంగా ఈ కింద చూద్దాం.

1. ఒకే అర్థం కలిగి ప్రయోగించిన అన్ని సందర్భాలలోనూ ఒకే ధ్వని రూపం కలిగిన అంశాలు ఒకే అర్థకంగా పరిగణించబడతాయి. ఏనుగులు కాకులు, బల్లలు, కుర్చీలు – వీటన్నిటిలోనూ – లు ఒకే రూపంలో ఉండి బహుత్వాన్ని సూచిస్తోంది. కాబట్టి వీటన్నిటిలోనూ ఇంకా ఇటువంటి కొన్నిటి లోనూ ఉన్న – లు లు ఒకే అర్థకం అవుతుంది. ధ్వని రూపం

ఒకటే అయినా రెండు అర్థకాలు వేరు వేరు అర్థాలు కలిగి ఉంటేవాటిని వేరు వేరు అర్థకాలుగా పరిగణించాలి. తమ్ముడు, అల్లుడు, మనమడు వంటి వాటిలో – డు మనుష్య పుంలింగ వాచకం; తాగుడు, వాగుడు, తిరుగుడు వంటివాటిలో – డు అది చేరిన క్రియ భావాన్ని సూచిస్తుంది. ఈ రెండు – డు లకి రూపం ఒకటే అయినా వాటి అర్థాలు వేరు. కాబట్టి వీటిని భిన్నార్థకాలుగా పరిగణించాలి. ఇటువంటి వాటిని "తుల్యవర్ణాలైన భిన్నార్థకాలు (Homophonous morphemes/forms)" అంటారు.

2. ఒకే అర్థం కలిగి ధ్వని రూపం మాత్రం వేరుగా ఉన్న అంశాలు వర్ణాత్మక నియతిలో ఉంటే అవి ఒకే అర్థకానికి చెందుతాయి. (అంటే అవి ఒకే అర్థకానికి సార్థకాలు అవుతాయి). సార్థకాల ధ్వనులలో ఉన్న భేదం వాటి పక్కనున్న అర్థకాల ధ్వనులని గాని ఆ అర్థకాల అక్షర నిర్మాణాన్ని (syllabic Structure) గాని ఆశ్రయించి ఉండే అటువంటి సార్థకాలు వర్ణాత్మక నియతిలో ఉన్నాయని అంటారు. కాకు – లు, కోతు–లు, కత్తు–లు వీటిలో బహువచనం ముందు ఉన్న కాకు–, కోతు–, కత్తు– అనేవి కాకి, కోతి, కత్తి అనే వాటి రూపాంతరాలు (సార్థకాలు). వీటి చివరి ఇకారం– లు లో ఉ కారం ఉండడం వల్ల దాని ముందు ఉ కారంగా మారింది. (ఇటువంటి మార్పుని 'సమీకరణం' అంటారు). ఉకారాంత రూపాలు – లు ముందే ఉంటాయి; ఇకారాంత రూపాలు మిగిలినచోట్ల ఉంటాయి. ఈ రెండూ ఇలా వర్ణాత్మక నియతిలో ఉన్నాయి కాబట్టి ఇవి ఒకే అర్థకం సార్థకాలు. సంస్కృతంలో తృతీయా బహువచన ప్రత్యయం – భిః కవి – భిః 'కవులచేత', మహద్–భిః 'గొప్పవారిచేత', లతా–భిః 'లతలచేత', కాని హ్రస్వ అకారాంత ప్రాతిపదిక తరవాత దీనికి ప్రత్యయం ఐః, దేవైః 'దేవతల చేత', అశ్వైః 'గుర్రాలచేత' (వీటి ప్రాతిపదికలు క్రమంగా దేవ–, అశ్వ–) కాబట్టి – భిః – ఐః అనేవి రెండూ ఒకే అర్థకానికి వర్ణాత్మక నియతిగల సార్థకాలు. గోండీలో అమనుష్య బహువచనార్థకానికి –క్, –జ్ అనే రెండు సార్థకాలు ఉన్నాయి; వీటిలో –క్ హలంతాల తరవాతా (కయ్–క్ 'చేతులు', కాల్–క్ 'కాళ్లు) –జ్ అజంతాల తరవాతా (కాయా–జ్ 'కాయలు', పడ్డీ–జ్ 'పందులు')

వస్తాయి. తుళులో బహువచనార్థకానికి -కుళు, -లు అనే రెండు సార్థకాలు ఉన్నాయి. వీటి ప్రవృత్తి అవి చేరే పదం అక్షర నిర్మాణాన్ని బట్టి ఉంటుంది. -కుళు ఏకాచ్కా నామవాచకాలకీ, దీర్ఘాచ్చుగాని రెండో అక్షరంలో సంయుక్త హల్లుగాని లేని ద్వ్యచ్కా నామవాచకాలకీ చేరుతుంది. కయ్-కుళు 'చేతులు', ఎలి-కులు 'ఎలకలు', -ళు మిగిలినవాటికి చేరుతుంది. బోరి-ళు 'ఎడ్లు', పిరెలు-ళు 'వేళ్లు',నాయి-ళు 'కుక్కలు' కొన్ని చోట్ల అక్షర నిర్మాణమూ, ధ్వనులూ కలిసి నియతి ఏర్పరుస్తాయి. తిను, కొను, విను వంటి ఏకహ్రస్వాచ్చు కలిగి అద్విరుక్త స కారంతో అంతమయ్యే క్రియల తరవాత త కారంతో మొదలయ్యే అర్థకానికి ట కారంతో మొదలయ్యే సార్థకం ఉంటుంది'అడుగుతాడు' కాని 'తింటాడు'. 'అడుగుతున్నాడు' కాని 'తింటున్నాడు' మొ. కాని దీర్ఘాచ్చు కలిగి సకారం చివర ఉన్న క్రియల తరవాత కాని, ద్విరుక్త నకారం ఉన్న క్రియల తరవాత కాని ఈ సార్థకం ఉండదుః మూంతాడు ('మూను' అనే క్రియారూపం), దున్నుతాడు. కాబట్టి ఒక్కడ నియతి అక్షర నిర్మాణం. చివరి హల్లు అనే రెండిటి మీదా ఆధారపడి ఉంది.

3. ఒకే అర్థం కలిగి ధ్వని రూపం మాత్రం వేరుగా ఉన్న అంశాలు పదాత్మక నియతిలో ఉంటే అవి ఒకే అర్థకానికి చెందుతాయి. వర్ణాత్మక నియతి చెప్పడం సాధ్యం కానప్పుడు సార్థకాలు పదాత్మక నియతిలో ఉన్నాయయని చెప్పవచ్చు. బహువచనప్రత్యయానికి సార్థకమైన-ల్లు రాత్రిళ్లు పెళ్ళిళ్లు వంటి కొద్ది మాటలలోనే ఉంది. దీనికి వర్ణాత్మక వియతి లేదని మంత్రులు, బల్లులు వంటి మాటలవల్ల తెలుస్తుంది. కాబట్టి ఇది రాత్రి, పెళ్ళి అనే మాటల తరవాతనే వస్తుందని చెప్పాలి. ఇంగ్లీషులో -en అనే బహువచన ప్రత్యయసార్థకం feet. అనే మాటలలోనే ఉన్నాయి. ఒకే అర్థకానికి చెందిన సార్థకాలు కొన్ని వర్ణాత్మక నియతిలోనూ మరికొన్ని పదాత్మక నియతిలోనూ ఉండవచ్చు. వర్ణాత్మక నియతిలో ఉన్న సార్థకం ముందు ~ అనే గుర్తూ, పదాత్మక నియతిలో ఉన్న సార్థకం మందు $\alpha$ అనే గుర్తూ వాడడం సంప్రదాయం.

4. ఒక ఆధారభూతమైన పదం నించి ఇంకొక పదం ఏర్పడినప్పుడు ఆ రెండింటిలోనూ వచ్చిన ధ్వని భేదాన్ని అర్థకంగా గుర్తించాలి. (ఇక్కడ నైడా ఇచ్చిన సూత్రం కొంచెం మార్పు చేయబడింది). ఇంగ్లీషులో foot కి బహువచనం feet. ఇక్కడ బహుత్వాన్ని నిర్దేశించే (ఉచ్చారణలో iY) బహువచన ప్రత్యయసార్థకం. ఇందులో లోపసార్థకం కూడా ఉంది అనడం అనవసరం (చూ. 5. 3).

5. సమధ్వని రూపాలు (Homophonous Forms) ఒకే అర్థకానికి చెందినవా? లేక వేరు వేరు అర్థకాలా? అనే విషయం నిర్ణయించడానికి ఈ కింది ఇచ్చిన నియమాలు తోడ్పడతాయి.

(i) వాటి అర్థాలు పరస్పర సంబంధం లేనివి అయితే అవి వేరు వేరు అర్థకాలు: చెవి 'శరీరావయం' చెవి 'తాళం చెవి' తాళం 'సంగీతంలో వేసేది. తాళం 'ఇంటికి వేసేది', ఏడు '7' ఏడు ('ఏడు' కివిధి రూపం).

(ii) వాటి అర్థాలు పరస్పర సంబంధం ఉన్నవి అయితే ఆ రూపాలు భిన్న భాషాభాగాలకి చెందినవి అయితే ఒకే అర్థకమని సులభంగా గుర్తించవచ్చు: నవ్వు, తిట్టు, తన్ను క్రియలు , నామవాచకాలూ కూడా. కాని ఆ రూపాలు ఒకే భాషాభాగానికి చెందినవి అయితే వాటి అర్థాలు పరస్పర సంబంధం ఉన్నవా కావా అనే విషయం నిర్ణయించడం ఊహాశక్తి మీదా, భాషా చరిత్ర మీదా ఆధారపడి ఉంటుంది. 'పెళ్లికొడుకు' 'పెళ్లి కూతురు' అనే మాటలలో కొడుకు, వివాదాస్పదం. వీటికి మూలార్థం యువతి, యువకుడు అనుకొంటే వీటిని ఒకే అర్థకాలుగా గ్రహించవచ్చు. 'ఆకుపచ్చ'లో ఆకు మామలూ ఆకే: కానీ 'ఆకు రాయి'లో 'ఆకు'కీ, మామూలు 'ఆకు'కీ సంబంధం ఉందా? 'కీచురాయి'లో 'రాయి' మామూలు రాయేనా? 'పాలరాయి'లో 'పాల' అనేది 'పాలు'కి సంబంధించినదేనా? ఇటువంటి చోట్ల తెలుగు మాట్లాడేవారి మధ్యే అభిప్రాయ బేధాలు ఉండవచ్చు. 'గాడిద', 'పంది', 'దున్నపోతు' మొదలైన జంతువాచక పదాలు మనుష్యుల స్వభావాన్ని సూచించడానికి మనుష్యులకి కూడా వాడతారు. కాబట్టి ఇవి ఒకే అర్థకాలు అనడం సమంజసం. కొన్ని చోట్ల చారిత్రకంగా సంబంధం లేని పదాల కూడా సంబంధం కలవిగా కనపడతాయి: 'మొక్కజొన్న'లో 'మొక్క' (<మక్కా),

మామూలు 'మొక్క'; 'ఆరంజోతి' (అరుంధతి)లో 'జోతి', మామూలు 'జ్యోతి'; 'గడియారం ముల్లు'లో 'ముల్లు'కీ, మామూలు 'ముల్లు'కీ ప్రప్రథమంగా సంబంధంలేదని అనిపించినా ఆలోచించి చూస్తే వీటి మధ్య సంబంధం స్పష్టమవుతుంది.

6. ఒక అర్థకాన్ని (పదంలలో మిగిలిన అర్థకాల నుంచి) విడదీయడానికి ఈ కింద ఇచ్చిన సందర్భాలు ఉపయోగపడతాయి.

(i) స్వతంత్ర ప్రయోగార్హత : ఇల్లు, చెట్టు, కొమ్మ, మొ.

(ii) స్వతంత్ర ప్రయోగార్హత లేకపోయినా, స్వతంత్ర ప్రయోగార్హత. కలవాటితో కలిసినప్పుడు బహువచన ప్రత్యయం : – లు, విభక్తి ప్రత్యయాలు మొ.

(iii) స్వతంత్ర ప్రయోగార్హత లేక అది కూడిన అంశాలకి కూడా స్వతంత్ర ప్రయోగార్హత లేకపోయినా ఆ పదాల విశిష్టార్థాన్ని సూచిస్తున్నప్పుడు: తమ్ముడు, మనుమడు, అల్లుడు మొదలైనవాటిలో – డు కాని దాని ముందున్న అంశాలు కాని స్వతంత్ర ప్రయోగార్హాలు కావు. అయినా వీటిలో –డు పురుష వాచకం; దాని ముందున్న అంశం కూడా విశిష్టార్థ సూచకమే. కాబట్టి ఈ రెండూ వేరు వేరు అర్థకాలు (ఇది నైడా ప్రత్యేకంగా ఇవ్వలేదు గాని దీన్ని (ii)లో అంతర్భాగంగా పరిగణించారు)*

---

* ఇంగ్లీషులో conceive, consume, contain, condense మొదలైన వాటిలో con- కి స్వతంత్ర ప్రయోగం లేదు. అలాగే ceive, - sume, -tain లకీ స్వతంత్ర ప్రయోగం లేదు. అయినా –dense కి స్వతంత్ర ప్రయోగం ఉండడం వల్ల వీటన్నిటినీ అర్థకాలుగా గ్రహించవచ్చునని నైడా అభిప్రాయం. కాని పైన ఇచ్చిన తమ్ముడు, మనుమడు, అల్లుడు వంటి వాటిలో ఏ ఒక్కదానిలోనూ 'డు' ముందున్న అంశం స్వతంత్ర ప్రయోగార్హం కాదు. అయినా 'డు' నీ దాని ముందు అంశాలనీ వేరు వేరు అర్థకాలుగా గ్రహించాలి. కాబట్టి ఇటువంటి చోట్ల ఒక్క దానిలోనైనా ఒక అంశం స్వతంత్ర ప్రయోగార్హమై ఉండాలని నైడా చెప్పిన నియమం అనావశ్యకమైనది.

(iv) ఒకే ప్రత్యేక సందర్భంలో ప్రయుక్తమై దానితో వచ్చే రూపాలు స్వతంత్ర ప్రయోగార్హత కలవిగా గాని లేక బహుళ వ్యాప్తిలో ఉన్నవిగా గాని ఉన్నప్పుడు:పట్టపగలు, నట్టనడుం, చిట్టచివర, మొట్టమొదట వంటివాటిలో పట్ట–నట్ట–చిట్ట–మొట్ట– మొదలైనవి పగలు మొదలైన వాటితోనే వస్తాయి కాని మరి ఏ ఇతర పదంతోనూ రావు. కాని పగలు మొదలైనవి స్వతంత్ర ప్రయోగార్హత కలవి కాబట్టి ఇవి అర్థకాలని మనం సులభంగా గుర్తించవచ్చు. వీటితో రావడం వల్ల పట్ట– మొదలైనవి కూడా ప్రత్యేకార్థకాలని గుర్తించవచ్చు. ఇవి అతిశయం అనే అర్థాన్ని సూచిస్తాయి. కూరా నారా, నోరూ వాయీ, పొలం పుట్రా మొదలైన పదబంధాలలో రెండో అంశం మొదటి అంశంతో మాత్రమే కలిసి వస్తుంది. వీటిలో మొదటి అంశం అర్థకం అని సులభంగా తెలుస్తుంది కాబట్టి రెండోదాన్ని కూడా అర్థకంగా పరిగణించాలి. వీటి అర్థం "మొదటి అంశం వంటిది" అని. ఇంగ్లీషులో cranberry, raspberry అనే వాటిలో berry 'పండు' స్వతంత్ర ప్రయోగార్హం కాబట్టి అర్థకం. అందచేత విశిష్ట జాతి వాచకాలైన cran-, rasp- అనే వాటిని కూడా వాటికి వేరు ప్రయోగం లేక పోయినా ప్రత్యేకార్థకాలుగా పరిగణించాలి.

ప్రాచీన భాషలో రెండు అర్థకాలుకలిసి ఏర్పడిన మాట తరవాత కాలంలో ఒకే అర్థకంగా పరిగణించబడుతూ ఉండవచ్చు. అదే విధంగా ఒకే అర్థకం ఉన్నవి అని అనుకొనే అన్యభాషాపదాలు వాటి అసలు భాషలో ఒకటికన్న ఎక్కువ అర్థకాలు కలవి కావచ్చు. తెలుగులో 'అన్నం' అనే మాట ఏకార్థకం. ఇది సంస్కృతం నించి వచ్చింది. సంస్కృతంలో ఇది అద్ 'తిను' అనే క్రియకి– న అనే కృత్ప్రత్యయం చేరడం వల్ల ఏర్పడింది. ఇదే విధంగా 'జమీందారు' తెలుగువారికి ఏకార్థకం; కాని ఉర్దూలో ఇది జమీన్ 'భూమి', – దార్ 'కలవాడు' అనే రెండు అర్థకాల కలయికవల్ల ఏర్పడినది.

## 5.2 పద నిర్మాణ వర్ణనా పద్ధతులు

పదనిర్మాణాన్ని వర్ణించడానికి మూడు పద్ధతులు వ్యాప్తిలో ఉన్నాయి. అవి

(i) సన్నివేశ పద్ధతి (Item and Arrargement; IA)

(ii) (సంబద్ధ) శబ్దావళీ పద్ధతి (World and Paradigm; WP)

(iii) ప్రక్రియాపద్ధతి (Item and Process; IP)

సన్నివేశ పద్ధతిలో ఒక మాటలో ఉన్న అర్థకాలూ అవి వచ్చే వరస సూచించబడతాయి. ఇది అర్థకాలు స్పష్టంగా విభజించడానికి వీలైనచోట్ల ఉపయోగిస్తుంది. కాని అలా చెయ్యడానికి వీలులేని చోట్ల ఇది ఉపయోగించదు. ఇంగ్లీషులో సాధారణంగా భూతార్థకం –ed కాని -sand, rang, saw మొదలైన వాటిలో ఇది లేదు. వీటిలో ఉన్న భూతార్థకం క్రియ పక్కన కాక క్రియ మధ్యలో ఉంది. కాబట్టి ఇటువంటివాటిని సన్నివేశ పద్ధతిలో వర్ణించడం కష్ట సాధ్యం. (సంబద్ధ) శబ్దావళీ పద్ధతి అంటే మనం సంస్కృతం ప్రాథమిక దశలో నేర్చుకొనేటప్పుడు వల్లెవేసే శబ్దాలు – "రామః, రామౌ, రామాః, రామం, రామౌ, రామాన్" – ఇటువంటి వాటిని ఉపయోగించే పద్ధతి. ఇందులో శబ్దంలో అర్థకాల విభజనకి ప్రాముఖ్యం ఉండక శబ్దమే ప్రాథమికాంశం (Basis Unit) గా పరిగణింపబతుడుఉంది. ఒక్కొక్క గణం (Class) లో ఒక శబ్దానికి ఉన్న అన్ని రూపాలూ ఒకచోట ఇచ్చి ఆ గణానికి చెందిన ఇతర శబ్దాల రూపాలు కూడా ఇలాగే ఉంటాయి అని ఈ పద్ధతి చెప్తుంది. ప్రాచీన పాశ్చాత్య భాషలైన గ్రీకు, లాటిన్ మొదలైన భాషలకి ప్రాచీన కాలంలో వ్యాకరణాలు ఈ పద్ధతిలోనే ఉన్నాయి. దీన్ని మెచ్చుకొనేవారు మిగలిన రెండు పద్ధతులలో చూసే లోపాలు రెండు : ఒకటి, ఒక ప్రత్యయానికి సంబంధించిన ధ్వనిరూపం ఎల్లప్పుడూ అదే ప్రత్యయాన్ని సూచించదు. అంటే లు బహు వచనార్థమైనా కాలు, వేలు, మొదలు వంటి చోట్ల అది బహువచనార్థకం కాదు. రెండోది, కొన్ని చోట్ల ఏ ధ్వనులు ఏ అర్థకానికి చెందుతాయి అనే విషయంలో భేదాభిప్రాయం ఉండవచ్చు. ఉదాహరణకి, ఇంగ్లీషు Children అనే మాటలో r ని Child తో తీసుకోవాలా లేక en తో తీసుకోవాలా? జటిలమైన పనిర్మాణం కల భాషలని నేర్చుకొనేందుకు ప్రాథమిక దశలో ఈ పద్ధతి ఉపయోగిస్తుంది కాని వ్యాకరణానికి ప్రాణమైన పద విభజనకి ఇందులో స్థానం లేదు కాబట్టి ఇది సమగ్రమైన వ్యాకరణమని చెప్పడం కుదరదు.

ప్రక్రియాపద్ధతి ఈ మూడింటిలో సమగ్రమైనదీ బహుళ వ్యాప్తిగా ఉన్నదీ. ఇది పాణిని మహర్షి ఉపయోగించిన పద్ధతి. ఇటీవల కాలంలో ఉత్పాదక వ్యాకరణ వేత్తలు (Generative Grammarians) దీనిని బహుళ ప్రచారంలోకి తీసుకువచ్చారు. ఇందులో పదనిర్మాణం ప్రక్రియ ద్వారా అంటే, అంచెలు అంచెలుగా సాధించబడుతుంది. ఒక్కొక్క అర్థకానికి ఉన్న సార్థకాలలో ఒకదానిని ప్రాథమికాంశం (Basic Unit) గా తీసుకొని సూత్రాల ద్వారా భాషలో ఉన్న రూపాలని సాధిస్తారు. సన్నివేశ పద్ధతిలో అన్ని సార్థకాలకీ సమాన ప్రతిపత్తి ఉంది. కాని ప్రక్రియాపద్ధతిలో ఒక సార్థకాన్ని ప్రాథమికంగా గ్రహించి మిగిలిన సార్థకాలని సూత్రాల ద్వారా సాధిస్తారు. సాధారణంగా బహుళ వ్యాప్తిగా ఉన్న దాన్ని లేక దేన్ని ప్రాథమికంగా గ్రహిస్తే వర్ణన సులభమవుతుందో దాన్ని ప్రాథమికంగా గ్రహిస్తారు. కొన్ని సందర్భాలలో పునర్నిర్మిత రూపాన్ని (Reconstructed Form) కూడా ప్రాథమికంగా గ్రహించవలసి వస్తుంది. తెలుగులో బహువచన రూప నిర్మాణాన్ని వర్ణించడానికి బహువచన ప్రత్యయం ప్రాథమిక రూపం – ళు (కాళ్లు, వేళ్లు, కోళ్లు వంటి వాటిలో ఉన్నది)గా తీసుకుంటే వర్ణన సహజంగా ఉంటుంది. –లు యే ప్రాథమిక రూపం అనుకొంటే కాలు + లు > కాళ్లులో రెండు లకారాలు కలిస్తే మూర్ధన్యళకారం ఎలా వచ్చిందో చెప్పడం కష్టం. – లు ని సాధించడానికి ళ కారం అచ్చుల మధ్య – లు గా మారుతుందని సూత్రించవచ్చు. ఇటువంటి సూత్రాలు చారిత్రకంగా జరిగి పరిణామాలకి సన్నిహితంగా ఉండడమే కాక భాషా స్వభావాన్ని ప్రతిబింబిస్తాయి. కాని వర్ణనా ప్రక్రియ చరిత్రకి సన్నిహితంగా ఉండాలనే నియమం లేదు. కాబట్టి ప్రక్రియాపద్ధతి చరిత్ర మీద ఆధారపడి ఉన్నదని గాని, ఇది చారిత్రక పరిణామాల్ని సర్వత్రా సూచిస్తుందని కాని అనుకోకూడదు. ప్రాథమికాంశ నిర్ణయం వర్ణనలో సౌకర్యాన్ని బట్టి చేయబడుతుంది.

## 5.3. అర్థకాలలో రకాలు

అర్థకాలని ధాతువులు (Roots), ప్రత్యయాలు (Affixes, Suffixes) అని రెండు ముఖ్యమైన తెగలుగా విభజించవచ్చు. ధాతువు అర్థ సంబంధంగల అన్ని మాటలలోనూ సమానంగా ఉండేది; ప్రాథమికమైనది. దానికి

విశేషాలని సూచించే ప్రత్యయాలు చేరతాయి. నమ్మేను, నమ్ముతున్నాను. నమ్మను, నమ్మితే, నమ్మకం మొదలైనవాటిలో ధాతువు నమ్ము-; దీనికి చేరినవి ప్రత్యయాలు. ఏ భాషలోనైనా ధాతువులు ఎక్కువగానూ ప్రత్యయాలు తక్కువగానూ ఉంటాయి. నామవాచకాలలో ప్రాథమికమైన అర్థకానికి ప్రాతిపదిక అని వ్యవహారం: ఇల్లు చెట్టు, గోడ మొ.

శ్రుతి కూడా భాషలో అర్థకంగా ఉంటుంది. ఒకే ధ్వని సముదాయం గల వాక్యాన్ని వేరు వేరు శ్రుతులతో ఉచ్చరిస్తే అర్థ భేదం వస్తుంది. కాబట్టి శ్రుతిని కూడా ఒక అర్థకంగా గ్రహించాలి. కొన్ని భాషలలో ఉదాత్తత కూడా అర్థకం అవుతుంది. ఇంగ్లీషులో tránsfer, ímport, (నామాలు); transfer, import (క్రియలు) – వీటి మధ్య ఉదాత్తత వల్లనే భేదం ఏర్పడుతుంది.

ప్రత్యయాలలో అయిదు రకాలు గుర్తించవచ్చు. అవి (i) పర ప్రత్యయాలు లేక ప్రత్యయాలు (Suffixes) : ఇవి ధాతువుకి తరవాత చేరతాయి. ఇవే సర్వసామాన్య మైనవి. తెలుగులో ప్రత్యయాలన్నీ ధాతువు తరవాత వచ్చేవే. (ii) పూర్వ ప్రత్యయాలు (Prefixes) : ఇవి ధాతువుకి ముందు చేరతాయి. సంస్కృతంలో ప్ర (ప్రహారం), పరా (పరాజయం), ఆ (ఆహారం), వి (విజయం) మొదలైన ఉపసర్గలు), పరా (పరాజయం). ఆ (ఆహారం), వి (విజయం) మొదలైన ఉపసర్గలు వీటికి ఉదాహరణలు (iii) అంతఃప్రత్యయాలు (Infixes) : 'ఇవి ధాతువు మధ్యలో చేరతాయి. సంస్కృతంలో రుణద్ధి 'అవుతున్నాడు (రుధ్ – ధాతుడు మధ్య ణ చేరింది), భినత్తి 'బద్దలు కొడుతున్నాడు' (భిద్ – ధాతువు మధ్య న చేరింది) వంటివాటిలో వికరణ ప్రత్యయమైన న ( ణ) దీని కుదాహరణ. (iv) సర్వాదేశాలు : (Suppletives) ఒక అర్థకానికి ప్రాథమికమైన సార్థకానికి ధ్వనిలో సారూప్యంలేని సార్థకం కొన్ని సందర్భాలలో రావచ్చు. అటువంటి సార్థకాన్ని సర్వాదేశం అంటారు. సంస్కృతంలో తృతీయా బహువచన ప్రత్యయమైన భిః కి బదులు హ్రస్వ ఆకారం అంతమందుగల ప్రాతిపదిక తరవాత – ఐః వస్తుంది. జనైః 'జనులచేత' ఇది సర్వాదేశం. సర్వాదేశం ధాతువులలోనూ, ప్రాతిపదికలలోనూ కూడా ఉండవచ్చు. సంస్కృతంలో బ్రూ–ధాతువుకి పరస్మైపద వర్తమానంలో ప్రథమ పురుషలోనూ, మధ్యమ పురుషైక ద్వివచనాలలోనూ

ఆహ్ – వైభాషికంగా సర్వా దేశ మవుతుంది ఫ అహ/బ్రవీతి 'చెప్పున్నాడు', అర్థ/ బ్రవీషి 'చెప్పున్నావు' మొ. (బ్రువః పంచానా మాదిత ఆహో బ్రువః–అష్టాధ్యాయి 3–4–84). ఇంగ్లీషులో went-t లో go అనే క్రియకు భూతార్థకం ముందు wen- సర్వాదేశమయింది. (v) లోపసార్థకం (Zero Allomorph): ఒక అర్థాన్ని ఇచ్చే ప్రత్యయం కొన్ని పదాలలో కపడకపోయినా ఆ ప్రత్యయం అర్థం మాత్రం వ్యక్తీకరించ బడుతూ ఉంటుంది ఇంగ్లీషులో బహువచన ప్రత్యయం చాలా నామవాచకాలకి చేరుతుంది. కాని sheep, deer వంటి కొన్ని మాటలలో ఇది లేకపోయినా వాటిని బహువచనాలుగా వాడతారు: The sheep are.......... మొ కాబట్టి వీటిలో బహువచనార్థకం సార్థకం లోపం అని అనుకోవాలి. లోప సార్థకాన్ని మొదట వాడిన వారు పాణిని మహర్షి. తెలుగులో వ్యతిరేకార్థకమైన అకారానికి (చెప్పను, తినను మొ॥) దీర్ఘాచ్చు తరువాత ( రా–Ø–ను తే –Ø–ను) పో –Ø ను, మొ.) లోపసార్థకం ఉంటుంది. అసలు ధ్వని స్వరూపం ఏ సందర్భంలోనూ లేని అర్థకం ఉండదు. కాబట్టి లోపాన్ని సార్థకంగా మాత్రమే గుర్తించవచ్చు. లోపాన్ని ఒక అర్థకంగా గుర్తించడం పరిహరించదగినది.

అంతరంగిక పరిణామం (Internal Changes), ద్విరుక్తి (Reduplication) అనేవి రెండూ కూడా అర్థకాలుగా గుర్తించవచ్చునని కొందరి మతం. ఇంగ్లీషులో sing: ring: rang వంటి క్రియలలో ధాతువు ధ్వనులలో ఉండే మార్పే భూతార్థకమని కొందరి మతం. వీటిలో భూతార్థకమని మరికొందరి మతం. ఈ వివాదం అక్కరలేకుండా వీటిలో భూతార్థకాన్ని (Past) గ్రహించి దీని ముందు sing, sang గా మారుతుందని సంధి సూత్రం రచిస్తే సరిపోతుందని ఇటీవలి కాలంలో వచ్చిన సూచన (past) తరువాత లోపిస్తుంది). ద్విరుక్తి సంస్కృతంలో భూతానద్యతన పరోక్షార్థంలో ధాతువుకి వస్తుంది. (ఈ రకం క్రియలు గ్రీక్, లాటిన్ లో కూడా ఉన్నాయి). దీనిలో ధాతువులో మొదటి భాగం ద్విరుక్తమై దాని మొదట చేరుతుంది; బభూవ 'అయింది', పపాచ 'వండేడు', దదర్శ 'చూశాడు' అనేవి భూ –, పచ్–, దృశ్ – ధాతువులనించి వచ్చినవి. ధాతువు ముందు చేరినది అభ్యాసవశమని సంస్కృత వ్యాకరణ సంజ్ఞ (పూర్వో౽ భ్యాసః, అష్టాధ్యాయి 6.1.4). కొన్ని భాషలలో ధాతువు తరవాత కూడా ద్విరుక్తి వస్తుంది. కాని ఇటువంటి చోట్ల కూడా భూతకాలిక ప్రత్యయాన్ని

వేరుగా తీసుకొని దాని ముందు ద్విరుక్తి వస్తుందని అంటే ద్విరుక్తిని అర్థకంగా తీసుకోవలసిన అవసరం ఉండదు; అప్పుడది సంధి లాంటిది అవుతుంది (పాణిని అవలంబించిన పద్ధతి ఇదే). పైగా జాహోతి, 'హోమం చేస్తున్నాడు', దదాతి 'ఇస్తున్నాడు' వంటి ధాతువులలో వర్తమానంలో కూడా ద్విరుక్తి ఉంది. అందువలన బభూవ వంటి వాటిలో ద్విరుక్తే భూతార్థకమని చెప్పవలసిన అవసరం లేదు. కాబట్టి ఆంతరంగిక పరిణామాన్నీ ద్విరుక్తినీ కూడా అర్థకాలుగా గుర్తించడం ఆవశ్యకం కాదు. వీటిని అర్థకం చేరడం వల్ల వచ్చిన సంధి పరిణామాలుగా గుర్తించడం శ్రేష్ఠం అనిపిస్తుంది. కాని బాహ్య దృష్టికి ఇవి అర్థకాలు కనిపించడం మాత్రం నిజం. (lived (live + భూతార్థకం -ed) వంటి ఇతర క్రియలు భూతార్థానికి ప్రత్యేకమైన అర్థకం ఉందని గుర్తించాలి). ఏ భాషలోనైనా మిశ్రితార్థకాలు క్వాచిత్కంగానే ఉంటాయి. కొందరు పండితులు గుర్తించిన మిశ్రితార్థకం (Portmanteau Morph) కూడా వివాదాస్పదమైనదే. మిశ్రితార్థం కొన్ని అర్థవంతమైన భాగాలుగా విడ తియ్యడం సాధ్యం కాకపోయినా అది రెండు మూడు అర్థకాల సమష్టి రూపం అని మనకి స్ఫురిస్తుంది. ఇంగ్లీషులో was, were దీనికి ఉదాహరణలు. was లో 'be' అనే క్రియా, భూతార్థకం, 'ఏకవచనం' అనే అర్థాలూ, were లో 'be', భూతార్థకం', 'బహువచనం' అనే అర్థాలూ మిశ్రితమై ఉన్నాయి.

## 5.4. విభక్తి సంయోజన – నిష్పాదన

పద నిర్మాణంలో ధాతువుకి చేరే ప్రత్యయాలని వాటి ప్రయోజనాన్ని బట్టి రెండు రకాలుగా విభజించవచ్చు. ఒక రకం విభక్తి సంయోజన (inflection) ఉపయోగించేవి. వీటిని విభక్తి సంయోజకాలు (Inflectional Suffixes) అనవచ్చు. రెండో రకం నిష్పాదన (Derivation) లో ఉపయోగించేవి. వీటిని నిష్పాదకాలు (Derivatives) అనవచ్చు. ఒక పదంలో ఈ రెండు రకాలూ కలిసి ఉండవచ్చు. విభక్తి సంయోజకాలు అని చేరిన పదానికీ వాక్యం ఉన్న ఇతర పదాలకీ మధ్య గల సంబంధాన్ని సూచిస్తాయి. కాబట్టి ఇవి సాధారణంగా పదం చివర ఉంటాయి. బహువచన ప్రత్యయం, విభక్తి ప్రత్యయాలు, కాలిక ప్రత్యయాలు మొదలైనవి విభక్తి సంయోజకాలు. నిష్పాదకాలు ఒక పదానికి చేరి నిఘంటువులో సూచించదగిన ఇంకొక పదాన్ని ఏర్పరచడానికి ఉపయోగిస్తాయి. నిష్పాదకాలు

ధాతువు పక్కనే ఉంటాయి. ఇవి నామవాచకాలకి గాని క్రియలకి గాని చేరి నామవాచకాలని ఏర్పరుస్తాయి. మంచి -తనం, చుట్ట-రికం, తిండి-పోతు, వేట-గాడు, అందగత్తె, టక్కరి ( < టక్కు + అరి) వంటి వాటిలో నిష్పాదకాలు నామవాచకాలకి చేరి కొత్త నామవాచకాలని ఏర్పరిచాయి. ఇటువంటి వాటిని తద్ధితాలు అంటారు. క్రియలకి నిష్పాదక ప్రత్యయాలు చేరి నామవాచకాలు ఏర్పడితే వీటిని కృత్ ప్రత్యయాలు అంటారు. ఏడు-పు ( < ఏడ్చు), ఈ-త (< ఈదు), నమ్మకం(< నమ్ము+అకం), ఆ-ట (< ఆడు), రా-బడి (< వచ్చు), మొల-క (< మొలుచు), మొ. కృత్తుల వంటి నిష్పాదక ప్రత్యయాలు చేరినప్పుడు ఏర్పడిన పదం భాషాభాగం దాని ఆధారపదం భాషాభాగం కన్న వేరుగా ఉంటుంది. కాని విభక్తి సంయోజకాలని చేర్చినప్పుడు మాత్రం పదం భాషాభాగం ఎప్పుడూ మారదు. సాధారణంగా విభక్తి సంయోజకాలు నిష్పాదక ప్రత్యయాలు ఉన్న పదాల్లో వీటి తరవాత వస్తాయి. 'పాట'లో అనే మాటలో 'పాడు'కి నిష్పాదక (కృత్) టకారం చేరి 'పాట' ఏర్పడింది; నిష్పాదకం తరవాత విభక్తి సంయోజకమైన -లో చేరింది. ఈ సాధారణ నియమానికి భిన్నంగా జర్మన్‌లో అల్పార్థకమైన -chen అనే నిష్పాదకం విభక్తి సంయోజకమైన బహువచన ప్రత్యయం తరవాత చేరుతుంది: Kind 'పిల్ల' Kind-chen 'చిన్న పిల్ల', Kind-er 'పిల్లలు'; Kind-er-chen 'చిన్నపిల్లలు'. విభక్తి సంయోజకాలకీ నిష్పాదకాలకీ మరొక ముఖ్య భేదం ఉంది. విభక్తి సంయోజకాలు ఇంచుమించు అన్ని ధాతువులకీ (లేక ప్రాతిపదికలకీ) చేరతాయి. -లో అనే సప్తమీ ప్రత్యయం ఇంచుమించు అన్ని నామాలకీ చేరుతుంది. ఇంట్లో, ఊళ్ళో, గదిలో, నీళ్ళలో, గాలిలో మొ. కాని నిష్పాదక ప్రత్యయాలూ కొన్ని ధాతువులకే చేరతాయి. పు అనే కృత్ ప్రత్యయం ఏడుపు, అరుపు, ఓర్పు, పిలుపు, గెలుపు మొదలైన కొద్ది వాటిలోనే ఉంది కాని నవ్వు, కోయు, అమ్ము మొదలైన ధాతువులకి ఇది చేరదు. వాటిలో చేరే ప్రత్యయాలు కూడా ఒక్కొక్కటి కొన్నింటిలోనే కనపడతాయి.

## 5.5 సంధి

కొన్ని అర్థకాలు కలిసి పదంగా ఏర్పడేటప్పుడూ, కొన్ని పదాలు కలిసి వాక్యంగా ఏర్పడేటప్పుడూ వాటిలో ధ్వనులు పరస్పర ప్రభావం వల్లనో లేక చారిత్రక కారణాలవల్లనో మార్పు చెందుతూ ఉంటాయి. ఇటువంటి ధ్వనుల

శారీరక కారణాలవల్లనో మార్పు చెందుతూ ఉంటాయి. ఇటువంటి ధ్వనుల మార్పును సంధి అంటారు.(ఇంగ్లీషులో దీనిని Morphophonemics అంటారు; సంస్కృతపదమైన "సంధి" (Sandhi)ని కూడా భాషా శాస్త్రంలో పారిభాషిక పదంగా గ్రహించి భాషాశాస్త్రవేత్తలు దీనిని కూడా morphophomenics కి బదులు ఇంగ్లీషులో వాడతారు). అష్టాధ్యాయిలో "పరః సన్నికర్షః సంహితా" (1.4.109) "సంహిత అంటే వర్ణాల ఎక్కువ సన్నికర్ష లేక సామీప్యం (అర్థమాత్రా కాలవ్యవధానం)" అని సంహిత లేక సంధి నిర్వచించబడింది. వర్ణాలు వాటి మధ్య చాలా తక్కువ వ్యవధానంతో ఉచ్చరించబడేటప్పుడు ఉచ్చారణావయవాలు ఒక వర్ణాన్ని ఉచ్చరించేటప్పుడే దాని తరవాత వర్ణాలని ఉచ్చరించడానికి తగిన ప్రయత్నాన్ని చేస్తూ ఉంటాయి. అందువల్ల ఒక వర్ణం ప్రభావం దాని పక్క వర్ణాలపై పడుతూ ఉంటుంది. అందువల్ల ఒక వర్ణం ప్రభావం దాని పక్క వర్ణాలపై పడుతూ ఉంటుంది. అంతేకాక నాదస్పర్శం, శ్వాసస్పర్శం వంటి విభిన్న వర్ణాలని పక్కపక్కగా ఉచ్చరించడం ఏ భాషలోనూ సాధ్యం కాదు కాబట్టి ఇటువంటివి కలిసినప్పుడు రెండూ ఒకే రకంగా మారడం జరుగుతూ ఉంటుంది. కాబట్టి ఉచ్చారణావయవాల కదలికలో పరిమితి వల్ల కూడా వర్ణాల మార్పు జరుగుతూంది. ప్రపంచ భాషలలో సంధి చాలా రకాలుగా ఉన్నా వాటిని ముఖ్యంగా నాలుగు విధాలుగా సంగ్రహించవచ్చు. అవి (i) సమీకరణం (Assimilation, (ii) అక్షర నిర్మితి (Sylable structure), (iii) శ్లథీకరణం, (Weakening and Stengthening), (iv) దృఢీకరణం భేదకత్వ నివృత్తి (Neutralization).

ఒక వర్ణం దాని పక్కనున్న వర్ణాల లక్షణాలని గ్రహించడం సమీకరణం. ఒక అచ్చు పక్క నున్న అచ్చు లేక హల్లు లక్షణం గ్రహించడం కాని ఒక హల్లు దాని పక్కనున్న అచ్చు లేక హల్లు లక్షణం గ్రహించడం కాని ఒక హల్లు దాని పక్కనున్న అచ్చు లేక హల్లు లక్షణం గ్రహించడం గాని జరుగుతుంది. పిల్లి-లు > పిల్లులు, కాకి-లు > కాకులు, నడుచు-ఇ > నడిచి, అడుగు-అ > అడగ వంటి చోట్ల రెండో అచ్చు మూడో అచ్చు వల్ల మార్పు పొందింది. పది-తప్పులు > పత్తప్పులు, పెరుగు-కావాలి > పెరుక్కావాలి, పాత-ది > పాద్ది వంటి చోట్ల హల్లులలో సమీకరణం చూడవచ్చు. రష్యన్ లో కొన్ని హల్లులు అగ్రాచ్చులు

చేరినప్పుడు తాలవ్యీకృతాలు అవుతాయి. దర్ 'కాన్కి', దర్ య్-ఇత్ 'ఇచ్చు (క్రియ)', అచ్చులు అనునాసికంతో మొదలయ్యే ప్రత్యయం చేరినప్పుడు అనునాసికాలుగా మారడం సాధారణంగా జరుగుతుంది.

అక్షర నిర్మితిలో మార్పులకు కలిగించే ప్రక్రియలు; అచ్చుకాని హల్లుకాని లోపించడం లేక కొత్తగా చేరడం:* పని-లు > పన్లు, పది-ఆరు > పదహారు, నడుచు విధ్యేకవచనం నడు; సంస్కృతంలో హసన్ + ఆస్తే > హసన్నాస్తే 'నవ్వుతూ ఉన్నాడు'; ఫ్రెంచిలో పదాంతహల్లు హల్లుతో మొదలయ్యే పదం ముందు లోపిస్తుంది: patitami: 'చిన్న స్నేహితుడు' pati garso 'చిన్న అబ్బాయి'; లాటిన్‌లో పదాంతంలో హల్లు+ర్ రావలసినప్పుడు వాటి మధ్య ఎకారం వచ్చి చేరుతుంది. అగ్రీ 'పొలం యొక్క', అగెర్ 'పొలం'; రెండు వర్ణాలు ఒక వర్ణంగా మారడం: కొరియన్‌లో స్పర్శంతరవత హ కారం వస్తే రెండూ కలిసి మహా ప్రాణంగా మారతాయి; అచ్చు హల్లుగా మారడం: సంస్కృతంలో యణాదేశం : (ఇ, ఉ, ఋ లు క్రమంగా య్, వ్, ర్ లుగా ఇతరాచ్చుల ముందు మారడం) హరి - ఓః > హర్యోః 'ఇద్దరు హరులయొక్క/లో' వధూ-ఓః > వధ్వోః ఇద్దరు వధువుల యొక్క /లో', పితృ-ఆ > పిత్రా 'తండ్రి చేత'; రెండు వర్ణాలు పరస్పర స్థానాలు మారడం (దీన్ని వర్ణ వ్యత్యయం (Metathesis) అంటారు): కూయిలో క కరాంతమైన క్రియకి తుమర్థక ప్రత్యయం -ప చేరినప్పుడు క పలు వర్ణవ్యత్యయం చెందుతాయి: లెక్ - ప > లెప్క 'విరగగొట్టడానికి'; గ బలకి కూడా ఇటువంటి మార్పే జరుగుతుంది: సుగ్-బ > సుబ్‌గ 'కాల్చడానికి'.

ఉదాత్తాచ్చులు ఉదాత్తతను కోల్పోవడం శ్లథీకరణం : ఇంగ్లీషు able: ability లో మొదటి అచ్చులో మార్పు దీనికి ఉదాహరణ. అనుదాత్తాచ్చులు

---

* రెండుచ్చులు పక్క పక్కగా వచ్చినప్పుడు వాటి మధ్య వచ్చిచేరే హల్లుని స్వరశ్రుతి (Glide) అంటారు. సాధారణంగా య, వలు స్వరశ్రుతులుగా ఉంటాయి. ప్రాచీనాంధ్రంలో అమ్మ యిచ్చెనులో యకారం, తమిళంలో ఇతు-ఆ > ఇతువా 'ఇదా?' లో వకారం స్వరశ్రుతులు.

లోపించడం, దీర్ఘాచ్చు హ్రస్వాచ్చుగా మారడం కూడా శ్లథీకరణమే. మూల ద్రావిడంలో ( నామ్ 'మనం' అనే పదం ద్వితీయాది విభక్తుల ముందు నమ్-గా మారుతుంది. తెలుగులో తాను : తన, తాము : తమలలో కూడా శ్లథీకరణం చూడవచ్చు. ఉదాత్తాచ్చులు సంధ్యచ్చులుగా మారడం లేక హ్రస్వాచ్చులు దీర్ఘాచ్చులుగా మారడం దృఢీకరణం : పడు >పాటు, చెడు > చేటు మొదలైన చోట్ల కృదంత రూప నిర్మాణంలో హ్రస్వాచ్చు దీర్ఘాచ్చుగా మారుతుంది.

భేదకత్వం ఉన్న రెండు వర్ణాల మధ్య భేదకత్వం ఒక స్థానంలో మాత్రం నశించడం భేదకత్వ నివృత్తి. సంస్కృతంలో పదాంతంలో స్పర్శం అల్పప్రాణశ్వాసంగా మాత్రమే ఉంటుంది. కాని వేరు వేరు సంస్కృత పదాలు చూస్తే పదాంతం తప్ప మిగిలిన స్థానాలలో శ్వాసాలు, నాదాలు, మహాప్రాణాలు, అల్ప ప్రాణాలు భేదకత్వం కలిగి ఉంటాయి. కాబట్టి పదాంతంలో వీటి మధ్య భేదకత్వం నివృత్తి చెందింది అనాలి.

| ప్రథమా ద్వివచనం | ప్రథమైకవచనం | |
|---|---|---|
| మారుతౌ | మరుత్ | 'గాలి' |
| శరదౌ | శరత్ | 'ఒక ఋతువు' |
| క్షుధౌ | క్షుత్ | 'ఆకలి' |

పై ఉదాహరణల వల్ల పదమధ్యంలో వున్న దధలు పదాంతంలో తకారంగా మారేయని తెలుస్తుంది. జర్మన్ లో కూడా నాదస్పర్శం పదాంతంలో సంస్కృతంలాగే శ్వాసంగా మారుతుంది.

భేదకత్వ నివృత్తికి సమీకరణం తోటీ శ్లథీకరణం తోటీ కొంత వరకూ సంబంధం ఉంది. పదాంతం అనే స్థానం ఉచ్చారణ రీత్యా శ్లథమైనది. కాబట్టి ఆ స్థానంలో శ్వాసనాద భేదం నశించడం అర్థం చేసుకోదగినదే. ఉచ్చారణలో మనం పదాదికి ఇచ్చినంత ప్రాముఖ్యం పదాంతానికి ఇవ్వం. అందువల్లనే ఫ్రెంచివంటి భాషలలో పదాంత హల్లులు లోపిస్తాయి.

ఒక పదాన్ని గాని వాక్యాన్ని గాని వ్యాకరణం ద్వారా సాధించేటప్పుడు రెండు లేక అంతకన్న ఎక్కువ సంధి సూత్రాలని ప్రవర్తింప చేయవలసి ఉంటుంది. ఇటువంటి సంధి సూత్రాలు కొన్ని ఒక నియతక్రమంలో ప్రవర్తిస్తేనే సాధురూపం (అంటే భాషలో ఉన్న రూపం) సిద్ధిస్తుంది. వాటి క్రమం మారితే భాషలోలేని అసాధు రూపాలు సిద్ధిస్తాయి. నియతక్రమంలో ప్రవర్తించవలసిన సంధి సూత్రాలని క్రమబద్ధ సూత్రాలు (Ordered Rules) అంటారు. ఉదాహరణకి 'అడక్కు' అనే రూపాన్ని సాధించడానికి అవసరమైన సూత్రాలనీ వాటి క్రమాన్నీ చూద్దాం. ఇది 'అడుగు–అకు' నించి వచ్చింది. దానిపై మొదట (1) "ఉకారం ఇంకొక అచ్చు ముందు లోపిస్తుంది" అనే సూత్రం ప్రవర్తించి *అడుగ్–అకు అవుతుంది (ఒక రూపాన్ని సాధించే ప్రక్రియలో ఏర్పడే అవాంతర రూపాలకు ఇవి నిజంగా భాషలో ఉన్న రూపాలు కావు; వీటిపై ఇంకా కొన్ని సూత్రాలు ప్రవర్తిస్తేనే అవి నిజరూపాలు అవుతాయి అని సూచించడానికి నక్షత్రం గుర్తు పెడతారు). దీనిపై (2) "తరవాత అక్షరంలో ఆకారం ఉంటే రెండో అక్షరంలో ఉకారం అకారం అవుతుంది" ఉకారం అకారం అవుతుంది" అనే సూత్రం ప్రవర్తించి * అడగ్–అకు అని అవుతంది. దీనిపై (3) "ఏక స్థానీయాలైన స్వర్ణాల మధ్య హ్రస్వాచ్చు లోపిస్తుంది" అనే సూత్రం ప్రవర్తించి * అడగ్కు అని అవుతుంది. దీనిపై (4) "అవ్యవహితమైన ఏకస్థానీయ స్వర్ణాలలో రెండవది శ్వాసమైతే మొదటిది కూడా శ్వాసం. అది నాదమైతే మొదటిది కూడా నాదం అవుతుంది" అనే సూత్రం ప్రవర్తించి భాషలో ఉన్న అడక్కు అనే రూపం ఏర్పడుతుంది. ఇప్పుడు 2, 3 సూత్రాలు తారుమారుగా అంటే 3 ముందు, తరవాత 2 ప్రవర్తిస్తే ఏమవుతుందో చూడండి. * అడుగ్–అకు మీద 3 ప్రవర్తించి ( అడుగ్కు అవుతుంది. ఇందులో ఆకారం లోపించడం వల్ల ఇక దీనిపై రెండో సూత్రం ప్రవర్తించే అవకాశం లేదు. కాబట్టి 4 ప్రవర్తించి అడుక్కు అనే అనిష్ట రూపం సిద్ధిస్తుంది. దీని వల్ల రెండో సూత్రం మొదట ప్రవర్తించాలనీ దాని తరవాతే మూడో సూత్రం ప్రవర్తిచాలనీ స్పష్టం. కాబట్టి ఈ రెండు సూత్రాలూ క్రమబద్ధ సూత్రాలని తెలుస్తుంది. పాణిని అష్టాధ్యాయిలోనే క్రమబద్ధ సూత్రాలు ఉపయోగించబడ్డాయి (చూ. విప్రతిషేధేపరం కార్యమ్ 1.4.2; పూర్వత్రా౽ సిద్ధమ్ 8.2.1.); చూ. అధ్యాయం 19.9.

కొన్ని సంధులు భాషలో లేని సముదాయాన్ని నివారించడానికి ప్రవర్తిస్తాయి. తెలుగులో మూర్ధన్యం ముందు నకారం ఉండదు. కాబట్టి అటువంటి చోట్ల నకారం ణకారంగా మారుతుంది. తిన్-టా-డు > తిణ్-టా-డు (తింటాడు). ఇటు వంటి చోట్ల నకారం ణకారంగా పరివర్తనం చెందడం భాషా స్వభావం మీద ఆధారపడి ఉంది కాబట్టి ఇటువంటి దాన్ని స్వాభావిక పరివర్తనం (Automatic Alternation) అంటారు.

కొన్ని సంధులు పద మధ్యంలోనూ (అంటే ఒక పదంలో రెండు అర్థకాలు కలిసినప్పుడూ), పదాంతంలోనూ (అంటే రెండు పదాలు కలిసినప్పుడు) సమంగానే ప్రవర్తిస్తాయి. కాని మరికొన్ని పద మధ్యంలో మాత్రమే లేక పదాంతంలో మాత్రమే ప్రవర్తిస్తాయి. పద మధ్యంలో మాత్రమే ప్రవర్తించే సంధి పద మధ్య సంధి (Internal sandhi); పదాంతంలో మాత్రమే ప్రవర్తించేది పదాంత సంధి (External sandhi)

అడుగు – ఏ > అడిగే (వాడు) (ఒక) అడుగు + ఏ > అడుగే

అడుగు – అ > అడగ అడుగు + ఆ > అడుగా

అడుగు – ఇ > అడిగి అడుగు + ఇక్కడ > అడుగిక్కడ

పై ఉదాహరణలలో రెండో అక్షరంలో ఉకారం ఇ/అ లుగా ప్రత్యయాల ముందే మారుతుంది; అవ్యయాల ముందూ లేక ఇతర పదాలముందూ మారదు. కాబట్టి ఈ సంధి పదమధ్య సంధి మాత్రమే. పద మధ్య సంధిని సూచించడానికి –గుర్తూ, పదాంత సంధిని సూచించడానికి + గుర్తూ వాడతారు.

ఉ$_2$ → / { ఇ / అ } →/ –

హ – { అగ్రాచ్చ { అ / ఆ } }

(హ = హల్లు; [ ] వీటి మధ్య ఉన్న ధ్వనులు యథాక్రమంగా సంబంధించి ఉంటాయి; { } వీటి మధ్య ఉన్న ధ్వనులకు క్రమం లేదు కాబట్టి అ గాని ఆ గాని ఉండవచ్చు; / ఈ గీత తరవాత వచ్చేది పరిసరం; – పెద్ద అడ్డు గీతముందు ఉంటేదానితరవాత ఉన్న దాని వెనక అనీ అర్థం).సంస్కృతంలో రష ల తరవాత న కారం ణ కారంగా పద మధ్యంలో మాత్రమే మారుతుంది: ఆస్తీర్ణం, మష్ణాతి (చూ. అష్టాధ్యాయి – రషాభ్యాం నోణః సమాన పదే 8.4.1) పదాల మధ్య ఇది ప్రవర్తించదు; అగ్నిర్నయతి. ఒకే సంధి పద మధ్యంలోనూ పదాంతంలోనూ ప్రవర్తించేదయినపడు కూడా అది పద మధ్యంలో ముందు ప్రవర్తించాలనీ, పదాంతంలో అవకాశముంటే తరవాత సంధులు ప్రవర్తించాలి అనే నియమం ప్రతి భాషకూ సాధారణం. గుడ్డులు–లు + లేవు + > గుడ్లులేవు; గుడ్డ–లు > గుడ్డల్లేవు. మొదటిదాంట్లో పదమధ్య సంధి (డ్డు–లు > డ్లు) మొదట ప్రవర్తించింది; ఇక పదాంత సంధికి అవకాశం లేదు. రెండో దాంట్లో పదమధ్య సంధి లేదు కాబట్టి పదాంత సంధి (రెండు సన్నిహిత హల్లుల మధ్య హ్రస్వాచ్చు మొదటి హల్లు సంయుక్తాక్షరంలో లేకపోతే లోపిస్తుంది) ప్రవర్తించింది. ఇదే విధంగా పులి–లు + లేవు > పుల్లు లేవు; ఇక్కడ పదాంత సంధి ముందు ప్రవర్తిస్తే * పులుల్లేవు అనే అనిష్ట రూపం ఏర్పడుతుంది.

సంధిని సహజంగానూ తర్క సహజంగానూ వర్ణించడానికి కొన్ని చోట్ల ప్రాథమిక రూపాలని (Basic or Underlying forms) పునర్నిర్మించుకోవాలి (చూ. 5.2.) ఫ్రెంచిలో పదాంత హల్లు అచ్చు ముందు ఉంటుంది; హల్లు ముందు లోపిస్తుంది.

Petit ami 'చిన్న స్నేహితుడు' pəti garsɔ̃ 'చిన్న అబ్బాయి'

groz ami 'పెద్ద స్నేహితుడు' gro garsɔ̃ 'పెద్ద అబ్బాయి'

ఇక్కడ హలంత రూపమే ప్రాథమికం అనుకోవాలి. అజంత రూపం ప్రాథమికం అనుకొని అచ్చు ముందు హల్లు చేరుతుంది. అంటే ఏ మాటలో ఏ హల్లు చేరుతుందో సూత్రం ద్వారా చెప్పడం కష్టం. పైగా అసలు అజంత పదాలకి అచ్చు ముందు ఏ హల్లూ చేరదు.కాబట్టి హల్లు ముందు కూడా హలంత రూపమే ప్రాథమికంగా ఉంది అనుకొని, అది సిద్ధరూపంలో లోపించింది అనుకోవడం సమంజసం కాబట్టి pəti garsɔ̃ కి ప్రాథమిక రూపం pətit garsɔ̃.

కొన్ని చోట్ల ఒకే వర్ణం సంధిలో కొన్ని పదాలలో ఒక రకంగానూ మరి కొన్ని పదాలలో ఇంకొక రకంగానూ మార్పు పొందుతూ ఉంటుంది. లేక కొన్నిటిలో మార్పు పొందుతూ మరికొన్నిటిలో మార్పు లేకుండా ఉంటుంది. ఇంగ్లీషులో పదాంతంలో *f* బహు వచన ప్రత్యయం ముందు *v* గా కొన్ని మాటలలో మారుతుంది. wife: wives, knife: knives. మరి కొన్నిటిలో ఈ మార్పు ఉండదు. proofs, muffs, graphs. కాబట్టి సంధి ప్రవర్తన దృష్ట్యా ఇంగ్లీషు *f* ని రెండు భిన్న వర్ణాలుగా గ్రహించాలి. వీటి భేదం $f_1$, $f_2$ అని అంకెలు ద్వారా గాని *f* F అని చిన్న, పెద్ద అక్షరాలు వాడడం ద్వారా గాని సూచించవచ్చు. ప్రాథమిక రూపంలో ఈ భేదం చూపెట్టి $f_1$ సంధిలో మారుతుంది, $f_2$ మారదు అని చెప్పవచ్చు. సంధి ప్రవర్తనలో భేదం కలిగి, వర్ణ స్థాయిలో భేదం లేని ఇటువంటి వాటిని సంధి వర్ణాలు (Morphophonemes) అంటారు. తెలుగు నామవాచకాల చివర ఉండే రు లో ర్‌ను కూడా రెండు భిన్న సంధి వర్ణాలుగా గ్రహించాలి. కొన్నిటిలో ఇది బహు వచన ప్రత్యయంలో కలిసి ళ్ల గా మారుతుంది: ఊరులు- > ఊళ్ళు చిగురు -లు > చిగుళ్లు, వేరు-లు > వేళ్లు. మరికొన్నిటిలో ఈ మార్పు ఉండదు. పేరు-లు పేర్లు, దద్దురు-లు > దద్దుర్లుసేరు-లు >సేర్లు. ఊరు మొదలైన వాటిలో ఉన్నది $ర్_1$ అనీ, పేరు మొదలైన వాటిలో ఉన్నది $ర్_2$ అనీ ప్రాథమిక రూపాలలో భేదం చూపిస్తే వర్ణనా సౌలభ్యం ఏర్పడుతుంది. వ్యాకరణానికి అనుబంధంగా ఇచ్చే నిఘంటువులో సంధివర్ణాల భేదం పాటించే ప్రాథమిక రూపాలు ఇవ్వాలి. వాటిపై తగిన సూత్రాలు ప్రవర్తించి సిద్ధ రూపాలు సాధించబడతాయి. ఇటువంటి సంధి వర్ణాలు ప్రాచీన కాలంలో రెండు భిన్న వర్ణాలుగా ఉండేవని చెప్పడానికి చారిత్రకాధారాలు చాలా సందర్భాలలో లభిస్తున్నాయి కాబట్టి ఇటువంటి వ్యాకరణ ప్రక్రియ అసహజం అని అనుకోకూడదు.

ఒక సూత్రం ప్రవర్తించడానికి అవకాశం ఉన్న రెండు అంశాల సముదాయాన్ని దత్తం (Input) అనీ, ఆ సూత్రం ప్రవర్తించాక ఏర్పడే రూపాన్ని ఆ సూత్రం యొక్క నిష్పన్న (రూప) ం (Output) అనీ, సూత్రం ప్రవర్తించడానికి అనువైన సందర్భాన్ని పరిసరం (conditioning) అనీ అంటారు. ఉదా : "బహువచన ప్రత్యయమైన లు ముందు ఇకారం ఉకారంగా మారుతుంది" అనే సూత్రానికి

"కాకి-లు" అనేది దత్తం; "కాకు-లు" అనేది నిష్పన్నం; - లు అనేది పరిసరం.

ఒక భాషలో సంధి సూత్రాలు కొన్నింటికి పరస్పర సంబంధం ఉంటుంది (ఒక అర్థకం స్థానంలో మరొక అర్థకం రావడం కూడా సంధి కిందకే వస్తుంది), భాషలో సహజంగానే ఉన్న ప్రకృతి ప్రత్యయాల కలయిక (లేక మాటల కలయిక) వల్ల ఏర్పడే రూపాలని సాధించడానికే వైయాకరణులు సాధారణంగా సంధి సూత్రాలు రచిస్తారు. కాని కొన్ని సందర్భాలలో ఒక సూత్రం వల్ల ఏర్పడిన నిష్పన్న రూపం మీద కూడా మరొక సూత్రం వల్ల ప్రవర్తించ డానికి అవకాశం ఏర్పడుతుంది. అటువంటప్పుడు మొదటి సూత్రం రెండో సూత్రానికి కొత్త దత్తాలని తయారుచేసి ఇస్తుంది కాబట్టి మొదటి సూత్రం రెండో సూత్రానికి ఉపహారక సూత్రం (Feeding Rule) అంటారు. ఉదాహరణకి తెలుగులో ఈ రెండు సూత్రాలు చూడండి : "పడు, చెడు, పాడు, ఆడు వంటి డు చివర ఉన్న క్రియలకి - తా- (భవిష్యత్కాల ప్రత్యయం) చేరినపుడు డకారం తరవాత ఉకారం అకారంగా మారుతుంది" : పడ-తా-ను, పాడ-తా-ను, మొ. "కొట్టు, తిట్టు వంటి ట్టు-చివర ఉన్న క్రియలకి తకారంతో మొదలయ్యే ప్రత్యయం చేరినప్పుడు ట్టు డుగా మారుతుంది : కొడు-తూ, కొడు-తుంది, తిడు-తూ, తిడు-తుం-ది, మొ. ఈ సూత్రం వల్ల వచ్చిన కొడు-, తిడు- అనే రూపాలపై కూడా పై సూత్రం (డు>డ/-తా( ప్రవర్తించి కొడ-తా-ను, తిడ-తా-ను అనే రూపాలు ఏర్పడతాయి. ఇక్కడ ట్టు >డు సూత్రం డు>డ సూత్రానికి కొత్త దత్తాలని కల్పించింది. కాబట్టి ట్టు>డు సూత్రం డు>డ సూత్రానికి ఉపహారక సూత్రం అని చెప్పవచ్చు. ఇటువంటి రెండు సూత్రాల మధ్య ఉన్న సంబంధాన్ని ఉపహారక సూత్ర క్రమం (Feeding Rule Ordering) అంటారు. ఉపహారక సూత్ర క్రమానికి వ్యతిరేకం అపహారక సూత్రక్రమం, (Bleeding Rule Ordering) , ఒక సూత్రం ప్రవర్తించడానికి అవకాశం ఉన్న అంశాలలో ఒకదాన్ని మరొక సూత్రం మార్చివేసి మొదటి సూత్రానికున్న అవకాశాలలో కొన్నింటిని అపహరిస్తే (అంటే, తీసివేస్తే) దాన్ని అపహారక సూత్రం (Bleeding Rule) అంటారు. ఉదాహరణకి, తెలుగులో "ఇకారం బహువచన ప్రత్యయమైన లు ముందు ఉకారంగా మారుతుంది" అనే సూత్రం ఉందని పైన చూశాం. దీని ప్రకారం పెళ్లి-లు * పెళ్లు-లు అని కావాలి. కాని "పెళ్లి తరవాత బహువచన

ఉ/–లు సూత్రం ప్రవర్తించదగిన ఒక అవకాశం లేకుండా చెయ్యడం వల్ల ఇది అపహారక సూత్రం (Feeding Rule, Bleeding Rule) అనే పదాలని మొదట కిపర్‌స్కీ (Kiparsky, Paul. 1968 "Linguistic Universals and Linguistic Change", **Universals in Linguistic Theory** (ed. Bach and Harms), PP. 171-202) వాడేరు. వీటికి సమానంగా ఇచ్చిన తెలుగు సాంకేతిక పదాలూ, ఇంకా ఇటువంటివి మరికొన్నీ భావానుగుణమైనవే కాని యథాతథానువాదాలు కావు అని గమనించాలి).

ఉపహారక సూత్ర క్రమానికి పైన ఇచ్చిన ఉదాహరణలో ఒక సూత్రంవల్ల నిష్పన్నమైన రూపం మీద మరొక సూత్రం ప్రవర్తిస్తే సాధురూపమే ఏర్పడింది. కాని ఇలా జరిగితే కొన్ని సందర్భాలలో అసాధురూపాలు ఏర్పడతాయి కాబట్టి ఈ ప్రమాదాన్ని నివారించడానికి వైయాకరణుడు ప్రయత్నపూర్వకంగా సూత్రాల క్రమాన్ని ఏర్పరిచి ఒక సూత్రం ప్రవర్తించిన తరవాత వ్యాకరణ గ్రంథంలో దాని తరవాత ఉన్న సూత్రమే ప్రవర్తించాలి గాని దానికి ముందు ఉన్న సూత్రం అవకాశం ఉన్నా సరే ప్రవర్తించ కూడదు అనే పరిభాష ఏర్పరుచుకోవాలి (ఉదా. 10వ సూత్రం ప్రవర్తించిన తరవాత 11, 12.... సూత్రాలు ప్రవర్తించ వచ్చు కాని 9,8..... సూత్రాలు ప్రవర్తించకూడదు). ఇలా ప్రయత్న పూర్వకంగా విధించిన సూత్ర క్రమాన్ని విహిత క్రమం (Extrinsic Ordering) అంటారు. క్రమాన్ని వైయాకరణుడు అవసరమైన సందర్భాలలోనే విధించాలి; మిగిలిన అన్నిచోట్లా సూత్రాల క్రమానికి ప్రాధాన్యం ఉండనక్కర్లేదు అని నవీన సిద్ధాంతం (ఇదే పాణిని అనుసరించినది!). విహిత క్రమానికి వ్యతిరేకం సహజక్రమం (Intrinsic Ordering) సహజ క్రమంలో సూత్రాల ముందు వెనుకల ప్రసక్తి లేదు; ఒక సూత్రం నిష్పన్న రూపం మీద అవకాశం ఉంటే మరొక సూత్రం దానికి ముందు వెనకల ప్రసక్తిలేదు; ఒక సూత్రం నిష్పన్న రూపం మీద అవకాశం ఉంటే మరొక సూత్రం దానికి ముందుదైనా తరవాతదైనా సరే ప్రవర్తించవచ్చు. ఉదాహరణకి, 'కొడ–తా–ను' వంటి రూపాల నిష్పాదనలో ముందు ట్టు > డు సూత్రం ప్రవర్తించడం వల్ల వచ్చిన* కొడు–తా–ను అనే నిష్పన్న రూపం మీద డు > డ సూత్రం (దానికి ముందుదైనా తరవాతదైనా సరే) ప్రవర్తించి 'కొడ–తా–ను' అనే రూపం సిద్ధిస్తుంది.

విహిత క్రమానికి పాణిని అష్టాధ్యాయిలో త్రిపాది (8వ అధ్యాయం 2, 3, 4 పాదాలు) మంచి ఉదాహరణ ( చూ. 19.9). త్రిపాదిలో ఒక సూత్రం వల్ల వచ్చిన నిష్పన్న రూపం మీద ఆ సూత్రానికి ముందు ఉన్న ఏ సూత్రమూ ప్రవర్తించ కూడదు; ఇది పాణిని పూర్వత్రా౽ సిద్ధం (8.2.1) అనే సూత్రంలో ప్రయత్న పూర్వకంగా విధించిన నియమం. ఉదాహరణ : రాజన్-భిఃలో నకారం 'నలోపః ప్రాతిపదికాంతస్య' (8. 2. 7) అనే సూత్రం వల్ల లోపించి 'రాజ-భిః' అని అవుతుంది. ఇది త్రిపాదీ సూత్రం, దీని తరవాత అతోభిస ఐస్ (7.1.9) "హ్రస్వ అకారం తరవాత భిః ఐః అవుతుంది" అనే త్రిపాదికి ముందున్న సూత్రం ప్రవర్తించడానికి అవకాశమున్నా సరే అది ప్రవర్తించదు (భిః ఐఃగా మారదు).

వ్యాకరణంలో కొంత భాగంలో కూడా ప్రయత్న పూర్వకంగా విధించే విహిత క్రమం నివారించ వచ్చునని కొందరి మతం. కొన్ని సూత్రాలలో ఇచ్చిన పరిసరాలని వివరంగా చెప్పి సూత్రాలని విపులీకరించడం వల్ల ఇది సాధ్యమవుతుంది. ఉదాహరణకి, ఈ పద్ధతిలో "హ్రస్వ అకారం తరవాత భిః ఐః అవుతుంది" అనే పాణిని సూత్రాన్ని "మొదట్లో అకారం తరవాత నకారం ఉండి లోపించిన ప్రాతిపదికలు కాక సహజంగా అకారాంతాలైన ప్రాతిపదికల తరవాతనే భిః ఐః గా మారుతుంది" అని మార్చాలి. ఇలా మార్చిన సూత్రంలో రూపనిష్పాదనలో ఒక రూపం పూర్వ స్థాయి స్మరణ ఉంది (రామ-మొదటినించీ అకారంతం, అందువల్ల రామ-భిః > రామైః; రాజ - మొదటినించీ అకారాంతం కాదు; నకారలోపం వల్లనే అది మధ్యలో అకారాంతం అయింది). ఇలా పూర్వస్థాయిని స్మరించే సూత్రాలని స్మారక సూత్రాలు (Global Rules) అంటారు. స్మారక సూత్రాలని ఉపయోగించడం వల్ల సంధి ప్రక్రియలో భాషా శాస్త్రజ్ఞులవాదం, ఈ చర్చపై ఇంకా తుది నిర్ణయం జరగలేదు.

## 5.6 పద భేదాలు

మనం 'పదం' లేక 'మాట' అనే మాటని ముఖ్యంగా రెండు అర్థాలలో వాడతాం. ఉదాహరణకి 'పువ్వులు' అనే పదాన్ని తీసుకొంటే, దీన్ని ప్-ఉ-వ్-వ్-ఉ-ల్-ఉ అనే ధ్వనులు సముదాయం అనే వర్ణ నిర్మాణానికి సంబంధించిన అర్థంలోనూ లేక ఇది 'పువ్వు' అనే పదం బహువచనం అనే వ్యాకరణానికి

సంబంధించిన అర్థంలోనూ వాడుతూ ఉంటాం. వర్ణ నిర్మాణ రీత్యా ఒకే పదమైనది వ్యాకరణరీత్యా రెండు కాని అంతకన్న ఎక్కువ పదాలు గాని కావచ్చు: చెప్పు 'పాదరక్ష, ఒక క్రియ'; తేలు 'ఒక విషకీటకం, క్రియ' లిపికీ ఉచ్చారణకీ అంతగా పొత్తులేని ఇంగ్లీషు వంటి భాషలలో లిపిలో ఒకే పదమైనది ఉచ్చారణలో రెండు భిన్న పదాలు కావచ్చు ( లేక లిపిలో వేరుగా ఉన్నవి ఉచ్చారణలో రెండు భిన్న పదాలు కావచ్చు (read) లే లిపిలో వేరుగా ఉన్నవి ఉచ్చారణలో ఒకటి గానూ వ్యాకరణంలో భిన్నంగానూ ఉండవచ్చు (meat, meet), కాబట్టి ఇటువంటి భాషలలో లిఖిత పదానికీ ఉచ్చారిత పదానికీ కూడా భేదం గుర్తించాలి. ఇక 'అబ్బాయిని' 'అబ్బాయికి', 'అబ్బాయిలో' అనేవి వేరు వేరు పదాలే అయినా ఇవి అబ్బాయి అనే ప్రాథమిక పదానికి విభక్తి సంయోజకాలు చేర్చడం వల్ల ఏర్పడినవి. విభక్తి సంయోజకాలు తీసివేయగా మిగిలిన దానికీ 'పదం' అనీ, అవి ఉన్నదానికీ 'పదం' అనే వాడడంలో కొంత ఇబ్బంది ఉంది. కాబట్టి విభక్తి సంయోజకాలు తీసివేయగా మిగిలిన దానికి నైఘంటుక పదం (Lexeme) అని వాడవచ్చునని కొందరి సూచన. నైఘంటుక పదం అంటే నిఘంటువులో సూచించదగిన ప్రాథమిక పదం; ఇది మన ప్రాచీన వ్యాకరణాలలో ధాతు ప్రాతిపదికలకి తుల్యం. నిష్పాదక ప్రత్యయాలు చేరినప్పుడు ప్రాథమిక పదం కన్న అర్థంలోనూ వ్యాకరణ ప్రవృత్తిలోనూ భిన్నమైన వేరొక ప్రాథమిక పదం ఏర్పడుతుంది. నమ్ము: నమ్మకం వీటిని నిఘంటువులో సూచించాలి. కాబట్టి ఇవి కూడా నైఘంటుక పదాలే. విభక్తి సంయోజకాలు ఉన్నవి మాత్రం నైఘంటుక పదాలు కావు.

ఒక భాషలో ఏవి పదాలు అనే విషయం భాషావ్యవహర్తలకి తెలిసినా పదాన్ని నిర్వచించడం చాలా కష్టం. లిపిలేని భాషలని మాట్లాడే ఆటవికులకు కూడా తమ భాషలలో పదాల్ని వేరు చేసి ఉచ్చరించే సామర్థ్యం ఉంది అని ఎడ్వర్డ్ సపీర్ అనే భాషా శాస్త్రజ్ఞుడు కనుక్కొన్నాడు. పదం అనే భావం చదువు వల్లా లిపి వల్లా ఏర్పడినది కాదని దీనివల్ల తెలుస్తుంది. పదానికి మొట్ట మొదట నిర్వచనం ఇచ్చినవారు పాణిని. ఆయన 'సుప్తిఙన్తమ్ పదమ్' (1.4.14) "నామ విభక్తుల (సుప్)తో గాని క్రియా విభక్తుల (తిఙ్)తో అంతమయ్యేది పదం" అని నిర్వచించారు. అయితే ఇది సాంకేతికమైన నిర్వచనం. సుప్పు ప్రక్రియ ద్వారా

చేరి లోపించిన అంశాలూ కూడా ఆ వ్యాకరణ పరిభాషలో సుబంతాలుగానే గ్రహించబడతాయి. కాబట్టి రాజా, దధి మొదలైనవి సుప్పు కనపడకపోయినా పదాలు అవుతాయి. ఇంతేకాక, ఎప్పుడూ సుప్పుచేరని అవ్యయాలకు కూడా వాటికి పదసంజ్ఞ వర్తించడానికి సుప్పు చేర్చబడి లోపింప చేయబడింది. అవ్యయాదావ్ సుపః (2.4.82) కాబట్టి పాణిని నిర్వచనం సంస్కృతానికి మట్టుకే పరిమితమైనదనీ, అందులో కూడా పరిభాషా సహాయం వల్లనే అది సమగ్రమవుతుందనీ గ్రహించాలి. విభక్తి ప్రత్యయాలూ, క్రియా విభక్తులూ లేని భాషలకు ఈ నిర్వచనం వర్తించదు.

ఆధునిక కాలంలో 'పదం' అనేది 'కనిష్ఠానిబద్ధరూపం' అని నిర్వచించబడింది (A word is a minimum free form: బ్లూమ్ ఫీల్డ్ *Language*, p. 178). దీని ప్రకారం పదం అంటే దానంతట అదే వాక్యంగా ఉచ్చరించదగిన కనిష్ఠ రూపం అని అర్థం. ఈ నిర్వచనం మనం పదాలు అని వ్యవహరించే ఇల్లు, పని, గోడ మొదలైన చాలా రూపాలకి వర్తిస్తుంది. కాని ఆ (ఇల్లు), ఈ (కాకి), నా (పుస్తకం), ఇంగ్లీషులో the, a, is, and మొదలైనవి వాక్యాలుగా చాలా అరుదుగా ఉపయోగించబడతాయి. ఉదాహరణకి 'ఆ ఇల్లు' అని వ్యక్తి అన్నప్పుడు వినే వ్యక్తి సరిగా వినక " 'ఆ' అన్నావా? 'ఈ' అన్నావా" అని అడిగితే "నేను 'ఆ' అన్నాను" అని మొదటి వ్యక్తి అనవచ్చు. కాని ఇటువంటి సందర్భాలు చాలా అరుదుగా వస్తాయి.

సాధ్యమైన విరామాల మధ్య ఉండే ధ్వని సముదాయం పదమని ఇంకొక నిర్వచనం. మనం వాక్యాలని ఉచ్చరించేటప్పుడు సాధారణంగా పదాల మధ్య విరామం లేకుండా ఉచ్చరిస్తాం. కాని నెమ్మదిగా మాట్లాడేటప్పుడు ఒక్కొక్క పదానికి విరామం ఉంచి ఉచ్చరిస్తాం: వాడు, రేపు, పొద్దున్న,వస్తాను, అని, చెప్పేడు. కాని ఇటువంటి సందర్భంలో కూడా 'వా, డు, రూ,పు....'' ఇత్యాదిగా ఉచ్చరించం.కాబట్టి ఇటువంటి ఉచ్చారణలో విరామాల మధ్య ఉండే వాటిని పదాలుగా గ్రహించాలని ఈ నిర్వచనాన్ని అనుసరించే వారి ఉద్దేశం.

ఒక పదంలో అర్థకాలు నిర్దిష్టమైన క్రమంలోనే వస్తాయి కాని వాటి వరస మారదు. కాని ఒక వాక్యంలో పదాలు చాలా వరకూ స్థానాలు మార్చుకోవచ్చు.

కాబట్టి పదంలో అంతర్నిర్మాణం ఏకీకృతంగా ఉంటుంది. అంతేకాక ఒక పదంలో అర్థకాల మధ్య ఇంకొక అర్థకం చేర్చడం సాధ్యం కాదు. కాని రెండు పదాల మధ్య ఇంకొక పదాన్ని చేర్చవచ్చు: నా పుస్తకం, నా కొత్త పుస్తకం, ఈ ఇల్లు, ఈ పెద్ద ఇల్లు. ఇది ఆధారంగా నా, ఈ మొదలైన వాటిని పదాలుగా గ్రహించవచ్చు. పట్టపగలు, చిట్టచివర మొదలైన వాటిలో మధ్య ఇంకొక పదం చేర్చడం సాధ్యం కాదు కాబట్టి వీటిని ఏక పదాలుగానే గ్రహించాలి.

కొన్ని భాషలలో పదాన్ని గుర్తించడానికి వర్ణ నిర్మాణంలో ఉన్న నియమాలు సహకరిస్తాయి. ఉదాత్తత ఉన్న భాషలలో అది పదంలో ఒక అక్షరం మీదే ఉంటుంది. ఇంగ్లీషు, రష్యన్ వంటి భాషలలో అది ఎక్కడ ఉంటుందో సూత్రరూపంలో చెప్పలేం కాని మరికొన్ని భాషలకి అలా చెప్పడం సాధ్యమవుతుంది. గ్రీకులో అది చివరి మూడక్షరాలలో ఒక దానిపై ఉంటుంది. టర్కిష్‌లో అంత్యాక్షరం మీదా, జెక్‌లో ఆద్యక్షరం మీదా, పోలిష్‌లో (సాధారణంగా) అంత్యాక్షరం పక్క అక్షరం (ఉపధ) మీదా ఉదాత్తత ఉంటుంది. అజాకర్షణ (Vowel Harmony) ఉన్న భాషలలో అది ఏక పదంలోనే జరుగుతుంది. చాలా భాషలలో పదాదినీ పదాంతలోనూ వచ్చే ధ్వనుల విషయంలో పద మధ్యంలో వచ్చే వాటిలో కన్న ఎక్కువ నియమాలు ఉంటాయి.

## 5.7 పద నిర్మాణ వాక్య నిర్మాణ విభాగం

ఒక పదంలో అర్థకాలు ఎలా కలుస్తాయో వర్ణించేది పద నిర్మాణమనీ, ఒక వాక్యంలో పదాలు ఎలా కలుస్తాయో వర్ణించేది వాక్య నిర్మాణమనీ పైన చూశాం. కాని ఈ రెండిటి మధ్య విభాగం భాషలో అన్ని చోట్లా స్పష్టంగా ఉండదు అని తెలుగులో ఇరవై ఎనిమిదో, ఇంగ్లీషులో twenty eighth అనే రూపాలు చూస్తే తెలుస్తుంది. వీటిలో తె. –ఓ. ఇం. -th అనే పూరణ పదాలు కల ప్రత్యయాలు ఇరవై, ఎనిమిది twenty eight అనేవి రెండు పదాలు కాబట్టి ఇవి కలిసిన నిర్మాణం వాక్య నిర్మాణం అవుతుంది. దీనికి 'ఇరవై ఎనిమిది ఆవులు' అని వేరొక పదం కలిస్తే సమస్య లేదు కాని వీటికి ప్రత్యేక పదం కాని పూరణ ప్రత్యయం చేరడం వల్ల ఇది మళ్లీ పద నిర్మాణంలోకి వచ్చింది. ఇంగ్లీషు redhaired వంటి పదాలలో కూడా -ed ప్రత్యయం red-hair అనే రెండు పదాల సముదాయానికి

చేరింది. ఈ సమస్యని తొలగించడానికి కొందరు ప్రత్యయాలు అంగంగా ఉన్న నిర్మాణాలు అన్నీ పద నిర్మాణాలే అని నిర్వచిస్తే సరిపోతుందని అన్నారు.

కాని వ్యాకరణ రచనకి ఈ విభాగం పెట్టుకొంటే సౌలభ్యం ఏర్పడక పోవడమే కాక క్లిష్టత ఏర్పడుతుంది. ఒకే వ్యాకరణ ప్రక్రియని కొంత పద నిర్మాణంలోనూ కొంత వాక్యనిర్మాణంలోనూ వర్ణించవలసి వస్తుంది. తెలుగులో ప్రేరణ క్రియలను ఉదాహరణగా తీసుకొంటే ఈ విషయం స్పష్టమవుతుంది. చాలా క్రియలకి ప్రేరణరూపాలు ఏర్పరచడానికి – ఇంచు చేరుతుంది: చేయించు, కొట్టించు మొ. కాని పడు, ఊడు మొదలైన వాటికి ప్రేరణ రూపాలు ఏర్పడడానికి వాటి తుమున్నంత రూపానికి కొట్టు అనే వేరొక క్రియ చేరుతుంది. పడగొట్టు, ఊడగొట్టు, విడదీయు మొ. కాబట్టి పద నిర్మాణం వాక్య నిర్మాణ విభాగం పాటించకుండా ప్రేరణ రూపాలు అన్నిటినీ ఒకే చోట వ్యాకరణంతో సాధించడం సమంజసం. సంస్కృతంలో బిభరాం చకార/బభార, విదాం చకార/వివేద, విదాం కుర్వంతు/విదంతు మొదలైన క్రియలలో ఒకే అర్థంలో రెండు పదాలు విదాం కుర్వంతు/ విదంతు మొదలైన క్రియలలో ఒకే అర్థంలో రెండు పదాలు ఉన్న రూపమూ ఒక పదమూ స్వేచ్ఛా ప్రవృత్తిలో ఉన్నాయి. వీటిని వేరు వేరు చోట్ల వర్ణించడం సమంజసం కాదు. పైగా పద నిర్మాణ వర్ణనకి వాక్యనిర్మాణ జ్ఞానం ఆవశ్యకం. ఉదాహరణకి విభక్తి ప్రత్యయాలు అవి చేరిన పదానికి వాక్యంలో ఉన్న క్రియకి లేక మిగిలిన పదాలకి ఉన్న సంబంధాలని సూచిస్తాయి. కాబట్టి వ్యాకరణంలో పద నిర్మాణ వాక్య నిర్మాణాలని వేరు వేరు అంతరువులుగా పరిగణించడం అనవసరమని పై చర్చ వల్ల తేలుతుంది.

పద నిర్మాణం క్లిష్టంగా ఉన్న సంస్కృతం, లాటిన్ వంటి భాషలలో వాక్యంలో పదాల వరస (word order) మొదలైన వాక్య నిర్మాణ నియమాలు అంత క్లిష్టంగా ఉండవు (ఇక్కడ క్లిష్టం అంటే ఎక్కువ సూత్రాలు ఉండడం లేక ఎక్కువ సూత్రాలు రాయవలసి రావడం అని అర్థం కాని కష్టం అని కాదు). పదనిర్మాణం ఎక్కువ లేని ఇంగ్లీషు, ఫ్రెంచి వంటి భాషలలో వాక్య నిర్మాణంలో పదాల వరస నియతంగా ఉంటుంది.

పందొమ్మిదో శతాబ్ది భాషా శాస్త్రజ్ఞులు ప్రపంచ భాషలన్నిటినీ వాటిలో ఉన్న పద నిర్మాణం దృష్ట్యా 1. విశ్లేషణాత్మక భాషలు (Analytic Languages),

2. సంయోజనాత్మక భాషలు (Agglutinative Languages), 3.సంశ్లేషణాత్మక భాషలు (Synthetic Languages), 4. అతి సంశ్లేషణాత్మక భాషలు (Polysynthetic Languages) అని నాలుగు రకాలుగా విభజించారు. చైనీస్,వియత్నామీస్ వంటి భాషలలో ప్రత్యయాలు చాలా తక్కువగా ఉండడం వల్ల వీటిలో పద నిర్మాణం చాలా తక్కువ కాబట్టి ఇవి విశ్లేషణాత్మక భాషలు, తెలుగు, తమిళం వంటి ద్రావిడ భాషలలో ప్రత్యయాలు ఉన్నాయి; కాని పదంలో వీటి చేరికలో అతుకులు తెలుస్తూ ఉండి సులభంగా విడదీయడానికి వీలుగా ఉంటాయి. కాబట్టి ఇవి సంయోజనాత్మకాలు. సంస్కృతం, లాటిన్, గ్రీక్ వంటివి సంశ్లేషణాత్మకాలు, వీటిలో ప్రత్యయాలు ఎక్కువగా ఉండడమే కాక ఒక పదంలో ఒక ప్రత్యయం రెండు భిన్నార్థాల సముదాయాన్ని సూచిస్తుంది; రామేణ లో-ఏణ తృతీయావిభక్తినీ, ఏకవచనాన్నీ కలిపి సూచిస్తుంది. ఇతర భాషలలో రెండు లేక అంతకన్న ఎక్కువ పదాలతోనే చెప్పవలసిన భావాన్ని వీటిలో ఒక పదంతోనే చెప్పవలసిన భావాన్ని వీటిలో ఒక పదంతోనే చెప్పవచ్చు. సం. పుత్రీయతి 'పుత్రుడు కావాలని కోరుకుంటున్నాడు 'లేక' పుత్రుడులా (వేరొకణ్ణి) చూసుకొంటున్నాడు'. కొన్ని అమెరికన్ ఇండియన్ భాషలు సంశ్లేషణాత్మక భాషలకన్నా క్లిష్టమైన పదనిర్మాణం కలవి కాబట్టి ఇవి అతిసంశ్లేషణాత్మక భాషలు. అయితే ఈ విభజన బీరువాలో విడివిడిగా ఉండే అరల వంటిది కాదు.ఒకే భాష కొన్ని సందర్భాలలో విశ్లేషణాత్మకంగానూ మరికొన్ని సందర్భాలలో సంయోజనాత్మకం గానూ ఉండవచ్చు. విశ్లేషణాత్మకంగా పరిగణించబడే చైనీస్‌లో కూడా కొన్ని ప్రత్యయాలు ఉన్నాయి. కాబట్టి ఈ విభజన భాషా నిర్మాణంలో తరతమ భావాన్ని సూచిస్తుంది కాని సువిభక్తమైనది కాదు అని అనుకోవాలి. మానవుల భాషలు మొదట్లో సంశ్లేషణాత్మకంగా ఉండి తరవాత కాలంలో అవి విశ్లేషనాత్మకాలుగా మారేయి అని కొందరు చేసిన సిద్ధాంతం సర్వేసర్వత్రా వర్తించదు. అదే విధంగా సంశ్లేషణాత్మక భాషలు అవి మాట్లాడే వారి సంస్కృతి ఔన్నత్యాన్ని సూచిస్తాయి అనే అభిప్రాయం కూడా సరియైనది కాదు.

# 6. వాక్య నిర్మాణం

## 6.1. వాక్య నిర్మాణ సంబంధాలు

ఒక వాక్యంలో పదాలు ఏ విధంగా పరస్పరం కలిసి ఆ వాక్యం ఏర్పడింది అని వర్ణించేది వాక్య నిర్మాణం అని ఇంతకుముందు చూశాం (చూ:89పేజీ వాక్యాలలో కూడా చాలా రకాలు ఉన్నాయి: నిర్దేశక వాక్యాలు (Declarative Sentences); ఒక విషయాన్ని తెలియచేస్తాయి: రాముడు నిన్న వచ్చాడు; ప్రశ్న వాక్యాలు (Interrogative Sentences) ఒక విషయాన్ని ప్రశ్నిస్తాయి: మీరు ఎప్పుడు వచ్చారు? విధి వాక్యాలు (Imperative Sentences) శ్రోతకి ఆదేశాన్ని ఇస్తాయి: నువ్వు రేపు రా మొదలైనవి. వీటిలో కూడా అంతర్వి భాగాలు ఉంటాయి. వాక్యాన్ని నిర్వచించడంలో పదాన్ని నిర్వచించడంలో లాగా కొంత కష్టం ఉంది. ప్రాచీన పాశ్చాత్య వ్యాకరణాలు సంపూర్ణార్థాన్ని ఇచ్చేవి వాక్యాలు అని నిర్వచించాయి. ఇటువంటి అర్థం మీద ఆధారపడిన నిర్వచనాలు సంతృప్తికరమైనవి కావు. ఒక వాక్యంలో పదాలు కూడా సంపూర్ణార్థం కలిగి ఉంటాయి కదా. అందువల్ల ఒక వాక్యంలో పదాలన్నీ ప్రత్యేక వాక్యాలు అని అనలేం. అంతేకాక ఒక పదం ఉన్న వాక్యం కూడా ఉంటుంది. 'ఆయన ఎప్పుడు వస్తారు?' అనే వాక్యానికి సమాధానంగా 'రేపు' అని అనవచ్చు. ఇక్కడ 'రేపు' అనేది ఒక వాక్యం. ఇది సందర్భం వల్ల 'ఆయన రేపు వస్తారు' అనే సంపూర్ణార్థాన్ని ఇస్తుంది కాని దానంతట అది అన్ని సందర్భాలలోనూ ఈ అర్థాన్ని ఇవ్వదు. కాబట్టి ఈ నిర్వచనం అసమగ్రం అని చెప్పాలి. ఆధునిక భాష శాస్త్రజ్ఞులు ఉచ్చారణలో రెండు విరామాల మధ్య ఉండే ధ్వని సముదాయం వాక్యం అని నిర్వచించారు.

వాక్య నిర్మాణంపై విశేష పరిశోధన పాశ్చాత్య దేశాలలో ఇటీవల కాలం వరకూ ఎక్కువ జరగలేదు. ఇటీవల చోమ్‌స్కీ మొదలైనవారు స్థాపించిన పరివర్తన వ్యాకరణం భాషలో వాక్య నిర్మాణం పరిశోధనకి ప్రాముఖ్యం ఇస్తుంది.(దీనిపై వివరాలకి 7వ అధ్యాయం చూడండి). కాని పాణిని అష్టాధ్యాయిలో పద నిర్మాణవర్ణన ప్రధాన స్థానాన్ని ఆక్రమించినా ఈ వర్ణన పదాలు వాక్యంలో ఇతర పదాలతో కలిగి ఉన్న సంబంధాలు ఆధారంగా చేయబడింది. అష్టాధ్యాయిలో

వాక్య నిర్మాణవర్ణన లేదని అనడం పొరపాటు అని ఇటీవలి కాలంలో పండితులు నిరూపించారు. కారకాలు, లకారార్థ నిరూపణ మొదలైన చోట్ల వాక్య నిర్మాణ వర్ణన స్పష్టంగా కనపడుతుంది (వివరాలకి 19వ అధ్యాయం చూడండి).

కొన్ని పదాలు కలిసి ఒక వాక్యంగా ఏర్పడడంలో ప్రతి భాషలోనూ కొన్ని నియమాలు ఉంటాయి. 'పెద్ద పుస్తకం' అనడానికి బదులు అందులో మాటలని తారుమారు చేసి 'పుస్తకం పెద్ద' అనలేం. 'మీ నేను చూశాను ఇల్లు' అనేది సాధు వాక్యం కాదు. ఇందులో మాటలవరస 'మీ ఇల్లు నేను చూశాను'/ నేను మీ ఇల్లు చూశాను/ నేను చూశాను మీ ఇల్లు/ చూశాను నేను మీ ఇల్లు అనే విధంగా మారిస్తేనే అది వాక్యంగా అంగీకరాయోగ్యం అవుతుంది. పై ఉదాహరణలో చూసినట్లు కొన్ని పదాలు ఒక నిర్దిష్ట క్రమంలో ఉంటేనే అది సాధు వాక్యం అవుతుంది; కొన్ని పదాలు మాత్రం స్థానం మారినా ఫరవాలేదు. ఎటువంటి పదాలు నిర్దిష్ట క్రమంలోనే ఉండాలి, ఎటువంటి పదాలు స్థానాలు మారవచ్చు అనే విషయం వ్యాకరణం స్పష్టం చెయ్యాలి. ఇటీవల జరిగిన పరిశోధనల వలన వాక్య నిర్మాణ వర్ణనే వ్యాకరణానికి ముఖ్యాంగం అనీ, దాని పైననే పద నిర్మాణ వర్ణన కూడా ఆధారపడి ఉంటుందనీ స్పష్టమైంది. ప్రత్యయాలు ఎక్కువగా ఉన్న భాషలలో వాక్యంలో పదాల వరస అంత నిర్దిష్టంగా ఉండదు. ప్రత్యయాలు తక్కువగా ఉన్న ఇంగ్లీషు, చైనీస్ వంటి భాషలలో పదాల వరసకి ప్రాధాన్యం ఎక్కువగా ఉంటుంది. వీటిలో పులిని చంపేడు' అన్నా, 'పులిని వేటగాడు చంపేడు' అన్నా అర్థం ఒకటే. కాని ఇంగ్లీషులో 'The hunter killed the tiger' అన్న వాక్యంలో పదాలు మార్చి 'The tiger killed the hunter' అంటే పూర్తిగా వ్యతిరేకమైన అర్థం వస్తుంది. ద్వితీయా విభక్తి ప్రత్యయం తెలుగులో ఉండడం, ఇంగ్లీషులో లేకపోవడమే ఈ భేదానికి కారణం.

వాక్యంలో పదాలకి పరస్పరం ఉన్న సంబంధం ముఖ్యంగా మూడు రకాలు. అవి: (i) స్థానసంబంధం (Positional relation), (ii) యోగ్యతా సంబంధం (Relation of Co-occurrence), (iii) ఆదేశ సంబంధం (Relation of Substitutability). . ఈ మూడింటినీ కలిపి వాక్య నిర్మాణం సంబంధాలు (Syntactic Relations) అని వ్యవహరించవచ్చు. కొన్ని పదాలు కలిసినప్పుడు

అవి నిర్దిష్ట క్రమంలోనే స్థానాలు మార్చడానికి వీలు లేకుండా ఉండడం స్థాన సంబంధం. * 'రెండు పెద్ద ఇళ్లు' అనేది 'పెద్ద రెండు ఇళ్లు' అని పదాల స్థానాలు మార్చి ప్రయోగిస్తే అది అసాధువు (Ungrammatical) అవుతుంది (అసాధురూపాలకి నక్షత్రం గుర్తు వాడడం సంప్రదాయం) సంఖ్యా వాచకమూ, విశేషణమూ ఉన్నప్పుడు సంఖ్యావాచకమే ముందు రావాలి అనేది ఇక్కడ నియమం. అదేవిధంగా 'నా కొత్త చొక్కా' అనడానికి బదులుగా *కొత్త నా చొక్కా అనడానికి వీలులేదు.

స్థాన సంబంధాన్ని గుర్తించడానికి ఒక వాక్యాన్ని పరిశీలిస్తేనే చాలు, కాని మిగిలిన రెండు రకాల సంబంధాలని గుర్తించడానికి కొంచెం సాదృశ్యంగల అనేక వాక్యాలని పరిశీలించడం అవసరం, వాక్యంలో ఉన్న ఒకరకం పదం కొన్ని రకాల పదాలతోనే కలుస్తుంది. మరికొన్ని రకాల పదాలు దానికి చేరిస్తే ఆ వాక్యం వింత అర్థాన్ని ఇవ్వడమో లేక అది అంగీకరాయోగ్యం కాక పోవడమో జరుగుతుంది. ఇది యోగ్యతాసంబంధం, ఆ,ఈ,వి మొదలైనవి వాటి తరవాత (విశేషణాలతో కూడిన) నామవాచకాన్ని అపేక్షిస్తాయి: ఆ (పెద్ద) చెట్టు, కాని వీటి తరవాత క్రియగాని క్రియా విశేషణంగాని రాదు. * ఆ వచ్చింది,* ఆ బాగా. 'కొన్ని' అమనుష్యవాచకాన్నే అపేక్షిస్తుంది : కొన్ని కూరలు, 'కొందరు' మనుష్యవాచకాన్నే అపేక్షిస్తుంది: కొందరు పిల్లలు, *కొన్ని అమ్మాయిలు, *కొందరు పులులు అసాధువులు, 'కూరలు కొన్ని' ఇత్యాదిగా వీటి స్థానాలు తారుమారు కావచ్చు. కొన్ని క్రియలు మనుష్యవాచకాలని లేక ప్రాణివాచకాలనే కర్తలుగా అపేక్షిస్తాయి. కమల ఆలోచించింది కాని *రాయి ఆలోచించింది, 'రాయి మాట్లాడింది, 'పులి మాట్లాడింది (ఇలువంటివి కథలలో మాత్రమే సాధ్యం; సామాన్య వ్యవహారంలో కాదు). అన్వయం (Agreement/Concord) అనేది యోగ్యత కిందకే వస్తుంది. తెలుగులో సమాపక క్రియ కర్తతో పురుషలింగ వచనాలలో అన్వయం కలిగిఉండాలి.

నేను రాస్తున్నాను.

విజయ బడికి వెళ్తోంది.

ఆటగాళ్లు ఆడుతున్నారు.

కొన్ని అప్రాణివాచకాలని ఒకే సముదాయంగా గ్రహించినపుడు బహువచనానికి బదులు ఏకవచనం రావచ్చు.

ఆయనకి వంద ఎకరాలు ఉంది / ఉన్నాయి.

నా దగ్గర వెయ్యి రూపాయిలు ఉంది / ఉన్నాయి.

ఆయనకి పది ఇళ్ళు ఉన్నాయి (*ఉంది).

తెలుగులో పాలు, బియ్యం (కొన్ని మాండలికాలలో మజ్జిగ) బహువచనాలు గానే పరిగణించబడతాయి. పాలు ఉన్నాయి, బియ్యం లేవు. హిందీలో విశేషణాలు విశేష్యంతో లింగవచనాలలో అన్వయం కలిగి ఉంటాయి. (స్త్రీలింగంలో విశేషణంలో వచనభేదం లేదు).

అచ్ఛా లడ్కా 'మంచి పిల్లవాడు'

అచ్ఛే లడ్కే 'మంచి అబ్బాయిలు'

అచ్ఛీ లడ్కీ 'మంచి అమ్మాయి'

అచ్ఛీ లడ్కియాఁ 'మంచి అమ్మాయిలు'

ఒక వాక్యంలో ఒక పదంలో స్థానంలో ఇంకొక పదాన్నిగాని పదాలని గాని పెట్టడం సాధ్యమయితే అటువంటి పదాలని గాని పెట్టడం సాధ్యమయితే అటువంటి పదాల పరస్పర సంబంధం అంటారు. ఇలా చేసినపుడు వాక్యం అర్థం మారుతుంది. అయినా ఒక పదం స్థానంలో ఇంకొక పదాన్ని పెట్టినపుడు ఏర్పడే కొత్తవాక్యం భాషలో అంగీకారయోగ్యం (సాధువు) అవుతుందా ? కాదా ? అన్నదే ఇక్కడ మనం చూడవలసింది.

ఆ – పెద్దది

పై వాక్యంలో గీత స్థానంలో ఇల్లు, చెట్టు, బల్ల, కిటికీ, రాయి, పని మొదలైనవి రావచ్చు. కాని చూశాడు, కొత్త, తిని, తొందరగా మొదలైన పదాలు రావు. కాబట్టి ఇల్లు, చెట్టు మొదలైన పదాలు ఆదేశ సంబంధం కలవి అని దీని వల్ల తెలుస్తుంది.

ఒక భాషలో పదాలని బాషాభాగాలు (Parts of Speech) గా విభజించడానికి ఇటువంటి పరీక్షపనికి వస్తుంది. ఇటువంటి పరీక్షవల్లనే పై పదాలని నామవాచకాలు (Nouns) అని వైయాకరణులు వ్యవహరించారు. ఒక్కొక్క భాషాభాగంలో కూడా సూక్ష్మ పరిశీలనవల్ల అంతర్విభజన చెయ్యవలసి ఉంటుంది. ఉదాహరణకి పై వాక్యం గీత స్థానంలో ఇళ్లు, చెట్లు, మొదలైన బహువచన రూపాలు రావడానికి వీలులేదు. కాని ఇవి కూడా నామవాచకాలే అని విస్తృత పరిశీలనవల్ల తేలుతుంది. ఏకవచనాలలో కూడా అన్ని నామాలూ పై వాక్యంలో గీత స్థానంలో రావు. అందం, మంచి తనం మొదలైన నామాలు పై వాక్యంలో పెట్టడానికి కుదరదు.

పదాలకే కాక పూర్తివాక్యాలకి కూడా పరస్పర సంబంధం ఉంటుంది.

ఆవిడ నవల రాసింది.

ఆవిడ రాసినది నవల.

పై వాక్యాలు వేరైనా వాటి అర్థం ఇంచుమించు ఒకటే.

ఆవిడ కథ రాస్తోంది.

ఆవిడ కథ రాయడం లేదు.

పై వాక్యాలలో రెండోది మొదటిదానికి వ్యతిరేకం. ఇటువంటి వాక్యాల పరస్పర సంబంధాన్ని గూర్చిన విశేష చర్చ ఏడో అధ్యాయంలో ఉంటుంది.

## 6.2 భాషాభాగాలు

ఒక భాషలో పదాల్ని వాక్యనిర్మాణంలో అవి వహించే పాత్రని బట్టి కొన్ని భాషా భాగాలు లేక పదజాతులుగా విభజించవచ్చు. ఇంగ్లీషు మొదలైన యూరోపియన్ భాషలకి వైయాకరణులు తొమ్మిది భాషాభాగాలని గుర్తించారు. అవి నామవాచకం (Noun), క్రియ (Verb), సర్వనామం (Pronoun), విశేషణం (Adjective), క్రియా విశేషణం (Adverb), పూర్వసర్గ (Preposition), సముచ్చయం (Conjunction), ఉపపదం (Article), ఆశ్చర్యార్థకం (Interjection). సంస్కృత వైయాకరణులు నామం, ఆఖ్యాతం (క్రియ), ఉపసర్గ, నిపాతం అని

నాలుగు భాషాభాగాలను గుర్తించారు. కాని పాణిని అష్టాధ్యాయిలో మాత్రం పదాలన్నీ సుబంతాలు (నామాలు), తిజంతాలు (క్రియలు) అని రెండు ముఖ్య భాగాలుగా విభజించబడ్డాయి. సుబంతాలలో సర్వనామాలు, విశేషణాలు, నిపాతాలు మొదలైనవిధంగా వ్యాకరణానికి అవసరమైనట్లు అంతర్విభజన చేయబడింది.

ప్రాచీన పాశ్చాత్య వైయాకరణులు భాషాభాగాలని అవిసూచించే అర్థాలనిబట్టీ అవి తీసుకొనే ప్రత్యయాలనిబట్టీ వాక్యంలో వాటి స్థానాన్ని బట్టీ నిర్వచించారు. వీరిలో ప్రాచీనుడైన డయోనాసియస్ థ్రేక్స్ (dionysius Thrax) ఇచ్చిన నిర్వచనాలు చూస్తే ఈ విషయం తెలుస్తుంది. (ఈయన క్రీ.పూ.2 వ శతాబ్దివాడు ఈయన తరవాతివారు కూడా వీటిని నిర్వచించడంలో ఈయనని అనుసరించారు) . " నామవాచకం విభక్తి ప్రత్యయాలు కలిగి వ్యక్తినిగాని వస్తువునుగాని సూచించే భాషాభాగం" ( "The noun is a part of speech having case-inflexions, signifying a person or a thing") "విభక్తిప్రత్యయాలు లేనిదీ. కాలపురుష వచన ప్రత్యయాలు గలదీ, వ్యాపారాన్ని గాని వ్యాపారకర్మనిగాని సూచించేదీ అయిన భాషాభాగం క్రియ" (The verb is a part of speech without case-inflexion, admitting inflexions of tense, person and number, signifying an activity or a being acted upon " ; "పదనిర్మాణంలోనూ వాక్యనిర్మాణంలోనూ మిగిలిన అన్ని భాషాభాగాల ముందూ ఉండే భాషాభాగం పూర్వసర్గ" ("The Preposition is a word placed before all other parts of speech in word - formation and Syntactic constructions" ) ఇటువంటి నిర్వచనాలు సమగ్రం కావని ఆధునిక భాషాశాస్త్రజ్ఞులు గుర్తించారు.ప్రత్యయాలులేని చైనీస్‌వంటి భాషలలో ప్రత్యయాలనిబట్టి చేసిన నిర్వచనాలు వర్తించవు కాబట్టి ఇటువంటి నిర్వచనం సర్వభాషలకీ వర్తించదు. ఇక అర్థం ఆధారంగా చేసిన నిర్వచనాలు అవి ఉద్దేశించబడిన భాషలకే వర్తించవు. ఉదాహరణకి నామవాచకాలు వ్యక్తిని గాని వస్తువునిగాని సూచించేవి అంటే నిజం, నిజాయితీ, అందం అభిప్రాయం మొదలైనవి నామవాచకాలుగా పరిగణించడానికి తగవు. కాని ఇవి నామవాచకాలు అని అందరికీ తెలిసినదే. అదే విధంగా వ్యాపారాన్ని బోధించేది క్రియ అంటే తెలియు, చచ్చు మొదలైనవి వ్యాపారాన్ని సూచించవు కాబట్టి క్రియలు కాలేవు. గుణాన్ని (Quality) సూచించేవి విశేషణాలు అంటే అందం, మంచితనం

మొదలైనవాటిని విశేషణాలుగా పరిగణించవలసి వస్తుంది. కాని చాలా నామవాచకాలు వ్యక్తులనీ, వస్తువులనీ సూచిస్తాయి అనేదీ, చాలా క్రియలు వ్యాపారాన్ని సూచిస్తాయి అనేదీ మాత్రం నిజం. కాబట్టి పైన ఇచ్చినవి సమగ్రమైన నిర్వచనాలు కాకపోయినా అవి ఆయా భాషాభాగాల కిందకి వచ్చే పదాల ఆర్థిక స్వభావాన్ని కొంతవరకు సూచిస్తాయి అని అనుకోవాలి.

ఆధునిక భాషాశాస్త్రజ్ఞులు భాషాభాషాభాగాలని పదాలని భాషాభాగాలుగా విభజించడానికి ముఖ్యాధారంగా తీసుకోవలసినది ఆ పదాలు వాక్యనిర్మాణంలో నిర్వహించే పాత్రేకాని వాటి అర్థం కని వాటికి చేరే ప్రత్యయాలుకాని కాదు అని చెప్తారు. అయితే వాక్యనిర్మాణానుసారంగా చేసిన భాషాభాగవిభజనకి అర్థం కాని పదనిర్మాణం కాని ఉపోద్బలకంగా ఉండవచ్చు. కాని సర్వేసర్వత్రా అలా ఉండదు ; ఉండవలసిన అవసరం లేదు. ఇటువంటి విభజన ఒక్కొక్క భాషకి ఆ భాషా స్వభావాన్ని అనుసరించి ఉంటుంది. అందువల్ల ఒక భాషలో నామవాచకమైన పదానికి సమమైనపదం ఇంకొక బాషలో వేరొక బాషాభాగం కావచ్చు. కాబట్టి ఒక భాషలో ఒక పదం నామవాచకం కాబట్టి దానికి సమమైన పదం ఇతర భాషలలో కూడా నామవాచకంగా ఉండాలి అని నిర్దేశించకూడదు.

సాధారణమైన సామాన్య వాక్యాలలో ఒక నిర్దిష్ట స్థానంలో రాగలిగిన పదాలు అన్నీ ఒక భాషాభాగానికి చెందినవి. ఉదాహరణకి -

నేను - (ని) చూశాను

అనే వాక్యం లో గీత స్థానంలో పులి, ఎద్దు, మనిషి, చేప, కొండ మొదలైన పదాలు రావచ్చు. కాబట్టి ఇవి అన్నీ ఒకే భాషాభాగానికి చెందినవి. ఈ భాషాభాగానికి సాధారణ వ్యవహారంలో ఉన్న " నామవాచకం" అనే పేరు వాడుకోవచ్చు ( లేక A అని సంకేతం వాడుకోవచ్చు). కాని ఒకే వాక్యంలో గీత స్థానంలో ఆ భాషాభాగానికి చెందిన పదాలు అన్నీ రావని గ్రహించాలి. పైవాక్యంలో "కళ్లతో చూశాను" అనే అర్థంలో నిజం, పిచ్చి, అభిప్రాయం మొదలైన నామవాచకాలు రావు.

అది – చెట్టు

పై వాక్యంలో గీత స్థానంలో రాదగిన పెద్ద, చిన్న, మంచి, ఎత్తైన, చెడ్డ మొదలైనవి ఇంకొక భాషాభాగానికి చెందినవి. (ఈ భాషాభాగం పేరు వ్యవహారంలో "విశేషణం"). ఈ విధంగా భాషాభాగ విభజన చెయ్యాలి. ఇంగ్లీషులో వాక్య నిర్మాణానుసారంగా చేసిన "విశేషణం" అనే భాషాభాగానికి చెందిన పదాలలో తరతమ భావం ఉంటుంది. hot, hott-er, hott-est, beautiful, more beautiful, most beautiful ఇటువంటి చోట్ల పద నిర్మాణ విధానం భాషాభాగవిభజనని సమర్థిస్తుంది.

ప్రతి భాషలోనూ కొన్ని పదాలు ఒకటికన్న ఎక్కువ భాషాభాగాలలోకి వస్తాయి. తెలుగులో విశేషణాలన్నీ ఇంచుమించు నామాలుగా కూడా ప్రవర్తిస్తాయి. మంచి, చెడ్డ కొత్త అనే విశేషణాలు ఈ కింది వాక్యాలలో నామాలుగా ఉన్నాయి.

ఆయనికి మంచిచెడ్డలు తెలుసు.

మంచికి పోతే చెడు ఎదురువచ్చింది.

ఆయన ఈ ఊరికి కొత్త.

అమ్మాయికి కొత్త పోలేదు.

కొత్తొకవింత ; పాతొకరోత.

నిన్న, మొన్న మొదలైన కాలవాచకాలు క్రియావిశేషణాలుగానూ, నామాలుగానూ కూడా ప్రవర్తిస్తాయి.

మా అమ్మాయి నిన్న మొన్న వచ్చింది.

నిన్న మొన్న చాలా మంచి రోజు.

ఆయన ఇవ్వేళ కనపడ్డారు.

ఇవ్వేళ దీపావళి.

పై చర్చవల్ల భాషాభాగవిభజన వాక్యనిర్మాణానుసారంగానే చెయ్యడం శ్రేష్ఠమని తేలుతుంది. పదనిర్మాణంలో భిన్నంగాఉన్న పదాలు వాక్యనిర్మాణంలో ఒకే భాషాభాగం కిందికి రావడం సాధారణంగా జరుగుతుంది. ఇంగ్లీషు విశేషణాలకి తరతమ భావనిరూపణకి కొన్నింటిలో - er, - est అనే ప్రత్యయాలు చేరతాయి ; మరి కొన్నింటికి more, most అనే పదాలు చేరతాయి. అయినా అవి అన్నీ విశేషణాలే అని వాక్యనిర్మాణం వల్ల తెలుస్తుంది.

## 6.3. సన్నిహితావయవాలు

ఒక వాక్యాన్ని మనం ఉచ్చరించినప్పుడు కాని రాసినప్పుడు కాని అందులో ఉన్న మాటలు వరసగా ఒకదాని తరవాత ఒకటి వస్తాయి. అందులో కొన్నింటి వరస నిర్దిష్టంగా ఉంటుందనీ, మరికొన్నిటి వరస అనిర్దిష్టంగా ఉంటుందనీ, ఈ విషయంలో భాషకీ భాషకీ మధ్య భేదాలు ఉంటాయనీ 6.1 లో చూశాము. ఒక భాషలో వేరు వేరు వాక్యాలని పరిశీలించి చూస్తే వాక్యానికీ అందులో ఉన్న పదాలకీ మధ్య కొన్ని అంతరువులు ఉంటాయనీ, ఒక పదానికి మరొక పదంతో దానికి మిగిలిన పదాలలో ఉన్న సంబంధంకన్న ఎక్కువ సన్నిహిత సంబంధం ఉంటుందనీ తెలుస్తుంది. ఇటువంటి సన్నిహిత సంబంధం గల పదాలు వాక్యంలో పక్క పక్కన ఉండవచ్చు లేక ఇతర పద వ్యవధానంతో ఉండవచ్చు.

ఇల్లు పెద్దది.

పై వాక్యంలో రెండు మాటలే ఉన్నాయి కాబట్టి దీన్ని విభజించడం సులభం. కాని.

ఈ ఇల్లు చాలా పెద్దది.

అనే వాక్యంలో ముఖ్య విభజన ఈ ఇల్లు, చాలా పెద్దది అనే వాటి మధ్య ఉందని వ్యవహర్తలకి సహజంగానే స్ఫురిస్తుంది. ఇందులో ఇల్లు, చాలా అనే మాటలు పక్క పక్కనే ఉన్నా వాటిమధ్య సంబంధం లేదు. పై వాక్యంలో ఉన్న విభాగాలనీ ఉపవిభాగాలనీ ఈ కింది విధంగా సూచించవచ్చు.

ఈ ఇల్లు చాలా పెద్దది.



పై చర్చవల్ల పెద్ద వాక్యాలలో పదాలని ముందు కొన్ని సముదాయాలుగా విడదీయవచ్చుననీ, తరవాత ఆ సముదాయాలని పదాలుగా విడదీయవచ్చుననీ తేలుతుంది.వాక్యంలో సన్నిహిత సంబంధం కలిగి సముదాయంగా ఏర్పడిన రెండు లేక అంతకన్న ఎక్కువ పదాలని సన్నిహితవయవాలు (immediate constituents) అంటారు. పదనిర్మాణంలో రెండు కన్న ఎక్కువ అర్థకాలుకలిసినప్పుడూ కూడా వాటి మధ్య సన్నిహితావయవ సంబంధం ఉంటుంది. నమ్మకాలు, కూడికలు అనే మాటలలో మొదటి విభాగం నమ్మకం, లు, కూడిక, లు అని; వీటిలో ఉన్న నమ్మకం, కూడిక అనేది నమ్ము, అకం, కూడు, ఇక అనే విధంగా తరవాత అంతరువులో విభక్తమవుతాయి.

రెండు పదాలు సన్నిహితావయవాలా కాదా అని నిర్ణయించడానికి ఉపయోగించే పరీక్ష ఒకటి ఉంది. వాక్యంలో ఆ రెండు పదాలకి బదులు వేరొక పదం లేక వాటిలో ఒకటి మాత్రమే ఉపయోగిస్తే ఏర్పడే వాక్యం సాధువా కాదా అని చూడడమే ఆ పరీక్ష.

వాడు మంచిపని చేశాడు.

పై వాక్యంలో 'మంచి పని'కి బదులు 'పని' ఉపయోగించి

వాడు పని చేశాడు.

అని అనవచ్చు. కాబట్టి 'మంచి', 'పని' అనేవి సన్నిహితావయవాలు అని నిర్ణయించవచ్చు. (పై రెండు వాక్యాలకి అర్థభేదం ఉన్నా ఎక్కడ మనం చూడవలసింది రెండో వాక్యం భాషలో అంగీకారయోగ్యమా కదా అన్నది మాత్రమే అనిగమనించాలి).

ఆ అమ్మాయిలు బడికి వెళ్తున్నారు.

వాళ్లు బడికి వెళ్తున్నారు

వాళ్లు వెళ్తున్నారు

వాళ్లు చేస్తున్నారు

పై వాక్యాలలో 'ఆ అమ్మాయిలు' అనే దాని బదులు 'వాళ్లు' అని వాడవచ్చు; 'బడికి వెళ్లున్నారు' అనే బదులు 'వెళ్తున్నారు'/ 'చేస్తున్నారు' అని వాడవచ్చు. కాబట్టి అవి సన్నిహితావయవాలు అని నిర్ణయించవచ్చు.

వాక్యంలో మొదటి విభాగం ఉద్దేశ్యానికీ (Subject), విధేయానికీ (Predicate) మధ్య ఉంటుంది. పైన చెప్పిన పరీక్ష పరిమిత ప్రయోజనం గలది. ఎందువల్లనంటే, వాక్యంలో ఏ రెండు మాటల బదులు ఒక మాట ఉపయోగించాం అనే ప్రశ్న వస్తుంది. మొదటి ఉదాహరణలో 'వాడు మంచి'కి బదులు 'వాడు' ఉపయోగించామా లేక 'మంచిపని'కి బదులు 'పని' ఉపయోగించామా అంటే మనకున్న భాషా నిర్మాణ జ్ఞానం వల్ల రెండోదే సరియైనదని తెలుస్తుంది. కాని ఈ పరీక్ష మనం సన్నిహితావయవాలు అని అనుకొన్నవాటిని నిర్ధారించటానికి ఉపయోగిస్తుంది అని చెప్పవచ్చు.

వాక్యగత పద నిర్మాణాలు రెండు రకాలుగా ఉంటాయి. ఒకటి అంతః కేంద్రక నిర్మాణం (Endo-Centric Construction). ఇటువంటి దానిలో పూర్తి నిర్మాణం అందులో ఉన్న ఒకపదం మాత్రమే వాక్యంలో ఉపయోగించవచ్చు.

ఆ అమ్మాయి

అమ్మాయి మంచిది

ఇంతవరకు మనం చూసిన నిర్మాణాలన్నీ అంతఃకేంద్రకాలే. పూర్తి నిర్మాణం బదులు ఉపయోగించదగిన అందులో ఉన్న పదాన్ని ప్రధానావయవం (Head) అంటారు. పై ఉదాహరణలో 'అమ్మాయి' ప్రధానావయవం.

ప్రధానావయవం కాని రెండో అవయవం విశేషణం (Attribute/ Subordinate). పై ఉదాహరణలో 'ఆ' విశేషణం. అంతఃకేంద్రక నిర్మాణాలలో రెండు రకాలు ఉన్నాయి. కటి సమానాధికరణం (Coordinate), ఇంకొకటి వ్యధికరణం (Subordinate). సమానాధికరణంలో రెండు లేక అన్ని అవయవాలూ ప్రధానంగానే ఉంటాయి; అంటే వాటిలో ఏ ఒకటి ఐనా నిర్మాణం అంతటికీ బదులుగా వాడవచ్చు.

7)

{ తల్లీ తండ్రీ / తల్లి / తండ్రి } వచ్చారు.

ఇవ్వేళో రేపో ఆయన వస్తారు.

ఇందులో రెండుకన్న ఎక్కువ అవయవాలు ఉండడానికి కూడా అవకాశం ఉంది.

ఆయనా భార్యా పిల్లలూ వచ్చారు.

వ్యధికరణ నిర్మాణంలో ఒక అవయవమే ప్రధానమైనది: కొత్త చొక్కాలు, ఇందులో విశేషణాలు ఒకటి కన్న ఎక్కువ ఉండవచ్చు.

నా రెండు కొత్త చొక్కాలూ



ఇందులో పైనా చూపినట్లు 'కొత్త చొక్కాలు' 'రెండు'తో కలుస్తుంది. ఇదీ అంతా 'నా'తో కలుస్తుంది. ఇది వ్యధికరణ నిర్మాణంలో ఇతర వ్యధికరణ నిర్మాణాలు అంతర్నిహితమై ఉండడడానికి ఉదాహరణ. పై నిర్మాణం అంతటికీ ప్రధానావయవం ఒకటే. ఇటువంటి నిర్మాణాలలో విశేషణాల స్థానం స్థిరంగా

ఉండడం గమనించదగినది. * రెండు నా కొత్త చొక్కాలూ, * నా కొత్త రెండు చొక్కాలూ, * కొత్త నా రెండు చొక్కాలూ వంటివి నిషిద్ధం.

అంతఃకేంద్రక నిర్మాణం కానిది అనంతఃకేంద్రక నిర్మాణం (Exocentric Construction). ఇందులో ప్రధానావయవం అనేదే ఉండదు. ఉద్దేశ్య విధేయాలు గల వాక్యం అనంతఃకేంద్రకానికి ఉదాహరణ.

మీరు వెళ్లమంటే నేను వెళ్తాను

ఆయన పది గంటల వరకూ ఉంటారు.

పై వాక్యాలలో ఏటవాలు అక్షరాలు గలవి అనంతః కేంద్రకాలు.

మొత్తం మీద వాక్యగత పద నిర్మాణాలలో అంతర్విభాగాలని కింద ఇచ్చిన పటం స్పష్టం చేస్తుంది.




కొన్ని చోట్ల సన్నిహితావయవ విభజన అర్థ సందిగ్ధత (Ambiguity) ని నివారిస్తుంది. అర్థసందిగ్ధతను వాక్యం వాడిన సందర్భమూ, వాక్యంలో ఉన్న ఇతర పదాలూ, ఆ వాక్యానికి ఉన్న శ్రుతీ కూడా నివారిస్తాయి.

ఈ ఆవు పాలు

కొత్త కుర్చీ గుడ్డ

పై వాటిలో మొదటి ఉదాహరణకి ఉన్న అర్థాలు –

(i) ఇక్కడ గిన్నెలో ఉన్న ఆవుపాలు (ఈ (ఆవు పాలు))

(ii) ఇక్కడ ఉన్న ఆవు ఇచ్చే పాలు ((ఈ ఆవు) పాలు)

రెండో దానికి ఉన్న అర్థాలు –

(i) కొత్త కుర్చీకి సంబంధించిన గుడ్డ ((కొత్త కుర్చీ) గుడ్డ)

(ii) కొత్తదైన కుర్చీ గుడ్డ (కొత్త (కుర్చీ గుడ్డ))

అర్థ భేదాన్ని అనుసరించి సన్నిహితావయవ విభజన మారడం పై ఉదాహరణల వల్ల స్పష్టపడుతుంది.

మరి కొన్ని చోట్ల సన్నిహితావయవ విభజన ఒకటే అయినా ఆ నిర్మాణానికి ఒకటి కన్న ఎక్కువ అర్థాలు వస్తాయి.

వాడు పాలు అమ్మేవాడు.

అది తినలేదు.

వీటిలో సన్నిహితావయవ విభజనలో మార్పులేకపోయినా మొదటి వాక్యానికి మూడు అర్థాలూ రెండో వాక్యానికి రెండు అర్థాలూ ఉన్నాయి. మొదటి దాని అర్థాలు :

(i) వాడు పాలు అమ్ముతూ ఉంటాడు.

(ii) వాడు ఇంకు ముందు పాలు అమ్ముతూ ఉండేవాడు.

(iii) వాడి దగ్గర ఉంటే, వాడు పాలు అమ్మి ఉండేవాడు.

రెండో దాని అర్థాలు :

(i) అది ఇంకా తినలేదు.

(ii) దానికి తినే శక్తి లేదు.

ఇటువంటి చోట్ల సన్నిహితావయవ విభజన అర్థసందిగ్ధతని నివారించలేదు.

## 6.4. వ్యాకరణ వర్గాలు

ఒక భాషలో పదాలని భాషాభాగాలుగా విభజించే పద్ధతులు ఇంతకు ముందు చూశాం. ఒక భాషా భాగానికే చెందిన పదాలని సమగ్ర వ్యాకరణ రచనలో ఇంకా అంతర్విభజన చెయ్యవలసి ఉంటుంది. ఉదాహరణకి తెలుగులో నామవాచకాలని మహత్తులు, అమహత్తులు, ఏకవచనం, బహువచనం ఇత్యాదిగా అంతర్విభజన చెయ్యవలసిన అవసరం ఉంది. అలాగే క్రియలలో పై విభాగమే కాక భూతకాలికం, భవిష్యత్కాలికం ఇత్యాదిగా విభజించాలి. ప్రత్యయాలున్న భాషలలో ఇటువంటివి సాధారణంగా ప్రత్యయాల ద్వారా వ్యక్తీకరించబడతాయి. అవి లేని భాషలలో ఇవి పదాల ద్వారానే వ్యక్తీకరించబడతాయి. భాషాభాగాలని ఈ విధంగా విభజించి ఏర్పరచిన వర్గాలని 'వ్యాకరణ వర్గాలు' (Grammatical categories) అంటారు. పాశ్చాత్య వేదాంతంలో ప్రతి వస్తువులోనూ, 'పదార్థమూ' (Matter) 'ఆకృతి' (Form) అనేవి రెండూ కలిసి ఉన్నట్లు చెప్పబడింది. పాశ్చాత్య వైయాకరణులు ఈ సిద్ధాంతాన్ని భాషలలో పదాలకి కూడా అన్వయించారు. దీని ప్రకారం ఒక పదంలో ఉన్న ప్రాతిపదిక లేక ధాతువు దాని ముఖ్య భాగం లేక పదార్థం, దానికి వాక్య నిర్మాణానుసారంగా చేరిన లింగం, విభక్తి, వచనం, కాలం మొదలైన వాటిని సూచించే ప్రత్యయం దాని అప్రధాన భాగం లేక 'ఆనుషంగిక లక్షణం' (Accident/Accidence), ఇది ఆ పదం ఆకృతికి సంబంధించినది. వ్యాకరణ వర్గాలు పదాలకి ఉన్న ఈ ఆనుషంగిక లక్షణాలని సూచిస్తాయి. కొన్ని ఆనుషంగిక లక్షణాలు ప్రధానంగా కొన్ని భాషా భాగాలకి సంబంధించి ఉంటాయి. లింగవచన విభక్తులు ముఖ్యంగా నామవాచకాలకి సంబంధించినవి; కాల పురుష వచనాలు ముఖ్యంగా క్రియలకి సంబంధించినవి.పదాల లక్షణాలనుసూచించే వ్యాకరణ వర్గాలు కాబట్టి భాషా భాగాలు కూడా వ్యాకరణ వర్గాలే అనడానికి వీలుంది. కొందరు వీటిని 'ప్రధాన వ్యాకరణ వర్గాలు' (Primary Grammatical categories) అని వ్యవహరిస్తారు. కాని భాషాభాగాలు ప్రత్యయాల ద్వారా వ్యక్తీకరించడవు అని గుర్తించాలి. కొన్ని ముఖ్యమైన వ్యాకరణ వర్గాలని గూర్చి కింద చర్చిద్దాం.

పురుష (Person) : సంభాషణలో వ్యక్తులు వహించే పాత్రని బట్టి పురుష విభాగం చెయ్యబడుతుంది. మాట్లాడే వ్యక్తి (వక్త) ఉత్తమ పురుష (First person); వినే వ్యక్తి (శ్రోత) మధ్యమ పురుష (Second person); వీరిద్దరి కన్న భిన్నమైన వ్యక్తి లేక పదార్థం ప్రథమ పురుష (Third person). ప్రథమ పురుష మిగిలిన పురుషల కన్న చాలా విషయాలలో భిన్నమైనది. మాట్లాడే వ్యక్తీ, వినే వ్యక్తీ సంభాషణా కాలంలో ఆ చోట ఉండి అందులో పాల్గొనేవారు. కాని ప్రథమ పురుషలో ఉన్న వ్యక్తులు లేక పదార్థాలు సంభాషణా స్థలంలో ఉండ నక్కరలేదు. కాబట్టి ప్రథమ పురుషలో 'నిర్దిష్టం' (Definite), 'అనిర్దిష్టం' (Indefinite), 'సామీప్యం' (Proximate), 'దూరస్థం' (Remote) మొదలైన అంతర్విభాగాలు ఉండడానికి అవకాశం ఉంది. చాలా భాషలలో ప్రథమ పురుషని మాత్రం సూచించే సర్వనామం లేదు; అటువంటి భాషలలో ప్రథమ పురుష సర్వనామాలు దానిలో అంతర్విభాగాలని కూడా సూచించేవిగా ఉంటాయి. తెలుగులో వాడు, వీడు, అతను, ఇతను, ఆయన, ఈయన, ఆవిడ, ఈవిడ, ఆమె, ఈమె, అది, ఇది, వారు, వీరు, వాళ్ళు, వీళ్ళు, అవి, ఇవి ప్రథమ పురుష సర్వనామాలు. వీటిలో లింగ గౌరవ వచనానుసారంగా భేదాలు ఉన్నాయి.

ఉత్తమ పురుష బహువచనం మిగిలిన బహువచనాల వంటిది కాదు. అది మాట్లాడే వ్యక్తినీ మరొక లేక మరికొంతమంది వ్యక్తులనీ కలిపి సూచిస్తుంది. ఈ ఇతర వ్యక్తులలో మధ్యమ పురుష కలిసి ఉందా లేదా అనేది ఆధారంగా తెలుగు వంటి కొన్ని భాషలలో ఉత్తమ పురుష బహువచనంలో రెండు రూపాలు ఉన్నాయి. 'మేం' మధ్యమ పురుష లేనిది; 'మనం' అది ఉన్నది. సంస్కృతం, ఇంగ్లీషు, కన్నడం వంటి భాషలలో ఈ భేదం లేదు.

తెలుగు ప్రథమ పురుష సర్వనామాలలో వక్తకి సమీపంలో ఉన్నది, దూరంగా ఉన్నది అనేది ఆధారంగా ద్వైవిధ్యం ఉంది:వీడు/వాడు, ఇది/అది మొ॥ కొన్ని భాషలలో వ్యక్తికి సమీపంలో ఉన్నది, శ్రోతకి సమీపంలో ఉన్నది, వక్తృశ్రోతలకి దూరంలో ఉన్నది అనే విధంగా మూడు విభాగాలు ఉన్నాయి. లాటిన్ టర్కిష్‌లలో ఇటువంటి భేదం ఉంది.

పురుషని సూచించే ప్రత్యయాలు సమాపక క్రియలలో ఉండడం సర్వ సాధారణం. ఇంగ్లీషు, మలయాళాలలో క్రియలలో ఈ భేదం లేదు. తెలుగు ప్రథమ పురుష క్రియలలో లింగ భేదం కూడా సూచితమవుతుంది. వెళ్తున్నాడు, వెళ్తోంది. కాని సంస్కృతంలో ఇది సూచితం కాదుః గచ్ఛతి (రెండు భాషలలోనూ వచన భేదం కూడా సూచితమవుతుంది). క్రియలలో పురుష ప్రత్యయాలు ఉన్న భాషలలో ఒక వాక్యంలో సర్వనామాన్ని ఉపయోగించ నక్కర లేదు. ఉదాహరణకి 'వస్తున్నాను' అంటేనే 'నేను వస్తున్నాను' అని అర్థం. ఇంగ్లీషు వంటి భాషలలో ఇలా సర్వనామాన్ని విడిచిపెట్టడం సాధ్యం కాదు.

**లింగ, వచనాలు (Gender and Number)** : చాలా భాషలలో నామవాచకాలలో లింగభేదం, వచన భేదం ఉంటుంది. నామవాచకాన్ని బట్టి దానికి సంబంధించిన విశేషణం, సమాపక క్రియ మొదలైన వాటిలో కూడా ఈ భేదం ఉంటుంది. లింగ వచన భేదాలు లేని భాషలు కూడా ఉన్నాయి. మన దేశంలో తొద, బ్రాహుయీలల లింగభేదం లేదు. చైనీస్, వియత్నమీస్ వంటి భాషలలో వచన భేదం లేదు. బహుత్వాన్ని సూచించవలసిన అవసరం ఏర్పడినప్పుడు మాత్రం 'రెండు', 'మూడు', 'కొన్ని' వంటి పదాలని చేరుస్తారు. ఆధునిక తమిళంలోనూ, ప్రాచీన తమిళంలోనూ కూడా బహువచన ప్రత్యయ ప్రయోగం విరళంః రెండు మరం 'రెండు చెట్లు', పత్తువీడు 'పది ఇళ్లు' (వీటిలో బహువచన ప్రత్యయం లేదు).

లింగ విభజన అనేది నామవాచకాల వర్గీకరణ అని చెప్పవచ్చు. ప్రాచీన ఇండో యూరోపియన్ భాషల (సంస్కృతం, లాటిన్, గ్రీక్)లో పుం, స్త్రీ, నపుంసకం అనే మూడు రకాల లింగాలు ఉన్నాయి. ఒక పదం అర్థానికీ దాని లింగానికి చాలాచోట్ల (ముఖ్యంగా జడవాచకాలలో) సంబంధం ఉండదు. కాబట్టి ఈ భాషలలో అర్థాన్నిబట్టి పదం లింగాన్ని ఊహించడం సాధ్యం కాదు. సంస్కృతంలో పర్వతశబ్దం పుంలింగం, శిఖరశబ్దం నపుంసకం; సముద్ర శబ్దం పుంలింగం, నదీశబ్దం స్త్రీలింగం, జలశబ్దం నపుంసకం; 'ఆకు' అనే అర్థం ఇచ్చే పత్రశబ్దం నపుంసకం కాని, అదే అర్థం గల ఛదశబ్దం పుంలిగం. కాబట్టి ఇటువంటి భాషలలో వ్యాకరణలింగానికీ (Gammatical Gender) సహజ లింగానికీ (Natural Gender) సంబంధం ఉండదు. (మనుష్య స్త్రీ వాచకమైన

కళత్రశబ్దం నపుంసకం!). తెలుగులో మహత్తు, అమహత్తు అని రెండు రకాలుగా లింగ విభజన చెయ్యబడింది. పురుషులూ, పురుషులుగా ఊహించబడిన సూర్యుడు మొదలైన దేవతలూ మహత్తు, మిగిలినవన్నీ (స్త్రీలతో సహా) అమహత్తు. ఈ విభజన సహజలింగానికి కొంతవరకూ దగ్గరే కాని స్త్రీలకూ మనుష్యేతరాలకూమధ్య బేదం చూపకపోవడం (అమ్మ వచ్చింది, ఆవు వచ్చింది, ఎద్దు వచ్చింది) వల్ల ఇది సహజలింగంతో సమంకాదు. పైగా జంతువులలో లింగభేదం విశేషణాల ద్వారా సూచించవచ్చుగాని, క్రియలో ఈ భేదం లేదు (ఆడ మేక ఉంది, మగ మేక ఉంది) సర్వనామాలలో స్త్రీలని సూచించే ఆమె/ఆవిడ అనే ప్రత్యేక పదాలు ఉన్నాయిగాని వీటితో వచ్చే క్రియ పురుషులకి చెందినదిగాగాని (ఆమె వచ్చారు), మనుష్యేతరాలకి చెందినదిగాగాని (ఆమె వచ్చింది) ఉంటుంది. హిందీ వంటి భాషలలో రెండు లింగాలే (పుం, స్త్రీ లింగాలు) ఉన్నాయి. లింగభేదం ఏ భాషలోనూ సహజలింగాన్ని పూర్తిగా ఆశ్రయించినదికాదు కాబట్టి ఒక పదం ఫలానా లింగంలో ఎందుకు ఉంది అనే చర్చ వ్యర్థమైనది. లింగ విభజన నామవాచకాలని కొన్ని సముదాయాలుగా విభజించేది మాత్రమేననీ; పుం, స్త్రీ, నపుంసకం అనే పేర్లు ఈ సముదాయాలలో కొన్నిటి ఆధారంగా వాడబడినవనీ గుర్తించడం మంచిది.

రెండు రకాల వచనభేదం (ఏకవచనం, బహువచనం) చాలా భాషలలో ఉంది. ఈ విభజనని కూడా ముఖ్యమైన సందర్భాలలో మాత్రమే పాటించే భాషలు కూడా కొన్ని ఉన్నాయని పైన చూశాం. సంస్కృతం, గ్రీక్ వంటి భాషలలో ఏక, ద్వి, బహువచనాలు మూడు ఉన్నాయి. ఫిజియన్ వంటి కొన్ని భాషలలో నాలుగు (ఏక, ద్వి, త్రి, బహు) వచనాలు ఉన్నాయి.

కొన్ని ద్రావిడ భాషలో లింగవచనాలు సమ్మిళితమై ఉన్నాయి. ప్రాచీన తమిళంలో – ర్, –మార్ అనే బహువచన ప్రత్యయాలు మనుష్యవాచకాలకి మాత్రమే చేరతాయి (అరసర్ 'రాజులు', పావై మార్ 'స్త్రీలు'), కాబట్టి వీటికి బహుత్వార్థమే కాక మనుష్యార్థం కూడా ఉంది అనాలి; – కళ్ బహువచన ప్రత్యయం అమనుష్యవాచకాలకే చేరుతుంది. కాని దీని ప్రయోగం విరళం. దీనిలో అమనుష్యార్థమూ, బహుత్వార్థమూ కలిసి ఉన్నాయి. ప్రాచీనాంధ్రంలో రు మనుష్య బహువచనార్థకం. అల్లురు, కోడండ్రు, పగతురు; – లు మనుష్య

వాచకాలలో కూడా ఉన్నా అతి ప్రాచీన కాలంలో తెలుగులో – రు మనుష్య బహువచనార్థకంగానూ, –లు అమనుష్య బహువచనార్థకంగా మాత్రమే ఉండేవి అని ఊహించవచ్చు.

కొన్ని పదాలలో ఏకవచన రూపానికీ, బహువచన రూపానికీ అర్థంలో వచనభేదమేకాక మరొక భేదంకూడా ఉండవచ్చు : పిల్ల, పిల్లలు (ఏకవచనంలో ఈ పదం ఆడపిల్లకే పరిమితం), డబ్బు, డబ్బులు. కొన్ని పదాలే ఏకవచనంలో మాత్రమేగాని, బహువచనంలో మాత్రమేగాని ఉండవచ్చు. నెత్తురుకి బహువచనం వాడుకలోలేదు. పాలు, బియ్యం, నీళ్ళు (మజ్జిగ కొన్ని మాండలికాలలో) నిత్య బహువచనాలు (పాలు ఉన్నాయి/ *ఉంది). నువ్వు, కంది, పెసర మొదలైన ధాన్యవాచకాల ఏకవచనరూపాలు విశేషణాలుగానే ప్రయుక్తమవుతాయి (నువ్వు గింజ, నువ్వు చేను మొ॥). సంస్కృతంలో అప్ శబ్దం నిత్య బహువచనం (ప్రథమైక వచనం ఆపః 'నీళ్ళు').

విభక్తి (Case) :– నామవాచకాలు వాక్యంలో అవి వహించే పాత్రని బట్టి విభిన్న విభక్తులలో ఉంటాయి. లాటిన్ భాషలో విభక్తి అని అర్థం ఇచ్చే (Casus) అనే మాట అసలు అర్థం 'పతనం' (falling) లేక 'మార్పు' (deviation), ఒక పదం నామవాచకంలో ఉన్న రూపం మిగిలిన విభక్తులలో మార్పు చెందడంవల్ల పాశ్చాత్య వైయాకరణులు విభక్తిని సూచించడానికి ఈ పేరు వాడేరు. సంస్కృతంలోనూ తెలుగునూ విభక్తి అనేది నామవాచకాల చివర చేరే ప్రత్యయాలని సూచించడానికే సాధారణంగా వాడబడుతున్నా, పాణిని అష్టాధ్యాయిలో ఇది క్రియలకి చేరే కొన్ని ప్రత్యయాలకి కూడా వాడబడిందని గమనించాలి.

విభక్తులు ప్రత్యయాలవల్లగాని, పూర్వసర్గల (Prepositions) వల్లగాని, పరసర్గల (Postpositions)ని సూచించబడవచ్చు. తెలుగులో ద్వితీయా విభక్తి (–ను) చతుర్థీ విభక్తి (–కు) మొదలైనవి ప్రత్యయాల ద్వారా వ్యక్తమవుతాయి. సప్తమిని సూచించే లో(పల), కింద, మీద మొదలైనవి పరసర్గలు. ఇంగ్లీషులో (to; from, in) మొదలైనవి పూర్వసర్గలు. పరసర్గలు నామవాచకం తరవాత, పూర్వసర్గలు నామవాచకానికి ముందూ వస్తాయి. ఇవి ప్రత్యయాలలా

నామవాచకానికి అంటి పెట్టుకొని ఉండక కొంత స్వతంత్ర ప్రతిపత్తి కలిగి ఉంటాయి.

సంస్కృతంలో ఏడు విభక్తులు ఉన్నాయి (ఇందులో సంబోధన ప్రథమా విభక్తి చెందినదిగానే పరిగణించబడింది). లాటిన్‌లో ప్రథమ, సంబోధన, ద్వితీయ, షష్ఠి, చతుర్థి, పంచమి అని ఆరు విభక్తులు పైన ఇచ్చిన వరసలో వ్యాకరణాలలో ఇవ్వబడ్డాయి. తృతీయ, సప్తములు ప్రత్యయాల ద్వారా కాక పూర్వసర్గల ద్వారా సూచించబడటంవల్ల లాటిన్‌లో అవి విభక్తులుగా గ్రహించబడలేదు. మన దేశంలో అన్ని భాషలలోనూ సంస్కృతాన్ని అనుసరించి సప్త విభక్తి ప్రణాళిక అంగీకృతమైంది. తమిళం, మలయాళం వంటి కొన్ని ద్రావిడ భాషలలో కరణార్థంలో ఒక ప్రత్యయమూ సహార్థంలో మరొక ప్రత్యయమూ ఉన్నాయి; త. కత్తి-యాల్ 'కత్తితో' (-ఆల్ కరణం), అవనొటు (-ఒటు సహార్థకం) 'వాడితో', సంస్కృతం (తెలుగులో కూడా) ఈ రెండు అర్థాలనీ తృతీయా విభక్తి ప్రత్యయమే సూచిస్తుంది (సహార్థంలో తృతీయకి వైభాషికంగా సహ చేరుతుంది). కాబట్టి ఈ భాషలలో ఈ రెండిటినీ వేరు వేరు విభక్తులుగా గుర్తించడం సముచితం. కాని సంస్కృతి వ్యాకరణ ప్రభావానికి లోనైన ప్రాచీన వైయాకరణులు ఇటువంటి విభేదం పాటించలేదు. దీనివల్ల భాషలలో విభక్తులు ఏడుకన్న ఎక్కువగా కూడా ఉండవచ్చునని తెలుస్తుంది. ఫిన్నిష్‌లో పదిహేను విభక్తులు ఉన్నాయి. కాని వీటిలో చాలా విభక్తుల ప్రత్యయాలు ప్రత్యేక పదాల నించి ఏర్పడినవే. ఉచ్చారణ వేగంవల్ల ప్రత్యేక పదాలు ప్రత్యయాలుగా మారడం తెలుగులో కూడా ఉంది. మీదవించి > మీంచి, -లోపలనించి > -లోంచి, ఇటువంటిమార్పే ఫిన్నిష్‌లో కూడా జరిగి, అన్ని విభక్తులు ఏర్పడ్డాయి.

సంస్కృతం మొదలైన ప్రాచీన ఇండో - యూరోపియన్ భాషలలో విభక్తికీ వచనానికీ కలిపి ఒకే ప్రత్యయం ఉంటుంది కాబట్టే ఒకే విభక్తికి చెందిన ప్రత్యయ రూపం వచనాన్ని అనుసరించి మారుతుంది. ఇంతేకాకుండా నామవాచకం లింగాన్ని బట్టి దాని చివరి ధ్వనినిబట్టి కూడా ప్రత్యయ రూపం మారుతుంది. ఉదాహరణకి సంస్కృతంలో అకారాంత పుంలింగానికి తృతీయా విభక్తి ప్రత్యయాలు రామేణ 'రామునితో/చేత', (ఏ.వ.), రామాభ్యాం ఇద్దరు రాములతో/ చేత, (ద్వి.వ.), రామైః 'రాములతో/చేత' (బ. వ.). రమా - భ్యాం (ద్వి. వ.). రమా-

భిః (బ.వ.). ఈ విధంగా ఉంటాయి. సర్వనామాలకి చేరే కొన్ని విభక్తి ప్రత్యయాలు వేరుగా ఉంటాయి. త-స్మిన్ 'వాడిలో' (సప్తమి (ఏ.వ.), రామే 'రాముడిలో', నద్యాం 'నదిలో' మొ॥ కొన్ని రకాల నామాలలో కొన్ని విభక్తుల మధ్య భేదం ఉండదు; నపుంసక లింగ నామాలలో ప్రథమా విభక్తికీ ద్వితీయా విభక్తికీ భేదం లేదు; జలం (ఏ. వ.), జలే (ద్వి. వ.) జలాని (బ. వ.), ద్రావిడ భాషలలో సంస్కృతంలో వలె కాక వచన ప్రత్యయమూ, విభక్తి ప్రత్యయమూ వేరుగా ఉంటాయి. కాకి – ని, కాకు – ల–ని. కొన్ని సందర్భాలలో విభక్తి ప్రత్యయరూపం నామవాచకం ఏ విభాగానికి చెందినది అనే దానిమీద ఆధారపడి ఉంటుంది. తెలుగులో అప్రాణివాచకాలలో ద్వితీయాప్రత్యయం సాధారణంగా లోపిస్తుంది కాని ప్రాణి వాచకాలలో ఈ లోపం ఉండదు; వాళ్ళు చెట్టు కొట్టేరు; వాళ్ళు కుక్కని కొట్టేరు.

ఒక క్రియని నిర్వహించే వ్యక్తులు లేక వస్తువులు వహించే పాత్రలు ఆ వ్యక్తులని లేక వస్తువులని సూచించే నామాలకి చేరే విభక్తి ప్రత్యయాల అర్థాలు. వీటినే పాణిని కారకాలు అన్నారు. కాని కారకాలకీ విభక్తి ప్రత్యయాలకీ ఏకైక సంబంధంలేదు. వాక్యనిర్మాణాన్ని బట్టి ఒకే కారకం భిన్న విభక్తుల ద్వారా సూచించబడవచ్చు. ఉదాహరణకి –

అర్జునుడు కర్ణుణ్ణి చంపేడు.

పై వాక్యంలో అర్జునుడు కర్త, ఇది ప్రథమావిభక్తిలో ఉంది; కర్ణుడు కర్మ, ఇది ద్వితీయావిభక్తిలో ఉంది, కాని –

శ్రీకృష్ణుడు అర్జునుడిచేతః కర్ణుణ్ణి చంపించేడు.

అనే ప్రేరణ క్రియ ఉన్న వాక్యంలో కర్త అయిన అర్జునుడు తృతీయా విభక్తిలో ఉంది. దీనికి కారణం రెండోవాక్యంలో ప్రేరణకర్త అయిన శ్రీకృష్ణుడు ఉండడం. షష్ఠీవిభక్తిలో ఉన్న నామం క్రియావ్యాపారంలో పాత్ర వహించదు కాబట్టి ఇది కారకాన్ని సూచించదు. పాణిని అవలంబించిన కారక సిద్ధాంతం భాషాశాస్త్రంలో ఒక ముఖ్యమైన అంశం. దీనిమీద విపులమైన చర్చ పందొమ్మిదో అధ్యాయంలో ఉంది. విభక్తులూ అవి సాధారణంగా సూచించే అర్థాలూ కింద

ఇవ్వబడ్డాయి :

ప్రథమ : కర్త, ప్రయోజనక కర్త

ద్వితీయ : కర్మ (కర్తచేత ఉద్దేశించబడినది)

తృతీయ : కర్త, కరణం (క్రియని చెయ్యడంలో ముఖ్యంగా కావలసినది)

చతుర్థి : సంప్రదానం (క్రియని ఎవరికోసం కర్త ఉద్దేశించాడో వాడు/అది)

పంచమి : అపాదానం (విశ్లేషం లేక విడిపోవడం మొదలు పెట్టిన చోటు)

సప్తమి : అధికరణం (క్రియ జరిగిన / జరిగే చోటు)

**కాలం (Tense), ఇచ్ఛ (Mood), క్రియాస్థితి (Aspect) :**

కాలప్రత్యయం క్రియ జరిగే / జరిగిన కాలాన్ని సూచిస్తుంది. క్రియలో ఉన్న కాలప్రత్యయమే కాక 'నిన్న', 'రేపు', 'ఇప్పుడు' మొదలైన కాలక్రియా విశేషణాలు (Adverbs of time) కూడా కాలాన్ని సూచిస్తాయి. అందువల్ల కొన్ని భాషలలో క్రియలో కాలప్రత్యయాలే ఉండవు. సాధారణంగా భాషలలో భూతం (Past), వర్తమానం (Present), భవిష్యత్తు (Future) అని మూడు కాలాలు ఉంటాయి. కొన్ని భాషలలో వర్తమాన భవిష్యత్తులకు రెండిటికీ ఒకే క్రియారూపం ఉంటుంది. కాలక్రియా విశేషణాలద్వారా అటువంటి చోట్ల భేదం స్పష్టం చెయ్యబడుతుంది. చాలా ద్రావిడభాషలలో వర్తమానకాల సమాపక క్రియ లేదు. ఇది వర్తమానకాల అసమాపక క్రియ 'ఉండు' క్రియ చేర్చడంవల్ల ఏర్పడుతుంది. తెలుగులో ఇంతే. చేయుచున్ ఉన్నాడు, చేస్తూ ఉన్నాడు చేస్తున్నాడు. ఇంగ్లీషులో భవిష్యత్తు will అనే సహాయక క్రియ (Auxiliary verb) ద్వారా సూచితమవుతుంది. తెలుగులో భవిష్యత్తు తద్ధర్మాన్ని (Habitual) కూడా సూచిస్తుంది. సూర్యుడు తూర్పున ఉదయిస్తాడు. ఇంగ్లీషులో తద్ధర్మం వర్తమానం ద్వారా సూచించబడుతుంది. ఒక క్రియని వర్తమానకాలానికి దగ్గరలో జరిగేదానిగా వక్త వివక్షిస్తే (అంటే భావిస్తే) భూత భవిష్యత్తులకు బదులుగా వర్తమానాన్ని వాడడం చాలా భాషలలో సహజం : వాడు రేపు వస్తున్నాడు.

కొన్ని భాషలలో మూడు కాలాలలోనూ సూక్ష్మవిభేదాలు ఉంటాయి.

ఉదాహరణకు సంస్కృతంలో భూతకాలంలో అనద్యతనభూతం (ఈ రోజుకు చెందిన భూతకాలం), అనద్యతనభూతం అనే విభేదం ఉంది; భవిష్యత్తులో కు డా ఇటువంటి విభేదమే ఉంది.

ఒక క్రియని వక్త ఏ దృక్కోణంనించి చూస్తాడో దాన్ని ఇచ్ఛ అంటారు. ఇది వక్త మనఃస్థితిని సూచిస్తుంది. ఇచ్ఛలో ముఖ్యమైన విభేదాలు విధి (Imperative) (రా), ప్రశ్న (Interrogation) (వస్తావా?), ఆశీస్సు (Wish), ఆవశ్యకత (Necessity/Obligation), నిశ్చయం (Certainity) 'రావాలి', సాధ్యత (Possibility) 'రావచ్చు'. పైన ఇచ్చిన విభేదాలు అన్ని భాషలలోనూ ఉండకపోవచ్చు. వీటిలో కొన్ని ఒకే ప్రత్యయం లేక సహాయక క్రియద్వారా వ్యక్తమవుతూ ఉండవచ్చు.

క్రియాస్థితి ఒక క్రియ పూర్తి అయినదా లేదా, లేక జరుగుతూ ఉందా? అనే విషయాన్ని ఇంకా ఇటువంటి వాటిని తెలియచేస్తుంది. తెలుగులో 'వేయు' 'పోవు' అనే సహాయక క్రియలు క్రియాస్థితిని సూచిస్తాయి. వాడు అన్నం తినేశాడు, చెరువు ఎండిపోయింది. పై వాక్యాలని వాడు అన్నం తిన్నాడు, చెరువు ఎండింది అనే వాటితో పోల్చిచూస్తే 'వేయు' 'పోవు' లు క్రియా పరిసమాప్తిని ఇతోధికంగా సూచిస్తున్నాయి అని తెలుస్తుంది. ఈ సహాయక క్రియలు పరిసమాప్తినే గాక శీఘ్రతను కూడా సూచిస్తాయి. ఈ అర్థం వర్తమానకాలంలో స్పష్టంగా తెలుస్తుంది. వాడు అన్నం తినేస్తున్నాడు. డబ్బు ఖర్చయిపోతోంది.

కాలం, ఇచ్ఛ, క్రియాస్థితి – ఈ మూడిటికీ అన్నిచోట్లా విభేదం పాటించడం చాలా కష్టం. భవిష్యత్కాల రూపాలు విధిగా కూడా వాడవచ్చు; నువ్వు రేపు వెళ్తావు (కదూ) అనేది భవిష్యత్తుగానూ విధిగానూ (వెళ్ళు అనే అర్థంలో) కూడా వాడవచ్చు. రేపు నువ్వు వస్తే బాగుంటుంది అనే సాధారణ వాక్యాన్ని విధ్యర్థంలో కూడా వాడవచ్చు. కాలానికీ, క్రియా స్థితికీ కొన్ని భాషలలో అవినాభావ సంబంధం ఉంటుంది. తమిళం వంటి కొన్ని భాషలలో వచ్చాడు, వచ్చి ఉన్నాడు, వచ్చి ఉండినాడు అనే విధంగా మూడు రకాలుగా భూతకాలంలో క్రియాస్థితి వ్యక్తమవుతుంది. తెలుగులో కొన్ని దక్షిణ మాండలికాలలో పైన ఇచ్చిన మూడు రూపాలూ అర్థభేదంతో వ్యవహారంలో ఉన్నాయి.

# 7. పరివర్తన వ్యాకరణం

## 7.1 ముఖ్యోద్దేశాలు, లక్షణాలు :

పరివర్తన వ్యాకరణం (Transformational grammar) అనే వ్యాకరణ ప్రక్రియ నోమ్ చోమ్స్కీ (Noam Chomsky) రచించిన Syntactic Structures (1957) అనే గ్రంథంతో ఆరంభమయిందని చెప్పవచ్చు. కాని ఈ రకం వ్యాకరణానికి సంబంధించిన మూల సూత్రాలు బీజ రూపంలో కొన్ని ప్రాచీన పాశ్చాత్య వ్యాకరణాలలోనూ పాణిని అష్టాధ్యాయి లోనూ అనుసరించబడ్డాయి కాని, ఆ గ్రంథాలలో ఈ సూత్రాలు వ్యక్తంగా చెప్పబడలేదు. కాబట్టి పరివర్తనవ్యాకరణ మూలసూత్రాలని నిర్వచించి ఉదాహరణ ప్రత్యుదాహరణలతో విపులంగా మొదట చర్చించినవాడు చోమ్స్కీయే అని చెప్పవచ్చు. ఈయన తరవాత రచనలలో పైన పేర్కొనబడిన గ్రంథంలో ప్రతి పాదించిన సిద్ధాంతాలని కొంతవరకు మార్చారు. ఈ ప్రక్రియలో పరిశోధన సాగించిన ఈయన అనుయాయులు కొందరు ఈయన సిద్ధాంతాలకి మౌలికమైన మార్పులు చేశారు. ఇంకా ఈ ప్రక్రియా సిద్ధాంతాలపై వాదోపవాదాలు జరుగుతూ ఉండడంవల్ల ఇది చరమ సిద్ధాంతం అని ఒకదాన్ని చెప్పడానికి ప్రస్తుతం వీలుకాదు. అయినా ఈ ప్రక్రియలో నిష్ణాతులైనవారంతా (లేక చాలామంది) అంగీకరించే మౌలిక విషయాలు కొన్ని ఉన్నాయి. అవి ఈ అధ్యాయంలో చర్చించబడతాయి.

పరివర్తన వ్యాకరణం ముఖ్యంగా ఒక భాషలో వాక్య నిర్మాణాన్ని ఒక రకం వాక్యానికీ మరొక రకం వాక్యానికీ గల పరస్పర సంబంధాన్నీ వర్ణించడానికి ఉద్దిష్టమైంది. కాని పరిశోధన సాగినకొద్దీ వర్ణనిర్మాణం, చారిత్రక వ్యాకరణం మొదలైన ఇతర వ్యాకరణాంగాలకి కూడా ఈ ప్రక్రియా పద్ధతులు అనువర్తించబడితే వాటికి కూడా ఇతోధిక శాస్త్రీయతా, నైశిత్యం చేకూరతాయని స్పష్టమయింది. పైగా అంతవరకూ నిర్లక్ష్యం చేయబడిన అర్థ నిర్మాణానికి (Semantic Structure) ఈ ప్రక్రియలో ప్రాముఖ్యం లభించింది. ఈ విధంగా పరివర్తన వ్యాకరణం మొత్తం భాషా నిర్మాణాన్నీ, భాషా స్వరూప స్వభావాలనీ సూక్ష్మదృష్టితో

గ్రహించడానికి ఉపకరిస్తుందని తెలియడంతో ఈ ప్రక్రియ భాషా శాస్త్రాధ్యయనంలో ఒక కొత్త సంచలనాన్ని రేకెత్తించింది.

ఆధునిక కాలంలో భాషాశాస్త్రం మొట్టమొదట అమెరికాలో అభివృద్ధి చెందడం ప్రారంభించిందని మనకి తెలుసు. ప్రారంభదశలో భాషాశాస్త్రాభివృద్ధికి ముఖ్య కారకులైన వారిలో అగ్రగణ్యుడు బ్లూమ్‌ఫీల్డ్. ఈయన మనస్తత్వ శాస్త్రంలో బిహేవియరిజం అనే శాఖచేత ప్రభావితుడైన కాలంలో తన ముఖ్య గ్రంథాలు రాశారు. ఈ శాఖకు చెందిన పండితులు పరిశోధన అనేది ఎప్పుడూ మనం గమనించదగిన విషయాలకి మాత్రమే పరిమితమై ఉండాలని సిద్ధాంతీకరించారు. తదనుగుణంగా బ్లూమ్‌ఫీల్డూ తదనుయాయులూ తమ వర్ణనాత్మక పరిశోధనని వర్ణ నిర్మాణం, పద నిర్మాణం మొదలైన సులభంగా గమనించదగిన శాఖలకి మాత్రమే పరిమితం చేసుకొన్నారు. అర్థం అంటే ఏమిటో సులభంగా నిర్వచించడానికి సాధ్యంకాదు కాబట్టి వీరు అర్థ నిర్మాణం మీదా, అర్థ నిర్మాణంతో ముడిపడిన వాక్య నిర్మాణంమీదా తమ దృష్టిని కేంద్రీకరించలేదు.

అంతకుముందున్న భాషా శాస్త్రజ్ఞులు చిన్నచూపు చూసిన అర్థ నిర్మాణ వాక్య నిర్మాణాలే భాషకు ముఖ్యాంగాలనీ, అందువల్ల భాషాశాస్త్రజ్ఞులు వీటిని సూక్ష్మంగా పరిశీలించాలనీ చోమ్‌స్కీ విప్లవాత్మకమైన ప్రతిపాదన చేశాడు.

ఒక భాషని మనం వింటున్నప్పుడు మనం వినేది కొన్ని ధ్వనుల సముదాయమే. ఈ విషయం మనకు అర్థంకాని ఒక కొత్త భాషని వినేటప్పుడు మనకు తెలుస్తుంది. ఇందువల్ల భాష అంటే మానవుడి నోటిలోంచి వచ్చే ధ్వనులే అని మనకు స్పష్టమవుతుంది. మానవులు ఈ ధ్వనులు ఎందుకు ఉచ్చరిస్తారు? వారి మనసులో ఉన్న అభిప్రాయాన్ని అంటే అర్థాన్ని ఇతరులకు వ్యక్తీకరించడానికి, వ్యాకరణం చెయ్యవలసిన పని అర్థానికీ దానికి సంబంధించిన ధ్వనులకీ గల పరస్పర సంబంధాన్ని వర్ణించడమే (ఏ భాషకయినా లిపి ఆ భాషాధ్వనులకు ఇవ్వబడిన దృశ్యరూపమేకాబట్టి భాషకి లిపి ముఖ్యం కాదు అని గ్రహించాలి). అంతేకాని, ఏరూపం ప్రామాణికం, ఏ రూపం అప్రామాణికం అని నిర్ణయించడం వ్యాకరణం పనికాదు. ఉదాహరణకి ఇంటికాడ, ఒత్తాది, సేత్తాది, రాయిండి వంటి రూపాలు సంఘంలో అప్రామాణికాలు, అందుచేత వాటిని

సభలలోనూ రాతలోనూ వాడకూడదు అని చెప్పడం వ్యాకరణం పనికాదు. అటువంటి రూపాలు వాడేవారి వ్యవహారంలో కూడా కొన్ని నియమాలు ఉంటాయనీ, ఒక కాలంలో అప్రామాణికమై నవి కాలక్రమేణ ప్రామాణిక మై తాయని గుర్తించడం ముఖ్యం.

పరివర్తన వైయాకరణుల దృష్టిలో వ్యాకరణం మనం ఇంతకుముందు విన్న లేక చదివిన వాక్యాలకి మాత్రమే పరిమితం కాకూడదు. అది భాషలో సాధ్యమైన వాక్యాలన్నిటినీ, అవి మనం ఇంతకుముందు విన్నవైనాసరే, వినవిని అయినాసరే, సాధించగలిగి ఉండాలి. మనం దైనందిన వ్యవహారంలో ఇంతకుముందు విన్న వాక్యాలే కాకుండా కొత్త వాక్యాలని కూడా సృష్టించి వ్యవహరిస్తూ ఉంటాం. ప్రతి వ్యవహర్తకీ భాషా నిర్మాణం తెలిసి ఉండడం వల్ల ఇటువంటి కొత్త వాక్యాలని సృష్టించడంలోనూ వాటిని ఇతరులు వాడినప్పుడు అర్థం చేసుకోవడం లోనూ ఏ విధమైన కష్టమూ ఉండదు. ఉదాహరణకు ఈ కింది వాక్యాలు ఆయా సంఘటనలు జరగడానికి ముందు ఎవరూ ఉచ్చరించి ఉండరు. అయినా వాటిని సృష్టించి వాడడంలోనూ,అర్థం చేసుకోవడంలోనూ ఎవరికీ కష్టం లేదు.

1. సంజయ్ గాంధీ విమాన ప్రమాదంలో చచ్చిపోయాడు.

2. అమెరికా వాళ్ళు రాకెట్టులో వెళ్ళి చంద్రమండలం మీద దిగేరు.

మనం ప్రతిరోజూ ఇటువంటి కొత్త వాక్యాలని వాడడం, వినడం మనకు తెలియకుండానే జరుగుతూ ఉంటుంది. చిన్ని పిల్లలు భాష నేర్చుకోవడం కూడా ఈ పద్ధతిలోనే జరుగుతుంది. మొదట కొన్ని నెలలు వాళ్ళు తను చుట్టూ ఉండేవారు మాట్లాడే మాటలు వింటూ ఉంటారు. ఆ తరవాత వాళ్ళు తాము విన్న వాక్యాలే కాక వినని వాక్యాలు కూడా వినిన మాటల సాయంతో సృష్టించి మాట్లాడతారు. వాళ్ళు ఒక్కొక్కసారి చేసే తప్పులవల్ల ఈ విషయం స్పష్టమవుతుంది. కాఫీ ఒండు, మేక పిల్లలు వాళ్ళ అమ్మ దగ్గరకి వెళ్ళేరు. ఇటువంటి ముద్దు పలుకులు మనం తరచు వింటూనే ఉంటాం. వ్యాకరణం ఒక భాషలో సాధువులైన అన్ని వాక్యాలనీ సాధించగలిగి ఉండడమే కాక సాధువులైన వాటిని మాత్రమే సాధించాలి, అసాధువులైన వాటిని (చూ. పై ముద్దు పలుకులు) సాధించకూడదు.

ఈ కింది వాక్యాలు కూడా అసాధువాక్యాలకి ఉదాహరణలు : (అసాధువాక్యాలకి ముందు నక్షత్రం గుర్తు చేర్చడం సంప్రదాయం).

3. ★ అమ్మాయి ఆ చీర కొత్త కట్టుకుంది.

4. ★ మా అన్నయ్య వచ్చింది.

5. ★ మేం రేపు వచ్చాం.

6. ★ బల్ల మాట్లాడింది.

పరివర్తనవైయాకరణులు సామర్థ్యానికీ ప్రవృత్తి కీ మధ్యగల భేదం గుర్తించారు. మనంఅందరమూమాట్లాడేటప్పుడు వ్యర్థపదాలు ఉపయోగించడం, అర్థానికి సరిపోని మాటలు వాడడం, మాటలు సరియైన క్రమంలో వాడకపోవడం, వాక్యాన్ని మధ్యలో వదిలేసి వేరొక వాక్యాన్ని ప్రారంభించడం మొదలైన తప్పులు చేస్తూ ఉంటాం. అంతేకాక మనం మాట్లాడే భాష భావావేశం, జ్ఞాపకశక్తి తక్కువ అవడం, పరిసరాల ప్రభావం, తమలపాకులు మొదలైనవి నములుతూ ఉండడం మొదలైనవాటి వల్ల కూడా మార్పుకు లోనవుతూ ఉంటుంది. ఇటువంటి లోపాలతో కూడినదైన భాష ప్రవృత్తి, కాని ఇటువంటి లోపాలు వ్యవహర్త అన్నివేళలా చెయ్యడు, ఇటువంటి లోపాలని పరిహరించి సరిగా మాట్లాడగలిగిన సామర్థ్యం అతనికి ఉంటుంది. కాబట్టి వైయాకరణుడు వర్ణించవలసినది భాషావ్యవహర్త సామర్థ్యం కాని ప్రవృత్తి కాదు.

పరివర్తన వ్యాకరణం పైన చెప్పినట్లు భాషలోని ఏ సాధువాక్యాన్ని అయినా సూత్రాల ద్వారా ఉత్పత్తిచెయ్య గలదు కాబట్టి దీనిని ఉత్పాదక వ్యాకరణం (Generative Grammar) అని కూడా అంటారు. సాధు వాక్యాలని ఉత్పత్తి చెయ్యగలిగిన వ్యాకరణం పరివర్తన సూత్రాలని ఉపయోగించాలనే నియమం లేకపోయినా transformational grammar, generative grammar అనే రెండూ సాధారణంగా తుల్యార్థకాలుగా వాడ బడుతున్నాయి. పరివర్తన వ్యాకరణానికి మూడు అంగాలు ఉంటాయి. అవి (i) వాక్యనిర్మాణం, (ii) అర్థనిర్మాణం, (iii) వర్ణనిర్మాణం అనేవి. వాక్య నిర్మాణంలో పదబంధ నిర్మాణం (Pharse structure), పరివర్తన సూత్రాలు (Transformations)

అనే రెండు విభాగాలు ఉన్నాయి. అర్థనిర్మాణం కొన్ని పదాల కలయికవల్ల ఏర్పడిన వాక్యం యొక్క అర్థాన్ని నిర్ణయిస్తుంది. ప్రతి వాక్యానికీ అంతరంగ నిర్మాణం (Deep structure), బహిరంగ నిర్మాణం (Surface structure) అని రెండు రూపాలు ఉంటాయి. వాక్యం యొక్క అంతరంగనిర్మాణం వాక్యార్థానికి సన్నిహితంగా ఉండి, దాన్ని తెలుసుకోవడానికి తోడ్పడుతుంది. అంతరంగ నిర్మాణం కొన్ని మార్పులకు లోనై బహిరంగ నిర్మాణంగా మారుతుంది. పై అంశాలన్నిటిమీదా విపులమైన చర్చ ఈ అధ్యాయం తరవాత భాగాలలో ఉంది. పరివర్తన వ్యాకరణానికి మూడో అంగమైన వర్ణనిర్మాణం ఉత్పత్తి చెయ్యబడిన వాక్యానికి వర్ణస్వరూపాన్ని ఇస్తుంది. ఒక వాక్యంలో కలిసిన వేరువేరు పదాల వర్ణాలు ఏయే మార్పులు పొందుతాయి (ఇదే సంధి)? ఒక క్రియారూపం భిన్న కాల లింగ పురుష వచనాలలో ఎలా ఉంటుంది? మొదలైన విషయాలని వర్ణనిర్మాణం నిర్ణయిస్తుంది. మొత్తంమీద వర్ణనిర్మాణం అమూర్తమైన వాక్యం లేక వాక్యార్థానికి మూర్తమైన ఉచ్చారిత వర్ణస్వరూపాన్ని ఇస్తుందని చెప్పవచ్చు.

## 7.2. పదబంధ నిర్మాణం

పరివర్తన వ్యాకరణంలో పదబంధ నిర్మాణం మనం ఇంతకుముందు చూసిన సన్నిహితావయవ విభజన (6.3.) పద్ధతిని అనుసరించే ఉంటుంది. కాని పదబంధ నిర్మాణం సూత్రరూపంలో ఉంటుంది. ఈ పదబంధ నిర్మాణ సూత్రాలు (Phrase Structure Rules) ఒక నిర్ణీత క్రమంలో ఉండి, భాషలోని అసంఖ్యాక వాక్యాల నిర్మాణాలని ఉత్పత్తి చేస్తాయి. ఇవి పెద్ద వాక్యాంగాలని వాటి భాగాలైన చిన్నచిన్న భాషాభాగాలుగా మార్చే పద్ధతిలో ఉంటాయి. వీటిలో మొదటి సూత్రం --

ప 1. వాక్యం → (వాక్య విశేషణం) ముఖ్య వాక్యభాగం

వా. ( వా.వి.) ము.వా.భా.

ఈ సూత్రం అర్థం వాక్యం (S) అనే గుర్తుని వాక్యవిశేషణం (Sentence Modifier = SM) ముఖ్యవాక్యభాగం (Nucleus = Nuc) అనే రెండుగా

మార్చాలి లేక మార్చి రాయాలి అని. దీనినే ఇంకో విధంగా కూడా చెప్పుకోవచ్చు వాక్యం అనే దానిలో వాక్య విశేషణం, ముఖ్యవాక్యభాగం అనే రెండు భాగాలు ఉన్నాయని కూడా అర్థం చెప్పవచ్చు. సూత్రంలో వాక్యం లేక S (= Sentence) అనేది ఒక గుర్తునే భావించాలి కాని ఇది అన్ని రకాల వాక్యాలకీ వర్తిస్తుంది అనుకోకూడదు. ఎందువల్లనంటే, పదబంధ నిర్మాణం అన్ని రకాల వాక్యాలనీ ఉత్పత్తిచేయ్యలేదు; కొన్ని రకాల వాక్యాల సాధురూపాలని ఉత్పత్తి చెయ్యడానికి పరివర్తన సూత్రాలు అవసరమవుతాయని తరవాత చూస్తాం. కుండలీకరణాలలో ఇచ్చిన అంశాలు వైభాషికాలు అని గ్రహించాలి. ఒక వాక్యాన్ని ఈ సూత్రాల ద్వారా సాధించేటప్పుడు (లేక ఉత్పత్తి చేసేటప్పుడు) కుండలీకృతాంశాల్ని గ్రహించవచ్చు లేక వదలవచ్చు.

వాక్య విశేషణంగా ఉండేవి : అవును, వ్యతిరేకం (లేదు, కాదు), బహుశా, నిజానికి, అసలు, అందుచేత మొదలైనవి.

7. అవును, ఆయన కథలు రాస్తారు.

8. నిజానికి, నేను వాణ్ణి తిట్టేను.

ప 2. ము.వా.భా. → నా.ప. + క్రి. ప.

(నా. ప. = నామపందబంధం; క్రి. ప. = క్రియాపదబంధం)

పై సూత్రంవల్ల ముఖ్యవాక్యభాగంలో నామపదబంధం (Noun phrase) క్రియా పదబంధం (Verb Phrase) రెండు అంతర్భాగాలు ఉన్నాయని తెలుస్తుంది (క్రియా పదబంధాన్ని ఆఖ్యాతపదబంధం – Predicate Phrase (Pred P) అని కూడా వ్యవహరిస్తారు). కొందరు ముఖ్యవాక్యభాగాన్ని నామ పదబంధం + సహాయక క్రియ (Auxiliary) + క్రియాపదబంధం అని మూడు భాగాలుగా విభజిస్తారు. మరికొందరి మతంలో సహాయక క్రియ క్రియా పదబంధంలో అంగంగా ఉంటుంది; సహాయక క్రియని గురించిన వివరణ కింద ఉంటుంది.

ప 3. నా.వ. ⟶ { (వా.) (సూ.వి.) నా. (బ.వ.) / వా. + నా.ప ) / నా. ప " / వా. }

పై సూత్రం నామపదబంధంలో ఉండదగిన అంగాలని సూచిస్తుంది; నామపదబంధాన్ని విస్తృతి చెయ్యడానికి ఇది ఉపయోగిస్తుందని కూడా ఇంకో విధంగా చెప్పవచ్చు. [ ] ఈ బ్రాకెట్లలో ఉన్న సముదాయాలలో ఏదో ఒక దానిని మాత్రమే ఒక వాక్యాన్ని సాధించేటప్పుడు తీసుకోవాలి అనేది సంప్రదాయం. ఇందులో నామపదబంధం బాణానికి రెండు వైపులా ఉంది. బాణానికి రెండు వైపులా ఒక గుర్తు తుల్యంగా ఉన్న సూత్రాలని పౌనఃపున్య సూత్రాలు (Recursive Rules) అంటారు. ఒక వాక్యాన్ని సాధించేటప్పుడు పౌనఃపున్య సూత్రాన్ని ఎన్నిసార్లైనా వాడవచ్చును. ఇందువల్ల ఒక పదబంధంలో అదే పదబంధాన్ని ఒకసారి గాని, అంతకన్న ఎక్కువసార్లు గాని ఇమిడ్చి పెద్ద పదబంధాన్ని విస్తృతం చెయ్యవచ్చు. ఉదాహరణకి పై సూత్రం వల్ల నామపదబంధంలో మరికొన్ని నామపదబంధాలని ఇమడ్చవచ్చు (చూ. వాక్యాలు 14–25), నా. ప. అంటే నామపదబంధాలని వరసగా ఎన్నిటినైనా పెట్టుకోవచ్చునని అర్థం. పై సూత్రం వల్ల నామపదబంధం స్థానంలో వాక్యం ఉంచవచ్చునని తెలుస్తుంది. దీనివల్ల పూర్తివాక్యమే ఒక పెద్ద వాక్యంలో నామపదబంధంగా ఇమిడి ఉన్న వాక్యాలని సాధించవచ్చు. ఈ సూత్రంలో వాక్యాన్ని విస్తృతి చెయ్యడానికి మళ్లీ పదబంధ ప్రథమ సూత్రంతో ప్రారంభించవచ్చు. సూచక విశేషణాలు (సూ. వి. Determiners–Det.) ఆ, ఈ, అన్ని, ఇన్ని, ఇత్యాదులు (బ. వ. = బహువచనం). పై సూత్రం వల్ల సాధించగలిగిన రకరకాల నామబంధాలకి ఉదాహరణలు కింది వాక్యాలలో కర్తలు :

9. పులి ఉంది.
10. ఆ పులి ఇక్కడ ఉంది.
11. ఈ ఎద్దు బండి లాగుతుంది.
12. పులులు ఉన్నాయి.
13. ఈ ఆవులు పాలు ఇస్తాయి.

14. మా అన్నయ్య వస్తాడనే విషయం నాకు సంతోషాన్ని కలిగించింది.
15. తప్పు చేసిన పోలీసుల్ని కఠినంగా శిక్షిస్తారు అనే వార్త ఇవ్వేళ పేపర్లో పడింది.
16. నిన్న వచ్చిన అమ్మాయి మా కాలేజీలో చదువుతోంది.
17. రోడ్డు మీద వెళ్ళే పిల్లలు మాట్లాడుకొంటున్నారు.
18. పాలూ నీళ్ళూ కలుస్తాయి.
19. నాకు ఆవకాయీ అన్నం ఇష్టం.
20. రెండూ రెండూ కలిపితే నాలుగు అవుతుంది.
21. రాముడూ సీతా పెళ్ళి చేసుకున్నారు.
22. భార్యా, భర్తా, పిల్లలూ (కలిసి) సినిమాకి వెళ్ళారు.
23. రాజకీయవేత్తలు చెప్పేవి అబద్ధాలు.
24. డాక్టరుగారు రావడం మంచిదయింది.
25. తప్పు చెయ్యడం మానవ సహజం.

పై వాక్యాలలో 9-15 ప 3. సూత్రంలో మొదటి దానికీ, 16-17 రెండో దానికీ, 18-22 మూడో దానికీ, 23-25 నాలుగో దానికీ ఉదాహరణలు.

సర్వనామాలు (నేను, మేం, మీరు, వాడు మొ.) నామవాచకాలలో అంతర్భాగమైనవే కాబట్టి పై సూత్రంలో నా. అనే దాని స్థానంలో మాటలని పెట్టేటప్పుడు ఒక సర్వనామాన్ని కూడా తీసుకోవచ్చును. నామవాచకాలలో సర్వనామాలే కాక ఇతర అంతర్విభజనలు కూడా ఉన్నాయని కింద చూస్తాం.

ప. 4. క్రి ప. → (పద్ధతి) (చోటు) (కాలం) (కారణం) ము. క్రి. + స. క్రి.

పై సూత్రం క్రియాపదబంధాన్ని ముఖ్యక్రియ (ము. క్రి. Main Verb = MV) సహాయకక్రియ (స క్రి; Auxiliary = Aux ), పద్ధతి (Manner), చోటు (Place), కాలం (Time), కారణం (Reason) అనేవాటిని తెలిపే క్రియావిశేషణాలుగానూ విస్తృతిచేస్తుంది. క్రియావిశేషణాలు వైభాషికాలని కుండలీకరణాలు సూచిస్తాయి.

26. మంత్రిగారు రావడంవల్ల ఇవ్వాళ పనివాళ్లు మన ఊళ్ళో వీథులు శుభ్రంగా తుడిచేరు.

పై వాక్యంలో మంత్రిగారు రావడంవల్ల అనే పదబంధం కారణాన్నీ, ఇవ్వాళ అనేది కాలాన్నీ, మన ఊళ్ళో అనేది చోటునీ, శుభ్రంగా అనేది పద్ధతినీ సూచించే క్రియావిశేషణాలు.

ప. 5. ము. క్రి. ⟶ పూరకం + క్రి.

పై సూత్రం ముఖ్యక్రియాపదబంధాన్ని పూరకం, క్రియ అనే రెండు అంశాలుగా విస్తృతం చేస్తుంది. చెప్పు, వెళ్ళు, తిను, ఉండు మొదలైనవి క్రియలు. ముఖ్యక్రియాపదబంధంలో క్రియతోపాటు మరొక అంశం ఉంటే గాని సాధారణంగా వాక్యం అంగీకారయోగ్యం కాదు.

27. ఎ. నేను తిన్నాను

బి. నేను పకోడీలు తిన్నాను.

28. ఎ. నేను వెళ్లేను.

బి. నేను హైదరాబాదు వెళ్లేను.

పై వాక్యాలలో సంభాషణ ప్రారంభంలో వాడదగినవి బి. గుర్తు గలవి గాని ఎ. గుర్తు గలవి కావు. అటువంటప్పుడు ఎ. గుర్తుగల వాటిని వాడితే తిన్నది ఏమిటో, వెళ్లింది ఎక్కడికో శ్రోతకు తెలియదు కాబట్టి, సమాచారం పూర్తికాదు. కాని సంభాషణ మధ్యలో ఎ. గుర్తు గలవి అంగీకారయోగ్యాలే. ఎందువల్లనంటే, వాటిలో లేని 'పకోడీలు', 'హైదరాబాదు' అనే సమాచారం సందర్భంవల్ల (అంటే అంతకు ముందు జరిగిన సంభాషణవల్ల) శ్రోతకు తెలిసి ఉంటుంది. కాబట్టి క్రియతోబాటు వాక్యావగాహనకు ముఖ్యంగా ఉండవలసిన అంశం పూరకం (Complement) అని చెప్పవచ్చు. పూరకం చాలా రకాలుగా ఉంటుంది. కొన్ని వాక్యాలకి పూరకం ఆవశ్యకం కాదు. అటువంటి వాటిలో పూరకం లేక లోపం అని చెప్పవచ్చు. కొన్ని వాక్యాలలో పూరకం పూర్తి వాక్యంగానే

ఉండవచ్చు. కింది సూత్రం పూరకాలలో ముఖ్యమైన రకాలని వివరిస్తుంది.

ప. 6. పూరకం----→
ø
(నా. ప.) + నా. ప.
(అతి) గుణక్రియావిశేషణం
స్థలక్రియావిశేషణం
(నా.ప.) గతి క్రియావిశేషణం
వా.

(అతి = అతిశయద్యోతకాలైన (Intensifiers) చాలా, మరీ, ఎక్కువ మొ.)

ఉదాహరణలు :

29. చంటిపిల్ల నిద్రపోయింది.

30. ఆమె నవ్వింది.

నా. ప.

31. కవి ఒక పద్యం రాశాడు.

32. ఆయన మంత్రి (గా ఉన్నారు).

33. ఆయన తెలివితక్కువ వాడు (గా కనపడుతున్నాడు).

నా. ప. + నా. ప.

34. మా నాన్నగారు నాకు డబ్బు ఇచ్చారు.

35. రాముడు సీతకు ఉంగరం పంపేడు.

36. నెహ్రూ ఇందిరాగాంధీకి ఉత్తరాలు రాశాడు.

(అతి) గుణక్రియావిశేషణం

37. మల్లిపువ్వులు { తెల్లగా ఉన్నాయి. / తెలుపు. }

38. ఆ అమ్మాయి { పొట్టిగా ఉంది. / పొట్టి. }

39. ఆ అమ్మాయి { చాలా పొట్టిగా ఉంది. / మరీ పొట్టి. }

40. కాఫీ చాలా వేడిగా ఉంది.

స్థల క్రియావిశేషణం

41. మీ కాఫీ బల్లమీద ఉంది.

42. నటరాజు బడికి వెళ్ళాడు.

43. వెంకటేశ్వరస్వామి పటం గోడమీద వేళ్ళాడుతోంది.

(నా.ప.) + గతిక్రియావిశేషణం

44. నేను బస్సు (లోకి) ఎక్కేను.

45. నేను రైలు (లోంచి) దిగేను.

46. నేను ముసలమ్మను బండిలోకి ఎక్కించాను.

వాక్యం

47. వాడు మనం గెలుస్తామని నాకు చెప్పేడు.

48. ఇందిరాగాంధీ ధరలు తగ్గిస్తుందని ప్రజలు అనుకున్నారు.

ప. 7. స.క్రి.--- (ఉద్దేశక్రియ) కాలం.

పై సూత్రం సహాయక క్రియని విస్తృతంచేస్తుంది. ఉద్దేశక్రియ (Model Verb / Auxiliary) వాక్యంలో ప్రధానక్రియని గురించి వక్తకు ఉన్న ఉద్దేశాన్ని తెలియజేస్తుంది. గల, వచ్చు, వలయు వంటివి ఉద్దేశ క్రియలు. ఉద్దేశ క్రియ వైభాషికం.

49. వాడు సముద్రంలో ఈదగలడు.

50. ఇందిరాగాంధీ దరలు తగ్గించవచ్చు.

51. నేను రేపు బడికి వెళ్ళాలి.

52. చరణ్‌సింగ్ ప్రధానమంత్రి అవగలిగేడు.

53. ప్రజలు సహకరిస్తే ప్రభుత్వం ధరలు తగ్గించగలుగుతుంది.

54. ఈపాటికి మంత్రిగారు అమెరికా వెళ్ళి ఉండవచ్చు.

55. నిన్న మేం బజారుకు వెళ్ళవలసి వచ్చింది.

ప. 8. కాలం { భూతం / వర్తమానం / భవిష్యత్తు }

పై సూత్రం కాలం అనేది భూతభవిష్యద్వర్తమాన కాలాలలో ఏదో ఒకటి కావచ్చునని నిర్దేశిస్తుంది. 52–55 వాక్యాలవల్ల ఉద్దేశక్రియ వాక్యంలో ఉన్నప్పుడు కాలప్రత్యయాలు దానికి చేరతాయని తెలుస్తుంది.

పై పదబంధనిర్మాణ సూత్రాలు దిఙ్మాత్రమైనవేకాని అవి సమగ్రాలని అనుకోకూడదు. ఇవి తెలుగుభాషానిర్మాణ దృష్ట్యా కూర్చబడినవి. ఇంగ్లీషు పదబంధ నిర్మాణ సూత్రాలకీ వీటికీ భాషానిర్మాణ భేదంవల్ల కొన్ని భేదాలు వచ్చాయి. ఉదాహరణకి ఇంగ్లీషులో can, may మొదలైన సహాయక క్రియలు ముఖ్యక్రియకి ముందు ఉంటాయి; తెలుగులో గల, వచ్చు మొదలైనవి ముఖ్య క్రియ తరవాతస్తాయి. ఇంగ్లీషులో క్రియ తరవాత విశేషణం ఉంటుంది: He is good, తెలుగులో ఈ నిర్మాణం లేదు.

పై పదబంధ నిర్మాణ సూత్రాలను ఒకదాని తరవాత ఒకటిగా (లేక వీలైనచోట్ల ఒక దానినే రెండుమూడు సార్లు) ఉపయోగిస్తూ చాలా రకాల వాక్యాల అంతరంగ రూపాలు ఏర్పడతాయి. వైభాషికాంశాలు తీసుకోవడంవల్లా మానడం వల్లా ఒక అంశాన్ని రెండు మూడు రకాల అంశాలుగా మార్చడానికి వీలుండడం వల్లా ఉత్పన్నమయ్యే వాక్యాలలో చాలా వైవిధ్యం ఉండడానికి వీలుఉంది.

పదబంధ నిర్మాణ సూత్రాలతోపాటు నిఘంటువు కూడా ఉంటుంది. ఈ నిఘంటువులో నామాలు, క్రియలు, విశేషణాల మొదలైన వ్యాకరణ వర్గాలలో ఒక్కొక్కదాని కిందకి వచ్చే అన్ని పదాలూ ఉరాయి. పదబంధ నిర్మాణ సూత్రాల ప్రకారం వచ్చిన ఆఖరి వరసలో ఉన్న వ్యాకరణ వర్గాలకి బదులు వాటికి చెందిన ఒక్కొక్క పదాన్ని చేరిస్తే మామూలు వాక్యానికి సన్నిహితమైన రూపం వస్తుంది. వీటిపై పరివర్తన సూత్రాలూ, వర్ణనిర్మాణ సూత్రాలూ ప్రవర్తించడంవల్ల అసలు వాక్యరూపం ఏర్పడుతుంది. ఉదాహరణకి ఈ కింది వాక్యం నిష్పాదన విధానం కింద ఇచ్చిన వృక్షపటం ద్వారా స్పష్టమవుతుంది.

56. అవును. ఆ అమ్మాయి బాగా పాటలు పాడగలదు.



పై వాక్యంలో 'పాడు' అనే క్రియ 'పాడ' గా వర్ణనిర్మాణ సూత్రం వల్ల మారుతుంది. అదే విధంగా 'గల' అనే సహాయక క్రియకి 'దు' ప్రత్యయం చేరడం అన్వయాన్ని సాధించే పరివర్తన సూత్రం ద్వారా జరుగుతుంది. పై పటం సూచించే నిష్పాదనవల్ల 56 వ వాక్యమే కాకుండా 57–59 వాక్యాలూ, ఇంకా అటువంటివి అనేకం సాధించబడతాయి.

57. అవును. ఈ గుర్రం తొందరగా బళ్లు లాగగలదు.

58. అవును. ఆ మనిషి వేగంగా పనులు చెయ్యగలడు.

59. అవును. ఆ అబ్బాయి గబగబా పద్యాలు చదవగలడు.

## 7.3 అర్థలక్షణాలు :

పదబంధ సూత్రాలన ఉపయోగించి ఒక నిష్పాదనని సాధించి చివర వచ్చిన వ్యాకరణ వర్గాలకు బదులు వాటికి సంబంధించిన పదాలు పెట్టడంవల్ల భాషలో వాక్యాలు సాధించవచ్చునని పైన చూశాం. కాని ఇలా చేసినప్పుడు అంగీకారయోగ్యాలైన వాక్యాలే కాక అంగీకారయోగ్యాలు కాని 60–65 వంటి వాక్యాలు కూడా ఉత్పత్తి చేయబడవచ్చు.

60. * నా దువ్వెన నవ్వింది.

61. * భావాలు నిద్రిస్తున్నాయి / నిద్రపోతున్నాయి.

62. * పులి మాట్లాడింది.

63. * పంది పిల్లలు అన్నం వండుతున్నాయి.

64. * అమ్మ కాఫీ వండుతోంది.

65. * నేను కుర్చీని మింగేను.

పై వాక్యాలలో యోగ్యత లోపించింది (చూ. 6.1) 60–63 వాక్యాలలో కర్తకీ క్రియకీ మధ్యా, 64–65 వాక్యాలలో కర్మకీ క్రియకీ మధ్యా యోగ్యత లేకపోవడంవల్ల ఇవి అసాధువులు. ఇటువంటి వాక్యాలు ఏర్పడకుండా వ్యాకరణం నిరోధించాలి. కాబట్టి ప్రతిమాటకీ ఉన్న అర్థ లక్షణాలని (Semantic Features)

వ్యాకరణం గుర్తించాలి. మాటలని వాటి అర్థాలనుబట్టి కొన్ని సముదాయాలుగా విభజించవచ్చు. ఉదాహరణకి కొడుకు, కూతురు, ముసలివాడు, వర్తకుడు మొదలైన మాటలు మనుష్యవాచకాలు; ఆవు, గేదె, మేక, సింహం వంటివి జంతు వాచకాలు. మొదటి సముదాయంలో ఉన్న మాటల అర్థంలో సాధారణ ధర్మం మనుష్యత్వం; రెండో సముదాయంలో ఉన్న మాటలలో సాధారణ ధర్మం జంతుత్వం లేక అమనుష్యప్రాణిత్వం. ఈ రెం..సముదాయాలలో ఉన్న వాటి అన్నిటికీ సమానధర్మం ప్రాణిత్వం. గాలి, రాయి, కొండ వంటివి ప్రాణిత్వంలేనివి (లేక అప్రాణులు). ప్రాణిత్వం, మనుష్యత్వం మొదలైనవి అర్థలక్షణాలు. కాబట్టి మాటల అర్థాన్ని బట్టి వాటిని కొన్ని సముదాయాలుగా విభజించటానికి ఉపయోగించే లక్షణాలు అర్థలక్షణాలు అని చెప్పవచ్చు. అర్థలక్షణాలని నిఘంటువులో ఆయా పదాలతోపాటు + లేక – గుర్తులతో సూచించవచ్చు. కొడుకు మొదలైనవి మనుష్య వాచకాలని వాటిని కొడుకు (+ మనుష్యత్వం) ఈ విధంగా సూచించవచ్చు. ఆవు (– మనుష్యత్వం, + ప్రాణిత్వం), రాయి (– ప్రాణిత్వం). ఈ విధంగా నిఘంటువులో అర్థలక్షణాల సూచన చెయ్యబడుతుంది. ఒక పదానికి (+ మనుష్యత్వం) అనే లక్షణం ఉంటే దానికి (+ ప్రాణిత్వం) అనే లక్షణం కూడా తప్పక ఉంటుంది కాబట్టి (+ మనుష్యత్వం) తోపాటు (+ప్రాణిత్వం)ని సూచించనక్కరలేదు. మనుష్యత్వం లేనివి ప్రాణులు (ఆవు, పులి) కావచ్చు లేక అప్రాణులు కావచ్చు (రాయి, ఇల్లు). కాబట్టి (–మనుష్యత్వం) తో పాటు ప్రాణిత్వ లక్షణాన్ని కూడా సూచించాలి. అర్థలక్షణాలని వ్యాకరణంలో ఆవశ్యకతని బట్టి ఇంకా సూక్ష్మంగా సూచించవచ్చు. (+ మనుష్యత్వం) అనే లక్షణం ఉన్న నామాలని (+ పురుషత్వం), (–పురుషత్వం) అనే విధంగా అంతర్విభజనచేస్తే 66–67 వంటి అసాధు వాక్యాలు నివారించబడతాయి.

66. • ఆ అబ్బాయి మా కోడలు

67. • ఆ అమ్మాయి మా అల్లుడు

ఇంకా నామాలని (+ సంఖ్యేయం), (– సంఖ్యేయం), (+ మూర్తం), (–మూర్తం) మొదలైన అర్థలక్షణాలలో అంతర్విభాగం చెయ్యవచ్చు; కుర్చీ, మంచం మొదలైనవి లెక్కపెట్టవచ్చు కాబట్టి ఇవి (+ సంఖ్యేయం); గాలి, విజాయితీ, సంతోషం

మొదలైనవి (– సంఖ్యేయం, – మూర్తం), ఒక ఆకారం గలవీ, ముట్టుకోదగినవీ, కనపడేవీ (+ మూర్తం) : చెట్టు, పువ్వు. మొదలైనవి. వాటికి వ్యతిరేకమైనవి (– మూర్తం) : పాట, సంగీతం, చదువు మొ.

నామాలకి చేసినట్లే క్రియలకి కూడా అర్థలక్షణ విభాగం చెయ్యవచ్చు. క్రియలలో ముఖ్యమైన విభజన సకర్మకత్వం (+ కర్మ), అకర్మకత్వం (–కర్మ). ఇంతేకాక ఇంకా సూక్ష్మవిభజన కూడా అవసరమవుతుంది. నవ్వు, మాట్లాడు, వండు వంటి క్రియలు (+ మనుషత్వం) అనే లక్షణం ఉన్న నామాలనే కర్తలుగా గ్రహిస్తాయి నిద్రపోవు, మింగువంటి క్రియలు (+ ప్రాణిత్వం) అనే లక్షణం ఉన్న నామాలనే కర్తలుగా గ్రహిస్తాయి. వండు అనే క్రియ కాఫీ, టీ వంటి వాటిని కర్మలుగా గ్రహించదు; అన్నం, కూరవంటి వాటినే కర్మలుగా గ్రహిస్తుంది. మింగు అనే క్రియ మందు, విషంవంటి వాటినే గాని కుర్చీ, చెట్టువంటి వాటిని కర్మలుగా గ్రహించదు. క్రియల అర్థలక్షణాలని ఈ కింది విధంగా సూచించవచ్చు

నవ్వు (– కర్మ, + మనుష్యకర్త)

వండు (+ కర్మ (– ద్రవం), + మనుష్యకర్త)

మింగు (+ కర్మ, + ప్రాణికర్త)

పై అర్థలక్షణ వివరణ దిక్ప్రదర్శకం మాత్రమే. ఇటువంటి నిఘంటువును సమగ్రంగా తయారుచేసేటప్పుడు ఇంకా సూక్ష్మతరమైన విభేదాల్ని గ్రహించవలసి ఉంటుంది.

అర్థలక్షణ విశ్లేషణ (Componential Analysis) నామాలకీ క్రియలకీ మధ్య యోగ్యత ఉండేటట్టుగానే గ్రహించి సాధువాక్యాలని మాత్రమే సాధించడానికి తోడ్పడుతుందని గ్రహించాము. ఇటువంటి యోగ్యత విశేషణాలకీ, నామాలకీ మధ్య క్రియావిశేషణాలకీ క్రియలకీ మధ్య కూడా ఉంటుంది. సాధారణ వ్యవహారంలో అసాధువులైన కొన్ని వాక్యాలు కథలు, కవిత్వంవంటి కొన్నిటిలో సాధువులగానే కనపడతాయి. 60, 62, 63 వాక్యాలు కథలలో సాధువులే. 60,

61,65 వాక్యాలు కవిత్వంలో సాధువులు. ఇటువంటి సందర్భాలలో అప్రాణులకు ప్రాణిత్వాన్ని ఆరోపించడం, అమనుష్యులకు మనుష్యత్వాన్ని ఆరోపించడం వంటి మార్పులు రససిద్ధికోసం చేయబడుతూ ఉంటాయి.

## 7.4. అంతరంగ నిర్మాణం – బహిరంగ నిర్మాణం

పదబంధ నిర్మాణ సూత్రాలని ప్రవర్తింపజేసి సాధించిన వాక్యరూపాలు వ్యవహారంలో ప్రయోగించడానికి తగినవి కావనీ, వాటిమీద పరివర్తన సూత్రాలూ, వర్ణనిర్మాణ సూత్రాలూ ప్రవర్తిస్తేనే వ్యవహారయోగ్యమైన వాక్యాలు తయారవుతాయనీ ఇంతకుముందు చెప్పబడింది. పరివర్తన సూత్రాల స్వరూపస్వభావాన్నీ ఆవశ్యకతనీ గురించి తెలుసుకొనేముందు ప్రతి వాక్యానికీ అంతరంగ నిర్మాణం, బహిరంగ నిర్మాణం అని రెండు రూపాలు ఉంటాయని తెలుసుకోవడం ముఖ్యం. ఒక వాక్యానికి ఉన్న అర్థమే అంతరంగ నిర్మాణం అని కొందరు భాషాశాస్త్రజ్ఞుల విశ్వాసం. మరికొందరు అర్థమే అంతరంగ నిర్మాణమని ఒప్పుకోకపోయినా, వాక్యార్థానికి అంతరంగ నిర్మాణమే బహిరంగ నిర్మాణంకన్న సన్నిహితంగా ఉంటుందని ఒప్పుకొంటారు. ఈ రెండవ తెగవారి మతంలో ఒక వాక్యానికి గల వాక్యనిర్మాణమే అంటే నామం + క్రియాపద బంధం, దీని విస్తృతి – దాని అంతరంగ నిర్మాణం. బహిరంగ నిర్మాణం ఉచ్చారితమైన (లేక లిఖితమైన) వాక్యరూపానికి తుల్యమైనది లేక అతి సన్నిహితమైనది. పరివర్తన సూత్రాలు ఒక వాక్యం అంతరంగ నిర్మాణాన్నించి దాని బహిరంగ నిర్మాణాన్ని సాధిస్తాయి. ఒక వాక్యాన్ని మనం విన్నప్పుడు మనకు వినపడినది దాని బహిరంగ నిర్మాణం. కాని ఆ వినపడిన వాక్యాన్ని మనం అర్థం చేసుకొనేటప్పుడు దాని అంతరంగ నిర్మాణాన్ని ఊహించి అర్థం చేసుకొంటాం. అందువల్ల రెండువిభిన్న నిర్మాణాలు గల వాక్యాలని మనం ఒకే అర్థం గలవిగా గ్రహించడానికి అవకాశం ఉంది.

68. ఎ) నేను సుబ్బారావుగారిని ఎరుగుదును.

బి) నాకు సుబ్బారావుగారు తెలుసు.

సి) సుబ్బారావుగారు నాకు తెలుసు.

69. ఎ) విశాలాక్షి మొగుడు మీద కోపంగా ఉంది.

బి) విశాలాక్షికి మొగుడు మీద కోపం వచ్చింది.

70. ఎ) నేను నారాయణని బజార్లో చూశాను.

బి) నాకు నారాయణ బజార్లో కనపడ్డాడు.

71. ఎ) నేను నిన్నరాత్రి శంకరాభరణంలో పాటలు విన్నాను.

బి) నాకు నిన్నరాత్రి శంకరాభరణంలో పాటలు వినపడ్డాయి.

72. ఎ) నేను ఆకలిగా ఉన్నాను.

బి) నాకు ఆకలి వేస్తోంది.

73. ఎ) నువ్వు అన్నం తిను.

బి) అన్నం తిను.

74. ఎ) మీరు సిగరెట్లు కాల్చకండి.

బి) సిగరెట్లు కాల్చకండి.

సి) సిగరెట్లు { కాల్చవద్దు / కాల్చొద్దు. }

పై వాక్యాలలో (ఎ) (బి) (సి) వాక్యాలు తుల్యార్థకాలు, (ఎ) (బి) లు మాత్రమే ఇవ్వబడిన వాక్యాలకి కూడా వాటిలో పదాలక్రమాన్ని మార్చి కొత్త వాక్యాలు తయారు చెయ్యవచ్చు. ఉదాహరణకి

69. సి) మొగుడుమీద విశాలాక్షి కోపంగా ఉంది.

డి) మొగుడుమీద విశాలాక్షికి కోపం వచ్చింది.

పై వాక్యాలు 69 (ఎ) (బి) లతో తుల్యార్థకాలే (ఒక్కొక్కప్పుడు ఇటు

వంటి మార్పు వాక్యంలో ఒక పదానికి ఊనికని లేక ప్రాధాన్యాన్ని ఇస్తుంది. (69 (సి) (డి)లలో ధ్వని విశాలాక్షి మొగుడు మీదే కోపం కాని ఇతరుల మీద కా- కొన్నిచోట్ల పదక్రమంలో మార్పు అసాధ్యం. 71 లో 'నిన్న రాత్రి' ని 'రాత్రి నిన్న' గా మార్చలేం.

పై వాక్యాలలో (ఎ) (బి) (సి) రూపాల నిర్మాణం వేరుగా ఉన్నా అవి సూచించే అర్థం ఇంచుమించు ఒకటే, దీనినే ఇంకో విధంగా, అంటే, ఈ వాక్యరూపాల బహిరంగ నిర్మాణం వేరయినా వాటి అంతరంగ నిర్మాణం ఒకటే అని చెప్పవచ్చు. 68 (ఎ) లో 'నేను' కర్త; 'సుబ్బారావుగారు' కర్మ; (బి) (సి) లలో సుబ్బారావుగారు కర్త; వీటిలో 'నేను' చతుర్థీవిభక్తిలో 'నాకు' గా ఉంది. (బి) (సి) లకి పదక్రమంలో మాత్రమే భేదం ఉంది. ఇలా వీటి బహిరంగ రూపాలు వే.. వేరుగా ఉన్నా, వీటి అర్థం ఒకటే. కాబట్టి వీటన్నిటికీ ఒకే అంతరంగ నిర్మాణ- ఉందని అనుకోవడం సమంజసం. పరివర్తన వ్యాకరణం ఇటువంటి తుల్యార్థకాలైన వాక్యాలన్నిటినీ ఒకే అంతరంగ నిర్మాణం నించి సాధిస్తుంది. భిన్న నిర్మాణం కలిగినా తుల్యార్థకాలైె వాక్యాల పరస్పర సంబంధాన్ని శాస్త్రీయంగా సూత్రరూపంలో వివరించడం పరివర్తన వ్యాకరణం ముఖ్యమైన ప్రత్యేకత.

ఒక్కొక్కసారి బహిరంగ నిర్మాణంలో కొన్ని పదాలు లోపిస్తాయి. 73 (బి) లో నువ్వు, 74 (బి) (సి) లలో 'మీరు' లేవు. అయినా ఈ వాక్యాలని మనం అర్థం చేసుకొనేటప్పుడు ఈ పదాలు ఉన్నట్టుగా గ్రహించి అర్థం చేసుకొంటాం. కాబ- -- వాక్యాలను అర్థం చేసుకోవడంలో కష్టం ఉండదు. 73 (బి) లో 'తిను' అనే క్రి.. -ఏకవచనం కాబట్టి ఇందులో కర్త 'నువ్వు' అధ్యాహార్యంగా ఉందని తెలుసుకోవచ్చు. అలాగే 74 (బి) లో క్రియ విశేష విధ్యేక వచనం కాబట్టి ఇందులో కర్త 'మీరు' అధ్యాహారంగా ఉందని తెలుసుకోవచ్చు. 73 (ఎ), 74 (ఎ) లలో 'నువ్వు' 'మీరు' బహిరంగంగానే ఉన్నాయి కా-ట్టి ఈ వాక్యరూపాలు వాటి (బి) వాక్యరూపాలకన్న అంతరంగ నిర్మాణా-.. సన్నిహితంగా ఉన్నాయని చెప్పవచ్చు. ఈ (బి) వాక్యరూపాలలో -ర్తృలోపం అనే పరివర్తన సూత్రం వర్తించింది. 74 (సి) లో కర్త 'నువ్వు' కాని, 'మీరు' కాని కావచ్చు. ఈ రెండింటిలో ఏది ఉద్దిష్టమైంది అనేది సందర్భాన్నిబట్టే తెలుస్తుంది. కాబట్టి బహిరంగ నిర్మాణంలో ఏ పదం లోపించింది అనేది వాక్యంలో ఉన్న ఇతర పదాలవల్లా లేక

సందర్భంవల్లా తెలుస్తుంది. ఒక వాక్యం అంతరంగ నిర్మాణంలో దాన్ని సరిగా అర్థం చేసుకోవడానికి కావలసిన పూర్తి సామగ్రి ఉంటుంది. బహిరంగ నిర్మాణంలో అంతరంగ నిర్మాణంలోని పదాలు లోపించవచ్చు. లేక ఒక పదం స్థానే మరొక పదం (సర్వనామం వంటిది) ఉండవచ్చు. ఈ కింది వాక్యం చూడండి :

75. (ఎ) రామయ్య పెళ్లాన్ని కొట్టేడు.
 (బి) రామయ్య తన పెళ్ళాన్ని కొట్టేడు.
 (సి) ★ రామయ్య రామయ్య పెళ్ళాన్ని కొట్టేడు.

75 (ఎ) లో రామయ్య తన పెళ్ళాన్నే కొట్టేడు కాని ఇంకొకళ్ళ పెళ్లాన్ని కాదని స్పష్టం. ఈ విషయం 75 ని 76 తో పోల్చిచూస్తే తెలుస్తుంది.

76. రామయ్య సుబ్బయ్య పెళ్ళాన్ని కొట్టేడు.

76 లో 'సుబ్బయ్య' అనే పదం లోపిస్తే ఈ అర్థం రాదు. కాబట్టి ఒక వాక్యంలో కర్మ కర్తకి చెందినదయితే కర్మకి విశేషణంగా ఉన్న కర్తృపదం లోపించవచ్చుననే సాధారణసూత్రం మనకి తెలుస్తుంది. అందువల్ల 75 (ఎ) కి అంతరంగ నిర్మాణం (సి) అని తెలుస్తుంది. 75 (బి) లో కర్మ విశేషణమైన 'రామయ్య' స్థానంలో 'తన' వచ్చింది. కాబట్టి 75 (ఎ) (బి) లు రెండిటికీ అంతరంగ నిర్మాణం 75 (సి) అని తెలుస్తుంది. కాని 75 (సి) ప్రయోగయోగ్యం కాదు (కాని ఇందులో 'రామయ్య' 'రామయ్య' అనే పదాలు ఒకే వ్యక్తినికాక ఒకే పేరు గల ఇద్దరు వేరువేరు వ్యక్తులని సూచించేవి అయితే ఈ వాక్యం సాధువే అవుతుంది). పై ఉదాహరణవల్ల కొన్ని సందర్భాలలో ప్రయోగయోగ్యాలు కాని అంతరంగ నిర్మాణలని కూడా వ్యాకర్త ఏర్పరుచుకోవలసి వస్తుందని తెలుస్తుంది. బహిరంగ నిర్మాణాలు అంతరంగ నిర్మాణం నించి పరివర్తన సూత్రాలు ప్రవర్తించడం ద్వారా సాధించబడతాయి.

బహిరంగ నిర్మాణంలో కొంచెం మాత్రం భేదం గల వేరువేరు వాక్యాలని పోల్చిచూడడం వల్ల కూడా ఒక వాక్యంలో ఏ పదం లోపించిందో తెలుసుకోవచ్చు..

77. నేను ఎమ్మే చదవాలి అనుకొంటున్నాను.

78. నేను మా అమ్మాయి ఎమ్మే చదవాలి అనుకొంటున్నాను.

పై వాక్యాలని పోల్చి చూస్తే 77 లో నేను తరవాత మరొక నేను ఉండాలి అనేది స్పష్టం; కాబట్టి దీని అంతరంగనిర్మాణం 79 అని చెప్పవచ్చు (ఇది కూడ ప్రయోగానర్హమే).

79. ★ నేను 2నేను ఎమ్మే చదవాలి' అనుకొంటున్నాను.

అంతరంగ నిర్మాణం అర్థానికి సన్నిహితం కాబట్టి అందులో అర్థ సందిగ్ధతకి తావులేదు. కాని బహిరంగ నిర్మాణంలో అర్థసందిగ్ధతకి అవకాశం ఉంది. కాబట్టి ఒకే బహిరంగ నిర్మాణం గల వాక్యానికి రెండు లేక అంతకన్న ఎక్కువ అర్థాలు ఉండడానికి అవకాశం ఉంది. మనం పైన లేక అంతకన్న ఎక్కువ అర్థాలు ఉండడానికి అవకాశం ఉంది. మనం పైన భిన్న నిర్మాణం గల తుల్యార్థకాలైన వాక్యాలకి ఒకే అంతరంగ నిర్మాణం ఉంటుందనడానికి చాలా ఉదాహరణలు చూశాం. ఇప్పుడు మనం ఒకే వాక్యానికి భిన్నార్థాలు ఉండడంవల్ల వేరువేరు అంతరంగ నిర్మాణాలు ఉండడానికి అవకాశం ఉందని తెలుసుకొంటాం.

80. మేక తినడానికి సిద్ధంగా ఉంది.

పై వాక్యానికి రెండు అర్థాలు ఉన్నాయని దీన్ని 81, 82 లతో పోల్చిచూస్తే తెలుస్తుంది.

మేక పులి తినడానికి సిద్ధంగా ఉంది.

82. మేక గడ్డి తినడానికి సిద్ధంగా ఉంది.

80 ని 81 కి బదులుగా గాని 82 కి బదులుగా గాని వాడవచ్చు. కాబట్టి 80 కి 81, 82 లకి సన్నిహితమైన రెండు వేరువేరు అంతరంగ నిర్మాణాలు ఉన్నాయనేది స్పష్టం. 81లో 'మేక' కర్మ. 82 లో 'మేక' కర్త. ఈ భేదాన్ని 80 నిర్మాణం సూచించలేదు. అందులో 'మే.. కర్త మాత్రంగానే బాహ్యరూపంలో కనిపిస్తుంది.

83. నేను వాణ్ణి నిన్న రమ్మన్నాను.

పై వాక్యానికి కూడా రెండు అర్థాలు ఉన్నాయి. ఒక అర్థంలో 'నిన్న' నేను

వాడితో రమ్మని చెప్పినప్పుడు సమయాన్నీ, రెండో అర్థంలో 'నిన్న' వాడు రావలసిన సమయాన్నీ సూచిస్తుంది. 84, 85 వాక్యాలు ఈ విషయాన్ని స్పష్టం చేస్తాయి.

84. నేను వాణ్ణి నిన్న కలుసుకొన్నపుడు (తరవాత) రమ్మన్నాను.

85. నేను వాణ్ణి నిన్న రమ్మని మొన్న చెప్పేను.

పై చర్చవల్ల ఒక వాక్యం నిజమైన స్వభావాన్ని తెలుసుకొందుకు దాని బహిరంగ నిర్మాణాన్ని మాత్రం చూస్తే చాలదనీ అంతరంగ నిర్మాణమే బహిరంగ నిర్మాణం కన్న ముఖ్యమైనదనీ స్పష్టమవుతుంది. అంతరంగ నిర్మాణం నించి దానికి సంబంధించిన బహిరంగ నిర్మాణాన్ని లేక బహిరంగ నిర్మాణాలని సాధించేవి పరివర్తన రూపాలు. వీటిని గురించి తరవాత విభాగంలో చూద్దాం.

## 7.5. పరివర్తన సూత్రాలు

ఒక వాక్యం అంతరంగ నిర్మాణం నించి దాని బహిరంగ నిర్మాణాన్ని లేక బహిరంగ నిర్మాణాలని సాధించడానికి ఉపకరించేవి పరివర్తన సూత్రాలు అవి పైన చూశాం. ఒక వాక్యం బహిరంగ రూపాన్ని సాధించడానికి కొన్ని చోట్ల ఒకటికన్న ఎక్కువ పరివర్తన సూత్రాలు అవసరమవుతాయి. కాబట్టి పరివర్తన సూత్రాలు బహిరంగ నిర్మాణాన్నిగాని, దానికి దగ్గరగా ఉన్న వాక్యావస్థనిగాని సాధిస్తాయి అని చెప్పడం సమంజసం. అంతరంగ నిర్మాణం వాక్యం అర్థమే కాబట్టి అది అమూర్తం; పదబంధ నిర్మాణ సూత్రాలు దీనికి కొంతవరకు దృశ్యాకారాన్ని ఇస్తాయి. కాబట్టి పరివర్తన సూత్రాలు పదబంధ నిర్మాణసూత్రాలు ప్రవర్తించడంవల్ల ఏర్పడిన వ్యాకరణ సంవర్గాల వరుసల మీద ప్రవర్తిస్తాయి. పదబంధ నిర్మాణ సూత్రాలు చెయ్యలేని పనులు పరివర్తన సూత్రాలు చేస్తాయి. కాబట్టి మొదటి రకం సూత్రాలకన్న రెండో రకానివి శక్తి మత్తరాలు. పరివర్తనసూత్రాలు ఒక వ్యాకరణ సంవర్గాల వరుస మీద ప్రవర్తించి దానిలో అవసరమైన మార్పులు చేస్తాయి. ఇవి చెయ్యగలిగిన పనులు నాలుగు : 1. చేర్పు (Addition), 2. లోపం (Deletion), 3. క్రమ విపర్యయం (Rearrangement),

4. ఆదేశం (Substitution). పదబంధ నిర్మాణ సూత్రాలు ఒక వ్యాకరణ సంవర్గాన్ని - అంటే వాక్యం, నామ పదబంధం మొదలైన వాటిని - విస్తృత చెయ్యగలవుగాని పైన చెప్పిన పనులని అవి చెయ్యలేవు.

పరివర్తన సూత్రాలు అంతరంగ నిర్మాణాన్ని బహిరంగ నిర్మాణంగా మార్చేవి మాత్రమే. కాబట్టి పరివర్తన సూత్రాలు ప్రవర్తించడం వల్ల మూల వాక్యం అర్థం సాధారణంగా మారదు. అంతరంగ నిర్మాణంలో వాక్యం పూర్తి అర్థం ఇమిడి ఉంటుంది కాబట్టి పరివర్తన సూత్రాలు ఒక కొత్త పదాన్ని చేర్చడం చాలా అరుదుగా జరుగుతుంది. ఇలా చేర్చబడిన పదం కూడా ప్రత్యేకార్థం కలిగి ఉండక వేరు పదాలకి లేక ప్రత్యయాలకి ఊతగా మాత్రం ఉంటుంది. ఇంగ్లీషులో do అనే క్రియ దీనికి మంచి ఉదాహరణ :

I know him.

I do not know him.

Do I know him ?

**పైవాక్యాలలో వ్యతిరేకార్థకమైన not కి ఊతగానూ, ప్రశ్నలో కర్తకి ముందు స్థానానికి క్రియను తీసుకురావడంకోసమూ చేర్చబడింది. తెలుగులో వలయు, లే-లనే సహాయక క్రియల తరవాత కాలప్రత్యయాలని చేర్చడంకోసం క్రమంగా వచ్చు, పో-అనే క్రియలు కొత్తగా చేర్చబడతాయి (86-89 చూడండి).**

86. నేను నిన్న బజారుకి వెళ్ళవలసి వచ్చింది.

87. వాడు రాకపోతే మనం వెళ్ళవలసి వస్తుంది.

88. నీరసంవల్ల నేను పని చెయ్యలేకపోతున్నాను.

89. చిన్నపిల్లల్ని పెద్దపనులు చెయ్యమంటే చెయ్యలేకపోతారు.

నిర్దిష్టమైన కాలసూచనలేకపోతే ఈ సహాయ క్రియల తరవాత వచ్చు, పో, లు ఉండవు.

90. నేను బజారుకి వెళ్ళాలి.

91. నేను పని చెయ్యలేను.

కొన్నిచోట్ల అంతరంగ నిర్మాణంలో ఉన్న ఒక పదాన్ని పరివర్తన సూత్రాలు లోపింపజేస్తాయి. ఉదాహరణకి 92, 93 వాక్యాలు చూడండి.

92. మా తమ్ముడు 'నేను పెళ్ళిచేసుకోను' అంటున్నాడు.

93. మా తమ్ముడు పెళ్ళిచేసుకోను అంటున్నాడు.

92 లో ఉన్న 'నేను' 93 లో లోపించింది.

పరివర్తన సూత్రాలు పదాల క్రమాల్ని మార్చడం సర్వసాధారణం.

94. వాడు నాకు నిన్న కనిపించాడు.

95. నాకు వాడు నిన్న కనిపించాడు.

96. నిన్న వాడు నాకు కనిపించాడు.

97. నిన్న నాకు వాడు కనిపించాడు.

98. వాడు నిన్న నాకు కనిపించాడు.

99. నాకు నిన్న వాడు కనిపించాడు.

పై వాక్యాలన్నిటికీ అర్థం ఒకటే కాబట్టి ఇవన్నీ ఒకే అంతరంగ నిర్మాణాన్నించి ఉత్పన్న మయ్యాయని చెప్పవచ్చు.

అంతరంగ నిర్మాణంలో ఉన్న ఒక పదానికి బదులు మరొక పదాన్ని ఉపయోగించడం ఆదేశం. 100వ వాక్యం 92 కి సమానం. 92 లో 'నేను' కి బదులు 100 లో 'తను' ఆదేశమయింది.

100 మా తమ్ముడు తను పెళ్ళిచేసుకోను అంటున్నాడు.

పరివర్తన సూత్రాలు ఒకే వాక్యంలోని అంగాలమీద ప్రవర్తించి దాని బహిరంగ నిర్మాణాన్ని సాధించగలవు, లేక అవి రెండు లేక అంతకన్న ఎక్కువ వాక్యాలమీద ప్రవర్తించి వాటిని ఒక వాక్యంగా కలపగలవు. ఒకటి కన్న ఎక్కువ వాక్యాలని కలిపి ఒక వాక్యంగా చేసినపుడు సాధించబడిన వాక్యంలో రెండు రకాలు ఉన్నాయి. వీటిలో ఒక రకం సంశ్లిష్ట వాక్యం (Complex Sentence) : దీనిలో మూలవాక్యాలలో ఒకదానిలో రెండోది లేక మిగిలినవి ఇమడ్చబడతాయి. రెండోరకం సంయుక్త వాక్యం (Compound/Conjoined Sentence) : ఇందులో మూలవాక్యాలు లేక వాటి అంగాలు వేటికవి స్వయంప్రతిపత్తితో ఉంటాయి. ముందుగా ఒక వాక్యంలోని అంగాలమీదే ప్రవర్తించే పరివర్తన సూత్రాలని కొన్నింటిని చూసి ఆ తరవాత సంశ్లిష్ట సంయుక్త వాక్యాలని గూర్చి చర్చిద్దాం.

101. (ఎ) నేను అమెరికా వెళ్ళేను.
(బి) నేను అమెరికా వెళ్తున్నాను.
(సి) నేను అమెరికా వెళ్తాను.

102. (ఎ) నేను అమెరికా వెళ్ళలేదు.
(బి) నేను అమెరికా వెళ్ళడం లేదు.
(సి) నేను అమెరికా వెళ్ళను.

101 లో వాక్యాలకి 102 లో వాక్యాలు వ్యతిరేకాలు. వ్యతిరేక వాక్యాలని సాధించడానికి పదబంధ నిర్మాణ సూత్రాలలో మొదటి దానిలో వాక్యవిశేషణంగా వ్యతిరేకాన్ని తీసుకోవాలి. కాని ఈ వ్యతిరేకం భిన్న కాలాలలో భిన్న రూపాలతో బహిరంగ నిర్మాణంలో వ్యక్తమవుతోంది. భూతకాలంలో వ్యతిరేకం క్రియకి – అ చేర్చ లేదు చేర్చడం వల్లా, వర్తమానంలో వ్యతిరేకం క్రియకి – అడ్డం చేర్చి లేదు చేర్చడం వల్లా, భవిష్యత్తులో వ్యతిరేకం క్రియకి – అ మాత్రం చేర్చడం వల్లా వ్యక్తీకరించబడుతోంది (భవిష్యత్తులో వ్యతిరేకమైన అ–కి తరవాత పురుష ప్రత్యయాలు ఉంటాయి). ఈ విషయాన్ని ఈ కింది పరివర్తన సూత్రం స్పష్టపరుస్తుంది.

| | | | |
|---|---|---|---|
| భూ. కా. | | | ఆ లేదు |
| వ. కా. | + వ్య. | ⇒ | అడ్డం లేదు |
| భ. కా. | | | అ |

వ్యతిరేకంలా ప్రశ్న పరివర్తనం కూడా ఏకవాక్యాంగాల మీదనే ప్రవర్తిస్తుంది. ప్రశ్న వాక్యాన్ని సాధించడానికి మొదటి పదబంధ నిర్మాణసూత్రంలో వాక్యవిశేషణంగా ప్రశ్నని తీసుకోవాలి. ప్రశ్నంలో రెండు రకాలు ఉన్నాయి. ఒక రకం అవును/కాదు/ఉంది/లేదు. అనే సమాధానం కోరేది: (ఇందులో ప్రశ్నార్థకం – ఆ).

103. నువ్వు రేపు వెళ్తావా ?

104. అది కమలేనా ?

105. మీ ఊళ్లో గుడి ఉందా ?

రెండో రకంలో ఎ–తో మొదలయ్యే ప్రశ్నార్థక పదం (ఎవరు, ఎప్పుడు, ఎలా మొ.) ఉంటుంది రెండో రకం వాక్యాల అంతరంగ నిర్మాణంలో ఏదో ఒక వ్యాకరణ సంవర్గం మీద ప్రశ్న లక్షణం ఉంటుంది. (దీన్ని ఎ – తో సూచించవచ్చు); ఇది అర్థలక్షణాల వంటి ఒక లక్షణం.

106. మీ ఇంటికి ఎవరు వచ్చారు ?

107. నువ్వు ఏం కొన్నావు ?

పై వాక్యాల అంతరంగ నిర్మాణాలు 108, 109 లు.

108. నా. ప. ఎ – మీ ఇంటికి వచ్చారు ?

109. నువ్వు నా. ప. ఎ – కొన్నావు ?

వీటిలో ఎ – ప్రశ్న లక్షణం కర్తృపదబంధం మీద 108 లోనూ కర్మపద బంధం మీద 109 లోనూ ఉంది. నామపదబంధం [+ మనుష్య] అయితే అది ప్రశ్నలో

ఎవరుగానూ అది [-మనుష్య] అయితే ఏం/ఏదిగానూ మారుతుంది. కాబట్టి ఈ అర్థలక్షణాలని నామపదబంధానికి ఉన్నట్లు స్పష్టంచెయ్యడం ముఖ్యం. ప్రశ్న లక్షణం ఉన్న వాక్యాంగం వాక్యంలో ఉంటే వాక్యవిశేషణంగా అంతరంగ నిర్మాణంలో ఉన్న ప్రశ్న లోపిస్తుంది కాబట్టి ఇటువంటి వాక్యాల బహిరంగ నిర్మాణంలో అది కనపడదు. ప్రశ్న లక్షణం నామపదబంధానికే కాక అందులో ఏకదేశమైన విశేషణాలకీ (ఎవరి పుస్తకం, ఎన్ని పుస్తకాలు, ఎంత డబ్బు), క్రియావిశేషణాలకీ (ఎక్కడ, ఎప్పుడు, ఎలా, ఎందుకు) కూడా చేర్చబడవచ్చు. క్రియావిశేషణాల ప్రశ్నరూపాలని ఈ కింద ఇచ్చిన సూత్రం ద్వారా సాధించవచ్చు.

$$\begin{bmatrix} \text{స్థల క్రి. వి.} \\ \text{కాల క్రి. వి.} \\ \text{పద్ధతి క్రి. వి.} \\ \text{కారణ క్రి. వి.} \end{bmatrix} + \text{ఎ} - \Rightarrow \begin{bmatrix} \text{ఎక్కడ} \\ \text{ఎప్పుడు} \\ \text{ఎలా} \\ \text{ఎందుకు} \end{bmatrix}$$

తెలుగులో ప్రశ్నార్థక శబ్దం క్రియకి దగ్గరగా ఉండడమే సహజమని ఈ కింది ఉదాహరణలవల్ల తెలుస్తుంది.

110. (ఎ) చిదంబరంలో గుడిని ఎవరు కట్టించేరు ?

(బి)? ఎవరు చిదంబరంలో గుడిని కట్టించేరు ?

111. (ఎ) నువ్వు ఎవరితో వచ్చావు ?

(బి)? ఎవరితో నువ్వు వచ్చావు ?

112. (ఎ) ఈ విషయం నాతో నువ్వు ఎందుకు చెప్పలేదు ?

(బి)? ఎందుకు ఈ విషయం నాతో నువ్వు చెప్పలేదు ?

సంశ్లిష్ట వాక్యాలు ఒక సామాన్యవాక్యంలో ఇంకొకటి (లేక అంతకన్న ఎక్కువ) సామాన్య వాక్యాలు ఇమడ్చడంవల్ల ఏర్పడతాయని ఇంతకుముందు చూశాం. ఇలా ఒక వాక్యంలో ఇంకొకటి ఇమడ్చబడడానికి ఒక షరా (Condition) ఉంటుంది. అది ఈ వాక్యాలలో ఏదో ఒక అంగం తుల్యార్థకంగా ఉండాలి అనేది. సంశ్లిష్ట వాక్యాలలో ప్రసిద్ధమైనది ధాతుజ విశేషణాలున్న వాక్యం కాబట్టి దాన్ని గురించి కొంత చూద్దాం.

113. మోటారు సైకిలుమీద వచ్చిన అబ్బాయి నా స్నేహితుడు.

114. సుశీల కొన్న చీర బాగుంది.

115. ఏపిల్ పళ్లు కోసిన కత్తి అలమారులో పెట్టేను.

116. అశోకుడూ, బుద్ధుడూ పుట్టినదేశం అన్యాయాలకి ఆటపట్టు.

113-116 వాక్యాల అంతరంగ నిర్మాణం 117-120 లలో ఉన్న విడివిడి వాక్యాలకి సన్నిహితం.

117. (ఒక) అబ్బాయి మోటారుసైకిలుమీద వచ్చాడు. (ఆ) అబ్బాయి నా స్నేహితుడు.

118. సుశీల (ఒక) చీర కొంది. (ఆ) చీర బాగుంది.

119. ఏపిల్ పళ్ళు కత్తితో కోశారు. (ఆ) కత్తి అలమారులో పెట్టేను.

120. అశోకుడూ, బుద్ధుడూ (ఈ) దేశంలో పుట్టారు. (ఈ) దేశం అన్యాయాలకి ఆటపట్టు.

పై వాటిలో రెండో వాక్యంలో మొదటివాక్యం ఇమడ్చబడింది. ఒంకొక వాక్యాన్ని లోపల ముడ్చుకున్న వాక్యాన్ని ప్రధానవాక్యం లేక అంటివాక్యం (Matrix sentence) అనీ, అందులో ఇమిడిన దానిని అంగవాక్యం (Embedded sentence) అనీ అంటారు. అంతరంగనిర్మాణంలో రెండో వాక్యం కర్తృనామానికి మొదటివాక్యం విశేషణంగా ఉంటుంది. అప్పుడు రెండు వాక్యాలలోనూ తుల్యంగా

ఉన్న నామాలలో అంగవాక్యంలోని నామం పరివర్తన సూత్రం ద్వారా లోపిస్తుంది (నామంతోపాటు ఉన్న విభక్తిప్రత్యయం కూడా లోపిస్తుంది). అంగవాక్యంలోని క్రియ దాని కాలానికి తగిన ధాతుజవిశేషణంగా మారుతుంది. (వచ్చాడు వచ్చిన, వస్తున్నాడు వచ్చే, వస్తున్న, వస్తాడు వచ్చే). ఈ పరివర్తన సూత్రాన్ని ఈ కింది విధంగా సూచించవచ్చు.

X + నా.ప.$_1$ + Y క్రి. + నా.ప.$_2$ = X + O + Y +

ధాతుజ వి. + నా. ప.2

(షరా : నా.ప.$_1$ = నా.ప.2)

పై సూత్రంలో X Y లు నామపదబంధానికి ఇరువైపులా ఉన్న ఇతర వాక్యాంగాలి సూచిస్తాయి. వాటిలో ఏమీ మర్పు ఉండదు. క్రియలోఉన్న కాలాన్ని బట్టి ధాతుజ విశేషణరూపంలో కూడా కాలసూచన ఉంటుంది. పై సూత్రంలో షరా రెండు నామపదబంధాలూ ఒకే ప్రాణిని, లేక పదార్థాన్ని, లేక భావాన్ని సూచించేటప్పుడు మాత్రమే ఈ సూత్రం వర్తిస్తుందని చెప్తుంది. పై ఉదాహరణలలో అంగవాక్యాలు తుల్యమైన నామం అంగవాక్యంలో కర్తగానే ఉండనక్కరలేదు; ఏ విభక్తిలోనైనా ఉండవచ్చు. 121–124 వాక్యాలు చైస్తే అంగ వాక్యాలు అంగివాక్యకర్తలకే కాక వాటిలోని ఏ నామానికైనా విశేషణాలుగా ఉండచ్చునని తెలుస్తుంది.

121. మోటారు సైకిలు మీద వచ్చిన అబ్బాయిని వాళ్ల నాన్న తిట్టేడు.

122. సుశీల కొన్న చీరని సుజాత దాచింది.

123. నువ్వు ఏపిల్‌పళ్లు కోసిన కత్తితో నేను పుచ్చకాయ కోశాను.

124. అశోకుడూ, బుద్ధుడూ పుట్టిన దేశంలో అన్యాయాలు జరుగుతున్నాయి.

ఒక్కొక్కప్పుడు వాక్యాలు అంగివాక్యంలో ఒక వ్యాకరణ సంవర్గానికి

విశేషణాలుగా కాక దానిలో ఒక వ్యాకరణ సంవర్గం స్థానంలోనే రావచ్చు.

125. కట్నం ఇచ్చి భర్తను కొనుక్కోవడం రమకు ఇష్టంలేదు.

పై వాక్యంలో కర్తృస్థానంలో ఉన్న "కట్నం ఇచ్చి భర్తను కొనుక్కోవడం" అనేది "కట్నం ఇచ్చి భర్తను కొనుక్కొంటారు" అనే పూర్తి వాక్యం నించి వచ్చింది.

సంయుక్త వాక్యంలో రెండు (లేక అంతకన్న ఎక్కువ) మూలవాక్యాల భాగాలు సమాన ప్రతిపత్తితో ఉంటాయని ఇంతకుముందు చూశాం.

126. రాముడూ సీతా అడవికి వెళ్లేరు.

పై వాక్యం 127, 128 వాక్యాల కలయిక వల్ల ఏర్పడింది.

127. రాముడు అడవికి వెళ్లేడు.

128. సీత అడవికి వెళ్లింది.

పై వాక్యాలలో కర్తలు తప్ప మిగిలిన భాగమంతా సమానమే (క్రియలో పురుష ప్రత్యయాలలో ఉన్న భేదం ఇక్కడ పరిగణనీయం కాదు). పై వాక్యాలని కలిపితే 129వ వాక్యం అవుతుంది.

129. రాముడు అవడికి వెళ్లేడు. సీత అడవికి వెళ్ళింది.

ఇందులో పునరావృత్తమైన భాగాలలో మొదటిదాన్ని లోపింపజేస్తే రాముడు సీత అడవికి వెళ్లే(రు).

అని అవుతుంది. రెండు నామాలకీ చివర సముచ్చయార్థకమైన దీర్ఘం చేరిస్తే 126 సిద్ధిస్తుంది. (ఇప్పుడు కర్త మనుష్య బహుత్వంలో ఉంది కాబట్టి క్రియ చివర -రు చేరుతుంది).

రెండు వాక్యాల కర్తలనే కాక కర్మలనీ క్రియలనీ, ఇతరాంగాలనీ కూడా సమ్ముచ్చయంలో కలపవచ్చునని ఈ కింది ఉదాహరణలు స్పష్టం చేస్తాయి.

130. నేను సర్కస్‌లో పులుల్నీ, సింహాల్నీ, ఏనుగుల్నీ చూశాను.

131. వాడు అన్నంతినీ, నిద్రపోయాడు.

132. నేను రేపూ ఎల్లుండీ డాక్టరు దగ్గరికి వెళ్ళాలి.

సముచ్చయార్థకమేకాక లేక(పోతే), కాని మొదలైనవి కూడా సంయుక్త వాక్యాలని నిర్మించడానికి ఉపయోగిస్తాయి. సంయుక్త వాక్యాంలో సముచ్చయంతో కలిపిన నామాలని సాధారణంగా వేరు వేరు వాక్యాలనించి సాధించవచ్చు. ఈ విషయం 126 వాక్యం వల్ల స్పష్టం. కాని కొన్ని చోట్ల ఇలా చెయ్యడం కుదురదు (133, 34 వాక్యాలు చూడండి).

133. పాలూ నీళ్ళూ కలుస్తాయి.

134. బస్సూ లారీ గుద్దుకొన్నాయి.

పై వాక్యాలని రెండు వేరు వేరు వాక్యాలు కలియడం వల్ల ఏర్పడినవిగా చెప్పడం కష్టం. ఎందువల్లనంటే అటువంటి వాక్యాలు అసహజంగా ఉంటాయి (135, 136 వాక్యాలు చూడండి.)

133. పాలూ నీళ్ళూ కలుస్తాయి.

134. బస్సూ లారీ గుద్దుకొన్నాయి.

పై వాక్యాలని రెండు వేరు వేరు వాక్యాలు కలియడం వల్ల ఏర్పడినవిగా చెప్పడం కష్టం. ఎందువల్లనంటే అటువంటి వాక్యాలు అసహజంగా ఉంటాయి (135, 136 వాక్యాలు చూడండి).

135. * పాలు కలుస్తాయి. * నీళ్లు కలుస్తాయి.

136. * బస్సు గుద్దుకొంది. * లారీ గుద్దుకొంది.

ఇటువంటి వాక్యాలని సాధించడానికి పదబంధ నిర్మాణంలోనే నామపద బంధాన్ని ఒకటి కన్న ఎక్కువ నామపదబంధాలుగా విస్తృతి చేసే సూత్రాన్ని చేర్చుకోవాలి.

ఒక వాక్యంలో రెండు లేక అంతకన్న ఎక్కువ పరివర్తన సూత్రాలు ప్రవర్తించడానికి వీలుంది అని పైన చూశాం. పరివర్తన సూత్రాలు ఒక భాష వ్యాకరణంలో నిర్ణీత క్రమంలో అమర్చబడాలి అనడానికి ఆధారాలు ఉన్నాయి. రెండు పరివర్తన సూత్రలని నిర్ణీత క్రమం మార్చి ఒక వాక్యలో ప్రవర్తింపజేస్తే ఒక్కొక్కసారి అసాధు వాక్యాలు ఏర్పడతాయి. ఉదాహరణకి 137 చూడండి.

137. (నువ్వు) కాళ్ల కడుక్కో.

138. పై వాక్యం అంతరంగ నిర్మాణానికి సన్నిహితం.

138. * నువ్వు నీ కాళ్ల కడుగు.

కర్మ కర్తకి సంబంధించినది అయితే క్రియకి-కొను అనే ఆత్మనేపద సహాయక్రియ చేరుతుంది అనే పరివర్తన సూత్ర వల్ల 138 139గా మారుతుంది.

139. * నువ్వు నీ కాళ్ళ కడుగు-కొను

కర్మకి కర్తకి అవినాభావ సంబంధం ఉంటే కర్మ పదబంధంలో సర్వనామం నిత్యంగానూ అవినాభావ సంబంధం లేకపోతే వైభాషికంగానూ లోపిస్తుంది అనే మరొక పరివర్తన సూత్రం వల్ల 139 140గా మారుతుంది (మరికొన్ని సూత్రాలు ప్రవర్తించాక 140 137గా మారుతంది).

140 * నువ్వు కాళ్ల కడుగు-కొను

పై రెండు పరివర్తన సూత్రాలు పైన ఇచ్చిన క్రమంలో కాక ముందు సర్వనామ లోప సూత్రం ప్రవర్తిస్తే 138లో నీ లోపిస్తుంది. ఆ తరవాత కొను చేర్చే సూత్రం ప్రవర్తించడానికి అవకాశం ఉండదు కాబట్టి అసాధువైన 141 సిద్ధిస్తుంది. (141వ వాక్యం 137 అర్థంలో అసాధువు).

141. * నువ్వు కాళ్లు కడుగు.

పరివర్తన సూత్రాలు క్రమబద్ధంగా ఉండడమే కాక అవి ఒక పెద్ద వాక్యంలో తరంగ న్యాయం (Cyclic Principle) లో ప్రవర్తిస్తాయి. తరంగ న్యాయం అంటే సూత్రాలు చిన్న అంగివాక్యం మీద ముందు ప్రవర్తించి, ఆ తరవాత దానికన్న పెద్ద అంగివాక్యం మీదా, అలా పోతూ చివరికి అంగవాక్యం మీదా ప్రవర్తించడం. ఇది నీళ్లలో రాయివేస్తే పుట్టిన తరంగాలు మొదట తక్కువ స్థలాన్ని ఆక్రమించి క్రమక్రమంగా ఎక్కువ స్థలానికి వ్యాపించినట్లు ఉండడం వల్ల దీన్ని తరంగ న్యాయం అంటారు.

## 7:6 విభక్తి వ్యాకరణం

విభక్తి వ్యాకరణం (Case Grammar) ఛార్లెస్ ఫిల్‌మోర్ (Charles J. Fillmore, "The case for case" in *Universals in Linguistic Theory* 1968: 1-99) ప్రతిపాదించినది. దీనికి మన ప్రాచీన వైయాకరణుల కారక సిద్ధాంతానికి (19.7) చాలా దగ్గర సంబంధం ఉంది. విభక్తి వ్యాకరణంలోని ముఖ్య ప్రతిపాదనలు పరివర్తన సిద్ధాంతంపైన ఆధారపడినవి కావు. అయినా ఫిల్‌మోర్ తన ప్రతిపాదనలని వివరించడానికి పరివర్తన వ్యాకరణ మార్గాన్ని అవలంబించి, దానిలో ఉన్న కొన్ని లోపాలని విభక్తి వ్యాకరణం ఎలా సరిదిద్దగలదో చూపేరు కాబట్టి మనం దీన్ని ఈ అధ్యాయంలో చర్చించడం సమంజసం.

విభక్తి వ్యాకరణం దాని పేరు సూచిస్తున్నట్టుగా నామవాచకాలకు ఉండే విభక్తుల ఉపయోగాన్ని గురించి చర్చిస్తుంది. ఇక్కడ మనం రెండు విషయాలు గమనించాలి. విభక్త్యర్థం కొన్ని భాషలలో ప్రత్యయాలు ద్వారానూ, కొన్నిటిలో పరసర్గల ద్వారానూ, మరి కొన్నిటిలో పూర్వసర్గల ద్వారానూ వ్యక్తం చేయబడుతుంది. ఇలా బాహ్యరూపం వేరయినా ఇవి అన్నీ విభక్తిగానే గ్రహించబడతాయి. విభక్తులు అంతరంగ నిర్మాణంలో ఒక విధంగానూ, బహిరంగ నిర్మాణంలో మరొక విధంగానూ ఉండవచ్చు. అంటే, అంతరంగ నిర్మాణంలో ఒక విభక్తిలో ఉన్న నామం బహిరంగ నిర్మాణంలో మరొక విభక్తిలో ఉండవచ్చు. కాబట్టి అంతరంగ విభక్తులకి (వీటినే మన పూర్వులు "కారకాలు' అన్నారు) బహిరంగ

విభక్తులకి మధ్య ఉన్న భేదం గ్రహించాలి.

విభక్తి వ్యాకరణ మతంలో వాక్యాన్ని రెండు ముఖ్యాంగాలుగా విభజించవచ్చు. అవి : 1. వక్త్రీచ్ఛ (Modlity), 2. మూల వాక్యాంశం (proposition) మూల వాక్యాంశంలో కాలభేదం లేని క్రియా, దానికి సంబంధించిన నామాలు ఉంటాయి. వ్యతిరేకత, కాలం, ఉద్దేశం మొదలైన వాక్యానికంతకీ సంబంధించినవి వక్త్రీచ్ఛలో ఉంటాయి. మూల వాక్యాంశంలోని ఒక్కొక్క నామం ఒక్కొక్క విభక్తిలో ఉంటాయి. ఒకే విభక్తిలో రెండు నామాలు ఉండడం సంయుక్త వాక్యంలో మాత్రమే సాధ్యం అవుతుంది. లేకపోతే ఆ విభక్తి అంతరంగ నిర్మాణంలో భిన్న విభక్తుల నించి వచ్చింది కావచ్చు. మూల వాక్యాంశంలో భాషలో ఎన్ని అంతరంగ నిర్మాణ విభక్తులు ఉన్నాయో అన్ని నామాలు ఉండవచ్చు. మూల వాక్యాంశంలో క్రియతోపాటు కనీసం ఒక నామమైనా ఉండాలి. పై విషయాలని సూత్రరూపంలో ఇలా చెప్పవచ్చు:

వాక్యం→వక్త్రీచ్ఛ+మూలావాక్యాంశం.

మూలావాక్యాంశం→క్రియ+విభక్తి$_1$+విభక్తి$_2$ ...+విభక్తి$_n$

(కనీసం ఒక విభక్తి ఉండాలి)

పైన 'విభక్తి' అన్న పదం 'అంతరంగ విభక్తి (లేక 'కారకం') అన్న అర్థంలో వాడబడింది. అంతరంగ నిర్మాణం అర్థానికి సన్నిహితం కాబట్టి ఈ అంతరంగవిభక్తులు అన్ని భాషలకి ఒకే రకంగా ఉంటాయి. ఈ అంతరంగ విభక్తులు న్ని ఉండాలి అనే అనిపై చర్చ ఇంకా ముగియలేదు. భాషకి భాషకి మధ్య వీటి సంఖ్యలో భేదం ఉండవచ్చు. కాని ఈ కింద ఇచ్చిన అంతరంగ విభక్తులు అన్ని భాషలలోనూ ఉంటాయని అనుకోవచ్చు :

కర్త(Agentive) : ఇది క్రియా వ్యాపారాన్ని స్వతంత్రంగా చేసే ప్రాణిని సూచిస్తుంది (కొన్ని చోట్ల అప్రాణులకి కూడా ప్రాణిత్వం ఆపాదించబడుతుంది: వాణ్ణి చూసి ఊరంతా హడిలిపోయింది. ఇక్కడ 'ఊరు' అనేది 'ఊళ్లోజనం' అనే అర్థంలో వాడబడింది).

కరణం (Instrumental) : ఇది క్రియావ్యాపారంలో ఉపయోగించన లేక క్రియావ్యాపారానికి హేతువయిన అప్రాణి శక్తిని లేక వస్తువుని సూచిస్తుంది.

సంప్రదానం (Dative) : ఇది క్రియావ్యాపారం వల్ల మార్పు చెందిన ప్రాణిని సూచిస్తుంది.

నిర్వర్త్యం (Factitive) : ఇది క్రియావ్యాపారం వల్ల ఏర్పడిన వస్తువుని సూచిస్తుంది; లేక ఇది క్రియా వ్యాపారంలో భాగంగా అర్థం చేసుకొనేది కూడా కావచ్చు.

అధికరణం (Locative) : ఇది క్రియావ్యాపారం జరిగిన చోటుని సూచిస్తుంది.

కర్మ (Objective) : ఇది క్రియావ్యాపారం వల్ల మార్పు చెందిన లేక క్రియా వ్యాపారానికి లోనైన శక్తిని లేక వస్తువుని సూచిస్తుంది.

పైన ఇచ్చిన విభక్తులు (ఇంకా అటువంటివి) బహిరంగ నిర్మాణంలో ఒక నామం దానితో కూడిన విభక్త ప్రత్యయం లేక పూర్వసర్గ లేక పరసర్గ అనే రెండిటితో సూచించబడతాయి. (కొన్ని రకాల వాక్యాలలో బహిరంగ విభక్తి సుచకమైన అర్థకం లోపించవచ్చు). ఫిల్‌మోర్ మతంలో మబనం సాధారణంగా కర్మ అని వ్యవహరించేది ప్రాని అయితే, అది కర్మగా కాక సంప్రదానంగా గ్రహించబడుతుంది అనే విషయం గమనించాలి.

క్రియలని అవి తీసుకోగలిగిన విభక్తులని అనుసరించి విభజించాలి. ఉదాహరణకి అకర్మకాలైన నడుచు, పరిగెత్తు, నవ్వు మొదలైనవి కర్మని తీసుకోవు కాబట్టి ఈ విషయం నిఘంటువులో సూచించబడాలి.

విభక్తి వ్యాకరణం బహిరంగ నిర్మాణంలో ఒకే విభక్తిలో ఉన్న నామాలు అంతరంగ నిర్మాణంలో భిన్న విభక్తులుగా ఉండడానికి అవకాశం ఉంది అనే విషయాన్ని స్పష్టం చేస్తుంది (పరివర్తన వైయాకరణులు ఈ విషయం గ్రహించలేదు). కింది ఉదాహరణలు చూడండి :

142. జానకిరామయ్య కిటికీని బద్దలుకొట్టేడు.

143. సుత్తి కిటకీని బద్దలుకొట్టింది.

144. జానకిరామయ్య సుత్తితో కిటికీని బద్దలుకొట్టేడు.

143లో సుత్తి ఉద్దేశ్యం (Subect) అయినా నిజానికి అది కర్త కాదు. ఈ వాక్యం మనం విన్నప్పుడు 'ఎవరో సుత్తితో కిటికీని బద్దలుకొట్టేరు' అనే అర్థం చేసుకొంటాం.గాని సుత్తి దానంతట అదే ఆ పని చేసింది. అని అనుకోం. కాబట్ట అంతరంగ నిర్మాణంలో 143, 144 రెండిటిలోనూ సుత్తి కరణం మాత్రమే. అది 143లో ప్రథమావిభక్తిలో ఉండి, ఉద్దేశ్యంగా ఉన్నంత మాత్రం చేత అది కర్త కాదు. సుత్తి కరణం, జానకిరామయ్య కర్త కాబట్టి ఈ రెండిటినీ కలిపిన సంయుక్త వాక్యం 145 అసాధువు అవుతుంది. కాని రెండు కర్తలూ (146), రెండు కరణాలూ (147) కలిసిన సంయుక్త వాక్యాలు సాధువులే.

145. * జానకిరామయ్యా సుత్తీ (కలిసి) కిటికీని బద్దలుకొట్టేరు.

146. జానకిరామయ్యాసీతారామయ్యా (కలిసి) కిటికీని బద్దలుకొట్టేరు.

147. సుత్తీ ఉలీ కిటికీని బద్దలుకొట్టేయి.

148. జానకిరామయ్య సుత్తితోనూ ఉలితోనూ కిటికీని బద్దలుకొట్టేడు.

వాక్యంలో కర్త ఉన్నప్పుడు అదే ఉద్దేశ్యం అవుతుంది. కర్తని వక్తవ్యక్తం చెయ్యదలుచుకోనపుడు కరణం మొదలైన ఇతర కారకాలు ఉద్దేశ్యం అవుతాయి. పైన చెప్పినది కర్తరి ప్రయోగ వాక్యాలకు సంబంధించినది. కర్మణి ప్రయోగ వాక్యాలలో కర్మ ఉద్దేశ్యమవడమూ కర్త తృతీయా విభక్తిలో ఉండడమూ వాక్యం రుర్మణి ప్రయోగం కావడం వల్ల వచ్చినవి. ఉద్దుశ్యం వేరు, కర్త వేరు; ఉద్దేశ్యం బహిరంగ నిర్మాణానికి చెందినది అనే సత్యాన్ని విభక్తి వ్యాకరణం స్పష్టం చేసింది. కరణమే కాక ఇతర కారకాలు కూడా కర్త లేనప్పుడు ఉద్దేశ్యం కావచ్చు 149 (a), 150 (a)లలో అధికరణం ఉద్దేశ్యంగా ఉంది.

149. (a) ఆ గిన్నె సోలడు బియ్యం ఉడుకుతుంది.

(a) ఆ గిన్నెలో సోలడు బియ్యం ఉడుకుతాయి.

150. (a) మా ఊరు బురదగా ఉంది.

(a) మా ఊళ్లో బురద (ఎక్కువగా) ఉంది.

పైన ఇచ్చిన కారకాలలో నిర్వర్త్యం అనేది కొంత కొత్తది. ఇది క్రియా వ్యాపారం వల్ల కొత్తగా పుట్టిన లేక సృష్టించబడిన వస్తువుని సూచిస్తుంది (151, 152 చూడండి). మన ఊర్వ వైయాకరణులు దీన్ని ఒకరకం కర్మగా భావించారు.

151. వడ్రండి కర్చీని తయారు చేశాడు.

152. స్టీవెన్‌సన్ రైలు ఇంజను కనిపెట్టేడు.

## 7.7. కొన్ని ఇటీవలి పరిణామాలు

పరివర్తన వ్యాకరణాన్ని భాషా శాస్త్రంలో ఒక ముఖ్యమైన శాఖగా ఏర్పరిచిన వారు చోమ్‌స్కీ అనే అమెరికాలోని భాషా శాస్త్రజ్ఞుడు అని పైన చూశాం ఆయన తన కృషిని syntactic structures (1957) అనే గ్రంథంలో ప్రారంభించి ఇప్పటికీ అనేక గ్రంథాలూ,వ్యాసాలూ రాస్తూనే ఉన్నారు. ఈయన భాషలో (ముఖ్యంగా ఇంగ్లీషులో) తమ దృష్టికి వచ్చిన సాక్ష్యాధారాల సాయంతో మొదటతాము ప్రతిపాదించినవ సిద్ధాంతాలకి అవసరమైన మార్పులూ చేర్పులూ అర్వాచీన రచనలలో చేస్తునే ఉన్నారు. ఈ మార్పులకీ చేర్పులకీ ఈయన అనుయాయులు కొందరు ఈయన అభిప్రాయాలపై చేసిన విమర్శలూ, సూచనలూ కూడా కొంతవరకూ దోహదం చేశాయి. ఈ అధ్యాయంలో పై విభాగాలలో చర్చించబడిన విషయ లు ఈయన 965లో ప్రచురించిన Aspects of the Theory of Syntax అనే గ్రంథం కాలం వరకూ ఈ శాఖలో అంగీకృతమైన సిద్ధాంతాలని ప్రతిబింబిస్తాయి అని చెప్పవచ్చు. ఆ తరువాత ఈయన తమ రచనలలో పరివర్తన సిద్ధాంతంలో మరికొన్ని విప్లవాత్మకమైన మార్పులు చాశారు. ఈ రచనలలో ముఖ్యమైనవి : Essays on Form and Interpretation (1977), Filters and control (1977, H.Lasnik‌తో), On Wh-movement (1977), Markedness and Core Grammar (1980), Pisa Lectures on Binding and Governance (1980), On the Representation of form and function (1980), వీటిలో ప్రతిపాదించబడిన నూతన విషయాలని సులభమైన శైలిలో Andrew Radford తమ Transformational Syntax (1981) అనే గ్రంథంలో వివరించారు. ఈ నూతన పరిణామాలలో ముఖ్యమైన వాటిని కొన్నిటిని ఈ కింద చూద్దాం.

(i) ఉత్పాదకార్థ నిర్మాణ శాఖ (Generative Semantics) : చోమ్‌స్కీ Aspects (1965) గ్రంథంలో ప్రతిపాదించిన సిద్ధాంతానికి ప్రామాణిక సిద్ధాంతం (Standard Theory) అనే పేరు వచ్చింది. ఈ సిద్ధాంతం ప్రకారం ఒక వాక్యం అంతరంగ నిర్మాణం అంటే ఆ వాక్యంలో పదాలని కొన్ని పదబంధాలుగా (ఉదా; నామ పద బంధం, క్రియాపద బంధం, మొ..) కూర్చి ఏర్పరిచిన నిర్మాణమే, అంతరంగ నిర్మాణం మీద పరివర్తన సూత్రాలు ప్రవర్తిస్తే ఆ వాక్యం బహిరంగ నిర్మాణం ఉత్పన్నమవుతుంది ; అదే అంతరంగ నిర్మాణం మీద అర్థ నిర్ణయ సూత్రాలు ప్రవర్తించి ఆ వాక్యం అర్థాన్ని నిర్ణయిస్తాయి. పాల్ పోస్టల్ (Paul Postal ), జాన్ రాస్ ( John Ross), జేమ్స్ మెకాలే (James Mc Cawley ), రాబిన్ లేకాఫ్ (Robin Lakoff )వంటి భాషా శాస్త్రజ్ఞులు కొందరు చోమ్‌స్కీ ప్రామాణిక సిద్ధాంతాన్ని విమర్శిస్తూ ఈ కింద ఇచ్చిన ప్రశ్నలని లేవనెత్తారు.

(క) అర్థ నిర్ణయ సూత్రాలు అంతరంగ నిర్మాణం మీదనే ప్రవర్తిస్తాయా ? లేక అవి బహిరంగ నిర్మాణం మీదనే లేక ఆ రెండిటిమీదా కూడా ప్రవర్తిస్తాయా ? అంతరంగ నిర్మాణం అనేది ఎంత లోతుగా ఉండాలి ? యోగ్యతా నియమాలు (Selectional Restrictions; ఉదాహరణకి, 'మాట్లాడు ' అనే క్రియకు మనుష్య వాచక శబ్దమే కర్తగా ఉండాలి, మొ..) అర్థపరమైనవా లేక వాక్య నిర్మాణ పరమైనవా ? (ఇవి అర్థం మీద ఆధార పడినవే అని నిర్ణయించబడింది).

(ఖ) పరివర్తన సూత్రాలు వాక్యంఅర్థాన్ని మార్చే అవకాశం ఉందా? లేదా?

ప్రామాణిక సిద్ధాంతం ప్రకారం వాక్యం అర్థం అంతా దాని అంతరంగ నిర్మాణం లోనే ఇమిడి ఉంటుంది. ఈ అభిప్రాయాన్ని అంగీకరిస్తే రెండు సామానార్థకాలైన వాక్యాలకి ఒకే అంతరంగ నిర్మాణం ఉండాలి ఉదాహరణకి,

153. రాముడు మద్రాసు నించి రేపు వస్తాడు.

154. రాముడు రేపు మద్రాసునించి వస్తాడు.

155. రాముడు కృష్ణుడికి రేడియో అమ్మేడు.

156. కృష్ణుడు రాముడు దగ్గర రేడియో కొన్నాడు.

153,154 వాక్యాలు రెండిటికి అర్థం ఒకటే, అలాగే 155,156 వాక్యాలు కూడా సమానార్థకాలు. అందువల్ల చోమ్‌స్కీయే చెప్పిన సిద్ధాంతం ప్రకారం ఈ ఒక్కొక్క జంటకి ఒకే అంతరంగ నిర్మాణం ఉండాలి. కాని ఒక్కొక్క వాక్యం యొక్క పదబంధనిర్మాణమే దాని అంతరంగ నిర్మాణం అని చోమ్‌స్కీ అనడం వల్ల 153 కి ఒక అంతరంగ నిర్మాణమూ, 154 కి మరొక అంతరంగ నిర్మాణమూ ఉందని ఆయన భావించినట్లు కనపడుతోంది. (155,156ల విషయంలో కూడా అంతే). అందువల్ల ఇక్కడ స్వవచోవ్యాఘాతం ఉంది

ఇక ఈ కింది ఉదాహరణ చూడండి.

157. ఈ గదిలో ఉన్న ప్రతి ఒక్కడూ ఒక సినిమానటిని అభిమానిస్తాడు.

ఈ వాక్యానికి రెండు అర్థాలు ఉన్నాయి. ఒక అర్థంలో వారందరూ అభిమానించేది ఒకే సినిమానటినే మరొక అర్థంలో వారిలో ఒక్కొక్కరు ఒక్కొక్క నటిని అభిమానిస్తారు, దీనికి రెండు అర్థాలు ఉన్నాయి.కాబట్టి దీనికి రెండు విభిన్నమైన అంతరంగ నిర్మాణాలు ఉండాలి. కాని ఈ వాక్యం పదబంధ విభజన రెండు అర్థాలలోనూ ఒకే రకంగా ఉంటుంది కాబట్టి చోమ్‌స్కీ అభిప్రాయంలో దీనికి ఒకే అంతరంగ నిర్మాణం ఉంది.

158. రాముడు రేపు వస్తాడని నేను నమ్ముతున్నాను.

159. రాముడు రేపు వస్తాడని నేను విశ్వసిస్తున్నాను.

160. రాముడు రేపు వస్తాడని నేను అనుకొంటున్నాను..

పై వాక్యంలో క్రియలు వేరైనా ఈ వాక్యాలన్నీ సమానార్థకాలే. అందువల్ల వీటి అన్నిటికీ ఒకే అంతరంగ నిర్మాణం ఉండడం సముచితమే కాని చోమ్‌స్కీ అభిప్రాయం ప్రకారం ఈ మూడింటికీ మూడు అంతరంగ నిర్మాణాలు ఉంటాయి.

పోస్టల్ మొదలైన పండితులు చోమ్‌స్కీ సిద్ధాంతంలో ఇటువంటి లోపాలు చూపెట్టి అంతరంగ నిర్మాణం పదబంధ నిర్మాణంతో ముడిపడినది కాదు అనుకొంటే ఈలోపాలని సవరించవచ్చు అని అన్నారు. అందువల్ల వీరి అభిప్రాయంలో అంతరంగ నిర్మాణం చోమ్‌స్కీ సిద్ధాంతంలో దానికన్న చాలా లోతైనదీ, అమూర్తమైనదీ, ఇంతే కాక, వీరు ప్రతి నిశ్చాయక వాక్యానికీ అంతరంగ నిర్మాణంలో "అని నేను నీకు చెప్తున్నాను" అనేది అనుబంధంగా

ఉంటుందని కూడా అన్నారు, ఉదా.

161. రాముడు రేపు వస్తాడు.

దీని అంతరంగ నిర్మాణం

162. రాముడు రేపు వస్తాడు అని నేను నీకు చెప్తున్నాను.

పైగా వీరు కర్తరి ప్రయోగాన్ని కర్మణి ప్రయోగంగా మార్చే పరివర్తన సూత్రం కొన్ని సందర్భాలలో అర్థ భేదం కలిగిస్తుందనే విషయాన్ని కూడా పండితులచే దృష్టికి తీసుకు వచ్చారు, కూడా.

163, Everyone in the room knows two languages.

164. Two languages are known by every one in the room.

163వ వాక్యానికి ప్రతి వ్యక్తికీ ఏవో రెండు భాషలు (అవి వేరు వేరు భాషలు కావచ్చు) తెలుసునని అర్థం; కాని దీని కర్మణి ప్రయోగ రూపమైన 164వ వాక్యానికి ప్రతి వ్యక్తికీ తెలిసి ఉన్నవి రెండు నిర్దిష్టమైన భాషలు అనే అర్థం వస్తుంది.

ఉత్పాదకార్థ నిర్మాణ శాఖలో కృషి చేసిన వారు ఇటువంటి ముఖ్యమైన సమస్యలని లేవనెత్తినా వాటిని పరిష్కరించడానికి వారు సరైన స్పష్టమైన మార్గాలు సూచించలేదు. ఈ పండితులలోనే భిన్నాభిప్రాయాలు ఏర్పడడం వల్ల ఈ శాఖలో అభివృద్ధి కుంటుపడింది, కాని చోమ్స్కీ వీరి విమర్శలలో ముఖ్యమైన అంశాలని గ్రహించి అర్వాచీన గ్రంథాలలో తమ సిద్ధాంతాలలో తగిన మార్పులు చేశారు. ఇలా మార్పులు చెయ్యడం వల్ల చోమ్స్కీ ప్రామాణిక సిద్ధాంతానికి విస్తృత ప్రామాణిక సిద్ధాంతం (External Standard Theory-EST ) అనే పేరు వచ్చింది ( ఇది మొదలైన కాలం 1970).

(ii)x-బార్ వాక్య నిర్మాణం (X-Bar Syntax )

ప్రామాణిక సిద్ధాంతంలో పదబంధ నిర్మాణాన్ని సూత్రాల ద్వారా శాసించే పద్ధతిని గురించి 7.2. లో చూశాం. అందులో కొన్ని అసమగ్రతలు ఉన్నాయి అని చోమ్స్కీ గ్రహించిలయనతమ ఇటీవల రచనలలో x-బార్

వాక్య నిర్మాణం అనే పద్ధతిని ఉపయోగిస్తున్నారు ( కొన్ని విషయాలలో ఈ కొత్త పద్ధతికీ 1950లలో జెలిగ్ హేరిస్ (Zellig Harris) అనుసరించిన పద్ధతికీ పోలికలు ఉన్నాయి.) (పాత కాలపు) పదబంధ నిర్మాణంలో (1) పదబంధాలూ (నామపదబంధం, క్రియా పదబంధం, మొ..), (11) వాటికి అంగాలైన పదాలని సూచించే భాషా భాగాలూ అనే రెండు అంశాలు మాత్రమే ఉన్నాయి. ఉదాహరణకి,. 'కొత్త' అనే విశేషణమూ, చొక్కా అనే నామమూ కలియడం వల్ల 'కొత్త చొక్కా' అనే నామపదబంధం ఏర్పడింది. ఒక పదబంధంలో అంగాలైన పదాలలో కొన్నా అదే రకం పదబంధంగా పని చేస్తాయి అనే విషయమే x-బార్ వాక్య నిర్మాణంలో ముఖ్య ప్రతిపాదన ఉదాహరణకి, This very tall girl అనే నామపదబంధంలో very tall girl అనే పదాలు ఒక చిన్న నామపదబంధంగా ఏర్పడతాయి అని చెప్పడానికి ఆధారాలు ఉన్నాయి. దీనికి ఒక ఆధారం కింది వాక్యంలో very tall girl అనే పద బంధం స్థానంలో లనే ఒక పదమే వాడడం సాధ్య మవడం

165. I like this very tall girl more than that one.

(ఇక్కడ one = very tall girl)

Though అనే పదం ఉన్న వాక్యంలో very tall girl అనే పదాలే this,the,a మొదలైనవి లేకుండా ఉపయోగించడం దీనికి మరొక ఆధారం

Very tall girl though she is, few people look up to her.

(తెలుగులో "ఈ చాలా పొడుగైన అమ్మాయి" అనీ, "ఈ" మొదలైనవి లేకుండా " చాలా పొడుగైన అమ్మాయి" అనికూడా వడవచ్చు . ఇంగ్లీషులోఅనేది మొదలైనవి లేకుండా చాలా కొన్ని సందర్భాలలోనే వస్తుందని గమనించాలి).

x-బార్ లో x ఏదో ఒక భాషా భాగానికి (నామంN),విశేషణం A మొ.) సూచకం xకి మరొక పదం కలిపితే ఏర్పడిన పదబంధం ఒక పైగీత ఉన్న $\bar{X}$ (x-బార్) అవుతుంది; $\bar{X}$కి మరొక పదం కలిపితే రెండు పైగీతలున్న $\bar{\bar{X}}$ (x-డబుల్ బార్) పదబంధం అవుతుంది. ఈ విధానంలో అనే పదబంధం విశ్లేషణ ఈ విధంగా ఉంటుంది.




(DET = Determiner ; AP=Adjective Phrase; DEG= Degree; A=Adjective; N=Noun)

నామ పదబంధంలోలాగే విశేషణ పదబంధం, క్రియాపదబంధం మొదలైన ఇతర పదబంధాలలో కూడా ఒక పెవెద్ద పదబంధంలో అనేక రకానికి చెందిన చిన్న పదబంధాలు ఉండడానికి అవకాశం ఉంది. ఈ విధానంలో నామ పదబంధం (Noun Phrase = NP) అనే దాని బదులు $\bar{N}$, $\bar{\bar{N}}$ ఇత్యాదిగా వాడతారని గమనించాలి. కొన్ని సందర్భాలలో పాత పద్ధతినీ, కొత్త పద్ధతినీ కలిపి వాడడం కూడా ఉంది. ఒక భాషా భాగాన్ని విస్తరించడంలో దానికి ఎన్ని బార్‌లు ఉండడం సాధ్యం అనేవిషయంలో అభిప్రాయ భేదాలు ఉన్నాయి.

(iii) 1980 నించి వచ్చిన పరిణామాలు :

భాషా శాస్త్రజ్ఞుడు ఒక భాషకి రచించే వ్యాకరణం ఆ భాషలో సాధువులని అంగీకరించ దగిన వాక్యాలన్నిటినీ శాసించగలిగి ఉండాలి. ఇంతే కాకుండా ఆ వ్యాకరణం ఒక అసాధు వాక్యం ఎందువల్ల అసాధువో కూడా చెప్పగలగాలి. అందువల్ల వ్యాకరణం ఒక భాషకి సిద్ధాంతం వంటిది. ఇటువంటి సమగ్రమైన వ్యాకరణాన్ని (ముఖ్యంగా ఇంగ్లీషుకి) ఎలా రచించాలి ? చోమ్‌స్కీ, ఇతర పరివర్తన వైయాకరణలు చేసే పరిశోధనల ముఖ్యోద్దేశ్యం ఈ ప్రశ్నకి సమాధానాన్ని అన్వేషించడమే, అనేక భాషలకి ఇటువంటి సమగ్ర వ్యాకరణాలు తయారైన

తరవాత వాటిని పరస్పరం పోల్చి చూస్తే మొత్తం మానవ భాషలన్నిటికీ తుల్యంగా ఉన్న లక్షణాలు తెలుస్తాయి. పరిమితః సంఖ్యగల సూత్రాల ద్వారా భాషలోని అపరిమిత సాధు వాక్య జాలాన్ని ఉత్పత్తి చెయ్యగలగడమే వ్యాకరణం పని.

ఈ మహోద్దేశ్యంతో పరిశోధన సాగిస్తున్న చోమ్‌స్కీ 1980 నించి తాము రాసే రచనలలో వ్యాకరణం నమూనాలో అవసరమైన కొత్త మార్పులు ఇంకా కొన్ని చేస్తునే ఉన్నారు. 1980 నించి ఆయన ప్రతిపాదించిన వ్యాకరణ సిద్ధాంతాలకి జి.బి. మోడల్/సిద్ధాంతం (Governnment and Binding) అని పేరు. ఇది పరివర్తన వ్యాకరణం నవీన రూపం అన్న మాట. ఇందులో Government అనే భావన ప్రాచీన పాశ్చాత్య వ్యాకరణ సంప్రదాయంనించి తీసుకొన్నదే; అందులో పూర్వ సర్గ (Preposition) దాని తరవాత వచ్చే నామవాచకాన్ని నియంత్రణ (govern) చేస్తుందనీ (to him లో to heని నియంత్రణ చేస్తుంది) , క్రియ దానికి కర్మ అయిన నామవాచకాన్ని నియంత్రణ చేస్తుందనీ (hit meలో hit అనే క్రియని) నియంత్రణ చేస్తుంది! మనకి తెలుసు. ఈ భావనని చోమ్‌స్కీ నామపదబంధాలకి (ముఖ్యంగా సర్వనామాలకి) ద్వితీయావిభక్తిని విధించడానికి ఉపయోగించారు. అయితే ఆయన govern అనే పదాన్ని C-Command అనే కొత్త పదం సహాయంతో ఈ విధంగా నిర్వచించారు (X ని అధికరించే మొదటి శాఖామూలం Y ని కూడా అధికరిస్తూ ఉండి,XYలుపరస్పరంఅధికరించుకోకుండా ఉన్నప్పుడే XY ని C-Command చేస్తుంది ఇది C-Command అనే పదం నిర్వచనం).

"Y C-Command చేసే నియంత్రణ శాఖా మూలాల క్రియా, పూర్వ సర్గ లో అతి తక్కువ స్థాయి శాఖా మూలం X అయితేనే XY ని నియంత్రణ చేస్తుంది.

దీని ఫలితార్థం ఇది; ran towards meఅనే పద బంధంలో ప్రాచీన పాశ్చాత్య వ్యాకరణం ప్రకారం క్రియా (ran) ,పూర్వ సర్గ (towards) కూడా 'I' ని నియంత్రణ చేస్తాయి అని చెప్పవచ్చు. ఇటువంటి పదబంధాలలోపూర్వసర్గ మాత్రమే దాని తరవాత వచ్చే నామాన్ని నియంత్రణ చేస్తుంది. క్రియలకీ అటువంటి నామానికీ ప్రత్యక్ష సంబంధం లేదు అనే విషయం స్పష్టం చెయ్యడమే ఇక్కడ చోమ్‌స్కీ ముఖ్యోద్దేశ్యం.




పై పదబంధ పటం (phrase marker = P-marker) లో రెండు రెండు గీతలు చీలే చోటులైన క్రియ పదబంధం, పూర్వ సర్గ పదబంధం అనేవి శాఖా మూలాలు (Nodes) క్రియా పదబంధం అనే శాఖా మూలం మిగిలిన అన్ని శాఖా మూలాలనీ అధికరిస్తుంది.(dominate) (C-Command (constituent command) అనే క్రియలకి బదులుగా తెలుగులో సహయోగించు' అనే పదం వాడవచ్చు.)

ఇక binding అంటే ఏమిటో సంగ్రహంగా చూద్దాం.

166. రాముడు తనని తిట్టుకొన్నాడు.

167. రాముడూ కృష్ణుడూ ఒకళ్లని తిట్టుకొన్నారు.

166వ వాక్యంలో 'తన' అనే పదం ఆ వాక్యంలో కర్త అయిన రాముణ్ణేసూచిస్తుంది కాని వేరొకరిని కాదు. కాబట్టి 'రాముడు' అనే నామపదబంధానికీ 'తనని' అనే నామ పదబంధానికీ ఒకే తుల్యమైన వ్యక్తిని సూచించడం (తుల్యాన్వయం) అనే సంబంధం ఉంది అలాగే 167వ వాక్యంలో 'ఒకళ్లని ఇకళ్లు' అనే నామపదబంధం సూచించే వ్యక్తులు ఆ వాక్యంలో కర్తలైన రాముడూ,కృష్ణుడే. ఇటువంటి తుల్యాన్వయంగల పదబంధాల మధ్యగల సంబంధాన్ని చోమ్‌స్కీ binding అన్నారు. దీనికి తెలుగులో అన్వాదేశ సంబంధం' అనవచ్చు.ఇలాగే 168 వవాక్యంలో 'మేష్టారు'కీ 'ఆయన 'కీ అన్వాదేశ సంబంధం ఉంది.

168. మేష్టారు వస్తే ఆయన్ని సందేహాలు అడగవచ్చు.

ఒకే వాక్యంలో ఒక నామపదబంధానికీ దానితో అన్వాదేశ సంబంధం కల సర్వనామానికీ పురుషలోనూ లింగంలోనూ వచనంలోనూ తుల్యత్వం ఉంటుంది. ఇలా తుల్యత్వం లేని 169 వంటి వాక్యం అసాధువు.

169. * రాముడూ కృష్ణుడూ తనని తిట్టుకొన్నారు.

వ్యాకరణం సాధు వాక్యాలని మాత్రమే ఉత్పత్తి చెయ్యాలి కాబట్టి అది భాషలో ఉన్న ఇటువంటి నియమాలని స్పష్టంగా చెప్పాలి. అప్పుడే అసాధు వాక్యాల ఉత్పత్తి నివారించడం సాధ్యమవుతుంది.

పై న పరివర్తన వ్యాకరణంలో వచ్చిన ఇటీవలి పరిణామాల పై చర్చ సూచనప్రాయంగా మాత్రమే ఇవ్వబడింది. దీనికి కారణం పరివర్తన వ్యాకరణ చర్చ ముఖ్యంగా ఇంగ్లీషు భాషనే దృష్టిలో పెట్టుకొని జరగడం పై చర్చ ఈ అంశంపై ఉన్న ఇంగ్లీషు గ్రంథాలని చదివి అర్థం చేసుకోవడానికి పునాదిగా ఉపయోగిస్తుంది.

# 8. అర్థ నిర్మాణం

## 8.1. అర్థం అంటే ఏమిటి?

ప్రతి భాషకీ ధ్వని, అర్థం అనేవి రెండు ముఖ్యాంశాలని అందరికీ తెలిసిన విషయమే. మానవుడు తన మనోఽభిప్రాయాన్ని ఇతరులకు తెలియజేయడానికి కొన్ని ధ్వనులు చేస్తాడు. ఆ ధ్వనులని విన్నవారు వాటిని ఉచ్చరించినవారి మనోఽభిప్రాయాల్ని తెలుసుకొంటారు. కాబట్టి వ్యవహర్త మనోఽభిప్రాయమే అతడు చేసిన ధ్వనుల అర్థమని మనం నిర్ణయించవచ్చు. ప్రతి భాషకీ ధ్వనులలో కొన్ని నియమాలు ఉండి, ధ్వని నిర్మాణం అనేది ఉన్నట్టుగానే అర్థ నిర్మాణం కూడా ఉంటుంది (ధ్వనులని సూచించే లిపి అర్వాచీన కాలంలో ఏర్పడిందనీ, ఏ భాషాలిపీ ఆ భాషాధ్వనులని సమగ్రంగా సూచించదనీ, ఇప్పటికీ వందల కొలది భాషలకి లిపి లేదనీ, అందువల్ల లిపి కన్న ధ్వనులే ముఖ్యమనీ గ్రహించాలి). అర్థాన్ని గురించి ప్రాచీన కాలంలో గ్రీక్ వేదాంత శాస్త్రజ్ఞులు కొంత చర్చించారు. శబ్దాలకీ అవి సూచించే అర్థాలకీ మధ్య గల సంబంధానికి కారణాలని అన్వేషించే ప్రయత్నంలో భేదాభిప్రాయాలు ఏర్పడడం వల్ల వీరిలో రెండు తెగలు ఏర్పడ్డాయి. ఒక తెగ వారు శబ్దార్థాల పరస్పర సంబంధం సహజ సిద్ధమని అన్నారు; వీరిని Naturalists అంటారు. వీరి మతంలో ఒక శబ్దంలో ఉన్న ధ్వనులకీ అది సూచించే అర్థానికీ సహజమైన అవినాభావ సంబంధం ఉంది. పులి అనే శబ్దం 'పులి'నీ, కుక్క అనే శబ్దం 'కుక్క'నీ సూచించడానికి కారణం ఆయా శబ్దాలలో ఉన్న ధ్వనులకీ అవి సూచించే జంతువులకీ ఏదో సహజ సంబంధం ఉండడమే అని వీరి అభిప్రాయం, 'పరపర', 'కిచకిచ', 'టపటప', 'భగభగ' వంటి ధ్వన్యనుకరణ శబ్దాలలోనూ, కాకి, మేక వంటి కొన్ని శబ్దాలలోనూ ఇటువంటి సహజ సంబంధం ఉన్నా మిగిలిన వేల కొలది శబ్దాలలో శబ్దార్థ సహజ సంబంధం ఉందని చెప్పడం కష్టం. అటువంటి చోట్ల కూడా సహజ సంబంధం ఉందని చెప్పడానికి వీరు తీవ్ర ప్రయత్నం చేశారు. ఈ ప్రయత్నం సఫలం కాకపోయినా దీనివల్ల వ్యుత్పత్తి పరిశోధన (Etymological study) అభివృద్ధి చెందింది. ఇక రెండవ తెగవారు శబ్దార్థ సంబంధం ఈ శబ్దానికి ఇది అర్థమని మానవులు తమలో

చేసుకొన్న పరస్పరాంగీకారం వల్లా, తరవాత కాలంలో సంప్రదాయం వల్లా ఏర్పడిందని అభిప్రాయపడ్డారు; ఇటువంటివారిని Conventionalists అంటారు.

మన దేశంలో ప్రాచీన కాలంలో అర్థవిషయకచర్చ వైయాకరణులు మాత్రమేకాక తార్కికులు, మీమాంసకులు, నైయాయికులు, అలంకారికులు కూడా చేశారు. వీరి పరిశోధన శాస్త్రీయంగానూ సమగ్రంగానూ జరిగింది. శబ్దార్థాల పరస్పర సంబంధం లోకవ్యవహారం వల్లనే సిద్ధిస్తుందని మన ప్రాచీనులు గ్రహించారు. "సిద్ధే శబ్దార్థ సంబంధే లోకతః" అని వరరుచి వార్తికం. "సామయికత్వాత్ శబ్దార్థ సంప్రత్యయస్య" అని గౌతమ న్యాయ సూత్ర(శబ్దార్థ సంబంధం సంప్రదాయ సిద్ధమని దీని అర్థం). తర్క సంగ్రహంలో ఈ శబ్దం వల్ల ఈ అర్థం తెలుస్తుంది అనేది శక్తి అనీ, ఈ శక్తి ఈశ్వరేచ్ఛ వల్ల ఏర్పడిందనీ చెప్పబడింది. ("అస్మాత్ పదాదయ మర్థో బోద్ధవ్య ఇతీశ్వర సంకేతః శక్తిః"). కాని నవ్యనైయాయికులు ఈ శక్తి ఈశ్వరేచ్ఛ వల్ల ఏర్పడింది కాదు (వ్యవహర్తల) ఇచ్ఛ వల్లనే ఏర్పడిందని చెప్పేరు. అర్థాన్ని గురించీ శబ్దాన్ని గురించీ మన ప్రాచీనులు చేసిన కృషి చివరి రెండు అధ్యాయాలలోనూ విపులంగా వివరించబడుతుంది.

ఆధునిక భాషాశాస్త్రాభివృద్ధికి ముఖ్య కారకులలో ఒకడైన బ్లూమ్ ఫీల్డ్ అర్థాన్ని గురించిన పరిశోధనకి ప్రాముఖ్యం ఇవ్వలేదని ఇంతకుముందు తెలుసుకొన్నాం(చూ.7.1.) దీనివల్ల ఆయన అనుయాయులు కూడా అర్థాన్ని గురించి ఎక్కువ పరిశోధించక మిగిలిన వ్యాకరణాంగాల మీదే తమ దృష్టి కేంద్రీకరించారు. బ్లూమ్‌ఫీల్డ్ అర్థాన్ని పరిశోధించకపోవడానికి కారణం ఇంకా చెప్పేరు: 'ఇంతవరకు శాస్త్ర విజ్ఞానం వల్ల మనకు స్పష్టంగా తెలిసిన విషయాల అర్థాలకే మనం సరియైన నిర్వచనం ఇవ్వగలం. ఉదాహరణకి ఖనిజాలకీ, వృక్షాలకీ, జంతువులకీ ఆయా శాస్త్రాల సహాయం వల్ల సరియైన నిర్వచనాలు ఇవ్వవచ్చు: 'ఉప్పు' అంటే సోడియం క్లోరైడ్ (NaCL) అని చెప్పవచ్చు. కాని 'ప్రేమ' 'ద్వేషం' మొదలైన పదాలకి శాస్త్రీయ నిర్వచనం ఇవ్వడం అసాధ్యం; ఇటువంటి పదాలే భాషలో ఎక్కువగా ఉన్నాయి". బ్లూమ్ ఫీల్డ్ వాద పద్ధతిలో

మూడు లోపాలు ఉన్నాయి. ఒకటి ఏ కాలంలోనైనా ఒక విషయానికి సాధారణంగా ఒకటి కన్న ఎక్కువ శాస్త్రీయ వివరణలు ఉంటాయి. అటువంటప్పుడు ఏ వివరణని మనం అర్థనిర్వచనానికి ఉపయోగించుకోవాలి? రెండోది – శాస్త్రీయ విజ్ఞానం అభివృద్ధి పొందడం చెరువులో నీటిమట్టం ఎక్కువైనట్టుగా నిరంతరంగా జరగదు. ఒక్కొక్క శాస్త్రీయ విషయం పరిశోధనల వల్ల మార్పులకీ, సూక్ష్మ వివరణలకీ లోనయి అధిక స్పష్టతనీ నైశిత్యాన్నీ పొందుతుంది. కాబట్టి అన్ని ప్రశ్నలకీ ఆఖరి శాస్త్రీయ సమాధానాలు ఇవి అని చెప్పగలిగే కాలం ఎప్పటికైనా వస్తుందని అనుకోవడం కష్టం. మూడోది – ఇతర శాస్త్రాల అభివృద్ధి అర్థ నిర్ణయానికి దోహదం చేసినా ఆ శాస్త్రాలు కూడా అర్థాలు భాషలోనే ఇస్తాయి కాబట్టి వాటి అర్థం నిర్ణయించడం అవసరమవుతుంది. ఉదాహరణకి ఉప్పు అంటే NaCL అని రసాయన శాస్త్రం చెప్పినా, NaCL అనే దాని అర్థం ఏమిటి అనే ప్రశ్న మిగులుతుంది. దీనికి ఇంకా నిశితమైన అర్థం ఇచ్చినా దానిని భాషా వ్యవహర్తలు ఎలా అర్థం చేసుకోగలుగుతున్నారు అనే ప్రశ్న ఇంకా మిగిలే ఉంటుంది. కాబట్టి ఇటువంటి అర్థ నిర్ణయ చర్చ అనంతమై చక్రభ్రమణంలా మళ్ళీ మొదటికి వస్తూ ఉంటుంది.

పై చర్చ వల్ల అర్థ శాస్త్ర చర్చ అర్థ శాస్త్ర పరిధిలోనే జరగాలి గాని ఇది ఇతర శాస్త్రాల ప్రమేయం వల్ల పరిపూర్ణతని సాధించుకోదు అనే విషయం స్పష్టమవుతుంది. ఏ శాస్త్రమైనా వృద్ధి పొందాలి అంటే దానిలో విషయ విభజన జరగాలి. ఒక్కొక్క విషయాన్ని సమగ్రంగా పరిశోధించడం వల్ల మొత్తం శాస్త్ర క్రమక్రమంగా వృద్ధి చెందుతుంది. కాబట్టి "అర్థం అంటే ఏమిటి?" అనే పెద్ద ప్రశ్నకి సమాధానాన్ని అన్వేషించడానికి ముందు దీనికి సంబంధించిన చిన్న చిన్న ప్రశ్నలు వేసుకొని, వాటికి సమాధానాలు అన్వేషించడానికి ప్రయత్నం చెయ్యాలి. ఇటువంటి చిన్న చిన్న ప్రశ్నలకు ఇచ్చిన సమాధానాలు పైపెద్ద ప్రశ్న సమాధానానికి అంగాలుగా ఉండి, మొత్తం అర్థం అంటే ఏమిటో తెలుసుకోవడానికి ఉపకరిస్తాయి. ఇటువంటి చిన్న చిన్న ప్రశ్నలు పదిహేను ఉన్నాయి. అవీ, వాటి సమాధానాలూ కింద ఇవ్వబడతాయి.

1. సమానార్థకత (Synonymy), భంగ్యంతర వాక్యం (Paraphrase) అంటే ఏమిటి?

సమానమైన అర్థం కలిగి ఉండడమనే సంబంధం సమానార్థకత్వ ఉదాహరణకి "తల్లి" – "ఒక వ్యక్తికి ఆ వ్యక్తిని కన్న స్త్రీ", "శవం" --"చచ్చి పోయిన వ్యక్తి శరీరం", "పిడికిలి" – "మూసిన చెయ్యి". పై జంటలు సమానార్థకాలు. ఈ జంటలలో రెండో పదబంధాలు భంగ్యంతర వాక్యాలు.

2. అర్థసాదృశ్యం (Semantic Similarity), అర్థభేదం (Semantic Difference) అంటే ఏమిటి?

"అత్త", "పిన్ని", "ఆవు", "చెల్లెలు", "నటి" అనేవి ఒక విషయంలో అర్థసాదృశ్యం కలవి; ఇవన్నీ స్త్రీ వాచకాలు.

"అత్త", "కుక్క", "ఆకు", "కొండ", "బండి" అనే వాటికీ "సిగ్గు", "నవ్వు", "సంతోషం" "కోపం" అనేవాటికి మధ్య ఒక విషయంలో భేదం ఉంది. మొదటి సముదాయంలోవి మూర్తాలు, రెండో సముదాయంలోని అమూర్తాలు.

3. విరుద్ధార్థకత (Antonymy) అంటే ఏమిటి?

4. ఉపరివర్గత (Superordination), అంతర్వర్గత (Subordination) అంటే ఏమిటి?

అవయవం–కాలు, ఇలు–పెంకుటిల్లు, మనిషి–పిల్ల (వాడు). పై జంటలలో మొదటిది ఉపరివర్గానికీ, రెండోది అంతర్వర్గానికీ చెందినది.

5. అర్థవత్త (Meaningfulness), అర్థాసంబద్ధత (Semantic Anamoly) అంటే ఏమిటి?

"సువాసన వేసే పువ్వు" అనేది అర్థవంతమైనది కాని "సువాసన వేసే పాట" అనేదానికి సరియైనది అర్థంలేదు. కాబట్టి ఇది అర్థాసంబద్ధతకి ఉదాహరణ. అదే విధంగా "డబ్బాలు ఖాళీ అవుతున్నాయి", "మనిషి తలకిందులుగా పడుతున్నాడు" అనేవి అర్థవత్తగలవి కాని "నీడలు ఖాళీ అవుతున్నాయి", "వడగళ్లు తలకిందులుగా పడుతున్నాయి" అనేవి అర్థాసంబద్ధత గలవి.

6. అర్థసందిగ్ధత (Semantic Ambiguity) అంటే ఏమిటి?

ఒక పదానికి గాని వాక్యానికి గాని ఒకటికన్న ఎక్కువ అర్థాలు ఉంటే అర్థ సందిగ్ధత ఏర్పడుతుంది. అర్థ సందిగ్ధత కొన్ని చోట్ల సందర్భంవల్ల నివారించబడతుంది కాని, ఏ అర్థం ఉద్దేశించబడింది అనేది సందర్భంవల్ల కూడా తెలియకపోతే అర్థసందిగ్ధత అలాగే మిగిలిపోతుంది. కొట్టు, చెప్పు, అడుగు, కోళ్ళు (మంచం కోళ్ళు, కూసే కోళ్ళు). పళ్ళు, బళ్ళు, (చదువుకొనే బళ్ళు, ఎడ్లులాగే బళ్లు), కప్పు (కాఫీ కప్పు, ఇంటికప్పు) ఇత్యాదిపదాలు అర్థసందిగ్ధతకి ఉదాహరణలు. "పళ్లు రాలగొడుతాను", "కప్పు పడిపోయింది", "ఆ వెధవ డబ్బు నాకు అక్కర లేదు" వంటి వాక్యాలలో కూడా అర్థ సందిగ్ధత ఉంది (దీనిపై చర్చ 7.4 లో కూడా ఉంది).

7. వ్యర్థపద ప్రయోగం (Semantic Redundancy) అంటే ఏమిటి?

"మూడు కాళ్ళ ముక్కాలిపీట", "పెళ్ళికాని కన్య" వంటి వాటిలో విశేషణం సూచించే అర్థం విశేష్యంలోనే నిక్షిప్తమై ఉంది : మూడు కాళ్ళు ఉన్న పీటనే "ముక్కాలిపీట" అంటాం; అలాగే పెళ్ళికాని స్త్రీనే "కన్య" అంటాం.

8. వివరణాత్మక సత్యం (Analytic Truth) అంటే ఏమిటి?

"పెద్దవాళ్ళు చిన్నపిల్లలు కారు", "మీ అమ్మ గొడ్రాలు కాదు", "ఆచార్యులు డిగ్రీలు పొందినవాళ్ళు" వంటి వాక్యాలలో ఆఖ్యాత పదబంధం అర్థం కర్తృపదబంధం అర్థంలోనే ఇమిడిఉంది. అందుచేత ఈ వాక్యాలు నిత్య సత్యాలు.

9. వ్యతిరేకత (Contradictoriness) అంటే ఏమిటి?

"చంటి పిల్లలు పెద్దవాళ్ళు", "ధనవంతులు బీదవాళ్ళు" వంటి వాక్యాలలో కర్తృపదబంధం అర్థానికీ ఆఖ్యాత పదబంధం అర్థానికీ పొత్తు లేకపోవడం వల్ల వీటిలో వ్యతిరేకత ఉంది. అందువల్లనే ఇవి అసత్యాలు అని తెలుస్తుంది.

10. అర్థానిర్దిష్ట సత్యాసత్యత (Semantically undetermined truth or falsehood; Syntheticity) అంటే ఏమిటి?

"రాజులు మత్తులు", "తెలుగు వాళ్లు ఆరంభశూరులు", "ఆడవాళ్లు అమాయాపరులు" వంటి వాక్యాలు వాటి అర్థంవల్ల, మాత్రమే సత్యాలు కావు, అసత్యాలు కావు. వాటి సత్యాసత్యతలు లోకంలో స్థితిగతుల మీద ఆధారపడి ఉన్నాయి.

11. వాక్యాసంబద్ధత (Inconsistency) అంటే ఏమిటి?

"రామయ్య బతికి ఉన్నాడు" – "రామయ్య చచ్చిపోయాడు". ఒకే వ్యక్తికి సూచించేటప్పుడు పై రెండు వాక్యాలూ మొత్తంగా నిజం కావు అబద్ధం కావు; వీటిలో ఏదో ఒకటి నిజమూ, రెండోది అబద్ధమూ అయి ఉండాలి. ఇది వాక్యాసంబద్ధత.

12. అనుగతి (Entailment) అంటే ఏమిటి?

ఒక వాక్యంవల్ల ఇంకొక వాక్యం అనుస్యూతంగా స్ఫురిస్తూ ఉంటే ఈ రెండు వాక్యాల మధ్య సంబంధాన్ని అనుగతి అంటారు. "ఆసియాలో దేశాలు బీదదేశాలు" అనే వాక్యంవల్ల "ఇండియా బీదదేశం" అనే వాక్యం స్ఫురిస్తుంది. "నా కారు ఎర్రది" అనే వాక్యాన్ని "నా కారు రంగుది" అనే వాక్యం అనుగమిస్తుంది.

13. పూర్వోద్దేశం ((resupposition) అంటే ఏమిటి?

ఒక వాక్యాన్ని ప్రయోగించడానికి ఆధారభూతమైన ఉద్దేశాలు కొన్ని ఉంటాయి. ఉదాహరణకి "తాళంచెవి ఎక్కడ ఉంది?" అనే ప్రశ్న "తాళం చెవి ఎక్కడో ఉంటుంది" అనే వాక్యం సత్యత్వం మీద ఆధారపడి ఉందికాబట్టి మొదటి వాక్యానికి రెండో వాక్యం పూర్వోద్దేశం.

14. ప్రశ్న – సమాధానాల సంబంధం ఎటువంటిది?

"రాముడు ఎప్పుడు వచ్చేడు?" అనే ప్రశ్నకి "రాముడు నిన్న వచ్చాడు", "రాముడు దీపావళినాడు వచ్చాడు", "రాముడు గంట క్రితం వచ్చాడు" ఇత్యాది సమాధానాలు సరియైనవి; కాని "రాముడికి మామిడి పళ్లు ఇష్టం", "రాముడు మా బావమరిది", "భీముడు నిన్న వచ్చాడు" ఇత్యాదులు సరియైనవి సమాధానాలు కావు.

15. నిక్షిప్త సమాధాన ప్రశ్న (Self-answered question) అంటే ఏమిటి?

"కన్య ఆడదా?", "పంచపాండవులు ఎందరూ?", "నా ఎర్ర కారు రంగు ఏమిటి?" వంటి ప్రశ్నలకి సమాధానాలు వాటిలోని నిక్షిప్తమై ఉన్నాయి.

ఒక వాక్యం అర్థవంతమైనదా కాదా అని చెప్పడానికి భాషానిర్మాణమూ, లోక ప్రవృత్తీ కూడా ఉపయోగిస్తాయి. కొన్ని వాక్యాలు కొత్త విషయం ఏమీ చెప్పకపోవడంవల్ల వింతగా ఉంటాయి. ఉదాహరణకి కింద వాక్యం చూడండి.

1. సోమవారం దాని తరవాత వచ్చే రోజుకి ముందు వస్తుంది.

కొన్ని వాక్యాలు వ్యాఘాతకత వల్ల అర్థరహితంగా ఉంటాయి (2-3 వాక్యాలు చూడండి).

2. నాకు ఇష్టమైనది ప్రతీదీ నేను అసహ్యించుకొంటాను.

3. నేను ఒకావిడ ఇచ్చిన బిస్కట్టు తిని, దాన్ని ఆవిడకి తిరిగి ఇచ్చేశాను.

లోకాన్ని గురించీ, మనుష్యుల ప్రవృత్తిని గురించీ మనకు తెలిసిన విషయాలు ఆధారంగా కొన్ని వాక్యాలు సత్యాలుగాగాని అసత్యాలుగాగాని కనిపిస్తాయి.

4. భూమిలో రైళ్లు నడుస్తాయి.

5. నేను మద్రాసునించి ఢిల్లీ మూడు గంటలలో వెళ్ళాను

6. నేను మద్రాసునించి ఢిల్లీ మూడు నిముషాలలో వెళ్ళాను.

7. మా మామయ్య మెలుకువగా ఉండే నిద్రపోతాడు.

భూమిలో రైళ్లు నడుస్తాయి అనే సత్యం తెలియనివారికి 4వ వాక్యం అసంబద్ధంగా కనిపిస్తుంది. ఆ విషయం తెలిసిన వారికి ఇందులో అసంబద్ధత కనబడదు. 5వ వాక్యం విన్నప్పుడు మనం ఆ వ్యక్తి విమానంలో ప్రయాణం

చేశాడు అని ఊహించుకొని అది సత్యం కావచ్చు అని నమ్ముతాం. కాని ఈ వాక్యం విమానాలు లేని కాలంలో (50 ఏళ్ల కిందట) ఎవరైనా ఉచ్చరిస్తే అది సత్యం కావడానికి వీలులేదు (పాదలేపం వంటివి నిజంగా ఉండి ఉంటే తప్ప). 6వ వాక్యం ప్రస్తుత కాలంవరకూ అసత్యమే; అంత వేగవంతమైన విమానాలు వచ్చినప్పుడు అది సత్యం కావచ్చు. 7వ వాక్యంలో వ్యతిరేకత ఉంది కాబట్టి ఇది అసలు అర్థంలో అసంబద్ధం, కాని ఇటువంటి వాక్యాలు విన్నప్పుడు మనం వాటిని ఏదో రకంగా అర్థంచేసుకోవడానికి ప్రయత్నిస్తాం. ఇందులో 'నిద్ర పోతాడు' అనే దానికి 'బద్ధకంగా ఉంటాడు' లేక 'చురుకుగా పనిచెయ్యడు' అనే లక్షణార్థం చెప్పుకొని, ఈ వాక్యం సరియైనదే అని అనుకొంటాం. ఇలా అర్థాలలో ఉన్న రకాలని గురించి తరవాత విభాగంలో చూద్దాం.

## 8.2. అర్థాలలో రకాలు

మనం వ్యవహారంలో పదాలని అవి సూచించే ముఖ్యార్థాలలోనే కాక అముఖ్యమైన లేక గౌణమైన అర్థాలలో కూడా వాడుతూ ఉంటాం. మన ఆలంకారికులు ముఖ్యార్థాన్ని 'అభిధ' (Entailment) అని వ్యవహరించారు. 'ధ్వని' లేక 'వ్యంజన' అనేది ఈ రెండిటికన్న అంతర్వాహినిగా ఉండి సహృదయులకు స్ఫురించే అర్థం. 'ఆడది' అనే పదానికి "మగవాడు కాని మనిషి" అనే అభిధార్థమే కాక "దయ గలది", "ధైర్యం లేనిది", "లోకానుభవం లేనిది", "బలం లేనిది" "అలంకార ప్రియత్వం గలది" మొదలైన అనేక లక్షణార్థాలు ఉన్నాయి. ఇదే విధంగా "పంది", "పులి", "దున్నపోతు", "బండరాయి" మొదలైన పదాలని మనుష్యపరంగా వాడినపుడు ఈ పదాల లక్షణార్థాలే మనం గ్రహిస్తాం. కొన్ని పదాల లక్షణార్థం దేశకాలాలనిబట్టి మారుతూ ఉంటుంది. అంతేకాక ఒక భాషలో ఒక పదానికి ఉన్న లక్షణార్థం మరొక భాషలో దానితో సమానమైన పదానికి ఉండకపోవచ్చును.

లక్షణార్థంవల్ల మనకు అవగతమయ్యే విషయాలు (i) శైలి(Stylistic Meaning), (ii) వక్తృమనఃప్రవృత్తి (Affective Meaning), (ii) ధ్వని (Reflected Meaning), (iv) సాహచర్యం (Collocative Meaning). ఇక్కడ శైలి అనేది విస్తృతార్థంలో వాడబడింది. ఒక మనిషి మాట్లాడేటప్పుడు

అతను ఉపయోగించే భాషవల్ల అతను ఏ ప్రాంతానికి చెందినవాడో, ఏ సాంఘిక వర్గానికి చెందినవాడో మొదలైన వక్తని గురించిన విషయాలు ఇతరులకు తెలుస్తాయి. అంతేకాకుండా మనం సన్నిహితులతో మాట్లాడేటప్పుడు ఒక విధంగానూ, అధికారులతో మాట్లాడేటప్పుడు మరొక విధంగానూ, మన కిందివారితో మాట్లాడేటప్పుడు ఇంకొక విధంగానూ మట్లాడతాం. ఇంతేకాక ఒక్కొక్క వ్యక్తి మాట్లాడే విధానంలో తేడాలు ఉంటాయి. కొందరు ఎప్పుడు హాస్యంగానూ, కొందరు ఎప్పుడు ముభావంగానూ, కొందరు ఎప్పుడు అసందర్భంగానూ మాట్లాడుతూ ఉంటారు. ఇవన్నీ శైలి కిందకే వస్తాయి.

ఒక వ్యక్తి మాట్లాడే విధానంవల్ల అతను ప్రశాంతంగా ఉన్నాడో లేక కోపంగానూ చిరాకుగానూ ఉన్నాడో తెలుస్తుంది. అంతేకాక అతనికి శ్రోతలని గురించి కాని, అతను ఎవరిని గురించి మాట్లాడుతున్నాడో వారిని గురించిగాని అతని ఉద్దేశం మొదలైన మనః ప్రవృత్తి మనకి తెలుస్తుంది.

8. గొడవ చెయ్యకుండా కూచోండి.

9. మీరంతా నిశ్శబ్దంగా కూచోవాలని ప్రార్థన.

పై రెండు వాక్యాలకీ అర్థం ఒకటే అయినా 9 8 కన్న మర్యాదాసూచకంగా ఉంది.

10. వాడు పొద్దున్నే వాచ్చాడు.

11. వాడు పొద్దున్నే సిద్ధమయ్యాడు.

12. వాడు పొద్దున్నే తగలడ్డాడు.

పై వాక్యాల వల్ల ఉద్దిష్ట వ్యక్తిని గురించి ఎటువంటి అభిప్రాయం ఉందో మనకి సులభంగా తెలుస్తుంది. ఇటువంటి భేదమే 13, 14 వాక్యాలకి కూడా ఉంది.

13. నువ్వు వెళ్లిరా.

14. నువ్వు ముందు బయటికి నడు.

15, 16 వాక్యాలలో ధ్వని ఉంది :

15. ఆయన పేరులో మాత్రమే సత్యం ఉంది.

16. ఆవిడ పేరు సరస్వతే కాని ఆవిడ చదువుకోలేదు.

కొన్ని పదాలకి ఇతర పదాలతో ఉన్న సాహచర్యంవల్ల లక్షణార్థం ఏర్పడుతుంది. "చేష్టలు" అనే మాట వినగానే మనకి "కోతిచేష్టలు" జ్ఞాపకం వస్తాయి. "వేషాలు" అనే మాట వినగానే "వెధవ వేషాలు", "వెకిలి వేషాలు" జ్ఞాపకం వస్తాయి. ఇటువంటి చోట్ల అభిధార్థం పూర్తిగా నశించి లక్షణార్థం మాత్రమే మిగిలి ఉంది.

కొన్ని సందర్భాలలో మాట్లాడే మాటల వల్ల వక్త దేహస్థితి తెలుస్తుంది. ఒంట్లో బాగాలేని వారు నీరసంగా మాట్లాడడమేకాక అసంపూర్ణ వాక్యాలు ఉపయోగిస్తారు. రొంపట్టినప్పుడు అనునాసికాక్షరాలు పలకవు. సాధారణంగా పిల్లల గొంతుకకీ – ఆడవారి గొంతుకీ – మగవారి గొంతుకకీ భేదం ఉంటుంది. ఇంతేకాక కొన్ని భాషలలో ఆడవారి భాషకీ మగవారి భాషకీ భేదం ఉంటుంది. అటువంటి భాషలలో మాట్లాడేది మగవాడా ఆడదా అనే విషయం (వ్యక్తి కనబడనప్పుడు) భాషవల్ల గ్రహించవచ్చు.

ఇక వాక్యనిర్మాణ విధానంలో భేదం వల్ల కూడా అర్థంలో స్వల్ప భేదం ఉంటుంది. ఒక విషయాన్ని నొక్కి చెప్పడానికి వాక్యంలో పదాల వరస మార్చడం. ఒక పదాన్ని ఉదాత్తంగా ఉచ్చరించడం, వాక్యశ్రుతి మార్చడం మొదలైనవి మనం చేస్తూ ఉంటాం. ఇటువంటి వాటివల్ల సూచితమయ్యే అర్థభేదాన్ని విషయార్థం (Thematic Meaning) అనవచ్చు.

17. (a) సుమిత్రకి మొదటి బహుమతి వచ్చింది.
    (b) మొదటి బహుమతి వచ్చింది సుమిత్రకి.

18. (a) నాకు ఆవకాయ ఇష్టం.
    (b) ఆవకాయ నాకు ఇష్టం.

19. (a) మా ఊళ్ళో చెల్లారామ్స్ అన్ని కొట్లలోకి పెద్దది.
    (b) మా ఊళ్ళో అన్ని కొట్టుల్లోకి పెద్దది చెల్లారామ్స్.

20. (a) నాకు డబ్బు కావాలి.
    (b) నాకు కావలసింది డబ్బు.

పై వాక్యాలలో పదాల వరస మార్చడం వల్ల (b) లు (a) ల కన్న ఎక్కువ భావద్యోతకాలుగా ఉన్నాయి. 21లో ఉదాత్తోచ్చారణవల్ల ఎలక్ట్రిక్ అనే పదానికి ప్రాముఖ్యం వచ్చింది.

21. ఆయన ఎలక్ట్రిక్ రేజర్‌తో గడ్డం గీసుకొంటారు.

## 8.3. అర్థక్షేత్రం

ఏ భాషలోనైనా నిఘంటువులో పదాలని వాటి అర్థాన్ని బట్టి కొన్ని సముదాయాలుగా విభజించవచ్చు. ఇటువంటి సముదాయాలని అర్థక్షేత్రాలు (Semantic Fields) అనవచ్చు. బంధువాచక పదాలన్నీ ఒక అర్థక్షేత్రానికి సంబంధించినవి. అదేవిధంగా 'నడుచు', 'పరిగెత్తు', 'పాకు', 'ఎగురు', 'ఈదు' మొదలైన క్రియలు గమనసూచన క్రియలు అనే అర్థక్షేత్రానికి చెందుతాయి. 'ఉపాధ్యాయుడు', 'విద్యార్థి' 'విద్యార్థిని', 'సహపాఠి' మొదలైన పదాలు విద్యాసంబంధాన్ని సూచించే అర్థక్షేత్రానికి చెందిన పదాలు.

అర్థక్షేత్రాలు పెద్దవిగా గాని చిన్నవిగా గాని ఉండవచ్చు. • అది వాటిలో ఉన్న పదాల సంఖ్య మీద ఆధారపడి ఉంటుంది. పెద్ద అర్థక్షేత్రాలలో అంతర్విభాగాలు ఉంటాయి. ఉదాహరణకి బంధువాచక పదాలలో పురుష బంధువాచక పదాలు, స్త్రీ బంధువాచక పదాలు అనే అంతర్విభాగం చెయ్యవచ్చు; లేక ఒకే తరానికి చెందిన బంధువులు, పై తరానికి లేక కింద తరానికి చెందిన బంధువులు అనే విధంగా అంతర్విభాగం చెయ్యవచ్చు.

ఒక అర్థక్షేత్రానికి చెందిన పదజాలంలో పరస్పర సంబంధాలని అర్థ లక్షణ విశ్లేషణ వివరిస్తుంది. (దీనిపై చర్చకి 7.3. చూడండి). అర్థలక్షణ విశ్లేషణ అర్థ నిర్మాణ పరిశోధనలో అతి ముఖ్యాంశం. దీనివల్ల రెండు ప్రయోజనాలు ఉన్నాయి. దీనివల్ల భాషలో ఏవి సాధువాక్యాలు, ఏవి అసాధు వాక్యాలు అనే విషయం తెలియడమే కాకుండా ఒక అర్థక్షేత్రంలో ఉన్న పరస్పర సంబంధం

కూడా తెలుస్తుంది. అర్థలక్షణ నిర్మాణానికి వాక్య నిర్మాణానికి మధ్య ఉన్న సన్నిహిత సంబంధాన్ని ఎత్తి చూపుతుంది.

అర్థ లక్షణాలు అంటే ఒక పదం మొత్తం అర్థంలో చిన్న చిన్న అంశాలు అని ఇంతకు ముందు చూశాం. ఉదాహరణకి కుక్క అనే దాని అర్థలక్షణాలు [+ ప్రాణిత్వం] [- మనుష్యత్వం] మొదలైనవి. ఒక పదం అర్థాన్ని సమగ్రంగా వివరించడానికి అర్థలక్షణాలే గాక సంబంధ లక్షణాలు (Relational Components) కూడా అవసరమవుతాయి. తండ్రి, తల్లి, కొడుకు, కూతురు మొదలైన సంబంధ వాచక పదాలలో మనుష్యత్వం, పురుషత్వం లేక స్త్రీత్వం మొదలైన అర్థలక్షణాలే కాక ఫలానా వ్యక్తిని లేక వ్యక్తులని కన్నవాడు లేక కన్నది లేక ఫలానా వ్యక్తికి పిల్లవాడు లేక పిల్ల ఇత్యాది సంబంధ లక్షణాలు కూడా అంతర్గతమై ఉన్నాయి. అంతేగాక పొడుగు, పొట్టి, లావు, సన్నం మొదలైన పదాలలో కూడా సంబంధ లక్షణాలని మనం గ్రహించాలి. ఎందువల్ల నంటే 'ఆమె పొడుగు' అనే వాక్యం అర్థం. 'సాధారణంగా మనుషులు ఉండే పొడుగుకన్న ఆమె ఎక్కువ పొడువుగా ఉంది' అని; అలాగే 'ఆమె పొట్టి' అంటే 'సాధారణంగా మనుషులు ఉండే పొడుగు కన్న ఆమె తక్కువగా ఉంది' అని అర్థం.

## 8.4. వ్యాకరణార్థం

నామవాచకాలు, క్రియలు, విశేషణాలు మొదలైన వ్యాకరణ సంవర్గాలకి చెందిన పదాలకి ఉన్న అర్థం నిఘంటువులో సూచించబడుతుంది. కాబట్టి ఇటువంటి అర్థాన్ని నైఘంటుకార్థం (Lexical meaning) అనవచ్చు. కాని ఒక వాక్యానికి మొత్తంగా ఉన్న అర్థాన్ని తెలుసుకోవడానికి ఆ వాక్యంలో ఉన్న పదాల నైఘంటుకార్థం మాత్రమే తెలుసుకొంటే చాలదు. నైఘంటుకార్థం కన్న భిన్నమైన వ్యాకరణార్థం (Grammatical meaning) అనేది ఒకటుందని గ్రహించాలి. సాధారణంగా ఒక వాక్యంలో ఉన్న పదాల అర్థాలు అన్నీ కలిపితే ఆ వాక్యం మొత్తం అర్థం వస్తుందని మనం అనుకుంటాం. ఈ ఊహ తప్పని 22, 23 వాక్యాలు చూస్తే తెలుస్తుంది.

22.ఆయన భార్య కొత్త కుర్చీలు కొంది.

23. ఆయన కొత్త భార్య కుర్చీలు కొంది.

పై రెండు వాక్యాలలోనూ పదాలు ఒకటిగానే ఉన్నా ఆ వాక్యాల అర్థంలో అనంతమైన భేదం ఉంది. ఈ భేదం ఎలా వచ్చింది? 22లో 'కొత్త' అనేది 'కుర్చీలు'కి విశేషణంగా ఉంది; 23లో 'కొత్త' 'భార్య'కి విశేషణంగా ఉంది. ఇటువంటి విశేషణ-విశేష్య సంబంధం అనేది వ్యాకరణార్థంలో ఒక రకం. వ్యాకరణార్థంలో మూడు రకాలు ఉన్నాయి. ఒకటి- ప్రత్యేక ప్రయోగయోగ్యతలేని అవ్యయాలు (-ఏ:వాడే, -ఓ:వాడో, వీడో, మొ.), ప్రత్యయాలు (బహువచన ప్రత్యయం, విభక్తి ప్రత్యయం, కాల ప్రత్యయం మొ.) వంటి వాటికున్న అర్థం. రెండు – వాక్యంలో పదబంధాలకి ఉన్న కర్త, కర్మ, విశేషణం మొదలైన వాటి అర్థాలు. మూడు – నిశ్చాయకం, విధి, ప్రశ్న మొదలైన వాక్య భేదాలకి ఉన్న అర్థాలు. ఒక వాక్యంలో అంగాలుగా ఉన్న పదాల, అర్థకాల నైఘంటుక వ్యాకరణార్థాలు కలియడంవల్లనే ఆ వాక్యార్థం స్ఫురిస్తుందని ఫలితార్థం.



# 9. భాష – సంఘం

## 9.1. భాషాభేదాలు–సాంఘిక కారణాలు

ప్రజల వ్యవహారంలో ఉన్న ఏ భాష అయినా కాలక్రమేణ మార్పు చెందుతూ ఉంటుంది. మనం ఈ కాలంలో మాట్లాడే తెలుగుకీ నన్నయాది ప్రాచీన కవులు వాడిన తెలుగుకీ పదాలలోనూ, ప్రత్యయాలలోనూ, వాక్య నిర్మాణంలోనూ, పదాల అర్థాలలోనూ భేదం ఉంది. ఈ విషయం ప్రాచీన కావ్యాలలోని ఒక పద్యాన్ని ఇప్పటి భాషలోకి మార్చి ఈ రెండిటినీ పోల్చి చూస్తే స్పష్టమవుతుంది. ఇలా కాలక్రమేణ భాష మారడం అన్ని భాషలకీ సహజమే. కాలానుగుణంగా భాషలలో వచ్చే చారిత్రక పరిణామాన్ని గురించి తరవాత అధ్యాయాలలో విపులమైన చర్చ ఉంది. ఈ అధ్యాయంలో ఏకకాలంలో భాషలో ఉండే భేదాలని గురించీ, వాటికిగల కారణాలని గురించీ చర్చిద్దాం.

ఒకే కాలానికి చెందిన భాషలో కూడా భేదాలు ఉంటాయి. ఒక భాషని ఆ భాషా వ్యవహర్తలు అందరూ ఒకే రకంగా వ్యవహరించరు. ఈ కాలపు తెలుగు ప్రాచీన కాలపు తెలుగుకన్న భిన్నంగా ఉన్నా నిజానికి ఈ కాలంలో తెలుగు కూడా అందరూ ఒకే రకంగా మాట్లాడరు. భాషా వ్యవహారంలో ప్రాంతాన్ని అనుసరించీ, కులాన్ని అనుసరించీ, వృత్తిని అనుసరించీ, విద్యార్హతలని అనుసరించీ వ్యక్తుల మధ్య భేదాలు ఉంటాయి ఇంకా సూక్ష్మంగా పరిశీలిస్తే ఒకే వ్యక్తి వాడే భాషలో సందర్భాన్ని అనుసరించి భేదాలు కనిపిస్తాయి. సభలో మాట్లాడేటప్పుడు వేదిక మీద ఉన్న వ్యక్తిని సూచించడానికి "వారు" అనే పదంలో "వారు చెప్పేరు", "వారు వచ్చేరు" ఇత్యాదిగా వ్యవహరిస్తాం. కాని మామూలు వ్యవహారంలో "వారు" అనకుండా "ఆయన" అనో "అతను" అనో అంటాం. సభలో "వారిని వచ్చి అధ్యక్ష పీఠాన్ని అలంకరించ వలసిందిగా ప్రార్థిస్తున్నాను", "నా మనవి ఏమిటంటే...", "అందరూ నిశ్శబ్దంగా కూర్చోవాలని ప్రార్థన" అంటాం. మామూలు వ్యవహారంలో చివరి వాక్యానికి బదులు "గొడవ చెయ్యకుండా కూచోండి" అనో "మాట్లాడకండి" అనో అంటాం సభలో ఈ మాటలు మాట్లాడితే అమర్యాదకరంగా

బావిస్తాం అలాగే సభార్హమైన మాటలు ఇంట్లో కుటుంబంలోనూ, మిత్రులతోనూ వాడితే నవ్వు పుట్టిస్తాయి. కాబట్టి సందర్భోచితంగా భాషలో భేదం ఉంటుందని దీనివల్ల తెలుస్తుంది. అలాగే సాహిత్య గోష్ఠిలోనూ, విజ్ఞానశాస్త్ర చర్చలోనూ, వైద్యశాస్త్ర చర్చలోనూ, ఇంకా ఇతర శాస్త్ర చర్చలలోనూ ఉపయోగించే పారిభాషిక పదాలు ప్రతి శాఖకీ ప్రత్యేకంగా ఉంటాయి. అటువంటి పదాలు ఆయా శాఖలలో ప్రవీణులు ఇతరులతో మామూలు వ్యవహారంలో మాట్లాడేటప్పుడు ఉపయోగిస్తే అసందర్భంగా ఉండి, గొప్ప చూపెట్టుకొందుకు మాట్లాడుతున్నట్టు ఉంటుంది. సంస్కృతం నిత్య వ్యవహారంలో ఉన్న కాలంలో అందులో కూడా ఇటువంటి సందర్భోచితభాష ఉండేది అనడానికి ఆధారం ఉంది. పతంజలి వ్యాకరణ మహాభాష్యంలో మామూలు వ్యవహారంలో ఉపయోగించే అపశబ్దాలు ఉదాహరణగా యర్వాణ తర్వాణులు అనే ఇద్దరు ఋషులు "యద్వానః" "తద్వానః" అనే సాధుశబ్దాలకి బదులు సాధారణ వ్యవహారంలో "యర్వాణః", "తర్వాణః" అనే వారనీ, కాని యజ్ఞ కర్మలో ఈ అపశబ్దాలు ప్రయోగించేవారు కారనీ చెప్పేరు. (ఈ ఋషుల పేర్లు వారు ఉపయోగించే అపశబ్దాలు ఆధారంగా ఏర్పడ్డాయనేది స్పష్టం; యాజ్ఞేకర్మణి సనియమః, అన్యత్రానియమః, ఏవం హి శ్రూయతే – 'యర్వాణస్తర్వాణో నామ ఋషయో బభూవుః ప్రత్యక్ష ధర్మాణః పరాపరజ్ఞా విదితవేదితవ్యా అధిగత యాథాతథ్యాః తే తత్రభవంతః 'యద్వానః తద్వానః' ఇతిప్రయోక్తవ్యే 'యర్వాణః తర్వాణః' ఇతి ప్రయుంజతే, యాజ్ఞేపునః కర్మణి నాపభాషంతే – వ్యాకరణ మహాభాష్యం, పస్పశాహ్నికం).

ఒకే భాషకు ప్రజల వ్యవహారంలో పదాలలోనూ, వాటి ఉచ్చారణలోనూ ప్రత్యయాలలోనూ పదాల అర్థాలలోనూ భేదాలు ఉండి ఆ భాషలో రకాలు ఉంటాయి. ఒకే భాషకు ఉన్న ఇటువంటి రకాలని మాండలికాలు (Dialects) అంటారు. ఇంగ్లీషులో (dialect) అనే పదాన్ని కొందరు లిపీ సాహిత్యంలేని ఆటవికులు మాట్లాడే భాషలకు ఉపయోగిస్తారు. కాని భాషాశాస్త్రంలో ఈ పదం ఒకే భాషలో ఉన్న రకాల్ని సూచించడానికి మాత్రమే వ్యవహరించబడతుంది. మరికొందరు ఈ పదాన్ని సంఘంలో తక్కువస్థాయిలో వారు మాట్లాడే అప్రామాణిక భాషకు మాత్రమే పరిమితంచేసి వాడతారు. కాని ఇప్పుడు ఈ

పదం సంఘంలో ఏ స్థాయిలో వారైనాసరే వారు మాట్లాడే రకానికి ఉపయుక్తమవుతోంది. కాబట్టి సంఘంలో హెచ్చుస్థాయిలో వారి మాండలికాన్ని ప్రామాణిక మాండలికం (Standard Dialect) అనీ, తక్కువ స్థాయిలో వారి మాండలికాలని అప్రామాణి మాండలికాలు (Non-Standard Dialects) అనీ వ్యవహరిస్తారు. కొన్ని సందర్భాలలో ఒక ప్రత్యేక వ్యక్తిభాష మిగిలిన వ్యక్తులభాషకన్న భిన్నంగా ఉండవచ్చు. అటువంటప్పుడు ఒక్కొక్క వ్యక్తికి ప్రత్యేకమైన భాషని లేక మాండలికాన్ని వైయక్తిక మాండలికం (Idiolect) అంటారు. ఉచ్చారణ లోపాలవల్లగాని, ఆ వ్యక్తి భిన్నప్రాంతాలవారిలోనూ భిన్న కులాల వారిలోనూ సన్నిహితంగా మసలడంవల్లగాని ఒక వ్యక్తి వ్యవహారం అతని చుట్టూ ఉన్న వ్యక్తుల వ్యవహారంకన్న భిన్నంగా ఉండవచ్చు. అటువంటప్పుడు ఆ వ్యక్తి వ్యవహారంలో ప్రత్యేకతని సూచించడానికి పై పదం ఉపయోగిస్తుంది.

వ్యక్తులు పుట్టిపెరిగిన ప్రాంతాలు ఆధారంగా ఏర్పడిన మాండలికాలని 'స్థల మాండలికాలు' (Regional Dialects) అనీ, వ్యక్తులు పుట్టిపెరిగిన కులాలు లేక సంఘాలు ఏర్పడిన మాండలికాలని 'కుల మాండలికాలు' (Social Dialects) అని అంటారు. ఈ రెండు రకాల మాండలికాలని గురించి కింద రెండు భాగాలలోనూ విపులమైన చర్చ ఉంటుంది. ఈ రెండు రకాలేకాక భాషలో ప్రాచీన మాండలికం, ఆధునిక మాండలికం అనే విధంగా కాలాన్ని అనుసరించి కూడా మాండలిక భేదాలు ఉంటాయని తరవాత అధ్యాయాలలో చూస్తాం. కుల మాండలిక, స్థల మాండలికాలు అనే రెండు రకాలలోనూ ఒక మాండలికానికీ మరొక మాండలికానికీ మధ్య భేదం సర్వత్రా సుస్పష్టంగా ఉంటుందని అనుకోకూడదు. ఒక స్థలమాండలికమూ మరొక స్థల మాండలికమూ కలిసే ప్రాంతంలో కొన్ని ఊళ్ళలో రెండురకాల వ్యవహారాలూ ఉంటాయి. అదేవిధంగా ఒక కులానికీ చెందిన వ్యక్తి మరొక కులంవారితో సన్నిహితంగా మెలగడంవల్లనో లేక వారిలా మాట్లాడాలని ప్రయత్నించడంవల్లనో తన కులానికి చెందిన మాండలికం కాక ఇతర కుల మాండలికాన్ని వ్యవహరిస్తూ ఉండవచ్చు. కొందరు బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులలా మాట్లడడమూ, కొందరు బాహ్మణేతరులు బ్రాహ్మణులలా మాట్లడడమూ మనం నిత్యానుభవంలో చూస్తున్నదే. కాని మొత్తంమీద చూసినపుడు స్థల మాండలికాలూ, కుల మాండలికాలు అనేవి ఉన్నాయని మనకు స్పష్టమౌవుతుంది.

## 9.2. స్థలమాండలికాలు

స్థలమాండలికాలు భౌగోళిక కారణాలవల్ల ఏర్పడతాయి. సాధారణంగా భాషలో ఒక కొత్త వ్యవహారం రాజకీయ సాంస్కృతిక వాణిజ్యాది రంగాలలో ప్రాముఖ్యం వహించిన పట్టణంలో పుట్టి కాలక్రమేణ దాని చుట్టూ ఉన్న పట్టణాలకీ గ్రామాలకీ వ్యాపిస్తుంది. ఇటువంటి వ్యాప్తి ఆ ముఖ్య పట్టణానికి రాకపోకలు సాగించడానికి వీలున్నంతమేరకే జరుగుతుంది. రాకపోకలకి అంతరాయం కలిగించే నదులు, పర్వతశ్రేణి మొదలైనవి ఉన్నచోట వాటికి ఒక వైపున ఉన్న వారు రెండో వైపున ఉన్నవారితో నిత్యసంబంధం కలిగిఉండడం సాధ్యంకాదు. కనక రెండువైపులవారి వ్యవహారాలలో భేదాలు ఎక్కువగా ఉంటాయి. కాబట్టి సాధారణంగా స్థలమాండలికాలకి ప్రకృతిసిద్ధమైన అవరోధాలు సీమలుగా ఉంటాయి. ఇంతేకాక, వీటికి రాజకీయమైన ఎల్లలు కూడా సీమలుగా ఉండవచ్చు. ఒక్కొక్కప్పుడు రాజకీయ పరిణామాలవల్ల ఇటువంటి ఎల్లలు మారినా, వాటివల్ల ఏర్పడిన పాతకాలపు వ్యవహార భేదాలు చాలాకాలంవరకూ కొనసాగుతూ ఉండవచ్చు. తెలుగు దేశంలో శ్రీకాకుళం, విశాఖపట్టణం జిల్లాలు పూర్వ కాలంలో కళింగ దేశంలో భాగంగా ఉండేవి. అందువల్ల భాష ఇప్పటికీ మిగిలిన ఆంధ్రదేశంలోని భాషకన్న విలక్షణంగా ఉంది (దీనికి ఉదాహరణలు కింద ఇవ్వ బడతాయి). మాండలిక భేదాలని సామాన్య వ్యవహారంలో "యాస" అంటారు.

అనాది కాలంలో మాండలిక భేదాలు అంతగాలేని భాషలో కాలక్రమేణ మాండలిక భేదాలు ఏర్పడి మరికొంత కాలానికి అవి భిన్న భాషలుగా మారతాయి. మాండలిక భేదాలు ఏర్పడడానికి కారణం ప్రజాసముదాయాల మధ్య దూరం వల్ల సంబంధ బాంధవ్యాలు సన్నగిల్లడం అని పైన తెలుసుకొన్నాం. ఇలా ఏర్పడిన మాండలికాలు ఇంకా వేటికవి విలక్షణమైన మార్పులక్కులోనై ఒకరి మాండలికం ఇంకొక మాండలికంవారికి అర్థంకాక పరస్పరార్థావగతి (Mutual Intelligibility) ని కోల్పోతాయి. అటువంటప్పుడు అవి ప్రత్యేక భాషలు అవుతాయి. ఈ విధంగానే మూల ఇండో యూరోపియన్ భాష లాటిన్, గ్రీక్, సంస్కృతం మొదలైన భాషలుగా విడిపోయింది; మూలద్రావిడ భాష తమిళం, తెలుగు, కన్నడం, తెలుగు మొదలైన ద్రావిడ భాషలుగా విడిపోయింది. అలాగే

సంస్కృతం తరవాత కాలంలో హిందీ, బెంగాలీ, మరాఠీ, అస్సామీ, పంజాబీ, ఒరియా మొదలైన భాషలుగా విడిపోయింది. రెండు ప్రజాసముదాయాల భాషలు ఒకే భాష మాండలికాలా లేక రెండు వేరు వేరు భాషలా అని నిర్ణయించడం సులభమైన పనికాదు. పరస్పరార్థావగతి ఉంటే వేరు భాషలు కావు, మాండలికాలు అని సాధారణంగా అంటారు. అవి రాజకీయ సాంస్కృతిక కారణాలవల్ల పరస్పరార్థావగతి ఉన్నవాటిని కూడా వేరు వేరు భాషలుగా పరిగణించడం జరుగుతుంది; అలాగే పరస్పరార్థావగతి లేనివాటిని కూడా ఒకే భాషగా పరిగణించడం కూడా జరుగుతుంది. పరస్పరార్థవగతి ఉన్న డేనిష్, నార్వేజియన్ వేరు వేరు భాషలుగానూ పరస్పరార్థవగతిలేని కంటోనీస్, మండారిన్ అనే రెండూ చైనీస్ అనే ఒకే భాషగానూ పరిగణించబడుతున్నాయి.

ఇంగ్లీషు మాతృభాషగా ఇంగ్లండు, అమెరికాలలో వ్యవహారంలో ఉంది. ఈ రెండు దేశాలలోపలే దీనికి కులస్థల మాండలికాలు అనేకం ఉన్నాయి. ఇంగ్లండు భాషకీ, అమెరికా భాషకీ మధ్య కొన్ని ముఖ్యమైన మాండలిక భేదాలు ఉన్నాయి. ఇంగ్లండు భాషలో ప్రశ్నవాక్యాలలో have అనే క్రియ కర్తకి ముందు స్థానానికి వస్తుంది. Haven't you any? అమెరికా భాషలో దీనికి బదులు Don't you have any? అని అంటారు. ఈ రెండింటికీ పదాలలో ఉన్న భేదాలకి ఉదాహరణలు :

| ఇంగ్లండు | అమెరికా |
|---|---|
| postman | letter carrier, mailman |
| tie | sleeper |
| bonnet | hood |
| rates | taxes |
| underground | subway |
| lift | elevator |
| petrol | gas |

తెలుగులో నాలుగు భాషా మండలాలు ఉన్నాయని వృత్తిపద పరిశోధన ఆధారంగా భద్రిరాజు కృష్ణమూర్తి నిరూపించారు. (చూ. తెలుగు భాషాచరిత్ర, ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ, 1979). అవి 1. పూర్వ మండలం (కళింగ దేశం : శ్రీకాకుళం, విశాఖపట్టణం జిల్లాలు); 2. దక్షిణమండలం (రాయలసీమ, నెల్లూరు, ప్రకాశం జిల్లాలు); 3. ఉత్తర మండలం (తెలంగాణా, మహబూబ్ నగర్, ఖమ్మం జిల్లాలలో కోస్తా, రాయలసీమలను ఆనుకొని ఉన్న తాలూకాలు ఆయా భాషా మండలాల్లో కలుస్తాయి); 4. మధ్యమండలం (ఉభయ గోదావరులు, గుంటూరు, కృష్ణా జిల్లాలు). పై గ్రంథం 398–399 పేజీలనించి ఈ కింది ఉదాహరణలు ఉద్ధరించబడ్డాయి.

| పూర్వమండలం | దక్షిణమండలం | ఉత్తరమండలం | మధ్యమండలం |
|---|---|---|---|
| మోట | కపిల | మోట | మోట |
| నాగలి | నాగేలి | నాగలి | నాగలి |
| | మడక | | |
| పేడ | పేడ | పెండ | పేడ |
| అనపకాయ | సొరకాయ | అనిగెంకాయ | సొరకాయ |
| గోంగూర | గోగాకు | పుండికూర | గోంగూర |
| | | పుంటికూర | |
| గాబు | కలుపు | కలుపు | కలుపు |
| గునపం | గడ్డపార | గడ్డపార | గడ్డపలుగు |
| | గడారు | | గడ్డపార |

ప్రాచీనకాలంలో పూర్వమండలం కళింగదేశంలో చేరి ఉండడంవల్ల అక్కడ విలక్షణమైన పదాలు ఉన్నాయి. పూజా (=కాడి), ఉండ (=చెక్రం), గాబు (=కలుపు), పైన (=దువ్వెన) మొద. కాకతీయులు, మహమ్మదీయులు పరిపాలించిన తెలంగాణాలో ఉర్దూపదాల ప్రాబల్యమే కాక కొన్ని విలక్షణమైన దేశ్యపదాలు కూడా ఉన్నాయి. దుబ్బనేల (=సన్నటి ఇసకనేల), పుంటికూర (గోంగూర), ఇసురురాయి (<విసురురాయి = తిరగలి), ఆలుగడ్డలు (=బంగాళా దుంపలు).

పూర్వమండంలో పదాది లకారం నకారంగా మారడం ఒక ప్రత్యేకత: నేదు (=లేదు), నాభం (=లాభం), పూర్వమండంలో మరొక విశేషం అంటాం, తింటాం వంటి వాటిలో టకారం బదులు తకారం ఉండడం; అంతాం, తింతాం. భూతకాలిక ప్రత్యయంలో భేదం మాండలికాలకి ఒక చక్కని ఉదాహరణ చేప్పేడు (కోస్తా)- చెప్పినాడు (రాయలసీమ) – చెప్పిండు (తెలంగాణా).

కోస్తాజిల్లాల వ్యవహారంలోనే ఉత్తర ప్రాంతానికీ దక్షిణ ప్రాంతానికీ మధ్య భేదాలు ఉన్నాయని ఈ కింది ఉదాహరణలు సూచిస్తాయి. (ఉ) నుయ్యి/ (ద) బావి, భావి, చేద / బొక్కెన, ఆవిడ/ఆమె, గిన్ని/గిన్నె, బిందీ/బిందె, గేదె/బర్రె, తోడల్లుడు / షడ్డకుడు మొ.

రాయలసీమ వ్యవహారంలో ఇన్నూరు (=రెండువందలు), మున్నూరు (=మూడు వందలు) వంటి పదాలే కాక ఐదు, ఆరు, ఏడులకి మంది చేరడం కూడా ఉంది : రా. ఐదుమంది = కోస్తా ఐదుగురు, మొ. (కోస్తా వ్యవహారంలో ఎనిమిదికీ దానిపై అంకెలకీ మాత్రమే 'మంది' చేరుతుంది). మరికొన్ని భేదాలు రా. ఉద్దులు/కోస్తా. మినుములు, ఉర్లగడ్డ/బంగాళాదుంప మొ.

మాండలిక పదాలని దేశపటంలో సూచించే రేఖలు వ్యవహార రేఖలు (Isoglosses). ఉదాహరణకి ఆంధ్రదేశ పటంలో పేడకు పెండ అని వ్యవహరించే తెలంగాణా ప్రాంతాన్ని ఒక గీతవల్ల మిగిలిన ప్రాంతాలనించి వేరు చేసి చూపవచ్చు. ఇది ఒక వ్యవహారరేఖ. ఇలాగే ఇతర పదాలూ, ప్రత్యయాలూ, ఉచ్చారణ భేదాలూ ఇత్యాదులలో భేదాలు ఉన్న ప్రాంతాలని వ్యవహార రేఖల ద్వారా సూచించవచ్చు. ఇటువంటి వ్యవహార రేఖలు గీసిన పటాన్ని మాండలికపటం (Dialect Atlas) అంటారు. మాండలిక పటాలలో ఒక్కొక్క వ్యవహార భేదం ఉన్న ప్రాంతంలో ఒక్కొక్క రకం గుర్తు పెడతారు. వ్యవహారరేఖలు వేరువేరు రకం గుర్తులు ఉన్న ప్రాంతాలని వేరు చేస్తాయి. మాండలిక పటాలు వృత్తిపద కోశాలలో గాని, తెలుగు భాషాచరిత్ర 414–426 పేజీలలో గాని చూడవచ్చు. ముఖ్యమైన మాండలిక భేదాలు ఉన్నచోట చాలా వ్యవహార రేఖలు ఇంచుమించు ఒకే స్థానంలో ఉండి, ఆయా మండలాలని విభజిస్తాయి.

కొన్ని వ్యవహార రేఖలు ఒక కేంద్ర ప్రదేశం (Focal Area) పై ఆధారపడి దాని చుట్టూ వ్యాపించినట్లు కనబడతాయి. రాజకీయ, సాంస్కృతిక, వాణిజ్య విద్యాదిరంగాలలో ప్రాముఖ్యం వహించిన పట్టణాలు కేంద్రప్రదేశాలుగా ఉంటాయి. అక్కడ పుట్టిన పలుకుబళ్లు దానిచుట్టూ ఉన్న ప్రదేశాలకి వ్యాపిస్తాయి. ఇంగ్లండులో లండన్, ఆక్స్ఫర్డ్, అమెరికాలో బోస్టన్, ఛార్లెస్టన్, రిచ్మండ్, ఫిలడెల్ఫియాలూ, ఫ్రాన్సులో పేరిస్ ఇటువంటి కేంద్రప్రదేశాలు, కేంద్ర ప్రదేశానికి విరుద్ధమైనది అవశిష్ట ప్రదేశం (Relic Area). మారుమూల చోట్లు కేంద్రప్రదేశాలతో నిత్యసంబంధం లేకపోవడంవల్ల వాటిలో వచ్చే మార్పుల వల్ల ప్రభావితం కాక ప్రాచీన వ్యవహారాన్ని వీలైనంతవరకూ తక్కువ మార్పులతో నిలుపుకొంటూ మిగిలిపోతాయి. ఇటువంటి మారుమూల ప్రదేశాలు అవశిష్ట ప్రదేశాలు. ఇవి దేశపు సరిహద్దుల్లో ఇతర ప్రాంతాలతో సంబంధంలేని ప్రాంతాలుగా ఉంటాయి. అవశిష్ట ప్రదేశాలలో ప్రాచీన కాలపు పలుకుబళ్లు మిగిలి ఉంటాయి. ఉదాహరణకి రాయలసీమ వ్యవహారంలో ఇన్నూరు, మున్నూరు మొ.

కొన్ని ప్రదేశాలు భిన్న కేంద్ర ప్రదేశాల ప్రభావానికి లోనవుతూ ఏఒక్క కేంద్ర ప్రదేశానికీ ప్రత్యేకంగా చెందకుండా ఉండవచ్చు. ఇటువంటిదాన్ని మిశ్రవ్యవహార ప్రదేశం (Transition Area) అనవచ్చు. కృష్ణాగోదావరీ మధ్య ప్రదేశం ప్రతిమాట వ్యవహారంలోనూ మిగిలిన మూడు మండలాల్లో ఏదో ఒక దానితో కలుస్తూ ఉండడంవల్ల ఇది మిశ్రవ్యవహార ప్రదేశం అని భద్రిరాజు కృష్ణ మూర్తి గారి అభిప్రాయం (చూ. తెలుగు భాషా చరిత్ర, పేజి 410).

## 9.3. కులమాండలికాలు

ఒక సంఘంలో ప్రజలలో ఉన్న అంతస్తులలో భేదం వారు మాట్లాడే భాషలో ప్రతిబింబిత మవుతుంది. ఈ అంతస్తులలో భేదం భారతదేశంలో వర్ణాలు లేక కులాలు అనే విధంగా వుంది. వర్ణభేదంలేని పాశ్చాత్య దేశాలలో వృత్తి, ధనం ఇత్యాదులపై ఆధారపడిన భేదాలు ఉన్నాయి. కాని మన దేశంలో వర్ణ భేదం వర్ణాంతర వివాహాలు 'ఇప్పటివరకు' చాలా అరుదు కాబట్టి పాశ్చాత్య దేశాలలో వర్గభేదం కన్న స్థిరంగా ఉంది. సంఘంలో అవాంతర భేదాల వల్ల భాషావ్యవ

హారంలో ఏర్పడిన మార్పులని గురించిన పరిశోధన సంబంధాన్ని గురించి పరిశోధించే భాషాశాస్త్ర శాఖకు సాంఘిక భాషాశాస్త్రం (Sociolinguistics) అని పేరు. ఇది ఇటీవలి కాలంలోనే వృద్ధిచెందడం మొదలుపెట్టినా ఇది ఇంత వరకూ భాషాశాస్త్రజ్ఞులు ఉపేక్షించిన అంశాల మీద దృష్టి కేంద్రీకరించడంవల్ల ఇందులో పరిశోధన ఫలితాలు భాష పూర్ణస్వభావాన్ని విశదీకరించేవిగా ఉన్నాయి.

భాష మీద భౌగోళిక పరిసరాల ప్రభావమూ, సంఘంలో కుటుంబ నిర్మాణమూ, ఆచార వ్యవహారాలూ, కట్టుబాట్లూ, మూఢ నమ్మకాలూ మొదలైన వాటి ప్రభావమూ ఉంటాయి. మంచు ప్రదేశంలో వ్యవహరించబడే ఎస్కిమో భాషలో రకరకాల మంచుకి వేరువేరు పేర్లు ఉన్నాయి. అడవులలో నివసించే వారి భాషలలో రకరకాల చెట్లకి పేర్లు ఉంటాయి. మర్రిచెట్టు, తుమికిచెట్టు, మద్దిచెట్టు మొదలైనవి చూసినవారి సంఖ్య పట్టణాలలో నివసించే వారిలో చాలాతక్కువగా ఉంటుంది చాలా మందికి ఈ పేర్లు కూడా పరిచయం కాక పోవచ్చు. మాంసాహారులు కాని వారికి రకరకాల చేపల పేర్లూ, జంతువు శరీరం లోపల ఉండే భాగాల పేర్లూ తెలియవు ఒంటెలకు సంబంధించిన అనేక పదాలు అరబిక్ భాషలో ఉన్నాయి కాని ఇతర భాషలలో లేవు. ఒక ప్రాంతంలో ప్రాచీన కాలం నించిలేని జంతువులకీ, పళ్లకీ ఆ ప్రాంతం భాషలో దేశ్యపదాలు ఉండవు. ఉదాహరణకి ఇంగ్లీషులో మామిడిపండుకి దేశ్యపదం లేదు. అలాగే ఏపిల్ పండుకి తెలుగు పదం లేదు.

౭. ంవాచకపదాలు (Kinship Terms) ప్రతి భాషలోనూ ఆ భాష మాట్లాడే వారి సంఘంలో వివిధ బంధుత్వాలకి గల సాన్నిహిత్యాన్నీ, ప్రాముఖ్యాన్నీ సూచిస్తాయి. ఇంగ్లీషులో borther కి తుల్యంగా తెలుగులో అన్న, తమ్ముడు అనే రెండు మాటలూ, sister కి తుల్యంగా అక్క, చెల్లెలూ అనే రెండు మాటలూ ఉన్నాయి. తెలుగువారికి చాలా ముఖ్యమైన ఈ భేదం ఇంగ్లీషు వారికి ముఖ్యం కాదన్న మాట. అలాగే బాబయ్య, పెదనాన్న, మామయ్యా కూడా ఇంగ్లీషు వారికి uncle అవుతారు; పిన్నీ, పెద్దమ్మా, అత్తా కూడా ఇంగ్లీషు వారికి aunt అవుతారు. కుటుంబ నిర్మాణంలో మార్పులు వస్తే భాషలో కూడా మార్పు వస్తుందనడానికి రష్యన్ చక్కటి ఉదాహరణ. రష్యాలో పూర్వకాలంలో అవిభక్త కుటుంబాలు ఉండేవి. కాని ఇటీవల విప్లవం, ప్రపంచ యుద్ధాలూ, సమష్టి

వ్యవసాయం మొదలైనవాటివల్ల పెద్ద కుటుంబాలు పోయి చిన్నచిన్న కుటుంబాలు ఏర్పడ్డాయి. అందువల్ల భాషలో కూడా ఒకే మాటగా ఉన్న కొన్ని బంధువాచక పదాలు నశించి వాటిస్థానంలో రెండు మూడు మాటలు కలిసిన పదబంధాలు వ్యాప్తిలోకి వచ్చాయి.

| పాతమాట | కొత్తపదబంధం | |
|---|---|---|
| shurin | brat zheru | 'బావమరది' |
| | 'భార్య సోదరుడు' | |
| nevestka | zhena brata | 'వదినె/మరదలు' |
| | 'సోదరుడి భార్య' | |
| yatrov | — — | 'తోడుకోడలు' |

వేరువేరు కుటుంబాలు ఏర్పడంవల్ల పై బాంధవ్యాల ప్రాముఖ్యం నశించి ఏకపదాలు వ్యవహార భ్రష్టమయ్యాయి; "తోడుకోడలు" అనేదానికి ఇప్పుడు పదబంధం కూడా లేకపోవడం గమనించదగినది.

సాంఘిక నిర్మాణం బంధువాచక పదాలవల్లేగాక భాషలో ఇతరాంశాల వల్ల కూడా తెలుస్తుంది. మగవారు ఆడవారికన్న పైచేయిగా ఉండడంవల్ల లింగ భేదం వివక్షించనప్పుడు మగవారికి సంబంధించిన పదాలే మనుష్య సామాన్యంగా వాడతాము :

ఎవ్వడూ అంత తెలివితక్కువ పని చెయ్యడు, అక్కడికి ఒక్కడూ రాలేదు, మొ. మగవారి ఆధిక్యాన్ని తెలియచేసే ఈ వ్యవహారం చాలా భాషలలో ఉంది. 'నువ్వు–మీరు', 'వాడు–అతను–ఆయన', 'అది–ఆవిడ' వంటి సర్వనామాల ఉపయోగం సాంఘిక భేదాలపై ఆధారపడి ఉంది.

భాషలలో పదప్రయోగ నిషేధం (Taboo) అనేది కూడా ఉంది. కొన్ని పదాలు కొన్ని సందర్భాలలో వాడకూడదు అనేదే ఆ నిషేధం. అశ్లీల పదాలు సభలలో వాడకూడదు. రాత్రిళ్ళు కొందరు 'పాము' అనే మాట వాడరు. దీనికి బదులు 'పురుగు' అంటారు : 'పాము కరిచింది' అనే దానిబదులు 'పురుగు

ముట్టింది' అని కొందరు పగలు కూడా అంటారు. 'మశూచికం' అనడానికి బదులు 'అమ్మవారు' అంటారు. అలాగే ఆడవాళ్ళు కొందరు 'బియ్యం నిండుకొన్నాయి', 'పసుపు నిండుకొంది' అంటారు; వీరి ఉద్దేశంలో అయిపోయింది/ అయిపోయాయి అని సరుకులకి వాడడం అమంగళకరం. 'దీపం ఆరిపోయింది' అనకుండా కొందరు 'దీపం కొండెక్కింది అంటారు పదప్రయోగ నిషేధంవల్ల కొన్ని భాషలలో పదాలే నశించాయి. ఈ విధమైన నిషేధం ఒక భాషనించి మరొక భాషకి కూడా వ్యాపించవచ్చు. నూట్కా భాష మాట్లాడే అమెరికన్ ఇండియన్ బాలికలు ఇంగ్లీషులో such అనే పదాన్ని వాడడానికి సిగ్గుపడతారు; దీనికి కారణం వారి మాతృభాషలో ఈ మాట అర్థం 'స్త్రీ జననేంద్రియం'. అరవ వాళ్ళు 'పూ పూక్కుం' (పువ్వు పూస్తుంది) అంటే మనకి నవ్వు వస్తుంది. అరవంలో 'సున్ని' అంటే 'పురుష జననేంద్రియం' కాబట్టి 'మినపసున్ని' పేరు విన్నప్పుడు వాళ్లకి నవ్వుగా ఉంటుంది. భాషావ్యవహారంలో వ్యక్తికీ వ్యక్తికీ మధ్య భేదం (ప్రాంతీయ భేదం కాక) వయస్సు, జాతి, విద్య, కులం, వృత్తి, స్త్రీ పురుషభేదం మొదలైన వాటిపై ఆధారపడి ఉంటుంది. ఇటువంటి మండలికాలు కులమాండలికాల కిందకి వస్తాయి. కులమాండలికాలు అనడంవల్ల ప్రతికులానికీ ఒక మాండలికం ఉంటుందని అనుకోకూడదు. ఉత్తర భారతదేశ భాషలలో అగ్రవర్ణాలవారి మాండలికం, హరిజనుల మాండలికం అని రెండు రకాలూ; దక్షిణ భారతదేశంలో బ్రాహ్మణుల మాండలికం, బ్రాహ్మణేతరాగ్రవర్ణాల వారి మాండలికం, హరిజనుల మాండలికం అని మూడు రకాలు ఉన్నాయని పరిశోధకుల అభిప్రాయం. హరిజను. శేషమంతటా ఊరిబ..టా గూడేలలో నివసిస్తారు కాబట్టి వారికీ మిగిలిన ప్రజలకీ మధ్య సంపర్కం తక్కువ అవడంవల్ల ఏర్పడ్డాయని పైన చూశాం. కులమాండలికాలకు కూడా సంపర్కరాహిత్యం కొంతవరకు కారణమని చెప్పవచ్చుగాని, ఇది మాత్రమే ఏకైక కారణం కాదు. ఎందువల్ల నంటే, వేరువేరు తెగలవారు దైనందిన కార్యకలాపాలూ, వ్యవసాయం, పండుగలూ, ఉత్సవాలూ మొదలైన వాటిలో నిత్యం కలవడం ఉంది. ..యితే, వారివారి భాషలలో ప్రత్యేకతలు నశించకుండా ఎందుకు మి.. ఉన్నాయంటే దీనికి కారణం ఒక్కొక్క తెగవారు తమలోని ఐక్యమత్యాన్నీ, తమతమ ప్రత్యేకతలనీ నిలుపుకోవాలనే ఆకాంక్ష. తుళుభాషలో బ్రాహ్మణులు తమ మాండలికాన్ని తమ

కులంవారితోనే ఉపయోగిస్తారు; ఇతరులతోమాట్లాడేటప్పుడు బ్రాహ్మణేతర మాండలికాన్ని ఉపయోగిస్తారు. అలాగే కన్నడంలో హవ్యక బ్రాహ్మణుల మాండలికం ప్రమాణ కన్నడానికి భిన్నమైనది. దీనిని వారు తమలోతాము మాత్రమే ఉపయోగించు కొంటారు. ఇతరులతో మాట్లాడేటప్పుడు ప్రమాణ కన్నడం ఉపయోగిస్తారు.

తెలుగులో కులమాండలికాలపై ఇంకా పరిశోధన జరగాలి. ఇందులో బ్రాహ్మణ మాండలికానికీ ఇతర మాండలికాలకీ మధ్య భేదాలు ఉన్నాయి; బ్రాహ్మణ మాండలికమే ప్రమాణమాండలికంగా చెలామణీ అవుతూ ఉండడం వల్ల విద్యావంతులైన ఇతరులు కూడా ఈ మాండలికాన్నే ఇంటి బయట వీలైనంత వరకు ఉపయోగిస్తారు. గోదావరి జిల్లాలలో ప్రమాణ భాషకీ, అప్రమాణ భాషకీగల భేదాలకి కొన్ని ఉదాహరణలు :

| ప్రమాణ భాష | అప్రమాణ భాష |
|---|---|
| రండి | రాయిండి |
| కూచో(ండి) | కూకో(ండి) |
| చాలా | ఒద్దే |
| వేగిర/తొందరగా | బేగే |
| నీళ్లు | నీలు |
| వేణ్ణీళ్లు | ఉడుకు నీలు |
| సాయంత్రం | సందేల/సందాల |
| రాత్రి | మాపిటికి |
| (ఇంటి) దగ్గర | (ఇంటి) కాడ |
| ఇవ్వేళ | ఇయ్యాల |
| ఉంటుంది | ఉంటాది |
| అవుతుంది | అవుద్ది |

| | |
|---|---|
| మధ్యాన్నం | మద్దేల |
| అన్నం | కూడు |
| ఊరగాయి | పచ్చడి |
| పెళ్లి | పెల్లి |
| వాడు | ఆడు |
| పెద్దవాడు | పెద్దోడు |
| పెద్దాడు | |
| నాన్న (గారు) | అయ్య |
| పోపు | తాలింపు |

ప్రమాణ భాషలో చకారం అప్రమాణ భాషలో సకారంగా మారడమూ (చింత/సింత), ళ్ల ల్లగా మారడమూ (పెళ్లి/పెల్లి), ఇ, ఈ, ఎ, ఏ ల ముందు వకారం లోపించడమూ (వేడి/ఏడి, విను/ఇను) -- ఇటువంటివి సర్వసాధారణమైన మార్పులు.

ఇంగ్లీషులో కూడా సాంఘిక భేదాలు ఉన్నాయి. ఇంగ్లండు ముఖ్య పట్టణమైన లండన్‌లో వృత్తి, విద్య, ధనం మొదలైన వాటివల్ల ప్రముఖులై ఉన్నత వర్గాలకి చెందిన వారి భాష ప్రమాణ భాషగా వ్యాప్తి చెందింది. వారి ఉచ్చారణే ప్రమాణోచ్చారణగా పేరు పొందింది; దీన్ని R P (= Received Pronuciation) అంటారు. ప్రమాణ భాషకీ అప్రమాణ భాషకీ గల భేదాలకి ఉదాహరణలు :

| ప్రమాణం | అప్రమాణం |
|---|---|
| I did it yesterday. | I done it yesterday. |
| He hasn't got it. | He ain't got it. |
| It was her that said it. | It was her what said it. |

ఏది ప్రమాణోచ్చారణ అనే విషయంలో ఇంగ్లండుకీ అమెరికాకీ మధ్య భేదాలు ఉన్నాయి. ఇంగ్లండులో పదాంతంలోనూ, సంయుక్తాక్షరాల మొదటా ఉన్న r (Car, Cart వంటి పదాలలో) ఉచ్చరించకపోవడం ప్రమాణం; దాన్ని

ఉచ్చరించేవారి మాండలికాలు హేళనకు గురి అవుతాయి. కాని న్యూయార్క్‌లో అటువంటి పదాలలో r ఉచ్చరించడం ప్రమాణం; దీన్ని ఉచ్చరించనివారి భాషని అక్కడ అప్రమాణ మాండలికంగా పరిగణిస్తారు. దీనికి కారణంగా r ని ఉచ్చరించేవారు ఇతర ప్రదేశాలనించి అధిక సంఖ్యలో వచ్చి న్యూయార్క్‌లో స్థిరపడడం అని అంటారు. దీనివల్ల ఏది ప్రమాణ భాష అనేది దేశకాల పరిస్థితులపై ఆధారపడి ఉంటుందని స్పష్టమవుతుంది.

ఇంగ్లీషు మాండలికాలలో ముఖ్యమైన భేదం తెల్లవారి భాషకీ నీగ్రోల భాషకీ మధ్య ఉంది. నీగ్రోలు కొన్ని తరాల క్రితం ఆఫ్రికానించి వలసవచ్చి, మొదట ఇంగ్లాండులోనూ ఆ తరవాత అక్కడనించి అమెరికాకూ వెళ్లి స్థిరపడిన వారు. అమెరికాలో నీగ్రోల ఇంగ్లీషులో కొన్ని ప్రత్యేకతలు :

1. నకారం ముందు ఇ ఎగా మారడం : pin → pen, tin → ten.

2. పదాంతంలోనూ అచ్చుల మధ్యాకూడా ర లోపించడం. (car → ca, Paris → Pa'is).

3. పదాంతంలో సంయుక్త హల్లులో చివరి హల్లు లోపించడం.(lost→ los, desk → des).

4. ప్రథమ పురుషైక వచన వర్తమాన క్రియలో s – లేకపోవడం (he go, she like).

3. సంయోజక క్రియ అయిన be ప్రయోగాభావం : She real nice.

6. be క్రియా రూపాంతరాలకి బదులు be యే వాడడం : (He usually be around, They sometimes be incomplete.)

7. వాక్య గర్భితమైన ప్రశ్నలో కూడా do అనే సహాయక క్రియలని మామూలు ప్రశ్నలో లాగానే వాడడం : I asked Mary where did she go.

8. వాక్యారంభంలో ఉండే there కి బదులు it వాడడం : It's a boy in my class named Joey.

9. nobody, nothing వంటి వ్యతిరేక పదాలు ఉన్నప్పుడు వాక్యం ప్రశ్న కాకపోయినా not తో కూడిన సహాయక క్రియ వాక్యాదికి రావడం : Can't nobody do nothing about it.

పై ప్రత్యేకతలలో కొన్ని తెల్లవారి మాండలికాలలోనూ ఉన్నాయి. ముఖ్యంగా దక్షిణ అమెరికాలో తెల్లవారి భాషకీ నీగ్రోల భాషకీ చాలా సాన్నిహిత్యం ఉంది. నీగ్రోలలో చాలామంది దక్షిణ అమెరికానించి ఉత్తర అమెరికాకు వచ్చి స్థిరపడినవారు. నీగ్రో భాషలో కొన్ని ప్రత్యేకతలు ఇంగ్లండులో ఉన్న మాండలికాలని పోలి ఉంటాయి. ఈ కారణాలవల్ల నీగ్రోలకి మొదట్లో ప్రత్యేక భాష లేదనీ, ఆదికాలంలో వారి ఇంగ్లీషు కొన్ని భేదాలతో ఇంచుమించు ఆయా ప్రాంతాలలో తెల్లవారి మాండలికాలలాగే ఉండేదనీ, వారు తెల్లవారినించి వేరుగా జీవిస్తూ ఉండడంవల్ల వారి మాండలికాలలాగే తెల్లవారి మాండలికాలకీ కాలక్రమేణ జీవిస్తూ ఉండడంవల్ల వారి మాండలికాలకీ తెల్లవారి మాండలికాలకీ కాలక్రమేణ భేదం అధికమైందనీ భాషాశాస్త్రజ్ఞుల విశ్వాసం. వీరి మాండలికాలలో వీరి పూర్వులు వాడిన ఆఫ్రికన్ భాషల లక్షణాలు కూడా అక్కడక్కడ లేకపోలేదు. అందువల్ల నీగ్రో మాండలికాలు నీగ్రోల ఉచ్చారణావయవాలలో లోపంవల్ల, సరిగా మాట్లాడలేక పోవడంవల్ల ఏర్పడ్డాయనే కొందరి అభిప్రాయం అశాస్త్రీయం, అసమంజసం. అలాగే నీగ్రోల భాషకూ తెల్లవారి భాషకూ అసలు భేదం లేదు అని చెప్పే వారి వాదంకూడా సత్యదూరమే.

కొన్ని భాషలలో స్త్రీల మాండలికం, పురుషుల మాండలికం అని స్త్రీలు మాట్లాడే భాషకీ పురుషులు మాట్లాడే భాషకి మధ్య భేదం ఉంది. ఉదాహరణకి అమెరికన్ ఇండియన్ భాషలైన గ్రోవాంట్, కొయాసతి, యానా, సియుక్స్ బేఫిన్ ద్వీపంలోని ఎస్కిమో, సైబీరియాలో, చుక్చీ, ద్రావిడ భాష అయిన కూడుఖ్, థాయ్‌లలో ఈ భేదం ఉంది. థాయ్‌లో 'నేను' అనడానికి మగవారు 'ఫామ్' అనీ, ఆడవారు 'దిఛన్' అనీ అంటారు. చుక్చీలో కొన్ని మాండలికాలలో కొన్ని పదాలలో స్త్రీల భాషలో అచ్చుల మధ్య ఉన్న నకార తకారాలు పురుషుల భాషలో లోపిస్తాయి. కూడుఖ్‌లో స్త్రీలు తమలోతాము మాట్లాడుకొనేటప్పుడే స్త్రీల భాషని ఉపయోగిస్తారు. ఉదాహరణకి క్రియలలో మధ్యమ పురుషైక వచన ప్రత్యయం పురుషుల భాషలో – లయ్, స్త్రీల భాషలో – ఇ, ఎన్‌దయ్/ఇన్ ది.

'బర్దలు కొడుతున్నావు.' కొయాసతిలో ఉదాహరణలు :

| | పురుషుల భాష | స్త్రీల భాష |
|---|---|---|
| 'చెప్పున్నాడు' | కాస్ | కాం |
| 'ఎత్తకు' | లకాచీస్ | లకాచిన్ |
| '(తొక్క) ఒలుస్తున్నాడు | మొల్స్ | మొల్ |
| 'నిప్పు చేస్తున్నావు' | ఓస్చ్ | ఓస్త్ |

కొయాసతిలో ఈ భేదం క్రమంగా నశిస్తున్నట్టు ఉంది ; ప్రస్తుతం వృద్ధులైన స్త్రీలే స్త్రీల భాషారూపాలని వాడుతున్నారు. ఇటువంటి భేదం ఉన్న అన్ని భాషలలోనూ కొన్ని రూపాలలోనే స్త్రీ పురుష భేదం ఉంది కాని మొత్తం భాష అంతటా కాదు అని గమనించాలి. ప్రపంచం అంతటా పురుషులలో కన్న స్త్రీలలో తమ అసలు సంఘంలో అంతస్తు కన్న ఎక్కువ అంతస్తులో ఉన్నట్టు కనపడాలి అనే మనస్తత్వం ఉంది. ఇది స్త్రీల మాటలలోనూ చేతలలోనూ కూడా వ్యక్తమవుతుంది. ఇంతేకాక స్త్రీలు ప్రాచీనాచారాలని, చాదస్తాలని మగవారి కన్న ఎక్కువగా పాటిస్తారు. అందువల్ల ఈ భేదం ఉన్న భాషలలో స్త్రీలు ప్రాచీన రూపాలని వాడుతున్నారు. ప్రమాణ మాండలికం ఉన్న భాషలలో స్త్రీలే మగ వారి కన్న ఎక్కువగా ప్రమాణ రూపాలని వాడాలనే ప్రయత్నం చేస్తున్నట్టు పరిశోధనల ద్వారా తేలింది. ఇటువంటి మనస్తత్వమే కొన్ని భాషలలో స్త్రీ పురుష భాషల మధ్య భేదం ఏర్పడడానికి కారణం అయింది.

సాంఘిక భేదాలు అత్యధికంగా ఉన్న భాష ఇండోనేషియాలో జావనీస్. ఇందులో మూడు శైలులు ఉన్నాయి. వీటిలో అతి సాధారణమైనది చిన్న రైతులవంటి పామరులు వాడే భాష. అత్యున్నతమైనది మహాధనికులైన రాజ వంశీయులు, ఉన్నతాధికారులు మాట్లాడేది. ఈ రెంటికీ మధ్య ఉన్నది పట్టణాలలో ఉండే మధ్యతరగతివారు మాట్లాడేది. ఈ మూడిటిలో అతిసాధారణ మైనదే అన్ని తరగతులవారి పిల్లలూ శైశవదశలో మాట్లాడతారు. పిల్లలు పెరుగుతూ ఉన్న కొద్దీ మిగిలిన రెండు రకాలూ కాలక్రమంలో నేర్చుకొంటారు.

కాబట్టి అతిసాధారణ మాండలికమే ప్రాతిపదికగా మిగిలిన రెండు శైలులూ ఏర్పడ్డాయని అనుకోవచ్చు. ఇంతేకాక, కింద- పైన- ఉన్న రెండు శైలులలో కొన్ని పదాలకి గౌరవ వాచకాలు చేర్చి, వాటిని ఇంకా ఉన్నతం చెయ్యవచ్చు. పై తరగతులవారు కూడా సాధారణ వ్యవహారంలోనూ, తమ కన్న తక్కువ వారితో మాట్లాడేటప్పుడూ సామిర్యశైలి ఉపయోగిస్తారు. ఉదాహరణలు :

| | సాధారణ శైలి | మధ్యమ శైలి | ఉన్నత శైలి |
|---|---|---|---|
| 'ఇప్పుడు' | సైకి | సనికి | సమెనిక |
| 'బియ్యం' | సెగ | సెగ | సెకుల్ |

## 9.4. ప్రమాణ భాష

నాగరికత వృద్ధిపొందని చిన్నచిన్న భాషాసముదాయాలలో మాండలికాలు ఉన్నా అవి వేటికవి తుల్యప్రతిపత్తి కలిగి ఉంటాయి. కాని నాగరికతా సంస్కృతీ వృద్ధిపొందిన భాషాసంఘాలలో ప్రమాణభాష ఆవశ్యకత ఉంది. సాహిత్య రచనకీ, విద్యాబోధనకీ, రేడియో, టెలివిజన్ మొదలైన వాటిలో కార్యక్రమాలకీ, కోర్టులు మొదలైన వాటిలో వ్యవహారాలు నడపడానికీ మొత్తం భాషా వ్యవహర్త లందరికీ అర్థమయ్యే ప్రాంతీయ భేదాలు ఎక్కువగా లేని ప్రమాణ భాష (Standard Language) అవసరం ఉంది. చాలా భాషా సంఘాలలో రాజకీయ విద్యావ్యాపారాదులవల్ల ప్రాముఖ్యం వహించిన ఒక పట్టణం లేక ప్రాంతంలో ఉన్నత శ్రేణి వారి మాండలికం ప్రమాణ భాషగా రూపొందుతుంది. కొన్ని భాషా సంఘాలలో ప్రాచీన కాలంలో లిఖితంగా ఉండిన భాషే ప్రమాణ భాషగా ఉందని కింద చూస్తాం. ఇంగ్లీషుకి లండన్‌లో ఉన్నత శ్రేణి వారి భాష, ఫ్రెంచికి పారిస్‌లో ఉన్నత శ్రేణవారి భాష ప్రమాణ భాషలయ్యాయి. ఇది ఇటీవలికాలంలోనే జరిగింది. అంతకు ముందు (అంటే 15, 16 శతాబ్దులకు ముందు) ఒక్కొక్క ప్రాంతానికి ఒక్కొక్క మాండలికం ప్రమాణంగా ఉండేది. ఇంగ్లీషు, ఫ్రెంచి మాట్లాడే ప్రాంతాలన్నీ రాజకీయంగా కలిసి, లండన్, పారిస్‌లు ముఖ్యపట్టణా లయ్యాక ఆ పట్టణాల భాషలు ప్రమాణ భాషలుగా దేశ వ్యాప్తమయ్యాయి.

ప్రమాణ భాష ఏర్పడ్డాక అందులో మార్పులు వ్యవహార భాషలో జరిగినంత వేగంగా జరగవు. అయినా ప్రమాణభాషలో కూడా కొంతవరకూ ప్రాంతీయ భేదాలు ఉండడానికి ఆస్కారం ఉంది. ప్రమాణభాషకు దేశమంతటా వ్యాప్తి ఉండడంవల్లా గ్రంథరచన అందులోనే జరగడం వల్లా ప్రమాణ భాషే సాధు భాష అనీ, అదే సుందరమైనదనీ ప్రజలలో అపోహ ఏర్పడుతుంది. కాని ఇది అపోహ మాత్రమే. అప్రమాణ మాండలికాలలో కూడా ప్రాచీన రూపాలు నిలిచి ఉండడమూ, రసభరితమైన సాహిత్యం పుట్టడమూ కూడా సర్వ సాధారణంగా జరుగుతుంది. తెలుగుకి సంబంధించినంతవరకూ కోస్తా జిల్లాలు సిరిసంపదలకు ఆలవాలమవడంవల్ల మొదట్లో విద్యాధికులూ, రచయితలూ ఆ ప్రాంతంలో ఏర్పడ్డారు. కాబట్టి కోస్తా జిల్లాల భాష ప్రామాణికమయింది.

తమిళం, అరబిక్, గ్రీక్ వంటి భాషలలో సాహిత్యం, విద్యాబోధన, రాతకోతల, ఉపన్యాసాలు మొదలైనవాటికి ఉపయోగించే ప్రమాణ భాష ఇప్పుడు ఎవరూ నిత్యవ్యవహారంలో మాట్లాడేది కాదు. వీటిలో ప్రమాణ భాష ప్రాచీన లిఖిత భాషకి సన్నిహితంగా ఉంటుంది. ఈ ప్రమాణ భాషలో ఆధునిక కాలంలో ఇతర భాషలనించి వచ్చిన ఎరువు పదాలు వీలైనంతవరకూ పరిహరించబడి వాటికి బదులు దేశ్యపదాలు వాడబడతాయి. ఇలా దైనందిన వ్యవహారానికి వ్యావహారిక మాండలికాలూ, ఉన్నతస్థాయిలో వ్యవహారానికి ప్రాచీన భాషకి సన్నిహితమైన మాండకమూ ఉండడాన్ని 'ద్విమాండలికత' (Diglossia) అంటారు. ద్విమాండలికత తెలుగులో కూడా ఇటీవలి కాలం వరకూ ఉండేది; కాని ఇప్పుడు వ్యావహారిక భాషే రచనలో కూడా చాలా వరకూ ఉపయుక్తమవుతోంది. ద్విమాండలికత ఉన్న భాషలలో రెండు మాండలికాలకీ పదాలు, వ్యాకరణం మొదలైనవాటిలో భేదాలు ఉంటాయి. ఉదాహరణకి గ్రీక్‌లో ద్రాక్షరసానికి ప్రమాణభాషలో 'ఇనొస్', వ్యావహారిక భాషలో 'క్రసి' అంటారు. తమిళంలో ద్విమాండలికతకి కొన్ని ఉదాహరణలు :

| ప్రామాణిక భాష (రాతలోనూ సభలలోనూ వాడేది) | వ్యావహారికం | |
|---|---|---|
| ఒన్ఱు | ఒణ్ణు | 'ఒకటి' |
| ఇరంటు | రెండు | 'రెండు' |
| మూన్ఱు | మూణు | 'మూడు' |
| నాంకళ్ | నాంగ | 'మేం' |
| నీంకల్ | నీంగె | 'మీరు' |
| అవళ్ | అవ | 'అది (స్త్రీ)' |
| అవర్కళ్ | అవంగ | 'ఆయన, వాళ్లు' |
| వంతీర్కళ్ | వందింగె | '(మీరు) వచ్చారు' |
| పార్త్తాల్ • | పాత్తా | 'చూస్తే' |
| వరుకిఱేన్ | వరెఁ | 'వస్తున్నాను' |
| పేరుంతు | బస్సు | బస్సు |
| తొలైకాట్చి | టి.వి. | టి.వి. |

Diglossia కి నిర్వచనం : "DIGLOSSIA is a relatively stable language situation in which, in addition to the primary dialects of the language (which may include a standard or regional standards), there is a very divergent, highly codified (often grammatically more complex) superposed variety, the vehicle of a large and respected body of written literature, either of an earlier period or in another speech community, which is learned largely by formal education and is used for most written and formal spoken purposes but is not used by any sector of the community for ordinary conversation." (Charles A. Ferguson, "Diglossia", *Language in Culture and Society* (ed. Dell Hymes) 1964 : 435)

## 9.5. బహుభాషావ్యవహారం

కొందరు వ్యక్తులుకాని కొన్ని సముదాయాలు గాని ఒకటి కన్న ఎక్కువ భాషలు మాట్లాడతూ ఉండవచ్చు. ఒక భాష మాట్లాడే ఒక సముదాయంవారు

వలసవెళ్లి మరొక భాష మాట్లాడే ప్రాంతంలో స్థిరపడడం వల్లా, ఒక భాషా ప్రాంతాన్ని మరొక భాషకు చెందినపాలకులు ఆక్రమించి పరిపాలించడం వల్లా ద్విభాషా వ్యవహారం (Bilingualism) కాని, బహుభాషా వ్యవహారం (Multilingualism) కాని ఏర్పడుతూ ఉంటుంది. ఇటువంటప్పుడు సాధారణంగా ఈ భాషలలో ఒకటి ఉన్నతస్థాయి భాష (prestige language) గా ఉంటుంది. పాలకుల భాష అవడంవల్ల గాని, సంఖ్యాబలంవల్ల గాని ఒక భాషకి గౌరవస్థానం లభిస్తుంది. ఒక కాలంలో పాలకుల భాష అయిన ఇంగ్లీషు ప్రాముఖ్యం ఎప్పటికీ మన దేశంలో తగ్గలేదు. ఉన్నత విద్యాబోధనలోనూ, రాజ్య పరిపాలనలోనూ ఇప్పటికీ ఇంగ్లీషును తొలగించడం కష్టసాధ్యమవుతోంది. ఉన్నతస్థాయి భాషకున్న గౌరవం, ప్రయోజనం దృష్ట్యా ఎక్కువ మంది దానిని నేర్చుకోడానికి లేక అధమ పక్షం ఆ భాషాపదాలు వీలైనన్ని తమ భాషలో కలిపి మాట్లాడడానికీ ప్రయత్నిస్తారు. ఇప్పుడు విద్యావంతులూ (ఇంగ్లీషు చదువుకోనివారు కూడా) తెలుగులో ఎక్కువ ఇంగ్లీషు సదా[illegible]ప్పి మాట్ల[illegible]డానికీ, తెలంగాణావారి భాషలో ఉర్దూ పదాలు ఎక్కువగా ఉండడానికీ కారణం ఇదే.

వ్యక్తులు బహుభాషా వ్యవహర్తలైనప్పుడు ఒక్కొక్క భాషను ఉపయోగించే సందర్భాలు వేరువేరుగా ఉంటాయి. తెలుగువారు కొందరు చాలా తరాల కిందట తమిళనాడుకి వెళ్ళి స్థిరపడ్డారు. ఇప్పటికీ వారు తెలుగు ఇళ్ళలోనూ, బంధువులతోనూ మాట్లాడుతూ ఉంటారు; బయటివారితో మాట్లాడేటప్పుడు తమిళం ఉపయోగిస్తారు. వీరికి విద్యాబోధన తెలుగులో జరగకపోవడంవల్ల తెలుగు లిపి రాక తెలుగుభాష క్రమక్రమంగా నశిస్తోంది. రెండు లేక అంతకన్న ఎక్కువ భాషలు ఒకే వ్యక్తి మాట్లాడేటప్పుడు ఒక భాష లక్షణాలు మరొక భాషకు సంక్రమించడం సహజం. అందువల్లనే తెలుగునాడు సరిహద్దులలో తెలుగు మాండలికాలలో పక్కన ఉన్న భాషల ప్రభావం కనపడుతూ ఉంటుంది. ఇటువంటి భాషాలక్షణవ్యాప్తి ధ్వనులలోనూ, వ్యాకరణంలోనూ, పదజాలంలోనూ కూడా ఉంటుంది. సరిహద్దు మాండలికాల నించి ఈ అన్యభాషాలక్షణాలు ఇతర ప్రాంతాలు కొన్నింటికి కూడా వ్యాపించవచ్చు. సాధారణంగా ఉన్నత స్థాయి భాషా లక్షణాలు ఇతర భాషలకి వ్యాపిస్తాయి. దాని దేశ్యమైన జంతువులనీ, వృక్షాలనీ, వంటకాలనీ సూచించే పదాల అ ప్రధాన భాషలనించి వచ్చి ఉన్నత

స్థాయి భాషలో చేరడం కూడా ఉంది.

## 9.6 బహుభాషా ప్రదేశం

బహుభాషా వ్యవహర్తల ద్వారా భాషా లక్షణాలు ఒక భాషనించి ఇతర భాషలకి వ్యాపిస్తాయని పైన చూశాం. ఇలా వ్యాపించడానికి ఆ భాషలు పరస్పరం జన్మసంబంధం కలవి కావచ్చు; జన్మసంబంధంలేనివి కావచ్చు. ఇలా జన్మసంబంధం లేకపోయినా తుల్యలక్షణాలు కలిగిఉన్న భాషలు మాట్లాడే ప్రదేశాన్ని బహుభాషాప్రదేశం (Linguistic Area) అంటారు. ("... 'linguistic area' may be defined as meaning an area which includes languages belonging to more than one family but showing traits in common which are found not to belong to the other members of (at least) one of the families." -M.B Emeneau. "India as a linguistic area" *Language* 32 (1956) . 3 - 16.)

మన భారతదేశమే బహుభాషా ప్రదేశానికి చక్కటి ఉదాహరణ అని భాషాశాస్త్రజ్ఞులు నిరూపించారు. మన దేశంలో ఆర్యభాషలు, ద్రావిడభాషలు, ముండాభాషలు అనే మూడు భాషాకుటుంబాలు ఉన్నాయి. ద్రావిడ భాషలకే సహజమైన ట, డ, ణ, ళ అనే మూర్ధన్యధ్వనులు మిగిలిన రెండు భాషాకుటుంబాల్లో చాలా భాషలకి వ్యాపించాయి. ముండాభాషాకుటుంబానికి చెందిన సవర (సోర) భాషలోనూ, ఆర్యభాష అయిన అస్సామీస్‌లోనూ ఇవిలేవు. సంస్కృతంలో ఋగ్వేదంలోనే ఇవి ఉన్నాయి కాని ఇతర ఇండోయూరోపియన్ భాషలలో ఇవి లేవు. మరాఠీలోనూ తెలుగులోనూ దంతమూలీయ చకారం (చప్పుడు, చాలు, చూడు, చోటు మొదలైన వాటిలోది) ఉంది; కాని ఇది మరాఠీలోనించి తెలుగులోకి వచ్చిందా లేక తెలుగులోనించి మరాఠీకి వెళ్లిందా అనే విషయం ఇంకా తేలలేదు.

ఢమఢమ, పటపట, కిలకిల వంటి ధ్వన్యనుకరణశబ్దాలూ; ఇల్లూ వాకిలీ, కూరానారా, తిండీతిప్పలూ వంటి ద్విపద ప్రయోగాలూ ద్రావిడభాషలలో ప్రచురం. ద్రావిడ భాషల ప్రభావంవల్ల ఇటువంటివి ఇతర భారతదేశ భాషలలో కూడా ఏర్పడ్డాయని పండితుల విశ్వాసం. ఇటువంటి ఆధారాలవల్ల భారతదేశాన్ని ఒక బహుభాషాప్రదేశంగా పరిగణిస్తారు.

యూరప్‌లో యుగొస్లావియా, అల్బేనియా, గ్రీస్, బల్గేరియా, రుమేనియాలు ఉండే ప్రాంతం మరొక బహుభాషాప్రదేశం. ఇక్కడ సెర్బొ-క్రోట్, మాసి డోనియన్, బల్గేరియన్ (ఇవన్నీ స్లావిక్ భాషలు), రుమేనియన్, గ్రీక్ అల్బేనియన్ భాషలు ఉన్నాయి. ఇవన్నీ ఇండోయూరపియన్ భాషలే అయినా వీటి మధ్య సంబంధం చాలాతక్కువ. వీటిలో ఒక ప్రత్యేక లక్షణం ఇంగ్లీషు the కి తుల్యమైన పదం నామం ముందు కాక వెనక చేరడం.

దక్షిణాఫ్రికాలో బుష్మన్; హాటెన్‌టాట్, బంటూ కుటుంబాలకి చెందిన భాషలు మాట్లాడే ప్రాంతం మరొక బహుభాషాప్రదేశం. వీటిలో గాలి నోట్లోకి పీల్చడం వల్ల పుట్టే హల్లులూ, లొట్టలు వేసేటప్పుడు వచ్చేధ్వని వంటి హల్లులూ ఉండడం ఒక ముఖ్యమైన ప్రత్యేక లక్షణం.

## 9.7. వ్యాపార భాషలు

అనేక చారిత్రక కారణాలవల్ల రెండు లేక అంతకన్న ఎక్కువ భిన్న భాషలు మాట్లాడేవారు కలిసి ఉండడం సంభవిస్తుంది. ఇటువంటి కలయిక ముఖ్యంగా వ్యాపారంవల్ల ఏర్పడుతుంది. వ్యాపారం కోసమేకాక వినోద యాత్రలకు, పరిపాలనకూ వ్యవసాయానికీ కూడా ఒక భాషవారు మరొక భాషా ప్రాంతంలో స్థిరపడడం జరుగుతుంది. అటువంటప్పుడు రెండు భాషల వారి మధ్య కలయిక అధికంగా కాక అవసరమైనంతవరకు మాత్రమే జరిగితే సూక్ష్మీకృతమైన భాషపుడుతుంది. ఇటువంటి సూక్ష్మీకృతమైన భాషని "వ్యాపార భాష" (Pidgin Lanugage) అంటారు. (Pidgin అనేది ఇంగ్లీషు business అనే దాని భ్రష్టరూపం). వ్యాపార భాష నిర్మాణమూ నిఘంటువూ అతిమాత్రంగా సూక్ష్మీకరించబడి ఉంటుంది; దీన్ని వ్యవహరించేవారికి వేరువేరు మాతృభాష లుంటాయి కాబట్టి ఇది ఎవరికీ మాతృభాషగా ఉండదు. రెండు భాషల వరిలో ఒక తెగవారికి గాని లేక రెండు తెగలవారికి గాని తాము ఉన్నతులమని అవతలి వైపువారు తమకంటె తక్కువ వారీన అభిప్రాయం ఉండడంవల్ల ఎవరూ రెండవ తెగవారి తమకంటె తక్కువవారని అభిప్రాయం ఉండడంవల్ల ఎవరూ రెండవ తెగవారి భాషని క్షుణ్ణంగా నేర్చుకోడానికి ఆసక్తి చూపకపోవడంవల్ల వ్యాపార భాషలు ఏర్పడతాయి. 15వ శతాబ్దినించి యూరప్‌లో భాషలు ఇతర ఖండాలకి

వ్యాపించడం మొదలు పెట్టేయి. పోర్చుగీస్ భాష మాతృకగా వ్యాపార భాషలు అమెరికా, చైనా, పశ్చిమాఫ్రికా, న్యూజిలాండ్; ఆస్ట్రేలియాలలో ఏర్పడ్డాయి. స్పానిష్ ఫ్రెంచి భాషలు మాతృకలుగా గల వ్యాపారభాషలు ఆఫ్రికాలోనూ ఇతర ప్రాంతాలలోనూ ఉన్నాయి.

యూరోపియన్ భాషా వ్యవహర్తల భాషను మొదట స్థానికులు అపరిపక్వంగా నేర్చుకొని మాట్లాడడం మొదలు పెడతారు. అందువల్ల యూరోపియన్లు వారితో మాట్లాడడానికి తమ సహజమైన భాషకాక అసంపూర్ణ వాక్యాలలో స్థానిక భాషాపదాల వీలైనంతవరకు కలిపి ఉపయోగిస్తారు. స్థానికులకి తమ అసలు భాష అర్థంకాదు అనుకోవడం వల్లనో వారి బుద్ధికౌశలం తక్కువ అనుకోవడం వల్లనో పాశ్చాత్యులు వారితో మనం చంటిపిల్లలతో మాట్లాడినట్టు చిన్నచిన్న మాటలతో మాట్లాడతారు. స్థానికులు అదే వారి అసలు భాష అనుకొని ఆ పదాలకే అవసరమైనప్పుడు అర్థాలు విస్తృతంచేసి తమ భాషలో సహజమైనట్లు పదబంధాలూ వాక్యాలూ కల్పించి కొత్త భాష సృష్టించి మాట్లాడుతారు. స్థానికులు పూర్తి భాష నేర్చుకోక పోవడానికి కారణం రెండు సముదాయాల మధ్యా సంసర్గం వ్యాపారం వంటి కొన్ని ప్రయోజనాలకే పరిమితం కావడం అని పైన చూశాం. వ్యాపార భాషలలో పదజాలం చాలావరకు పాశ్చాత్య భాషకు చెందినదీ, ధ్వనినిర్మాణం వ్యాకరణం మాత్రం స్థానిక భాషకు దగ్గర అయినదీ అయి ఉంటుంది. ప్రతి వ్యాపార భాషకీ ఒక మాతృకాభాష (ఇంగ్లీషు, ఫ్రెంచి, మొ.), ఒక స్థానికభాష (చైనీస్, మొ.) ఆధారంగా ఉంటాయి. నియో-మెలనేసియన్‌లో ఇంగ్లీషు గ్రాస్ 'గడ్డి' అనే పదం అర్థవిస్తృతిచెంది 'తల వెంట్రుకలు', గ్రాస్ బిలోజ్ ఫేస్ 'గడ్డం', గ్రాస్ బిలోజ్ మౌస్ 'మీసం' – వీటిలో మాటలు ఇంగ్లీషు అయినా నిర్మాణం ఇంగ్లీషుది కాదు. అలాగే చైనీస్ వ్యాపార భాషలో వన్‌పీసి హౌస్ అంటే 'ఒక ఇల్లు', వన్‌ఫెల మేన్ అంటే 'ఒక మనిషి' (పీసి < Piece) . చైనీస్ సంఖ్యలలో ఉన్న మనుష్యామనుష్య భేదం వ్యాపార భాషలో పీసి, ఫెల అనే మాటలు సంఖ్యాపదాలకు చేర్చడంలో ప్రతిబింబిస్తోంది.

వ్యాపారభాషలో కూడా ఒకరకం భాషే కాబట్టి దానికి కూడా నియతమైన పదజాలమూ, నియతమైన వ్యాకరణ నిర్మాణమూ ఉంటాయనే విషయం వేరుగా చెప్పనక్కర్లేదు. అలా ఉండదు అనుకొనేవారి ఊహ అపోహ.

వ్యాపారభాషలున్న కొన్ని సంఘాలలో వారు రెండు మూడు తరాల తరవాత వారి అసలు మాతృభాష మరిచిపోయి వ్యాపారభాషనే ఇంటాబయటా మాట్లాడ్డం మొదలు పెట్టేరు ఇటువంటప్పుడు పిల్లలు చిన్నతనంనించీ కుటుంబంలోనూ బయటా వ్యాపారభాషనే విని దానినే మాతృభాషగా వ్యవహరించడం జరుగుతుంది. ఇటువంటి భాషని 'వ్యాపారంమాతృబాష' (Creole) అంటారు. ఇటువంటి భాషలు దక్షిణఅమెరికాలనూ, కేరిబియన్ ప్రాంతంలోనూ జమైకాలోనూ ఉన్నాయి. అమెరికాలో జార్జియా తీరప్రాంతంలో ద్వీపాలలోనూ, దక్షిణ కెరోలినాలోనూ నీగ్రోలు వాడే గుల్లా (Gullah) ఇటువంటి వ్యాపార మాతృభాష. మాతృభాష అయిన తరవాత వ్యాపారభాష అనేక సాంఘిక ప్రయోజనాలకి వాడబడుతుంది కాబట్టి అది పదజాలంలోనూ, వ్యాకరణంలోనూ విస్తృతమవుతుంది. ఈ విస్తృతి–ఉన్న పదాలని కలపడంవల్లా, కొత్త పదాలని ఇతర భాషలనించి ఎరువు తెచ్చుకోవడంవల్లా కూడా జరగవచ్చు. ఈ భాషలలో మాతృక అయిన పాశ్చాత్య భాషలో ఉండే ప్రత్యయాలు లోపించడం, పరసర్గలకు బదులు పూర్వసర్గలు చేరడం మొదలైన మార్పులు కొట్టవచ్చినట్లు కనపడతాయి. స్థానిక భాషల ప్రభావం దీనికి కారణం.

దక్షిణ అమెరికాలో ఆఫ్రికానించి తేబడిన నీగ్రోలని ఒక భాష వారిని భిన్నభాషల వారితో కలిపి వేరువేరు చోట్ల నివసించేటట్లు చేశారు. ఇందువల్ల వారిలోవారు ఆఫ్రికా భాషలు మాట్లాడుకోవడం సాధ్యంకాక వ్యాపార భాషలోనే మాట్లాడుకోవలసివచ్చేది. ఇటువంటివి వ్యాపార భాషలే మాతృభాషలు అవడానికి కారణాలు.

పురాతన కాలంలో కూడా ఒక జాతివారు మరొక జాతివారి ప్రాంతానికి వలసవెళ్ళి వారితో కలిసిపోయినప్పుడు వ్యాపారభాషలవంటి భాషలు ఏర్పడి ఉంటాయని అనడానికి ఆధారాలు ఉన్నాయి. ఆర్యులు మన దేశానికి వలస వచ్చి ద్రావిడులలో కలియడంవల్ల ఆర్య భాష ద్రావిడభాషా ప్రభావానికి లోనైంది. అందువల్లనే సంస్కృతంలో ఇతర ఇండో–యూరోపియన్ భాషలలో లేని మూర్ధన్య వర్ణాలు ఏర్పడ్డాయని పండితుల విశ్వాసం. అలాగే ఇండో–యూరోపియన్ భాష మాట్లాడే ఇంకొక తెగవారు మధ్యధరా ప్రాంతం

నించి బాల్టిక్ ప్రాంతానికి వెళ్ళి అక్కడి జాతులతో కలియడంవల్ల మూల జర్మానిక్ భాష ఏర్పడింది (ఇది ఇప్పటి ఇంగ్లీషు, జర్మన్ మొదలైన భాషల మూలభాష). అందువల్లనే జర్మానిక్ భాషలలో wife, hand, leg మొదలైన పదాలు మూల ఇండో-యూరపియన్‌లో లేనివి చేరాయి; ఇవి ఆకాలంలో ఆ ఇతర జాతులు మాట్లాడే భాషలనించి వచ్చాయని పండితుల ఊహ. ఇంతేకాక, జర్మానిక్ భాషలలో వ్యాకరణంలో కొన్ని విపరీతమైన మార్పులు కూడా ఉన్నాయి. వీటన్నిటికీ స్థానిక జాతుల భాషల గాఢ ప్రభావమే కారణమని శాస్త్రజ్ఞుల అభిప్రాయం.

# 10. భాషల విభజన

## 10.1 విభజన పద్ధతులు

ప్రపంచంలో మూడువేల భాషలకి పైన ఉన్నాయని అంచనా. కొన్ని భాషల విషయంలో అవి ప్రత్యేక భాషలా లేక మరొక భాష మండలికాలా అనే విషయంలు తేల్చడం సాధ్యంకాదు కాబట్టి భాషల సంఖ్య ఇంత అని నిర్దుష్టంగా చెప్పడం కష్టమైన పని. మానవులు మాట్లాడే ప్రతి భాషా ఇంకొక భాషకన్న విలక్షణమైనదే అయినా అన్ని భాషలకీ వర్తించే కొన్ని సామాన్య లక్షణాలు ఉన్నాయి అని ఒకటి, రెండు అధ్యాయాలలో చూశాం. అయినా ప్రపంచంలో అన్ని భాషలూ ఏక భాష నించి ఉత్పన్న మయ్యాయని నిరూపించి చెప్పలేం ప్రప్రథమంలో కొందరు విద్వాంసులు అన్ని భాషలూ ఒక మూలభాషనించే పుట్టేయని అభిప్రాయపడినా పరిశోధన వృద్ధిచెందినకొద్దీ ఈ అభిప్రాయాన్ని ఉపపత్తులతో నిరూపించడం సాధ్యం కానదని స్పష్టమయింది. అయినా ప్రపంచ భాషలని కొన్ని సముదాయాలుగా విభజించవచ్చు. ఈ విభజనకి ఉపయోగించే పద్ధతులు రెండు ఉన్నాయి. అవి –

1. లక్షణాత్మక విభజన (Typological classification)

2. జన్మాత్మక విభజన (Genetic classification)

## 10.2 లక్షణాత్మక విభజన

లక్షణాత్మక విభజనలో భాషల లక్షణాలని అనుసరించి అవి కొన్ని సముదాయలుగా విభజించబడతాయి. ఇలా ఒక సముదాయంలో చేర్చబడ్డ భాషలు జన్మ సంబంధం కలవి కావచ్చు; లేనివి కావచ్చు. ఆఫ్రికాలోనూ అమెరికాలోనూ ఉన్న అనేక భాషలకు జన్మసంబంధం నిరూపించి దాని ప్రకారం వాటిని విభజించడం కష్టసాధ్యమైన పని. ఇటువంటి భాషల విషయంలో లక్షణాత్మక విభజన పద్ధతి మాత్రమే శరణ్యం.

1818 లో ఆగస్ట్ వాన్ ష్లెగెల్ (August von Schelegel) ప్రపంచ భాషలన్నిటినీ లక్షణాలను అనుసరించి మూడు సముదాయాలుగా విభజించారు. అవి :

1. ప్రత్యయరహిత భాషలు (Analytic/isloating/root languages): చైనీస్, అన్నామీస్ వంటివి.

2. వికరణాత్మక భాషలు (Agglutinative/affixing languages): టర్కిష్, స్వాహిలీ, ద్రావిడ భాషల వంటివి (వీటిలో ప్రకృతి ప్రత్యయయోగం శిథిలంగా ఉండి, వాటి విభాగం స్పష్టంగా కనపడుతూ ఉంటుంది).

3. సంశ్లేషణాత్మక భాషలు (Synthetic/inflectional languages): లాటిన్, గ్రీక్ సంస్కృతం వంటివి (వీటిలో ప్రకృతి ప్రత్యయాలు చాలా సన్నిహితంగా ఉండి సంధి బాహుళ్యంవల్ల వాటిని విభజించడం కష్ట సాధ్యంగా ఉంటుంది; ఒక ప్రత్యయమే లింగవిభక్తి వచనాలు మూడింటినీ సూచించడం వీటిలో తరచుగా ఉంటుంది).

తరవాత కాలంలో లాటిన్, గ్రీక్ సంస్కృతాల కన్నా ఇంకా క్లిష్టతరమైన నిర్మాణంగల కొన్ని అమెరికన్ ఇండియన్ భాషలు వెలుగులోకి వచ్చాయి. ఇటువంటివాటిని కొందరు అతి సంశ్లేషణాత్మక భాషలు (Polysynthetic languages) అన్నారు. ఈ విభాగం ఒక భాష సాధారణ లక్షణాన్ని సూచించినా ఇది నిర్దుష్టం కాదు. ఒకే భాష కొన్ని సందర్భాలలో ప్రత్యయరహితంగానూ, మరికొన్ని సందర్భాలలో ప్రత్యయ సహితంగానూ ఉండవచ్చు. చైనీస్‌లో తక్కువ సంఖ్యలోనే అయినా కొన్ని ప్రత్యయాలు లేక పోలేదు. అదే విధంగా వికరణాత్మక భాషలలో కొన్ని పదనిర్మాణాలు మిగిలిన వాటికన్న క్లిష్ట తరంగా ఉంటాయి. కొందరు పండితులు సంశ్లేషణాత్మక భాషలే మానవ భాష ఉచ్ఛస్థితికి చెందినవని ఆపోహపడ్డారు. ఇది అపోహ మాత్రమే.

ఇటీవలి కాలంలో పండితులు పైస్థూలవిభాగంకన్న ఒక్కొక్క వ్యాకరణాంగాన్ని విడివిడిగా తీసుకొని భాషలలో భేదసాదృశ్యాలని పరిశీలించడం మేలైదని గ్రహించారు. ఉదాహరణకి వర్ణనిర్మాణంలో మూడు అచ్చులున్న

భాషలు (అరబిక్ మాండలికాలు), అయిదు అచ్చులున్న భాషలు (లాటిన్), తొమ్మిది అచ్చులున్న భాషలు (ఇంగ్లీషు మాండలికాలు) అనే విధంగా విభజించ వచ్చు. ఇలాగే దీర్ఘాచ్చులున్న భాషలు, ఉదాత్తత వర్ణంగా ఉన్న భాషలు అనే విభజన మరొకటి ; హల్లుల సంఖ్య, సంయుక్త హల్లుల సంఖ్యపై ఆధారపడిన విభజన మరొకటి, పదనిర్మాణంతో రెండు వచనాలున్న భాషలు, మూడు వచనాలున్న భాషలు, విభక్తి ప్రత్యయాలు ఉన్న భాషలు, అవిలేని భాషలు ఇత్యాదిగా విభజించవచ్చు. వాక్యనిర్మాణంలో విశేషణం విశేష్యానికి ముందు ఉండే భాషలు, తరవాత ఉండే భాషలు, లేని భాషలు (ఫ్రెంచి), విశేషణ విశేష్యాలకి లింగవచన సాదృశ్యం ఉండే భాషలు, లేని భాషలు ఇత్యాదిగా విభజించవచ్చు. ఇటువంటి పరిశోధన ఇంకా ప్రాథమికావస్థలోనే ఉంది. భాషలలో వైవిధ్యం ఏ రకంగా ఉంటుంది సాదృశ్యం ఏ రకంగా ఉంటుంది. మానవ భాషలో ఏ నిర్మాణం బహుళం, ఏ నిర్మాణం విరళం ఇత్యాది మానవభాషాసహజ లక్షణాలు తెలుసుకోవడానికి ఈ పరిశోధన ఉపయోగిస్తుంది.

## 10.3. జన్మాత్మక విభజన

రెండు లేక అంతకన్న ఎక్కువ భాషలలో వర్ణార్థసాదృశ్యంగల శబ్దాలు ఎక్కువగా ఉండడానికి ముఖ్యకారణం జన్మసంబంధం వల్ల వర్ణాలలోనూ అర్థంలోనూ సాదృశ్యం ఉన్న భిన్నభాషాశబ్దాలని సజాతి శబ్దాలు (Cognates) అంటారు. ఇటువంటి సాదృశ్యం జన్మసంబంధం వల్లనే కాక ఎరువు తెచ్చుకోవడం, ధ్వన్యనుకరణ, యాదృచ్ఛికత వీటివల్లకూడాభాషలమధ్య కనిపించవచ్చు. ఈ కారణాలకి అవకాశం లేనప్పుడు సాదృశ్యం సర్వనామాలు, సంఖ్యావాచకాలు, దైనందిన వ్యాపారబోధకాలైన క్రియలు వంటి వాటిలో ఉన్నప్పుడు ఆ భాషలు జన్మసంబంధం కలవి అని నిర్ణయించడం సులభం. జన్మసంబంధం గల భాషలు ప్రాచీన కాలంలో ఒకే భాషగా ఉంటాయి. అంటు వంటి భాషని మూలభాష (Parent/Proto language) అంటారు. ఒక మూలభాష కాలక్రమంలో విస్తరించిన కొద్దీ మాండలికాలుగా చీలి, ఆ మాండలి కాలే మరికొంతకాలానికి పరస్పరావగాహన సన్నగిల్లి ప్రత్యేక భాషలుగా స్థిరపడతాయి. ఒక మూలభాషనించి పుట్టిన భాషలని దుహితృ భాషలు (Daughter languages) అనీ, సోదర భాషలు (Sister

languages) అనీ వ్యవహరిస్తారు సోదర భాషలన్నిటినీ కలిపి భాషాకుటుంబం (Language Family) అంటారు. ప్రపంచంలో ఎన్ని భాషాకుటుంబాలు ఉన్నాయనేవి జటిలమైన ప్రశ్న. ప్రసిద్ధభాషల విషయంలో సమస్యలేదుగాని చారిత్రకాధారాలులేని కొన్ని ఆఫ్రికా భాషలు, అమెరికన్ ఇండియన్ భాషలలో భాషాకుటుంబ నిర్ణయం చెయ్యడంలో పండితులకు భేదాభిప్రాయాలు ఉన్నాయి. ప్రపంచంలో ఎక్కువ మంది జనాభా మాట్లాడే భాషలు ఇండో-యూరపియన్ భాషలు. వీటిలోనే అతి ప్రాచీన కాలంనించీ గ్రంథాలు లభ్యమవుతున్నాయి. పందొమ్మిదో శతాబ్దినించి భాషాశాస్త్ర పరిశోధన వీటిపైనే ఆరంభమయింది. కాబట్టి ఈ భాషాకుటుంబంతో ప్రారంభించి ప్రపంచలోని భాషా కుటుంబాలని గురించి సంగ్రహంగా కింద చర్చించబడుతుంది.

ఇండోయూరోపియన్ : ఇందులో అనేక ఉపకుటుమబాలు ఉన్నాయి. జర్మానిక్ భాషలలో ఇంగ్లీషు -ఫ్రిజియన్, డచ్ - జర్మన్, స్కాండినేవి యన్ అనే మూడు భాగాలు ఉన్నాయి. ఇంగ్లీషు ప్రపంచంలో అన్ని భాషలకన్న ఎక్కువ జనాభా వ్యవహారంలో ఉంది. నెదర్ లాండ్స్, జర్మనీ తీరప్రాంతాలలో కొందరు ఫ్రిజియన్ మాట్లాడుతున్నారు. డచ్ - జార్మనీ భాషలలో ముఖ్యమైనవి మూడు; అవి జర్మన్, డచ్, ఫ్లెమిష్, స్కాండినేవియన్ భాషలు : డేనిష్(డెన్మార్క్ లో), స్వీడిష్(స్వీడన్, ఫిన్ లాండులలో) బొక్మల్, నినోర్స్క్ (రెండూ నార్వేలో), ఐస్‌లాండిక్ (ఐస్‌లాండులో). జర్మానిక్ భాషలలో అతిప్రాచీన గ్రంథం నాలుగో శతాబ్దిలో వుల్ఫిలా అనే పండితుడు గాథిక్ భాషలో చేసిన బైబిల్ భాషాంతరీకరణం; ఇందులో కొంతభాగం మాత్రమే లబ్ధం. స్కాండినేవియన్‌కు చెందిన ప్రాచీన నోర్స్‌లో గ్రంథాలు పన్నెండో శతాబ్దినించి దొరుకుతున్నాయి. డచ్-జర్మన్ ప్రాంతంలో ప్రాచీన సాక్సన్, ప్రాచీన హై జర్మన్, ప్రాచీనాంగ్లాలకు ఆధారాలు ఉన్నాయి.

కెల్టిక్ భాషలు పూర్వకాలంలో ఎక్కువ వ్యాప్తిలో ఉండేవి కాని, ఇప్పుడు నాలుగే మిగిలాయి. ఫ్రాన్స్ ఈశాన్య దిశ చివర ఉన్న బ్రిటన్ ఫ్రెంచి భాషా ప్రభావానికి నిలదొక్కుకోలేకపోతోంది. యు.కె. లో వెల్ష్, ఐరిష్, స్కాట్స్ గేలిక్ ఇంగ్లీషుభాషా ప్రవాహంలో మునిగిపోకుండా ఉండడానికి తీవ్ర ప్రయత్నం చేస్తున్నాయి.

రొమాన్స్ భాషలలో అయిదు ముఖ్యమైన భాషలకు లిపులూ, సారస్వతమూ ఉన్నాయి. అవి పోర్చుగీస్, స్పానిష్, ఫ్రెంచ్, ఇటాలియన్, రుమేనియన్. ఇవి కాక సార్డినియన్ అనే భాషా, ఇటలీ ఈశాన్య ప్రాంతంలో ఉన్న రెటోరొమానిక్ అనే మాండలిక సముదాయమూ రొమాన్స్ భాషలకు చెందినవే. ఈ మాండలికాలలో రొమాన్ష్ అనేది లిఖిత భాష అయి, స్విస్ రిపబ్లిక్‌లో ఒక అధికారభాష అయింది. ప్రాచీన భాషలలో ప్రసిద్ధమైన లాటిన్ ఇప్పటి రొమాన్స్ భాషల మూలభాషకు సన్నిహితమైనది. ఇటలీలో ప్రాచీనకాలంలో లాటిన్ కాక మరికొన్ని భాషలు కూడా ఉన్నట్లు శాసనాధారాలు ఉన్నాయి; కాని ఈ ఆధారాలు సమగ్రం కావు. ఒస్కన్, ఉంబ్రియన్, వెనెటిక్ అనే ఇటువంటి ప్రాచీన భాషలు లాటిన్‌కి సన్నిహితమైనవి. ఎత్రుస్కన్ అనే మరొక ఇటువంటి ప్రాచీన భాష ఇండోయూరపియన్ కుటుంబానికి చెందినది కాదు; ఇది మరి ఏ కుటుంబానికి చెందినదని నిర్ణయించడమూ సాధ్యంకాదు.

స్లావిక్ భాషలు తూర్పు యూరప్‌లో చాలా భాగంలో వ్యవహారంలో ఉన్నాయి. వీటిలో ముఖ్యమైనది రష్యన్. ఇది మాస్కో చుట్టుపట్ల ఉద్భవించినా క్రమంగా సోవియట్ ప్రాబల్యం గల దేశాలన్నిటికీ మాతృభాషగానో లేక అధికారభాషగానో వ్యాపించింది. అందువల్ల ఇది ప్రపంచంలో సాంఘికంగానూ రాజకీయంగానూ ఇంగ్లీషు తరవాత ద్వితీయ స్థానాన్ని ఆక్రమిస్తోంది. రష్యన్ భాష తూర్పు దక్షిణ ప్రాంతాలలో దానికంటె స్వల్పంగా భిన్నమైన బ్యెలో రష్యన్, ఉక్రేనియన్ భాషలు ఉన్నాయి. ఇవికాక ఇతర స్లావిక్ భాషలు పోలిష్, జెక్, స్లొవాక్ ( ఈ మూడు ఒక భాష మాండలికాలే), సెర్బో-క్రోషియన్, బల్గేరియన్. స్లావిక భాషలలో ప్రథమ లిఖిత భాష ప్రాచీన చర్చిస్లావోనిక్ దీనిఓల గ్రంథాలు తొమ్మిదో శతాబ్దివించి ఉన్నాయి.

బాల్టిక్‌శాఖలో ముఖ్యమైనవి లిథువానియన్, లాత్వియన్.

అల్బేనియన్‌ని కూడా ఒక ప్రత్యేక శాఖగా పరిగణించాలి.

దక్షిణ కాకసస్ ప్రాంతంలోనూ మరి కొన్ని చోట్లా వ్యవహృతమయ్యే ఆర్మేనియన్ మరొక శాఖ.

గ్రీక్ భాష కూడా మరొక శాఖ. క్రీస్తు పూర్వం రెండు వేల ఏళ్లకి ముందు గ్రీస్‌లో ఇండో-యూరోపియన్‌కు చెందని భాషలు ఉండేవి. గ్రీక్ భాషా వ్యవహర్తలు ఉత్తర ప్రాంతం నించి అలలు అలలుగా భిన్నకాలాలలో గ్రీస్‌దేశం చేరారని ప్రాచీన గ్రీక్ మాండలికాలవల్ల తెలుస్తుంది. వీటిలో ఏథెన్స్ మాండలికమే ప్రమాణమై, అలెగ్జాండర్ దండయాత్రలవల్ల ఇతర ప్రాంతాలకి వ్యాపించింది. హెూమర్ కవి గ్రంథాలైన ఇలియడ్. ఒడెస్సీల కాలం తెలియదు. కొంతకాలం క్రితం వరకూ నిశ్చితంగా కాలం తెలిపిన ఆధారాలు క్రీ.పూ. ఏడవ శతాబ్ది నించి మాత్రమే లభ్యమయ్యాయి. కాని ఇటీవల క్రీ.పూ. 1450-1200 కాలానికి చెందిన మెసినెయన్ గ్రీక్ ఫలకాలు (Tablets) దొరికేయి. రాజకీయ ప్రాబల్యం తగ్గిన తరవాత గ్రీక్ భాష వ్యవహరించే ప్రాంతం సంకుచితమయింది.

తూర్పు దేశాలలో ఇండో యూరోపియన్ భాషలు ఇండో - ఇరానియన్ శాఖకు చెందినవి. ఇరానియన్ శాఖలో నాలుగు ముఖ్యమైన భాషలు ఇప్పుడు వ్యవహారంలో ఉన్నాయి. అవి కుర్దిష్ (టర్కీ, ఇరాక్, ఇరాన్), పర్షియన్ (ఇరాన్‌లో చాలా భాగం), పష్తో లేక అఫ్‌గన్ (ఆఫ్ఘనిస్తాన్,పాకిస్తాన్), బలూచి (పాకిస్తాన్‌లో బలూచిస్తాన్). ఉత్తరాకకసస్ ప్రాంతంలో ఒసెటిక్ కూడా ఈ శాఖకు చెందినదే. క్రీ.పూ. 300కి ముందు కాలంలో అవెస్తన్, ప్రాచీన పర్షియన్ అనే రెండు మాండలికాలకు ఆధారాలు ఉన్నాయి. జోరాష్ట్రియన్ మతం వారి పవిత్ర గ్రంథమైన అవెస్తా క్రీ.పూ. 600 ప్రాంతానికి చెందినది, దీని భాష ఋగ్వేద భాషకి సన్నిహితం. డేరియస్ అనే రాజు శాసనాలలో ప్రాచీన పర్షియన్ లభిస్తోంది. మధ్యకాలం ఇరానియన్ అని చెప్పదగిన పహ్లవి భాష పర్షియన్ సామ్రాజ్యంలో క్రీ.పూ. 300 నుండి క్రీ.శ. 900 దాకా వ్యవహారంలో ఉండేది. దీనికి ఆధారాలు ఇప్పటికీ ఉన్నాయి.

ఇండో-ఇరానియన్‌లో రెండో ఉపశాఖ ఇండో-ఆర్యన్. ఇందులో ప్రాచీనమైనది సంస్కృత భాష. ఋగ్వేద భాష మనకు తెలిసిన అన్ని భాషల కంటె ప్రాచీనమైనది. సంస్కృతంలో అపారమైన సాహిత్య సంపదా, పాణిన్యాది మహర్షుల వ్యాకరణ గ్రంథాలూ, ఇతర శాస్త్ర గ్రంథాలూ సంస్కృతానికి ప్రపంచ భాషలలో ఒక ఉన్న స్థానాన్ని ఏర్పరిచాయి. సంస్కృతం కాలక్రమేణ

ప్రాకృత భాషలుగా మారి, తరవాత ఇప్పటి హిందీ (ఉర్దూ), పంజాబీ, బెంగాలీ, అస్సామీస్, ఒడియా, మరాఠీ, గుజరాతీ, సింధి, కాశ్మీరీ, నేపాలీ, సింహళీస్ (శ్రీలంకలో) ఇత్యాది భాషలుగా మారింది.

ప్రాచీన కాలంలో వ్యవహారంలో ఉండి ఇప్పుడు నశించిన ఇండో యూరోపియన్ భాషలు చాలా ఉన్నాయి. వీటిలో కొన్నింటికి గ్రంథాలు ఉన్నాయి కాని మరి కొన్నింటికి శాసనాల వంటి స్వల్పాధారాలే ఉన్నాయి. స్వల్పాధారాలు ఉన్న భాషల స్థానం నిర్ణయించడం సాధ్యం కాలేదు. మధ్య ఆసియాలో 7-10 శతాబ్దుల మధ్యకాలంలో టొకారియన్ శాఖకు చెందిన రెండు భాషలు ప్రసిద్ధ మైనవి. మధ్యధరా ప్రాంతంలో ఉండేవని తెలసిన ఇలిరియన్, ఫ్రిజియన్ భాషలు ఇండో యూరోపియన్ లో ఏ శాఖకు చెందినవి అని నిర్ణయించడం సాధ్యం కాలేదు.

క్రీ.పూ. 15వ శతాబ్ది నించి హిట్టైట్ భాషకు శా- ధారాలు ఉన్నాయి. దీన్నీ, మరికొన్ని భాషలనీ కలిపి అనటోలియన్ శాఖగా పండితులు ఏర్పరిచారు. అనటోలయిన్ శాఖ ఇండో యూరోపియన్ లో భాగమని కొంది అభిప్రాయం. కాని, ఎక్కువమంది ఇది మూల ఇండో యూరోపియన్ భాష శాఖలుగా చీలక ముందు. దాని నించి విడినదని నమ్ముతున్నారు. అందువల్ల వీరు ఇండో యూరోపియన్ ని ఇండో హిట్టైట్ అని వ్యవహరిస్తారు.

**ఫిన్నో-ఉగ్రిక్ కుటుంబం :** ఇందులో యూరప్ లోని మూడు భాషలు, ఫిన్నిష్, ఎస్తోనియన్, హంగేరియన్ ముఖ్యమైనవి. ఇవికాక యూరప్ ఆసియాలలో ఉన్న లప్పిష్, మొర్ ద్విన్, చెరెమిస్, వొత్యక్ అనేవి కూడ దీనికి చెందినవి. సమొయెద్ భాషలు కూడా దీనితో సంబంధం కలవి.

**అల్టైక్ కుటుంబం :** ఇందులో మూడు శాఖలున్నాయి. టర్కిక్ శాఖలో టర్కిష్, అజెర్ బైజని (ఇరాక్, కాకసస్ లలోది), కిర్గిజ్, ఉజ్ బెగ్, టర్కొమెన; కజక్ ముఖ్యమైనవి. మంగోల్ శాఖలో చాలా భాషలున్నాయి. మంగోలియా తూర్పు ప్రాంతంలోని మంచు, తుంగుస్ మూడో శాఖకి చెందినవి.

**ఉత్తర దక్షిణ కాకసస్ కుటుంబాలు :** ఇవి కాకసస్ ప్రాంతంలో ఉన్నాయి. దక్షిన కాకసస్ కుటుంబంలో ప్రాచీన సాహిత్యం కల జార్జియన్ అనే భాషా, మింగ్రెలియన్ అనే భాషా ఉన్నాయి. అబ్ఖాసియన్, అవర్ , చెచెన్, కబర్డియన్, ఇంకా చాలా భాషలు ఉత్తర కాకసస్ కుటుంబానికి చెందినవి.

**బాస్క్ :** ఫ్రాన్సులో పశ్చిమ పిరేనేస్‌లోనూ, స్పెయిన్‌లోనూ కొంత జనాభా బాస్క్ భాష మాట్లాడతారు. ఇది ఇంతవరకూ ఏ భాషా కుటుంబానికీ చెందినట్లు నిరూపించబడలేదు కాబట్టి, దీన్ని ప్రత్యే భాషాకుటుంబంగా పరిగణించారు.

**ఆఫ్రో–ఏషియాటిక్ కుటుంబం :** దీనికి చెందని భాషలు ఉత్తర ఆఫ్రికాలోనూ నైరృతి ఆసియాలోనూ ఉన్నాయి. ఇందులో సెమిటిక్, ఈజిప్షియన్, బెర్బెర్, కుషిటిక్, చడ్ అనే అయిదు శాఖలు ఉన్నాయి. చివరి నాలుగు శాఖలనీ కలిపి కొందరు హమిటిక్ అని వ్యవహరిస్తారు.

సెమిటిక్ శాఖ ప్రసిద్ధమైనది. ఇందులో ప్రస్తుతం ఉన్నవాటిలో ముఖ్యమైనవి హిబ్రూ, అరబిక్, ఇథియోపియాలో కొన్ని భాషలు. అరబిక్‌లో అంతమాత్ర భేదాలుగల పరిగణించవలసిందే అయినా పారంపర్య ప్రభావంవల్ల ఇవన్నీ అరబిక్ భాషగానే పరగణించబడుతున్నాయి. పూర్వకాలంలో మాత్రమే ఉన్న కొన్ని సెమిటిక్ భాషలలో పుష్కలమైన సాహిత్యం ఉంది. మెసపొటేమియాలో అక్కాడియన్ (దీనినే అసిరియన్, బాబిలోనియన్ అని కూడా అంటారు). సుమేరిన్ (ఇది ఏ భాషా కుటుంబానికీ చెందదు) భాషలు ఉండేవని అనేక శాసనాల వల్ల తెలుస్తుంది. ఈ శాసనాలే ప్రపంచంలో ప్రాచీనతమమైన చారిత్ర కాధారాలు, అరమైక్, సిరియక్ పరస్పర సంబంధంగల మాండలికాలు. వీటిలో మత గ్రంథాలు ఇప్పటికీ ఉపయోగంలో ఉన్నాయి. ప్రాచీన హిబ్రూతో స్వల్ప భేదం మాత్రమే కలిగిన ఫొనిషియన్ మధ్యధరా ప్రాంతంలో వ్యాపారంకోసం వాడబడేది. లేఖన పద్ధతి ఆ భాషలోనే మొదటి ఆరంభమయింది అంటారు ఈ భాష తరవాత కాలంలో ప్యూనిక్‌గా మారి, అది కార్తాజినియన్ సామ్రాజ్యంలో వాడబడింది. బైబిల్‌లో పాత టెస్టమెంట్

అధికభాగం హిబ్రూలో రచితమైంది. ఇది ఇప్పుడు వ్యవహారంలో ఉన్న సెమిటక్ భాషలు అంహారిక్, టిగ్రే,టిగ్రిఞ. వీటిలో మొదటిది అధికార భాష. ఇవికాక గెఎజ్ అనే వీటికి సంబంధధించిన ప్రాచీన భాష చర్చిలో ఉపయోగించబడుతోంది.

ఈజిప్షియన్‌శాఖకు చెందినవి ప్రాచీన ఈజిప్షియన్, దాని తరవాత రూపం కాప్టిక్ (ఇది చర్చిలోనే ఉపయోగించబడుతోంది.).

బెర్బెర్ శాఖలో ముఖ్యభాషలు కబిల్, షిల్ , జెనగ, తుఆరెగ్. ఇవి ఉత్తర ఆఫ్రికా, సహారాలలో ఉన్నాయి.

కుషిటిక్ శాకాభాషలు ఆఫ్రికా తూర్పు కొమ్ములో ఉన్నాయి. వీటిలో సోమాలీ, గల్లా, బెజా అధిక సంఖ్యాకుల వ్యవహారంలో ఉన్నాయి.

ఆఫ్రికా సూడాన్ ప్రాంతంలో చిన్న భాషాకుటుంబాలూ, పెద్ద భాషా కుటుంబాలూ అనేకం ఉన్నాయి. వీటిని గురించి వివరాలు అంతగా తెలియవు. వీటిలో సొంగై భాష నైగర్‌నది పక్క అధిక సంఖ్యాకుల వ్యవహారంలో ఉంది.

చారి-నైల్ కుటుంబం భాషలు నైలునది పక్కా తాంగన్యికాలోనూ, చారినది పక్కా ఉన్నాయి. ఈ ప్రదేశం మధ్యభాగంలో ఉన్న నిలోటిక్ శాఖలో దింక, నుయేర్, షిలుక్ భాషలు ఉన్నాయి. ఉగాండాలో అకొలి, కెన్యా, తాంగన్యికాలలో మసై, నందిలని కొందరు ఆఫ్రో-ఏషియాటిక్ కుటుంబానికి చెందినవిగా పరిగణించారు కాని, అది సరికాదు. ఉత్తర సైడాన్ లో నుబ చారి నైల్ కుటుంబానికి చెందినది. బగిర్మి, మోరు, మరికొన్ని భాషలు మధ్య సూడానిక్ శాఖకు చెందినవి.

మధ్య సహారన్‌కుటుంబంలో ప్రసిద్ధమైన భాష ఈశాన్య నైజీరియాలోని కనురి.

నైగర్-కాంగో కుటుంబం ఆఫ్రికాలో ముఖ్యమైనది. ఈ భాషలు పశ్చిమ ఆఫ్రికాలోనూ, భూమధ్య రేఖకు దక్షిణాన ఉన్న ఆఫ్రికా అంతటా

వ్యవహారంలో ఉన్నాయి. ఇందులో చాలా శాఖలు న్నాయి కాని, ఈ విభజన ఇంతవరకు సమగ్రంగా జరగలేదు.

ఇందులో పశ్చిమ అట్లాంటిక్, మండ్ శాఖల విభజన సుస్పష్టం. లిబేరియా నించి సెనెగల్ వరకూ తీరప్రాంతంలో మొదటి శాఖ ఉంది. దీనిలో ముఖ్యమైనది ఫులానీ (సెనెగల్ నుండి కేమరూన్స్ వరకూ), సియెరా లెయోన్ లొతెమ్నె, బులొంసెనెగల్ లో ప్రసిద్ధమైనవి మండ్ శాఖా భాషలలో అధిక సంఖ్యాకులు మాట్లాడేవి లిమేరియా, సియోరా లెయోన్ లలో క్పెల్, లోమా, మెండ్ వీటికి ఉత్తరానగల మలింక్, బంబరా.

లిబేరియానించి కేమరూన్స్ వరకూ తీరప్రాంతంలో కావ శాఖా భాషలు ఉన్నాయి. వీటిలో ముఖ్యమైనవి అకన్ (ఫంటి, త్వి మాండలికాలు), బవ్యూల్, ఏవ్, ఫాన్, యొరుబా, ఇబో, నూపె లిబేరియా బస్సా, క్రూ భాషలు ఈ శాఖకు చెందినవి అంటారు కాని, ఇది వివాదగ్రస్తం, క్వా శాఖకు ఉత్తరాన గర్ శాఖా భాషలు ఉన్నాయి. వీటిలో ముఖ్యమైనది మొస్సి; మిగిలిన వాటి వివరాలు తెలియవు..

కేమరూన్స్ నుండి తూర్పున కాంగోవరకూ వివరాలు తెలియని అనేక నైగర్–కాంగో కుటుంబ భాషలు ఉన్నాయి. ఇవన్నీ ఒక శాఖా కాదా అనే విషయం వివాదాస్పదం. వీటిలో జండ్, సంగోలు ముఖ్యమైనవి.

మధ్యశాఖ తూర్పు నైజీరియా, కేమరూన్స్‌లలో ఉంది. ఇందులో చిన్నచిన్న భాషలు అసంఖ్యాకం. కాని ఎఫిక్, తివ్ అనే రెండూ మాత్రం చాలా మంది వ్యవహారంలో ఉన్నాయి. ఈ శాఖకు చెందిన బంటూ భాషా సముదాయం మాత్రం ఎక్కువ ప్రాంతంలో వ్యవహారంలో ఉంది. నైగర్–కాంగో కుటుంబంలో కల్లా బంటూ భాషల సంఖ్యే ఎక్కువ. అందువల్లి వీటిలో విభజన ఇంకా వివాదగ్రస్తం. వీటిలో మూడు రకాలు ఉన్నాయి. వీటిలో వ్యాపార రీత్యానో ప్రభుత్వాదరణం వల్లనో వృద్ధిచెందినవి ఒక రకం. తూర్పు ఆఫ్రికాలో స్వాహిలీ, కాంగో తూర్పున కొంగొ, దక్షిణాన లుబా, ఉత్తరాన 'ంగలా' ఇటువంటివి. కొన్ని మాండలికాల కలయికవల్ల ఏర్పడినవి రెండోరకం. దక్షిణ రొడేషియాలో షొనా,

దక్షిణ న్యసాలాండ్‌లో న్యంజా ఇటువంటివి. ఆటవిక భాషలలో ముఖ్యత్వం సంపాదించుకున్నవి మూడోరకం. ఇటువంటి గండా (ఉగాండా), కికుయూ, కంబా (కెన్యా), ఛగా, న్యమ్‌వెసీ (తాంగన్యికా), రుండీ, ర్వండా (రువాండా-ఉరుండి), బెంబా (ఉత్తర రొడీషియా), ఉంబుండు, కింబుండు (అంగోలా), హెరెరో (నైరృతి ఆఫ్రికా), జులు, ఖోసా, స్వజీ, దక్షిణ సాథో, ఉత్తర సాథో, త్స్వానా, వెండా (దక్షిణ ఆఫ్రికా).

బంటూ భాషలో లింగ వచనాలని సూచించే పూర్వసర్గలు ఉన్నాయి. అందువల్ల భాషల పేర్లు పూర్వ సర్గలతో కలిపి ఒకసారి, అవి లేకుండా మరొక సారి పేర్కొనబడతాయి : కొంగోని కికొంగో అనీ గండాని లుగండా అనీ కొందరు వ్యవహరించారు. ఈ భాషలు మాట్లాడే జాతి పేరుకూడా భాష పేరుకి సన్నిహితంగా ఉంటుంది : లుగండా భాష మాట్లాడేవారు ఉగాండాలోని బగాండా జాతివారు.

బంటూ భాషలు వ్యాపించడంవల్ల ఖోయ్‌సాన్ భాషాకుటుంబంలోని భాషలు నశించాయి. దీనికి చెందిన రెండు చిన్న భాషలు సండావ్, హత్సాతాంగన్యికాలో మిగిలేయి. దక్షిణ ఆఫ్రికా ఎడారిలో ఉన్న బుష్మన్; హాటెన్ టాట్ భాషలుకూడా దీనికి చెందినవే.

జపనీస్ కుటుంబంలో జపనీస్, ర్యుక్యు ఉన్నాయి. కొరియన్ భాష మరొక కుటుంబం. ఇటీవల కాలంలో ఈ రెండింటికీ మధ్య కొంత సంబంధం ఉందని తేలింది.

సినో-టిబెటన్ కుటుంబం తూర్పు ఆసియాలో అన్నిటికన్న పెద్దది. ఇందులో టిబెటో-బర్మన్; చైనీస్ అని రెండు శాఖలు ఉన్నాయి. టిబెట్‌లోనూ చుట్టుపక్కలా మాట్లాడే టిబెటన్, బర్మాలోని బర్మీస్ టిబెటో-బర్మన్ శాఖలో పెద్ద భాషలు. ఈ దేశాల మధ్య పర్వత ప్రాంతాలో గారో, బొడో, నాగా, కుకి-చిన్ మొదలైన అనేక భాషలు ఈ శాఖకు చెందినవి. దక్షిణ బర్మాలోని కరెన్ భాషలు ఏ కుటుంబానికి చెందుతాయో సరిగా తెలియదు కాని, సాధారణంగా వీటిని టిబెటో-బర్మన్ శాఖలోనే చేరుస్తారు.

చైనీస్ శాఖలో ప్రధాన భాష ఉత్తర చైనా అంతటా ఉన్న మండారిన్. ఆగ్నేయ చైనాలో చాలా భాషలు ఉన్నాయి. యంగ్‌త్సె నది ముఖద్వారంలో వూ మాండలికాలు ఉన్నాయి. వీటిలో ప్రసిద్ధమైనది సుచౌవ్. దక్షిణ తీర ప్రాంతంలో వుకియెన్ మాండలికాలు అనేకం ఉన్నాయి : అమొయ్, ఫూచౌవ్ మొ. ఈ పేర్లు అవి వ్యవహారంలో ఉన్న పట్టణాల పేర్లమీద ఏర్పడ్డాయి. లోపలి భాగంలో హక్కా ఉంది. దీనికి దక్షిణాన విశాలభాగంలో కంటోనీస్ మాండలికాలు ఉన్నాయి. నైరృతి చైనాలో స్థానిక భాషలు చాలా ఉన్నాయి. వీటి మీద వివరాలు తెలియవు గాని, ఏవి చైనీస్‌కి సంబంధించినవి కావు అనే విషయం స్పష్టం. వీటిలో కొంత ప్రసిద్ధమైనవి మియావో, యావో.

కడై కుటుంబానికి చెందిన భాషలు ఇండో-చైనాలోని థాయ్ (లేక సియామీస్), లావోటియన్, బర్మాలోని షన్ భాషలు; ఇవి కాక అనేకమైన చిన్న భాషలు నైరృతి చైనా, హైనన్ ద్వీపాలలో ఉన్నాయి. ఈ భాషలు సినోటిబెటన్ కుటుంబానికి చెందినవి కావని ఇటీవల స్పష్టమయింది.

మలయో—పోలినీషియన్ కుటుంబం విస్తీర్ణంలో ఇండో-యూరపియన్ తరవాత చెప్పతగ్గది. ఇది పసిఫిక్ ద్వీపాలు, పశ్చిమాన మడగాస్కర్ దాకా ఉంది. ఇందులో రెండు శాఖలు ఉన్నాయి. పశ్చిమ (లేక ఇండోనీషియన్) శాకలో ఈస్ట్ ఇండీస్‌లోని భాషలు ఉన్నాయి. వీటిలో ముఖ్యమైనవి మలే (సుమత్రి, మలాయా, బోర్నియో), ఇండోనీషియన్ (ఇండోనీషియా;ఇది మలే భాషలో స్థానిక భాషాపదాలు కలవడంవల్ల ఏర్పడింది), జావనీస్, సుండానీస్, మదురస్ (మూడూ జావాలోవి), బతక్ (సుమత్రా), బలినీస్ (బలి), డయాక్ (బోర్నియో), మకస్సర్ (సెలెబ్స్), తగలాగ్, బిసయన్, ఇలొకనొ (మూడూ ఫిలిప్పైన్స్‌లోవి), చమొర్రో (గువాం), మలగసీ (మడగాస్కర్).

తూర్పు శాఖలో మైక్రొనిషియన్, పోలినీషియన్, మెలనీషియన్ అని మూడు భాగాలున్నాయి. పోలినీషియన్ భాషలు పరస్పరం చాలా సన్నిహిత సంబంధం కలవి. ఇవి హవాయీ నించి న్యూజీలాండ్, ఈస్టర్ ద్వీపం, ఇంకా పశ్చిమ ద్వీపాలదాకా ఉన్నాయి. వీటిలో ప్రసిద్ధమైనవి హవాయియన్

టిహిటియన్, సమోవన్, మయొరీ, ఫిజియన్, ఇంకా అనేక భాషలు పరస్పర దూర సంబంధం గలవి మెలనీషియన్ విభాగంలో ఉన్నాయి.

న్యూగినియాలోనూ దాని పక్క ద్వీపాలలోనూ ఉన్న భాషల జన్మ సంబంధాలు సరిగా తెలియవు. వీటిని తాత్కాలికంగా పపువన్ భాషలు అన్నారు.

ఆస్ట్రేలియాలో ఆటవికులు మాట్లాడే అనేక భాషలు ఆస్ట్రేలియన్, కుటుంబం కిందకి వస్తాయి.

టాస్మానియాలో పూర్వకాలం ఉండిన భాషలు ప్రత్యేక కుటుంబానికి చెందిన భాషలు అయి ఉండవచ్చు.

**ద్రావిడ కుటుంబంలో** ముఖ్యమైన భాషలు దక్షిణ భారతదేశంలో ఉన్నాయి. తెలుగు, తమిళం కన్నడం, మలయాళం ప్రాచీన సాహిత్య సంపద కలిగి, కోట్ల కొలది జనుల వ్యవహారంలో ఉన్నాయి. ప్రాచీన సాహిత్యమూ, లిపీ లేకపోయినా వ్యవహారంలో మాత్రం ఉన్నవి 17 గుర్తించబడ్డాయి ద్రావిడ కుటుంబంలో మూడు ఉపకుటుంబాలని గుర్తించడం పరిపాటి. దక్షిణోపకుటుంబంలో తమిళం, మలయాళం, కొడగు, కోత, తొద, కన్నడం, తళు ఉన్నాయి. మధ్యమోప కుటుంబంలోని తెలుగు, గోండి, కొండ, పెంగొ, మండ, కూయి, కువి, కోలామీ, నాయకీ పర్జీ, గదబ, కూడుఖ్, మాల్తో, బ్రాహుయీలు ఉత్తరోపకుటుంబం కిందకి వస్తాయి. పాకిస్తాన్‌లోని బలూచిస్తాన్‌లో ఉన్న బ్రాహుయీ, ఉత్తర భారతంలోని భాషలూ ఆర్యుల ప్రవేశానికి ముందు ద్రావిడ భాషలు ఇండియా ఉపఖండం అంతటా ఉండేవని నిరూపిస్తాయి. ఇవికాక ఇరుళ, కురుంబ, కొరగ, ఇంది, కొవంటి కొత్తగా బయల్పడ్డవి ప్రత్యేక భాషలని కొందరు పరిగణిస్తున్నారు.

ఆస్ట్రో-ఏషియాటిక్ కుటుంబంలో భాషలు ఆగ్నేయ ఆసియా అంతటా ఉన్నాయి. దీనికి చెందిన ముండాశాఖలో భాషలు మధ్య భారతదేశంలో ఉన్నాయి. వీటిలో ప్రసిద్ధమైనవి సవర, సంతాలీ, ఖడియా, గదబ, ఖాసి (చివరిది

అస్సాంలో ఉంది), నికోబార్ ద్వీపాలలో నికొబరీస్ ఉంది. ఉత్తర బర్మాలో పలాఉంగ్, వా, దక్షిణ బర్మాలో మొన్ ఉన్నాయి. ఇండో–చైనాలో ఖ్మేర్, అధిక జనాభా గల వియత్నామీస్ ఉన్నాయి.

అమెరికాలో యూరపియన్లు వలస వెళ్లక పూర్వం నించీ అనేక భాషలు ఉన్నాయి. వీటిలో కొన్ని యూరపియన్ భాషాప్రవాహంలో మునిగిపోయినా ఇప్పటికీ చాలా భాషలు మారుమూల ప్రాంతాలలో గృహభాషలుగా మిగిలి ఉన్నాయి. వీటిని (అమెరికన్) ఇండియన్ భాషలు అంటారు. వలస వెళ్లడం వలన అమెరికాలో స్థిరపడిన యూరపియన్ భాషలు ఇంగ్లీషు, స్పానిష్, పోర్చుగీసు, ఫ్రెంచి, ఇటాలియన్, జర్మన్ ఈ ప్రవాహానికి తట్టుకొని కొంకొంది జనుల వ్యవహారంలో మిగిలి ఉన్న (అమెరికన్) ఇండియన్ భాషలు దక్షిణ అమెరికాలో నాలుగు : పెరగయ్, నైరృతి బ్రెజిల్‌లలో గ్వరానీ గృహభాషగా మిగిలింది. వీరు ఇంటి బయట స్పానిష్ గాని పోర్చుగీసుగాని వాడతారు. పెరూ, ఎక్వడోర్, బొలీవియాలలో లక్షలాది జనం క్వెచువా మాట్లాడతారు. దక్షిణ పెరూ, బొలీవియాలలో అయ్‌మరా ఉంది. తుపి–గ్వరానీ మీద ఆధారపడిన లింగ్వాజెరాల్ విభిన్న భాషలవారి మధ్య పరస్పర వ్యవహారానికి ఉపయోగించే భాషగా అమజోనియన్ బ్రెజిల్‌లో కొంతకాలం క్రితం దాకా మాగా వ్యవహారంలో ఉండేది ; ఇప్పుడు దీని స్థానాన్ని క్రమక్రమంగా పోర్చుగీసు ఆక్రమిస్తోంది.

మధ్య అమెరికాలో లక్షల కొలది జనం వ్యవహారంలో స్థానిక భాషలు ఉన్నాయి. ఇవి స్పానిష్ ప్రభావానికి లోనవుతున్నాయి. మెక్సికో, గౌతమేలా లలో ఈకింది భాషలు ఉన్నాయి; నహ్నువాట్ల్ (10 లక్షలు), క్వెచె, చక్ చిక్వెల్, మాం, యుకాటెక్, కెక్చి, ఒటొమి, జపొటెక్, మిక్స్‌టెక్, టొటొనాక్. మెక్సికొకి ఉత్తరాన నవహొ ఉంది. ఇవికాక కొన్ని పోగా మిగలిన కొన్ని చిన్న చిన్న భాషలు కూడా ఉన్నాయి.

ఉత్తర అమెరికాలో భాషల కుటుంబ విభజన విషయంలో భేదాభిప్రాయాలు ఉన్నాయి. దీనిపై ఇంకా పరిశోధన సాగుతోంది కాబట్టి కింద ఇచ్చిన విభజన స్థూలమైనది అని గమనించాలి.

తూర్పుతీరంలో కెరొలినానించి ఉన్నారాన లబ్రాడర్ వరకూ అల్గాంక్వియన్ భాషలు ఉండేవి. యూరోపియన్లు మొదట ఈ ప్రాంతానికే వలస వచ్చారు కాబట్టి అమెరికాలోని ఇంగ్లీషు ఫ్రెంచిలలో ఈ భాషలనించి వచ్చిన మాటలు చాలా ఉన్నాయి.

మసాచుసెట్స్ భాషలో అమెరికాలో మొదటగా బైబిల్ భాషాంతరీకరించబడి ముద్రించబడింది. పొహటాన్, డెలవార్, మొహెగన్, పెనొబ్‌స్కాట్, పసబక్వొడీ, క్రీ (హడ్సన్ బే), మోనొమిని (ఉత్తర మిచిగన్), ఒజిబ్వా (గ్రేట్ లేక్స్ ఉత్తరతీరం) అనే నాలుగు భాషలపై బ్లూమ్‌ఫీల్డ్ తులనాత్మక పరిశోధన చేసి, ఈ పద్ధతులు అన్ని భాషలకీ వర్తిస్తాయని నిరూపించారు. పొతవతోమీ, ఇలినోన్, షావ్‌నే, బ్లాక్‌ఫుట్, అరపహో, చెయెన్నే భాషలుకూడా ఈ కుటుంబానికి దూరసంబంధం గల శాఖలు.

ఆగ్నేయ అమెరికాలో అనేక భాషలు ఉన్నాయి. వీటిలో ముఖ్యమైనదీ పెద్దదీ అయినది నట్‌షెజ్ – మస్కొజియన్ కుటుంబం, క్రీక్, అలబామా (కొయాసటీ మాండలికం), చకసావ్, చోక్టావ్, నట్‌షెజ్.

ఇరాక్వియన్ కుటుంబంలో చెరోకీ, టుస్కరోరా, హురోన్, వరీ, ఒకేటా, మొహాక్, సెనెకా, కొనెస్తోగా (లేక సున్‌క్విహన్నా) ఉన్నాయి. ఇవి కెరోలినా తీరంలోనూ, సెంట్ లారెన్స్‌వాలీ మధ్యా తూర్పు పెన్‌సిల్వేనియాలలో ఉన్నాయి.

సివుయన్ కుటుంబం గ్రేట్‌ప్లైన్స్ ఉత్తర ప్రాంతంలో ఉండేవి. ఇందులో భాషలు బిలొక్సి, ఒపో, టుటెలో, కటబ్వా, డకోటా, మండన్, విన్నెబగో, చివేర్ డెగిహో, హిదాత్సా, క్రోవ్, సివుయన్ ప్రాంతానికి దక్షిణాన కడోయను కుటుంబం ఉంది. కగో, విచిటా, పన్నే ఇందులో ముఖ్యం. దక్షిణాన మిసిసిపీ వాలీలో ట్యూనికన్ కుటుంబంలో ట్యూనికా, అటకపా, చిటిమచా ఉన్నాయి. టెనెసేలో వేరు ఏ భాషకీ చెందని యుచీ ఉండేది.

నట్‌షజ్–మస్కొజియన్, ఇరాక్వియన్, కడోవన్, ట్యూనికన్,

యుచియన్, హోకన్ కుటుంబాలు పరస్పర సంబంధంకలవి అని కొందరి మతం, కాని దీనికి ఉపపత్తి చాలరు. ఈ పెద్ద కుటుంబాన్ని హోకన్–సివుయన్ వారు వ్యవహరిస్తారు.

ఆర్కిటిక్ తీరంలో లబ్రడోర్, గ్రీన్‌లాండ్‌ల నించి అలాస్కాదాకా ఎస్కిమో–అలెయుట్ భాషలు ఉన్నాయి. అలాస్కాలో ఇనుపిక్‌పీ, అలాస్కా గ్రీన్‌లాండులలో యుపిక్‌పీ కలిపి ఎస్కిమో అని సాధారణంగా వ్యవహరిస్తారు.

పసిఫిక్ వాయవ్యదిశలో కొలంబియా నది వాలీ నుండీ అలాస్కావరకు అసంఖ్యాకమైన భాషలు ఉన్నాయి. వీటిలో చాలా భాషలు మూడు కుటుంబాలకి చెందుతాయి. సేలిషన్ : బెల్లకోలా, కేర్‌దలేన్ చెహాలియు, కలిస్పెల్; వకషన్; నూట్కా క్వకియుట్ల్; బెల్లా బెల్లా; చిమకువన్ : చికుం, క్విలెయుట్. ఈ మూడు కుటుంబాలక పరస్పర సంబంధం ఉన్నట్టుంది కాబట్టి వీటిని కలిపి మోసన్ అని వ్యవహరిస్తారు. హైదా, ట్లింగిత్, త్సింషియన్, కుటెనై ఏ కుటుంబాలకి చెందినవో ఇంకా నిర్ధారితం కాలేదు కుటెనై, మూనస్ అల్గాంక్వియన్‌కి చెందినవని నిరూపితమయింది.

ఆరెగాన్, కేలిఫోర్నియాలలో 25 భాషా కుటుంబాలు ఉన్నాయని ఒక అంచనా. ఈ కుటుంబాలని పెనూటియన్, హొకన్ అనే రెండు బృహత్కుటుంబాలుగా సంగ్రహించడానికి అవకాశం ఉంది, ఈ కింది భాషలు ఒక్కొక్కటి ఒక్కొక్క కుటుంబానికి ప్రతీకలు; వింటున్, మైదు, మివొక్, కోట్టనోన్, యొకూత్స్, చినూక్ కలపుయా, టకేల్మా, సియుస్లావ్, కూస్. ఇవి పెనూటియన్ సముదాయంలోవి. హొకన్ సముదాయంలో వాటికి ఉదాహరణలు కరోక్, షాష్టా, చిమరికో, యానా, పామో, ఎసెలెన్, సలినన్, చుమాష్, యమన్ సముదాయం, త్లపనెక్ (సుబ్తియాబా రీవి మాండలికం), తెక్విస్ – త్లటెక్, జికాక్, ఈశాన్య మెక్సికోలో కొమెక్రుడో వంటి భాషలు (హొకన్‌కి చెందినవే కావచ్చు. తూర్పు టెక్సాస్‌లో టొంకవా గూడా హొకన్‌కి చెందినవే కావచ్చు. తూర్పు టెక్సాస్‌లో టొంకవా కూడా హొకన్‌కి దూరసంబంధం కలది కావచ్చు. హొకన్–సివుయన్ అనేది ఒక బృహత్కుటుంబమనే వాదం కూడా ఉంది.

మధ్య అమెరికాలో ముఖ్యమైనది **మాయన్ కుటుంబం :** యుకటెక్. మాం కెక్చి, క్విచ్, కక్చికెల్, పొకొమాం, పొకొంచి, ఇక్సిల్, జెల్టల్, చొల్, చొంటల్, చొర్తి ఇత్యాదులు. మధ్య మెక్సికోలో గల్ఫ్ తీరంలోని హుయాక్స్ టెక్ కూడా మాయన్ భాషే.

దక్షిణ మెక్సికోలో అనేక భాషల మీద పరిశోధన ఇటీవలే ఆరంభమయింది కాబట్టి వివరాలు ఎక్కువ తెలియవు. మిక్స్, జోక్, పొపొలుకా ఒక సముదాయం. టొటొనాక్. టెపెహువా మరొక సముదాయం. ఇవీ, హువావ్ మాయన్‌కి సంబంధించినవని ఒక వాదం; ఈ బృహత్కుటుంబం పేరు మేక్రో — మాయన్.

జపొటెక్, చటినో మరొక సముదాయం. మిక్స్‌టెక్, క్వికటెక్. ట్రిక్ అముస్గో మరొక సముదాయం. మజటెక్, చోచో, ఇక్స్‌కటెక్, పొపొలకా (ఆఫ్ ప్యుయెబ్లొ) మరొకసముదాయం. ఒటొమి, మజహువా, పమె మరొకసముదాయం. వీటికి పశ్చిమాన తరాస్కన్ ఉంది. ఇందులో చాలా సముదాయాలకి పరస్పర సంబంధం ఉందని కొందరి వాదం. దీనిని **ఒటో మంగెయన్ కుటుంబం** అని వారు అంటారు.

మధ్య అమెరికాలో ముఖ్యమైన భాష నహువాట్ల్. యూరోపియన్లు రాక ముందే ఈ భాషకి లిపి ఉంది. ఈ భాషనించి అనేక పదాలు ఇంగ్లీషులోకి వచ్చాయి. ఇది **ఉటో—అజ్‌టెకన్** కుటుంబానికి చెంది దక్షిణాన ఉన్నది. ఈ కుంటుంబం కేంద్రం గ్రేట్ బేసిన్, కొలరాడో వాలీలలో ఉంది. ఇక్కడి భాషలు షొషొన్, పయుటే, తుబతులబ్, హోపీ అరిజోనా, మెక్సికోలలో పపగో, పిమా, తరహుమరా, కోరా, హ్యుచొల్, గ్రేట్ ప్లైన్స్ దక్షిణాన కొమాంచ్ ఈ కుటుంబానికి చెందినవి.

ఉటో అజ్‌టెకన్ భాషల మధ్య **అతబాస్కన్** కుటుంబం ఉంది. దీని అసలు కేంద్రం వాయువ్య కెనడా, మధ్య అలాస్కాలలో ఉంది. అక్కడి వాటిలో ముఖ్యమైనవి సర్సి, చిపెవ్యన్. వీటితో దూరసంబంధం గల హైదా, ట్లింగిట్‌లు కూడా అక్కడ ఉన్నాయి. ఇవన్నీ న—దెనే అనే బృహత్కుటుంబం

కిందికి వస్తాయి. దక్షిణ అతబాస్కన్ భాషలు సంచారక జాతుల వ్యవహారంలో ఉన్నాయి. వీటిని అపాచెయన్ శాఖ అంటారు. వీటిలో ముఖ్యమైనది నవహొ. ఉత్తర కేలిఫోర్నియా అతబాస్కన్ శాఖలో హూపా, చస్టా కోస్టా, మట్టోల్ ఉన్నాయి.

సంచారక జాతులు వ్యవహరించే అపాచెయన్ భాషలు ఉన్నచోటే స్థిర నివాసులు కూడా ఉన్నారు. వీరికి ఒక్కొక్క ఊరికి ఒక్కొక్క భాష ఉంది. ఇవి **తనోయన్, కెరెసన్, జుని** అని మూడు కుటుంబాల కిందికి వస్తాయి. ఇందులో మొదటిది నిశ్చయంగానూ, మూడోది అనిశ్చితంగానూ ఉటో-అజ్టెకన్ కుటుంబంతో సంబంధం కలవి కాబట్టి **అజ్టెక్-తనోయన్** అనే బృహత్కుటుంబాన్ని గుర్తించవలసిన అవసరం ఉంది.

చిన్ని భాషాకుటుంబాలని కొన్నిటికి కలపడానికి ప్రయత్నాలు జరుగుతున్నట్లే ప్రసిద్ధమైన పెద్ద భాషా కుటుంబాలు కొన్నిటి మధ్య పరస్పర సంబంధం నిరూపించడానికి పరిశోధనలు జరుగుతున్నాయి. ఇటువంటి సంబంధాలు చరిత్రలో అనేక సహస్రాబ్దాల వెనుక ఉన్న పరిస్థితికి సంబంధించినవి కాబట్టి వీటిని నిరూపించడానికి నిశిత పరిశ్రమ అవసరం. పైగా ప్రతి రెండు మానవ భాషలకీ ఎంతో కొంత సంబంధం ఉందని ఊహించడం తేలిక, నిరూపించడం కష్టం. కాబట్టి ఇంత వరకూ ఆ విషయంలో వచ్చిన సూచనలు పరిశోధన ప్రారంభ దశలో ఉన్నట్టు గ్రహించాలి. వీటిని సిద్ధాంతాలని నమ్మడం గాని, పూర్తిగా నిరాకరించడం గాని సాధ్యంకాదు. ఉదాహరణకి, ఫిన్నో-ఉగ్రిక్, అల్టైక్ కుటుంబాలు పరస్పర సంబంధం కలవి అనీ, ఇవి యూరలక్ట-అల్టైక్ బృహత్కుటుంబమనీ ఒక వాదం; ఇందులో కొందరు జపనీస్, కొరియన్, ఎస్కిమోలని కూడా చేర్చారు. ఇదికాక ఫిన్నో-ఉగ్రిక్ ఇండో యూరపియన్‌కి సంబంధం కలది అని కొందరూ, ద్రవిడియన్‌కి సంబంధం కలది అని మరికొందరూ, ఆస్ట్రో-ఏషియాటిక్‌కి సంబంధం కలదని మరికొందరూ వాదిస్తున్నారు. ఇండోయూరపియన్‌కీ సెమిటిక్‌కీ సంబంధం ఉందని కొందరి మతం. ద్రావిడ భాషలకీ ఫిన్నో-ఉగ్రియన్ కుటుంబంలో భాషలకీ పరస్పర సంబంధం ఉందని నిరూపించడానికి కాల్డ్‌వెల్ మొదలైన పండితులు కొందరు ప్రయత్నించారు; ఈ సిద్ధాంతం సహేతుకమైనదే అని బరో వంటి ఇటీవలి కాలపు పండితులు కూడా అంగీకరించారు. ఇటువంటి సంబంధాలని నిరూపించడానికి ఇతోఽధిక పరిశ్రమ అవసరమవుతుంది.

# 11. తులన పద్ధతి

## 11.1. భాషల జన్మసంబంధం

10వ అధ్యాయంలో ప్రపంచంలోని భాషలనన్నింటికీ కొన్ని కుటుంబాలుగా విభజించవచ్చునని తెలుసుకొన్నాం. ఈ విభజనకు ఆధారం జన్మసంబంధం, రెండు లేక అంతకన్న ఎక్కువ భాషలలో పదాలు, ప్రత్యయాలు, నిర్మాణంలో సాదృశ్యముంటే ఆ భాషలకు జన్మసంబంధం ఉందని, అంటే, ఆ భాషలు ఇప్పటికి ఆధారాలు మిగలని ఒక మూలభాషనించి పుట్టేయని నిర్ణయించవచ్చు. ఇలా శాస్త్రజ్ఞులు మొట్టమొదట సంస్కృతం, గ్రీక్, లాటిన్ మొదలైన ఇండో-యూరోపియన్ భాషాకుటుంబానికి చెందిన భాషలని జన్మసంబంధం గలవిగా గుర్తించారు. సర్ విలియం జోన్స్‌తో ప్రారంభించి ఇండో-యూరోపియన్ భాషల తులనాత్మక చరిత్ర పరిశోధన ఎలా వృద్ధి చెందిందో 17వ అధ్యాయంలో విపులంగా చర్చించబడుతుంది. ఇండో-యూరోపియన్ భాషలపై జరిగిన పరిశోధనలో ఉపయుక్తమైన పద్ధతులు ఇతర భాషాకుటుంబ పరిశోధనలలో కూడా ఉపయుక్తమవుతున్నాయి. కొన్ని భాషలు ఒక కుటుంబానికి చెందినవి అని నిర్ణయించాక, ఆ భాషల పరస్పర సంబంధం ఎటువంటిది; ఒక్కొక్క భాషలో వర్ణాలలోనూ ఏర్పడిన మార్పు లేమిటి; మూలభాషని పునర్నిర్మించే పద్ధతులేమిటి; అనేది పరిశోధనీయాంశాలు.

జన్మసంబంధ నిర్ణయానికి పదాలలో సాదృశ్యం కన్న ప్రత్యయాలలో సాదృశ్యం ముఖ్యం. పదాలలో సాదృశ్యం జన్మసంబంధం వల్లేకాక యాదృచ్ఛికత, ధ్వన్యనుకరణ, ఎరువు తెచ్చుకోవడం వంటి కారణాల వల్ల కూడా ఉండవచ్చు. ప్రత్యయాలు ఎరువు తెచ్చుకోవడం చాలా అరుదు కాబట్టి ప్రత్యయాలు, పదనిర్మాణంలో సాదృశ్యం జన్మసంబంధాన్ని పట్టి చూపుతుంది. తమిళం వ-ంతు, కన్నడం బ-ందు 'వచ్చి' అనే పదాలలో భూత ప్రత్యయ సాదృశ్యం ఈ భాషల జన్మ సంబంధానికి సాక్ష్యం. సంస్కృతంలో భూతకాలిక (లిట్) రూపాలలో ద్విరుక్తి ఉంటుంది; పపాత 'పడ్డాడు', దదర్శ 'చూశాడు',

ఇటువంటి ప్రక్రియ గ్రీకు భూతకాలిక క్రియలలో కూడా ఉంది. ఇది ఈ భాషల జన్మసంబంధానికి కాదనలేని నిదర్శనం. పదాలలో కూడా శరీరావయావ వాచి పదాలు, పదిలోపు సంఖ్యావాచకాలు,, సర్వనామాలు, దైనందిన వ్యవహారంలో అవసరమయ్యే పదాలు మొదలైన మౌలిక పదజాలం (Basic vocabulary) లో ఎరువు తెచ్చుకోవడం అరుదు కాబట్టి వీటిలో సాదృశ్యం కూడా జన్మ సంబంధ నిర్ణయానికి ఉపయోగిస్తుంది. పదాలలో భాషల మధ్య వర్ణాలలో భేదం ధ్వని సూత్రానుసారంగా ఉన్నట్లు కనపడితే అవి ఉన్న భాషలు సోదర భాషలని చెప్పవచ్చు.

ప్రపంచంలో సోదర భాషలు లేనివి లేక ఇంతవరకూ సోదర భాషలు ఉన్నట్లుగా తెలియనివి అయిన భాషలు కొన్ని ఉన్నాయి. ఫ్రాన్సు, స్పెయిన్ లలో వ్యవహరించబడే బాస్క్, కాశ్మీర్ లో బురుషస్కి, జపనీస్ వీటికి ఉదాహరణలు, వీటికి తులన పద్ధతి ఉపయోగించదు కాబట్టి వీటి చరిత్ర తెలుసుకొందుకు చారిత్రకాధారాలు, అంతరంగిక పునర్నిర్మాణం ( చూ. 12వ అధ్యాయం) అనేవే శరణ్యాలు.

## 11.2. సజాతి శబ్దాలు

సోదర భాషలలో వర్ణర్థ సాదృశ్యంగల శబ్దాలని సజాతి శబ్దాలు అంటారని ఇంతకు ముందు (10.3) చూశాం , సజాతి శబ్దాలని ఏరి కూర్చడం తులన పద్ధతిలో మొదటి మెట్టు. అయితే ఇది అనుకొన్నంత సులభంకాదు. వర్ణాలలో కొంచెం మాత్రమే భేదం ఉండి అర్థం ఒకటిగా ఉన్న పదాలని ఒక సముదాయంగా కూర్చడం కష్టం కాదు. ఉదాహరణలు :

| I. తమిళం | మలయాళం | కన్నడం | తెలుగు |
|---|---|---|---|
| కణ్ | కణ్ | కణ్, కణ్ణు | కన్ను |
| పాంపు | పాంపు | హావు | పాము |
| ఇరంటు | రంటు | ఎరడు | రెండు |
| మూను | మూన్ను | మూఱు | మూఁడు |

| | | | |
|---|---|---|---|
| నాల్,నాన్గు | నాల్ | నాలు | నాలుగు |
| ఐంతు | అంచు | అయ్‌దు | అయిదు, ఏను |
| ఆఱు | ఆఱు | ఆఱు | ఆఱు |
| ఏళ్ | ఏళు | ఏళు | ఏడు |
| ఎట్టు | ఎట్టు | ఎంటు | ఎనిమిది |
| మరం | మరం | మర | మ్రాను |

| I. సంస్కృతం | గ్రీక్ | లాటిన్ | గాథిక్ | |
|---|---|---|---|---|
| ద్వౌ | dyoo | duo | twa | 'రెండు' |
| త్రయః | tries | tres | ries | 'మూడు' |
| చత్వారః | tettares | quatturor | fidwor | 'నాలుగు |
| పంచ | pente | quinque | fimf | 'అయిదు |
| షట్ | hex | sex | saihs | 'ఆరు' |
| సప్త | hepta | septem | sibun | 'ఏడు |
| అష్టౌ | octoo | octo | ahtau | 'ఎనిమిది' |
| నవ | ennea | novem | niun | తొమ్మిది' |
| దశ | deca | decem | taihun | 'పది' |

ఇటువంటి సజాతి శబ్దాలు సేకరించి వీటి ఆధారంతో ధ్వనిసూత్రాలు phonetic laws) ఏర్పరుస్తారు. పై ఉదాహరణల ఆధారంగా త.మ.క. ణ్ = తె.న్ (దీనినే వేరేవిధంగామూల ద్రావిడంలో *ణ్ తెలుగులో న్ గామారుతుంది అని చెప్పవచ్చు), త.మ. ంప్ = కవ్ = తె.మ్ (మూలద్రావిడం*ంప్ కన్నడంలో వ్ గానూ, తెలుగులో మ్ గానూ మారుతుంది) ఇత్యాది ధ్వని సూత్రాలు రచించవచ్చు.

వర్ణాలలోనూ అర్థంలోనూ భేదం ఎక్కువ ఉన్నప్పుడు సజాతి శబ్ద నిర్ణయం కష్ట తరమవుతుంది. ఉదాహరణకు బ్రాహుయీ ఖఫ్ 'చెవి' తమిళం, మలయాళం, తెలుగు చెవి, కన్నడం కివిలకు సంబంధించినదే. కానీ యీ బ్రాహుయీ మాటకూ మిగిలిన భాషలలో మాటలకూ వర్ణసాదృశ్యం ఎక్కువ లేదు. కాని ఇంకా అనేక సజాతి శబ్దాలు కూర్చాక బ్రాహుయీ ఖ (కంఠ్యోష్మ స్పృష్టం) మూలద్రావిడ*క కారం నించీ, బ్రాహుయీ అకారం మూలద్రావిడ*ఎ కారం నించీ, బ్రాహుయీ ఫ (కాఫీలో 'ఫ') మూలద్రావిడ *వ కారంనించీ వచ్చాయని స్పష్టమవుతుంది. కాబట్టి పై శబ్దాల జన్మసంబంధం ధ్రువపడుతుంది. ధ్వని సూత్రానుసారంగా ఒక పదంలో అన్ని ధ్వనుల పరిణామాన్నీ వివరించ గలిగితే వర్ణసాదృశ్యం తక్కువగా ఉన్నా అటువంటి పదాలని సజాతి శబ్దాలుగా స్వీకరించవచ్చు. పరిశోధన ప్రాథమిక దశలో సజాతి శబ్దంగా స్వీకరించబడినది ధ్వని సూత్ర రచన తరువాత సజాతి శబ్దంకాదని ఒక్కొక్కప్పుడు నిరూపితమవు తుంది. బ్రాహుయీ దూయీ 'నాలుక' అనే పదం తమిళం నా, నాక్కు, తె. నాలుక అనేవాటికి సంబంధించిందని మొదట్లో పండితులు భ్రమించారు. దీనికి కారణం ఇతర భాషలలో పదాదినకారం ఉన్నపదాలు కొన్నిటిలో బ్రాహుయీలో దకారం ఉండడం (బ్రా. దీర్= మిగిలిన భాషలు నీర్ 'నీళ్ళు'). కాని తరువాత పరిశోధనల వల్ల అగ్రాచ్చులముందే మూలభాషలో *న కారం బ్రాహుయీలో దకారంగా మారుతుందని తేలింది. కాబట్టి బ్రా. దూయీ మిగిలిన భాషలలో పదాలకి సజాతి శబ్దంకాదని తెలిసింది. ఇటువంటి వాటిని వ్యుత్పత్త్యాభాసం (False etymology) అంటారు. సజాతి శబ్దాలలో వర్ణభేదానికి అవకాశం ఉన్నట్లే అర్థభేదానికి కూడా అవకాశం ఉంది. సంస్కృతంలో విద్–ధాతువుకి 'తెలుసు కోవడం' అని అర్థం. లాటిన్‌లో దీని సజాతి శబ్దమైన vidకి 'చూడడం' అని అర్థం. కాని 'చూడడం' 'తెలుసుకోవడం' అనే అర్థాలు పరస్పర సంబంధం కలవి, కాబట్టి సోదర భాషలలో ఇటువంటి అర్థభేదం ఉండడం సహజం. తెలుగు నెలకి సజాతి శబ్దమైన తమిళం నిలా అర్థం 'చంద్రుడు'. చంద్రుడికీ నెలలకీ సంబంధం ఉంది కాబట్టి ఇటువంటి అర్థభేదం గురించి పట్టించుకోనక్కర లేదు. అదే విధంగా ఒక భాషలో 'సూర్యుడు/' అనే అర్థం ఇచ్చేపదం సజాతి శబ్దం మరొక భాషలో 'రోజు, పగలు కాలం' మొదలైన సన్నిహితార్థాలు సూచించేదిగా

ఉండవచ్చు. ఇటువంటి అర్థభేదాలకి మరికొన్ని ఉదాహరణలు; బ్రాహుయీ ఖల్ – 'కొట్టు, పేల్చు' : తమిళం కొల్ 'చంపు'; కూడుఖ్ తుంగుల్, మాల్తో తుంగ్లె 'కల' : త. తూంకు 'నిద్రపోవు, వేళ్ళాడు', తె. తూగు.

పై చర్చవలన సజాతి శబ్దసంగ్రహణమూ, ధ్వని సూత్ర రచనా పరస్పరాశ్రయాలనీ, ఒకదానివల్ల మరొకటి సమగ్రమవుతుందనీ తేలుతుంది. కొన్ని స్పష్టమైన సజాతి శబ్దాలు ఆధారంగా ధ్వని సూత్రాలు రాసుకొన్నాక మళ్ళీ భాషల నిఘంటువులని పరిశీలిస్తే అంత స్పష్ట సంబంధం లేకపోయినా సంబంధం ఉన్నట్లు నిరూపించతగ్గ సజాతి శబ్దాలు కొన్ని దొరకవచ్చు. ధ్వని సూత్రం ఏర్పడ్డాక అంతకు ముందు సజాతిశబ్ద నిర్ణయంలో ఉన్న సందిగ్ధత తొలగి పోతుంది. ఉదాహరణకు గోండీ ఏర్ 'నీళ్లు' మొదట్లో 'నీర్'కు సంబంధించినది అనుకొన్నారు. కానీ గోండీలో నకారలోపమూ *ఈ ఏగా మారడమూ మరి ఎక్కడా (అంటే ఇతర సజాతి శబ్దాలలో) లేవు. అందువల్ల ఈ పదం తమిళం యాఱు, తెలుగు ఏఱులకి, సంబంధించినదనీ ఇందులో అర్థవ్యాకోచం ఏర్పడిందనీ తరవాత గ్రహించారు (గోండీలో *యా > ఏ, *ఱ > ర మార్పులు సార్వత్రికమైనవే). సజాతిశబ్ద సముదాయాలని నిశితంగా పరిశీలించడం వల్ల ధ్వని సూత్రాలని నిర్దుష్టంగానూ అపవాదరహితంగా చెయ్యవచ్చు.

ద్రావిడ భాషలలో సజాతిశబ్ద సముదాయాలు టి.బరో, ఎం. బి. ఎమెనో కూర్చిన A Dravidian etymological dictionary (1961 Supplement 1968; revised edition 1984) లో ఇవ్వబడ్డాయి. సంస్కృతం మొదలైన ఇండో ఆర్యన్ భాషలలో సజాతి శబ్దాలు ఆర్.ఎల్. టర్నర్ కూర్చిన A Comparative dictionay of Indo-Aryan languages (1962-6) లో ఇవ్వబడ్డాయి.

## 11.3. వర్ణపునర్నిర్మాణం

కొన్ని భాషలు ఒక భాషాకుటుంబానికి చెందినవని స్పష్టంగా తెలిసేక వాటి మూల భాషలో పదాలు, వ్యాకరణంఎలా ఉండేవో తెలుసుకోవాలనే కుతూహలం పండితులకి సహజంగా కలిగింది. ఈ ఆశయాన్ని సాధించడానికే తులన పద్ధతి (Comparative Method) తీర్చి దిద్దబడింది. సజాతి శబ్దాల్లో ఉన్న ధ్వనుల

పరస్పర సంబంధం ఆధారంగా మూలభాషలో వర్ణాలు పునర్నిర్మించబడతాయి. వర్ణపునర్నిర్మాణం (Phonological Reconstruction) చేసిన తరవాత దాని ఆధారంతో ప్రత్యయ పునర్నిర్మాణం (Morphological Reconstruction) చెయ్యవచ్చు. వర్ణ పునర్నిర్మాణం వలన మూలభాషా రూపాలు తెలియడమే కాకుండా ఒక్కొక్క మూలాభాషాధ్వని దుహితృభాషలలో ఎలా పరిణమించిందో తెలిపే ధ్వని సూత్రాలు కూడా రచించవచ్చు. కింది ఉదాహరణలు చూడండి

| | కన్నడం | తెలుగు |
|---|---|---|
| (i) | కడల్ | కడలి 'సముద్రం' |
| | కాల్ | కాలు |
| | కుప్పె | కూడు |
| | కూళ్ | కూడు |
| | కొనె | కొన |
| | కోఱు, కోరు | కోరు |
| (ii) | కిఱు | చిఱు |
| | కీవు | చీము |
| | కెడు | చెడు |
| | కేసు, కేసవె | చేమ |

వర్ణపునర్నిర్మాణంలో సంబంధి ధ్వనుల సముదాయ పట్టికలు మొదట తయారు చేసుకోవాలి. పై కన్నడం, తెలుగు సజాతి శబ్దాలలో పదాది వర్ణాలకి ఇటువంటి రెండు పట్టికలు తయారు చెయ్యవచ్చు. అవి –

(i) క.క్ = తె. క్

(ii) క.క్ = తె. చ్

ఇప్పుడు ఒక్కొక్క సముదాయంలో ఉన్న వర్ణాలకి మూలవర్ణాన్ని పునర్నిర్మించాలి. మొదటి సముదాయంలో రెండు భాషలలోనూ కకారమే ఉంది కాబట్టి మూలభాషలో కూడా కకారమే ఉండేదని ఊహించవచ్చు. కాబట్టి మొదటి సముదాయంలో మూలవర్ణం *క్ అని పునర్నిర్మించవచ్చు. (చారిత్రక వ్యాకరణంలో నక్షత్రపు గుర్తు తులన పద్ధతిద్వారా పునర్నిర్మించాలా? లేక తెలుగు చకారాన్ని పునర్నిర్మించాలా ? అనే సమస్య వస్తుంది. ఇందులో కూడా *కకారాన్నే పునర్నిర్మిస్తే మొదటి సముదాయానికీ రెండో దానికీ పరిసరాలలో భేదం ఉండాలి. పరిసరాలలో భేదం లేకపోతే రెండు సముదాయాలకి రెండు భిన్న వర్ణాలు పునర్నిర్మించాలి. ఒక మూల వర్ణం ఒక భాషలో భిన్న పరిసరాలలో భిన్న వర్ణాలుగా మారుతుంది కాని, ఒకే పరిసరంలో ఒక వర్ణంగానే ఉంటుందనేది చారిత్రక భాషాశాస్త్రంలో ప్రాథమిక సూత్రం. పై ఉదాహరణలలో రెండో సముదాయం అగ్రాచ్చుల (ఇ, ఈ, ఎ, ఏ) ముందూ, మొదటి సముదాయం అనగ్రాచ్చుల (అ, ఆ, ఉ, ఊ, ఒ, ఓ) ముందూ ఉన్నాయి కాబట్టి రెండిటికీ *క్ ఏ మూలవర్ణమని చెప్పవచ్చు. అంటే, మూలభాషా *కకారం కన్నడంలో మార్పు లేకుండా కకారంగా అన్ని పరిసరాలలో మిగిలిందనీ, తెలుగులో మాత్రం అగ్రాచ్చుల ముందు చకారంగా మారిందనీ చెప్పవచ్చు. ఈ పరిణామాన్నే ఇలా సూచించవచ్చు. (మూల భాషావర్ణం దుహితృభాషలో పొందిన పరిణత రూపాలని ప్రతి రూపాలు (Reflexes) అంటారు.




తెలుగులో ఈ పరిణామాన్ని కింద ఇచ్చిన విధంగా కూడా చూపవచ్చు.

*క్ → తె.చ్/ --అగ్రాచ్చు.

(→ పరిణామాన్ని / పరిసరాన్ని సూచిస్తాయి; – అగ్రాచ్చు అని రాస్తే అగ్రాచ్చు ముందు అనీ, అగ్రాచ్చు – అని రాస్తే అగ్రాచ్చు తరవాత అనీ, అచ్చు

– అచ్చు అవి రాస్తే అచ్చుల మధ్య అవి అర్థం.).

ఒక భాషలో ఒక వర్ణానికి రెండో భాషలో ఒకటికన్న ఎక్కువ వర్ణాలు తుల్యంగా ఉంటే రెండో భాషలోని ఆ వర్ణాలు భిన్న పరిసరాలలో ఉన్నవయితే ఆ రెండూ (లేక అంతకన్న ఎక్కువ) మూల భాషలో ఒక వర్ణం నించి వచ్చినవనే చెప్పాలి. పరిసర భేదం లేకపోతే వాటికి మూలభాషలో భిన్న వర్ణాలని పునర్నిర్మించాలి. ఈ విషయం క్రింది ఉదాహరణలు చూస్తే స్పష్టమవుతుంది.

| సంస్కృతం | గ్రీక్ | లాటిన్ | మూలభాషలో ఆద్యచ్చు |
|---|---|---|---|
| అజతి | agei | agit | * అ |
| అస్తి | esti | est | * ఎ |
| అస్థి | osteon | os | * ఒ. |

సంస్కృత భాషకు ఉన్న ప్రాధాన్యంవల్ల మొదట్లో సంస్కృత వర్ణాలో అసలు మార్పులే లేవని పండితులు భ్రమించారు. పై ఉదాహరణలు అన్నిటిలోనూ సంస్కృతంలో అకారమే ఉంది కాబట్టి * అకారమేమూల వర్ణమనీ, అది కొన్ని పదాలలో గ్రీక్ లాటిన్ (ఇంకా అనేక భాషలలో) ఎ, ఒలుగా మారిందని అనుకొన్నారు. కాని *అకారం ఎగా ఏ పరిసరాలలో మారుతుంది, ఒగా ఏ పరిసరాలలో మారుతుంది, ఏ పరిసరాలలో అకారంగానే మిగులుతుంది అని నిర్ణయించడం ఎవరికీ సాధ్యం కాలేదు. అందువల్ల తరావాత కాలంలోపండితులు *ఎ, *ఒ అని మూల భాషకి పునర్నిర్మించి, అవి సంస్కృతంలో అకారంతో కలిసిపోయాయని నిర్ణయించారు.

ఒక వర్ణం మరొక వర్ణంగా మారడానికి సాధారణంగా పరిసర వర్ణాల ప్రభావం ఉంటుంది. సాధారణంగా కకారం అగ్రాచ్చుల ముందు చాలా భాషలలో చకారంగా మారుతుంది కాని, చకారం అగ్రాచ్చులముందు కకారంగా మారడం అసంభవం. అదే విధంగా అచ్చుల మధ్య శ్వాసవర్ణాలు నాదవర్ణాలుగా మారతాయి (అచ్చులు నాదాలు కాబట్టి). సకారం హకారంగా మారడం చాలా భాషలలో ఉంది కాని, హకారం సకారంగా మారదు. ధ్వని పరిణామంలో ఏది సహజం, సాధారణం, ఏది అసహజం, అసాధారణం అనే విషయం కూడా ఏ సోదరభాష పరిణామానికి

లోనయింది అనే విషయాన్ని నిర్ణయించడానికి తోడ్పడుతుంది. మూడు లేక అంతకన్న సోదర భాషలు ఉన్నప్పుడు ఎక్కువ భాషలలో ఏ ధ్వని ఉంటే అది మూల భాషాధ్వని అనీ, ఒకటి, రెండు భాషలలో ఉన్నవి పరిణామం చెందినదనీ అనవచ్చునని అంటారు కాని ఇది ఎల్లప్పుడూ నిజంకాదు. ద్రావిడ భాషలలో తమిళం, మలయాళం, తొద అనే మూడు భాషలలోనే పదాదినాదస్పర్శాలు లేవు. మిగిలిన 18-20 భాషలలోనూ పదాది నాదస్పర్శాలు ఉన్నాయి. అయినా మూలద్రావిడంలో పదాదినాదస్పర్శాలు లేవనీ, శ్వాసస్పర్శాలే నాదాలుగా అధిక సంఖ్యాక భాషలో అర్వాచీనకాలంలో మారేయనీ పండితులు నిర్ణయించారు..

పై కన్నడం, తెలుగు ఉదాహరణలలో చకారం కన్నడంలో కకారంగా మారిందని ఎందుకు అనకూడదు అనే విషయాన్ని మరికొంత పరిశీలిద్దాం. కన్నడ కకారానికి తుల్యంగా తెలుగు చకారం అగ్రాచ్చులముందు మాత్రమే కనపడడం దీనికొక కారణమని ఇంతకు ముందు చూశాం. అంతేకాక, చకారం అగ్రాచ్చుల ముందు కకారంగా మారడం ధ్వని శాస్త్రరీత్యా అసహజమని కూడా గమనించాలి. ఇంకా సజాతి పదాలు పరిశీలిస్తే అగ్రాచ్చుల ముందూ ఇతరాచ్చుల ముందూ రెండు భాషలలోనూ చకారమే ఉన్న ఉదాహరణలు దొరుకుతాయి.

| కన్నడం | తెలుగు |
|---|---|
| చళి, సళి | చలి |
| చిఱతె | చిఱుత |
| సుత్తు | చుట్టు |
| చెండు | చెండు |

పై ఉదాహరణలలో మూలభాషావర్ణం నిర్వివాదంగా * చకారమే (ద్రావిడ భాషలలో చ,స కు ఆదిలో భేదంలేదు) కాబట్టి కన్నడంలో కొన్ని పదాలలో * చకారం చకారంగా ఉంటుందని మరికొన్నిటిలో పరిసర భేదం లేకుండా కకారంగా మారుతుందనీ చెప్పడం అసమంజసం.

కొన్ని మూలభాషావర్ణాలు కొన్ని భాషలలో లోపించడం కూడా ఉంది. తెలుగులోనూ దక్షిణ ద్రావిడ భాషలలోనూ పదాది చకారం లోపించింది; ఈ చకారం మధ్యోత్తర ద్రావిడ భాషలలో మిగిలి ఉంది అని ఉప్పు (పర్జీ చుప్), ఇచ్చు (పర్జీ చీ-), ఆకలి (పర్జీ చాకొల్) మొదలైన ఉదాహరణలు నిరూపిస్తాయి. పర్జీభాషలో అజాదులైన పదాలు కూడ కొన్ని ఉన్నాయి కాబట్టి వీటిలో చకారం కొత్తగా వచ్చి చేరిందని చెప్పడం అసమంజసం.

పై చర్చలో పదాదిధ్వనులే పునర్నిర్మాణానికి ఉదాహరణలుగా ఇవ్వబడ్డాయి పై పద్ధతులు ఉపయోగించి మొత్తం పదంలో ఉన్న అన్ని వర్ణాల్నీ పునర్నిర్మాణం చెయ్యవచ్చు. అలాగే రెండు కన్న ఎక్కువ సోదర భాషలు ఉన్నప్పుడు కూడాపై పద్ధతులే ఉపయోగిస్తాయి.

పునర్నిర్మాణ పద్ధతి భాషాచరిత్రావగాహనకు ముఖ్యపద్ధతే అయినా దీనికి కూడా కొంత పరిధి ఉంది. మూలభాషావర్ణాలు మనం కొంత వరకు పునర్మించ గలం వాని వాటికి గల సవర్ణ భేదాలు లేక వాటి అసలు ఉచ్చారణ స్వరూపం మొదలైన విషయాలు మనకు తెలియవు. పూర్తి పదం పునర్నిర్మించడం కూడా అంతటా సాధ్యంకాదు. సాధారణంగా ద్రావిడ భాషలలో పదాలలో మొదటి అక్షరంలో వర్ణాలు మాత్రమే పునర్నిర్మించడం సాధ్యం. మిగిలిన అక్షరాలలో ధ్వనులు ఒక్కొక్క విధంగా ఉన్నప్పుడు వాటి పునర్నిర్మాణం సాధ్యం కాదు. ఇటువంటివి తరావాత కాలంలో ఒక్కొక్క విధంగా చేరి ఉండాలి. దుహితృ భాషలలో ఆధారాలు. ఎంత సమగ్రంగా ఉంటే మూలభాషా స్థితి మనకు అంత స్పష్టంగా తెలుస్తుంది. కాబట్టిపునర్నిర్మితరూపాలు దుహితృభాషలలో పరిణామాలు సూచించడానికి వీలైన సూత్రాల వంటివి. పరిశోధన విస్తరిల్లిన కొద్దీ పునర్ని ర్మితమైన మూలాభాషా స్వభావం మారిపోతూ ఉంటుంది. ఇటువంటి కొన్ని అసమగ్రతలు ఉన్నా చారిత్రకాధారాలు లేని మూల భాషలను గూర్చి తెలుసుకొందుకు తులనపద్ధతి ముఖ్య సాధనం. చారిత్రకాధారాలలో దొరికే ప్రాచీన రూపాలకన్న ప్రాచీనతరమైన రూపాలని తులనపద్ధతి వలన తెలుసుకో వచ్చునని పై చర్చ నిరూపిస్తుంది. ఇప్పటి తెలుగు 'పాత'కు ప్రాచీన రూపం 'ప్రాఁత' అని ప్రాచీన గ్రంథాల వల్ల తెలుస్తుంది. 'ప్రాఁత'కు ఇంకా ప్రాచీన తర

రూపం 'ఏశంత్(య్)' అనీ, ముఖ్యంగా ఇందులో రేఫ*ళ నించి వచ్చిందనీ తులన పద్ధతివలనే తెలుస్తుంది. చారిత్రకాధారాలు మూలరూపం ఇప్పటి రూపంగా మారడంలో గల పరిణామక్రమాన్ని స్పష్టంగా వివరించేందుకు తోడ్పడతాయి.

మూలభాషా వర్ణపునర్నిర్మాణం సరియైన పద్ధతిలో సాగించడానికి భాషల సహజస్వభావం, ఆ భాషలో ఇతర పరిణామాలు కూడా సహాయపడతాయి. ఈ భాషలలో వర్ణాలు సాధారణంగా నిర్మాణ క్రమం (Pattern) లో ఉంటాయి మూలభాషకు * క, * చ, * ట, * త, * ప అనే అయిదు శ్వాసస్పర్శాలని నిస్సందేహంగా పునర్నిర్మించాం అనుకోండి. నాదస్పర్శాలలో * గ, * జ, * డల పున ర్నిర్మాణానికి కూడా సాక్ష్యం బలంగా ఉండి *ద, *బల విషయంలో కొంత సందిగ్ధతకు అవకాశం ఉంది అనుకోండి. ఇప్పుడు నిర్మాణక్రమం ఆధారంగా మూల భాషలో * ద, * బ లుకూడా ఉండి ఉండాలని మనం నిర్ణయించవచ్చు. ఇంతకు ముందు మూల ఇండోయూరోపియన్ లో *ఎ, * ఒలని పునర్నిర్మించ డానికి పండితులు మొదట్లో సందేహించాలనీ, కాని తరవాత వాటినికూడ పున ర్నిర్మించారనీ మనం చూశాం. సంస్కృతంలో చ (లాటిన్ que) వంటి కొన్ని మాటలలో లాటిన్ Pattern కు బదులు తాలవ్య చకారం ఉంది. అయితే తాలవ్యీకరణం ఎ కారం ముందు జరుగుతుంది కాని అకారం ముందు జరగదు. కాబట్టి ఈ మాటలలో పూర్వకాలంలో సంస్కృతంలో అకారం కాక ఎకరమే ఉండిఉండాలని ఊహించవచ్చు. దీనివల్ల మూలభాషలో *ఎకారం ఉండేదని, అది సంస్కృతంలో అకారంగా మారిందనీ చెప్పడానికి మరొక ఉపపత్తి దొరికింది.

## 11.4. ప్రత్యయ పునర్నిర్మాణం

మూలభాషలో వర్ణాలని పునర్నిర్మించాక దాని ఆధారంతో ప్రత్యయాలని కూడా పునర్నిర్మించవచ్చు. అయితే ప్రత్యయాలు ధ్వని పరిణామంవల్ల మారడమే కాక సామ్యంవల్ల కూడా ప్రాచీన భాషలో ప్రత్యయంబదులు ఆధునిక భాషలో మరొక కొత్త ప్రత్యయం రావచ్చు. ఉదాహరణకు ప్రాచీనాంధ్రంలో అల్లుండ్రు, అల్లురు లో–రు బహువచన ప్రత్యయ్యంబదులు ఇప్పటి తెలుగులో అల్లుళ్లు అని–లు ప్రత్యయం ఉంది; అలాగే కొడండ్రు/కోడళ్లు; చేయు–ట/ చెయ్యడం (చెయ్య్–అడం) మొ. అందువల్ల ప్రత్యయ పునర్నిర్మాణం కష్టసాధ్య

మైనవి. అయినా చాలా భాషలలో ఒక ప్రత్యయరూపం తుల్యంగా ఉన్నప్పుడు దాన్ని పునర్నిర్మించడం సులభం. ద్రావిడ భాషలలో చతుర్థీ విభక్తి ప్రత్యయం తమిళంలో-క్కు (అవఋక్కు, అవనక్కు 'వాడికి'), కన్నడంలో క్కె -ఇగె (మర-క్కె చెట్టుకి', అవనిగె 'వాడికి') తెలుగులో -కు, -కి (వా-కు, వాని-కి). పై ఆధారాలతో మూలద్రావిడానికి *-క్కు పునర్నిర్మించవచ్చు. సప్తమీ విభక్తి ప్రత్యయం విషయంలో ఇటువంటి పూర్ణసాదృశ్యం లేదు. ఈ ప్రత్యయం తమిళంలో-ఇల్, -ఉళ్ (ఊరిల్, ఊరుళ్; 'ఊళ్లో'), కన్నడంలో ప్రాచీన భాషలో - ఒళ్ (మరదొళ్ 'చెట్టులో'), ఆధునిక భాషం - అల్లి (మరదల్లి', తుళులో - లోన్ (ఇంటిలోన్) మూలద్రావిడంలో * -ఇల్, *-ఉళ్ రెండూ పునర్నిర్మించాలి (త. -ఉళ్, క.-ఒళ్, తె. -లోన్ >*-ఉళ్), పైగా ఇల్ 'ఇల్లు, ఉళ్ 'లోపలి భాగం' అని ప్రత్యేక ప్రయోగార్హత ఉంది. కాబట్టి ఇవి మొదట్లో ప్రత్యేక పదాలని చెప్పవచ్చు, ఈ ఉదాహరణవల్ల మూలభాషలో మొదట్లో ప్రత్యేక పదాలని చెప్పవచ్చు, ఉదాహరణవల్ల మూలభాషలో కూడా ఇప్పటి భాషలలోలాగే మాండలిక భేదాలు ఉండేవి అని గ్రహించవచ్చు.

వాక్యనిర్మాణం సులభంగా పరభాషా ప్రభావానికి లోనవుతుంది కాబట్టి దీన్ని మూలభాషలో సమగ్రంగా పునర్నిర్మించడం సాధ్యంకాదు. అయితే చాలా దుహితృభాషలలో తుల్యంగా ఉన్న విశిష్ట నిర్మాణాలు మూలభాషకు పునర్నిర్మించవచ్చు. ద్రావిడ భాషలలో చాలావాటిలో క్రియారహిత వాక్యాలు ఉన్నాయి. కాబట్టి ఈ నిర్మాణం మూలభాషకు చెందినదే అని ఊహించవచ్చు. త. అవన్ నల్లవన్; క. అవను ఒళ్ళెయదను; తె. వాడు మంచివాడు. మొత్తానికి వర్ణనిర్మాణ పునర్నిర్మాణమంత సమగ్రంగా ప్రత్యయ నిర్మాణ వాక్యనిర్మాణ పునర్నిర్మాణం చెయ్యలేమని గ్రహించాలి.

లాటిన్ నించి పుట్టిన ఫ్రెంచి, స్పానిష్, ఇటాలియన్ ఇత్యాది భాషలను తులనపద్ధతి ద్వారా పోల్చిచూసి పునర్నిర్మించిన రూపాలు లాటిన్ రూపాలకు చాలా సన్నిహితంగా ఉన్నాయి. దాని వల్ల తులనపద్ధతి శాస్త్రీయమైనదేనని ధ్రువపడింది.

## 11.5 మూల భాషా సంస్కృతిపై ఊహాలు

మూలభాషలో పదాలని పునర్నిర్మించడం వల్ల ఆ భాష మాట్లాడినవారి సంస్కృతిని గురించీ వారు వాడిన వస్తువులు, ఆయుధాలు మొదలైన వాటిని గురించీ కొంత ఊహించవచ్చు. అయితే ఇటువంటి ఊహలలో తగు జాగ్రత్త అవసరమని బ్లూమ్‌ఫీల్డ్ అల్గాంక్వియన్ భాషాకుటుంబంపై చేసిన పరిశోధన తెలుపుతుంది. ఈ భాషలలో 'తుపాకి', 'విస్కీ' అనేవాటిని సూచించే సమస్త పదాలు ఉన్నాయి; వీటిని సిద్ధాంతరీత్యా మూలభాషకు పునర్నిర్మించవచ్చు, అయితే ఈ వస్తువులు యూరోపియన్లు అమెరికాకు వెళ్లక పూర్వం అక్కడ లేవు. వీటిని మూలభాషా వ్యవహర్తలు ఉపయోగించి ఉండడం అసంభవం. కాబట్టి ఇవి వారికి తెలుసు అని చెప్పడం తప్పు అవుతుంది. ఆ కాలపువారు ఈ పదాలని మరొక ఆయుధానికీ, విస్కీవంటి మరొక పానీయానికీ వాడుతూ ఉంటే వారన్నమాట. ఈ కొత్త వస్తువులు వచ్చాక ఈ పదాలలో అర్థవిపరిణామం ఏర్పడింది.

ఇండో యూరోపియన్ భాషలలో ఒకటినించి పదివరకూ సంఖ్యావాచకాలని సులభంగా పునర్నిర్మించవచ్చు. పదకొండునించి వంద వరకూ సంఖ్యాపదాల సమస్త రూపాలు కూడా అధమం వాటిలో ఉన్న నిర్మాణ క్రమాన్నైనా పునర్నించవచ్చు. దీనివల్ల ఈ సంఖ్యలు మూలభాషావ్యవహర్తలకి తెలుసునని చెప్పవచ్చు. వీటిలో ఒకటి నించి నాలుగుదాకా ఉన్న పదాలు విశేషణాలుగా భిన్న లింగాలలో వాడబడతాయి. (సం. ఏకః ఏకా, ఏకం. మొ॥). కాబట్టి అతి ప్రాచీన దశలో వారికి నాలుగు అంకెలే తెలుసుననీ వారు బొటనవేలుతో మిగిలిన నాలుగు వేళ్లనీ తాకుతూ లెక్కించేవారనీ ఊహించవచ్చు. సంబంధి వాచక పదాలలో స్త్రీకి భర్తవైపు చుట్టాలని సూచించే పదాలు పునర్నిర్మించవచ్చు. కాని భర్తకు భార్యవైపు చుట్టాలని సూచించే పదాలు ఉన్నా అవి సజాతి పదాలు కావు కాబట్టి అవి మూల ఇండో యూరోపియన్‌కు చెందవు. దీనివల్ల స్త్రీ వివాహానంతరం భర్త కుటుంబంతో కలిసి ఉండేదనీ, భర్తకు భార్యవైపు వారితో ఎక్కువ సంబంధం ఉండేదికాదనీ విదితమవుతుంది.

మూల ఇండో యూరోపియన్ వ్యవహర్తలు మొదట్లో నివసించిన ప్రాంతం ఏది అనే విషయంపై చాలా పరిశోధన జరిగింది. 'మంచు' అనే అర్థమిచ్చే పదం మూల భాషకు పునర్నిర్మించవచ్చు కాబట్టి ఉష్ణప్రాంతమైన భారతదేశం వారి

ప్రాచీన స్థానం కాదని చెప్పవచ్చు. దీనికతోడు భారతదేశంలో ఉండే ఏనుగు, పులి, కోతి వంటి జంతువులకీ వివిధ వృక్షాలకీ మూల ఇండో యూరోపియన్ మాటలు లేవు. ఇరాక్, మధ్యధరా ప్రాంతాలలో జంతువులు, వృక్షాలకు కూడా మూలభాషాపదాలు లేవు. ఇక మిగిలిన ప్రాంతం యూరోప్ మధ్య భాగం, అంటే నల్ల సముద్రానికి ఉత్తరంగానూ బాల్టిక్ సముద్రానికి దక్షిణంగానూ ఉన్న ప్రాంతాలు. ఇక్కడే ఇండో యూరోపియన్ భాషల మూడు శాఖలు జర్మానిక్, బాల్టిక్, స్లావిక్ అనేవి ఉన్నాయి. దీనికి విరుద్ధంగా ఇటలీ, గ్రీక్, భారతదేశాలలో ఒక్కొక్క శాఖే ఉంది. దీనివల్ల మూల ఇండో యూరోపియన్ వ్యవహర్తల ప్రాచీన స్థానం యూరోప్ మధ్య భాగం అనీ అక్కడనించి వారు తెగలుతెగలుగా ఇతర ప్రాంతాలకు వలస వెళ్లారనీ పాల్ థీమే (Paul Thieme) నిర్ణయించారు. మూలభాషాపదాలున్న beech వృక్షమూ, salmon అనే చేపా ఈ ప్రాంతంలోనే ఉంటాయి.

ద్రావిడ భాషలలో గోధుమని సూచించే దేశ్యపదంలేదు. కాబట్టి మూల ద్రావిడ భాషావ్యవహర్తలకు గోధుమ ఆహారం కాదని తెలుస్తుంది; వరి, జొన్నలకి చాలా ద్రావిడ భాషలలో పదాలు ఉన్నాయి. విల్లు, అమ్ము (బాణం)లను సూచించే పదాలు ఇంచుమించు అన్ని ద్రావిడ భాషలలోనూ సజాతి పదాలుగా ఉన్నాయి కాబట్టి మూలభాషావ్యవహర్తలు వీటిని ఉపయోగించేవారని చెప్పవచ్చు. *నూఱ్ *100' మూలద్రావిడంలో ఉంది కాని 1000ని సూచించే దేశ్యపదం తెలుగులోనే ఉంది. 1000ని సూచించే త.మ. ఆయిరం, కం. సావిర సంస్కృతం సహస్ర - నించి వచ్చినవి. కాబట్టి మూలభాషావ్యవహర్తలకు వెయ్యిగాని అంతకుపై అంకెలుగాని లెక్కపెట్టడం తెలియదని మనం ఊహించవచ్చు.

## 11.6. ఉపకుటుంబాలు

ఒక భాషాకుటుంబంలో రెండు లేక అంతకన్న ఎక్కువ సోదర భాషలున్నప్పుడు మొదట్లో అవిభక్తంగా ఉన్న మూలభాష మాండలిక భేదాలు తలెత్తడం వల్ల కొన్ని శాఖలుగా చీలి మళ్ళీ ఒక్కొక్క శాఖ ఇప్పుడు ఉన్న భాషలుగా విడిపోతుంది. ఒక భాషాకుటుంబంలోని ఇటువంటి శాఖలనే ఉప కుటుంబాలు (Subgroups) అంటారు. 10వ అధ్యాయంలో మూల ఇండో-యూరోపియన్ భాష, ఇండో-ఇరానియన్, ఆర్మేనియన్, గ్రీక్, అల్బేనియన్,

ఇటాలిక్, కెల్టిక్ జర్మానిక్, బాల్టో-స్లావిక్, అనటోలియన్, టొకేరియన్ అనే పది ఉపకుటుంబాల మూల భాషలుగా మొదట చీలిందనీ, వీటిలో ఒక్కొక్క ఉపకుటుంబం మూలభాష కాలక్రమేణ మనకు తెలిసిన భాషలుగా చీలేయని చూశాం. అలాగే మూలద్రావిడభాష మొదట మూలదక్షిణద్రావిడ భాష, మూల మూలమధ్య ద్రావిడ భాష, మూలోత్తర ద్రావిడభాష అనే మూడుగా చీలింది. మూల దక్షిణ ద్రావిడం నించి తమిళం, మలయాళం మొదలైన 7 భాషలూ, మూల మధ్య ద్రావిడంనించి తెలుగు, గోండీ మొదలైన 11 (పదకొండు) భాషలూ, మూలోత్తర ద్రావిడంనించి కూడుఖ్ మాల్తో, బ్రాహూయీ అనే 3 భాషలూ ఉద్భవించాయి. ఒక్కొక్క ఉపకుటుంబ మూలభాషకీ అనే 3 భాషలూ ఉద్భవించాయి. ఒక్కొక్క ఉపకుటుంబ మూలభాషకీ ఇప్పటి భాషలకీ మధ్యకూడా రెండు లేక అతకన్న ఎక్కువ శాఖాభేదాలు ఉండవచ్చు. మూలభాష ఇప్పటి వివిధ భాషలుగా మారడంలోని ఈ క్రమ పరిణామాన్ని కుటుంబ వృక్షపటం (Family Tree Diagram) ద్వారా సూచిస్తారు (ద్రావిడ భాషా కుటుంబవృక్షపటం నా 'ద్రావిడ భాషలు' అనే గ్రంథం చివర చూడవచ్చు).

సోదర భాషలను కొన్ని ఉపకుటుంబాలుగా విభజించడంలో ఉపయోగించే పద్ధతులేమిటి అనే విషయం పరిశీలిద్దాం. కొన్ని సోదర భాషలలో మిగిలిన సోదర భాషలలో లేని పరిణామాలు కొన్ని సదృశంగా ఉంటాయి. ఉదాహరణకు జర్మానిక్ భాషలైన ఇంగ్లీషు, జర్మన్ మొదలైన భాషలలో మూల ఇండో యూరోపియన్ భ, ధ, ఘలు బ, ద, గలు గానూ *బ,*ద,*గలు ప, త, కలు గానూ, *ప,*త,*కలు ఫ, థ, ఖలు గానూ కొన్ని పరిసరాలలో మారతాయి (చూ. 17.4). ఈ మార్పు అన్ని జర్మానిక్ భాషలలోనూ ఉంది కాబట్టి ఇది వీటి మూలభాషాకాలం లోనే, అంటే ఇవన్నీ అవిభక్తంగా ఉన్నప్పుడే జరిగి ఉండాలి ఇటువంటి సదృశపరిణామాలు (Shared Innovations) అవి ఉన్న భాషలు ఒకానొక కాలంలో ఒకే భాషగాఉండి ఉండాలని సూచిస్తాయి కాబట్టే ఇవి ఉప కుటుంబ నిర్ణయానికి తోడ్పడతాయి.

అయితే కొన్ని అది సాధారణధ్వని పరిణామాలు (కకారం అగ్రాచ్చుల ముందు చకారంగా మారడం, వకారం బకారంగా మారడం మొ.) జన్మ సంబంధం ఉన్న భాషలలోనూ లేని భాషలోనూ లేని భాషలలోనూ తుల్యంగా కనిపిస్తాయి.

తాలవ్యీకరణం సంస్కృతంలో, తమిళంలో, తెలుగులో ఉంది : స బగా మారడం హిందీలోనూ కన్నడంలోనూ ఉంది. స హగా మారడం గ్రీక్ లోనూ గోండీలోనూ ఉంది. కాబట్టి ఇటువంటి మార్పులు ఉపకుటుంబ నిర్ణయానికి పనికిరావు. అదే విధంగా కొన్ని సోదర భాషలలో ఒక ధ్వని మార్పు లేకుండా ఉంటే ఈ మార్పు లేకపోవడం ఆధారంగా ఆ సోదర భాషలన్నీ ఒక ఉపకుటుంబానికి చెందుతాయని చెప్పలేం. ఎందువల్లనంటే, పిత్రార్జితం అందరి కొడుకులకీ, మనుమళ్లకీ చెందినట్టే మూలభాషాధ్వనులు యథాతథంగా నిలుపుకోవడానికి దుహితృ భాషలన్నిటికీ అధికారం ఉంది. దుహితృభాషలలో కొన్ని సదృశపరిణామం పొందినప్పుడే వాటిని ఒక ఉపకుటుంబంగా విభజించడానికి అవకాశం ఉంటుంది.

కొన్ని ధ్వని పరిణామాలు భౌగోళికంగా సన్నిహితమైన భాషలలో ఒక దానినించి మరొకదానికి సంక్రమిస్తాయి. ఇలా సంక్రమించడం ఇటీవల కాలంలో జరిగి ఉండవచ్చు. కాబట్టి ఇవి ఆ భాషల సన్నిహిత సంబంధాన్ని నిర్ణయించ డానికి ఉపయోగించవు. కన్నడం, తుళు, కొడగు అనే మూడు భాషలలోనూ ప్రాచీన వకారం బకారంగా మారుతుంది. కాని ఈ మూడు భాషలకూ మరి ఏ విషయంలోనూ సన్నిహిత సంబంధంలేదు. కాబట్టి ఈ ధ్వని పరిణామం కన్నడంలో మొదలైన తుళు, కొడగులకు వ్యాపించిందని నిర్ణయించారు (తుళు, కొడగులు కర్ణాటక రాష్ట్రంలోనే ఉన్నాయి. కాబట్టి అవి కన్నడ ప్రభావానికి లోనయ్యాయి).

ఒక సదృశధ్వని పరిణామం ప్రత్యేకంగానూ, విలక్షణంగానూ ఉంటే అది ఉన్న భాషలన్నిటిలోనూ యాదృచ్ఛికంగా జరిగి ఉండదు. కాబట్టి అటువంటిది ఆ భాషల సన్నిహిత జన్మసంబంధాన్ని సూచిస్తుంది. ఉదాహరణకు గోండీ, కొండ, కూయి. కువి, పెంగొ, మండలలో 'ట అగా మారుతుంది (తె. నాడు: కొండ నాఉ) ఇటువంటి ప్రత్యేక పరిణామం ఇతర ద్రావిడ భాషలలో లేదుకాబట్టి ఇది ఈ భాషలని ఒక ఉపకుటుంబంగా ఏర్పరచడానికి ఆధారమవుతుందిది. పెంగొ, మండ కూయి, కువిలలో ఉ జగా మారడంకూడా ఇటువంటి విలక్షణ పరిణామమే.

ఉపకుటుంబ నిర్ణయానికి ధ్వనిపరిణామమే కాక పదనిర్మాణ, వాక్య నిర్మాణాలలో పరిణామాలు, అర్థపరిణామాలూ కూడా ఉపయోగిస్తాయి. కోట, తోద భాషలలో మూలభాషలో భూతకాలిక రూపాలు వర్తమానార్థంలో వాడబడతాయి; వీటిలో భూతకాలాన్ని వ్యక్తం చెయ్యడానికి పాత భూతకాలిక ప్రత్యయం తరవాత మరొక కొత్త భూతకాలిక ప్రత్యయం చేర్చాలి. ఈ మార్పులు కోత, తొదలు ఒక ఉపకుటుంబమని సూచిస్తాయి. చాలా మధ్య ద్రావిడ భాషలలో మన్ - 'ఉండు' (తె. మను, మన్ను) అనే క్రియ సహాయక క్రియగా ఉపయోగపడుతోంది. ఇటువంటి ఉపయోగం మిగిలిన భాషలలో లేదు కాబట్టి ఇది మధ్య ద్రావిడ భాషలలో ఒక సదృశపరిణామమన్న మాట. గోండీ - కువి ఉపకుటుంబంలో *ఏఱ్ (మూ.ద్రా.* యాఱ్ నించి వచ్చింది) అనే మాట అర్థం 'నీరు' ఇతర భాషలలో ఈ పదం అర్థం 'నది' కాబట్టి ఈ అర్థపరిణామం గోండీ - కువి ఉపకుటుంబ నిర్ణయానికి ఒక సాక్ష్యం.

ఉపకుటుంబ నిర్ణయం ఏ ఒక్క పరిణామం ఆధారంగానూ చెయ్యలేం। భాషానిర్మాణం అన్ని భాగాలోనూ ఆధారాలు దొరికినప్పుడు ఉపకుటుంబ నిర్ణయం సులభమవుతుంది. నిజంగా భాషల మధ్య సన్నిహిత సబంధం ఉన్నప్పుడు సాదృశ్యాలు అనేక వ్యాకరణ భాగాలలో దొరుకుతాయి. అనేక సాదృశ్యాలు భాషల మధ్య ఉన్నప్పుడే వీటి సంఖ్యాబలం ఉపకుటుంబ నిర్ణయాన్ని ధ్రువపరుస్తుంది. ఒక్కొక్కప్పుడు ఒక అర్థాన్ని సూచించే పదాలు వేరువేరు ఉపకుటుంబ భాషలో వేరువేరుగా ఉండి, ఆ భాష సన్నిహిత అర్థంలో *వాళయ్ అనే మూలరూపం నించి వచ్చిన పదాలు ఉన్నాయి : త. వాళై, మ. వాళ, క. బాళె; 'బియ్యం' అనే అర్థంలో *అరి(కి) నించి వచ్చిన పదాలు ఉన్నాయి. త. అరిచి, మ. అరి, క. అక్కి తెలుగులో వీటికి సబంధించిన పదాలు లేవు కాబట్టి తెలుగు దక్షిణ ద్రావిడోపకుటుంబానికి చెందదు అని ఈ ఆధారం వల్ల స్పష్టమవుతుంది.

# 12. అంతరంగిక పునర్నిర్మాణం

## 12.1. అంతరంగిక పునర్నిర్మాణ పద్ధతి

అంతరంగిక పునర్నిర్మాణం (Internal reconstruction) ఒక నిర్ణీత కాలానికి చెందిన భాషలోని (ఉదా. ఇప్పటి తెలుగు, లేక నన్నయకాలపు తెలుగు) సంధి పరివర్తనాలు ఆధారంగా ఆ భాష ప్రాచీన స్థితిని పునర్నిర్మించడానికి ఉపయోగిస్తుంది. కాబట్టి ఇది సోదర భాషలున్న భాషల విషయంలో తులన పద్ధతికి సాహాయ్యకారిగా ఉంటుంది; సోదర భాషలు లేని బాస్క్ వంటి ఒంటరి భాష విషయంలో వాటి ప్రాచీన చరిత్ర తెలుసుకొందుకు ఇదే ఏకైకాధారం. చారిత్రకాధారాలున్న భాషలకు కూడా లిఖితాధారాల వల్ల తెలిసే భాషా స్థితికి అంతరంగిక పునర్నిర్మాణ పద్ధతి ఉపయోగించి అంతకంటె ముందు కాలంలో ఆ భాష ఎలా ఉండేదో తెలుసుకోవచ్చు కాబట్టి అటువంటి భాషలకు కూడా దీని వల్ల ప్రయోజనం ఉంది.

ఒక భాషలో ఒక పదంగాని అర్థకంగాని ఒక పరిసరంలో ఒక వర్ణంతోనూ మరొక పరిసరంలో మరొక వర్ణంతోనూ ఉన్నప్పుడు అటువంటి పదాన్ని (లేక అర్థకాన్ని) ఈ మార్పులేని మరొక పదం లేక అర్థకంతో పోల్చి చూసినప్పుడు మొదటిదాంట్లోని రెండు వర్ణాలలో ఏది ప్రాచీనమో మనకు తెలుస్తుంది. ఉదాహరణకి సంస్కృతంలో 'మరుత్' 'శరత్' 'సమిత్' అనే మూడు శబ్దాలు తీసుకొందాం. వీటికి ప్రథమైకవచనంలోనూ, హల్లులముందూ (మరుద్భిః, శరద్భిః, సమిద్భిః) భేదం లేకపోయినా అజాదిప్రత్యయాల ముందు భేదంవుంది.

| | | | |
|---|---|---|---|
| (ప్ర.ఏ.) మరుత్ | (ప్ర.ద్వి.) మరుతౌ | (ప్ర.బ.) మరుతః | (తృ.ఏ.) మరుతా |
| శరత్ | శరదౌ | శరదః | శరదా |
| సమిత్ | సమిధౌ | సమిధః | సమిధా |

పై ఉదాహరణలలో మరుత్ శబ్దంలో తకారం ప్రథమైకవచనంలోనూ

(అంటే పదాంతంలో), అచ్చు ముందూ కూడా త కారంగానే ఉంది (ఇది మరుద్భిఃలో భ నాదహల్లు కాబట్టి దానిముందు దకారంగా మారింది. ఈ మార్పు ప్రస్తుత చర్చకు అనవసరం). కాబట్టి ఇందులో తకారమే ప్రాచీనమని చెప్పవచ్చు. ఇక అచ్చుల ముందు శరద్-, సమిధ్- అనే రూపాలలో ద, ధలకు బదులు ప్రథమైకవచనంలో తకారం ఉంది. వీటిలో తకారమే ప్రాచీనమా లేక ద, ధలు ప్రాచీనాలా అనేది సమస్య. తకారం ప్రాచీనమనుకొని ఇది అచ్చులముందు కొన్ని శబ్దాలలో మారకుండా ఉంటుంది, మరికొన్నిటిలో ద కారమవుతుంది, మరికొన్నిటిలో ధ కారంగా మారుతుంది అని అంటే ఇది ధ్వనిపరిణామ స్వభావానికి విరుద్ధం. ఒక భాషలో ఒక ప్రాచీన ధ్వని అన్ని మాటలలోనూ ఒక రకంగానూ మారుతుంది; భిన్నవర్ణ పరిసరాలలో భిన్న ధ్వనులుగామారుతుంది అనేది సార్వకాలిక సత్యం. పై ప్రతిపాదన దీనికి విరుద్ధం కాబట్టి శరత్-/శరద్-లో ద కారం ప్రాచీనమనీ సమిత్-/సమిధ్-లో ధ కారం ప్రాచీనమనీ చెప్పడం సమంజసం. పదాంతంలో మహాప్రాణాలు అల్పప్రాణాలుగానూ నాదస్పర్శాలు శ్వాసస్పర్శాలు గానూ మారడం సంస్కృతంలో నియమం కాబట్టి పై వాటిలో ద, ధలు పదాంతంలో తగా మారేయని నిర్ణయించవచ్చు. ఇది అంతరంగిక పునర్నిర్మాణానికి ఒక చక్కని ఉదాహరణ అంతరంగిక పునర్నిర్మాణంలో పైన మనం చేసినట్లు కొంత సాదృశ్యం ఉన్న శబ్దాలని లేక శబ్దజాతులని పరస్పరం పోల్చి చూడడం ముఖ్యం. సంస్కృత వైయాకకరణలు శరత్ శబ్దం దకారం టమనీ, సమిత్ శబ్దం ధకారాంతమనీ, దృక్ శబ్దం శకారంతమనీ, వాక్ శబ్దం చకారాంత మనీ పరిగణించడంలో అంతరంగిక పునర్నిర్మాణ పద్ధతి ఇమిడి ఉంది. దీనివల్ల ఈ పద్ధతి భాషాచరిత్రను తెలుసుకునేందుకే కాక వర్ణనాత్మక వ్యాకరణ రచన శాస్త్రీయంగా చెయ్యడానికి కూడా ఉపయోగిస్తుందనేది స్పష్టం.

పై చర్చలో పదాంతం అనేది నిషేధ స్థానం; అచ్చుల ముందు అనేది నిషేధ రహిత స్థానం. ఎందువల్లనంటే అచ్చు ముదు త,ద,ధలు మూడూ రావచ్చు; కాని పదాంతంలో అల్పప్రాణశ్వాసమే ఉండాలి, మిగిలిన స్పర్శాలు ఉండకూడదు అనే నిషేధం ఉంది. అందువల్లనే ఇక్కడ ద,ధలు తగామారేయి. నిషేధ రహిత స్థానంలో ఉన్న ధ్వనులే పరివర్తన ఉన్నపుడు ప్రాచీనాలు గ్రహించాలి అనే నియమం పైచర్చ వల్ల స్పష్టమవుతుంది.

అంతరంగిక పునర్నిర్మాణం ఆధునిక కాలంలో మొదట ఉపయోగించిన వారు పంధొమ్మిదో శతాబ్దికి చెందిన హెర్మన్ గ్రాస్మన్ (Hermann Grossman). ఈయన సంస్కృతంలోనూ గ్రీక్‌లోనూ (ముఖ్యంగా క్రియలలో) రెండు మహాప్రాణాలు పక్కపక్కన ఉండవు అనే విషయం కనుగొన్నారు. దీనినే తరవాతవారు గ్రాస్మన్ సూత్రం (Grassman's Law) అన్నారు. సంస్కృతంలో భూతానద్యతన పరోక్షార్థక (లిట్) క్రియలలో ధాతువు ప్రథమ హల్లూ, అచ్చే ద్విరుక్తమైతాయి : పపాత 'పడ్డాడు', దదర్శ 'చూశాడు' మొ. కాని మహాప్రాణమున్న ధాతువులకు ద్విరుక్తి వచ్చినపుడు మహాప్రాణం స్థానంలో దానికి సంబంధించిన అల్పప్రాణం ఉంటుంది; భూ నించి బభూవ 'అయింది', ధృనించి దధార 'ధరించాడు' మొ. ద్విరుక్తి నియమాన్ని అనుసరించి వీటి పూర్వరూపాలు *భభూవ, *ధధార అయి ఉండాలనీ, రెండు మహాప్రాణాలలో మొదటివాని మహాప్రాణత్వం లోపించిందనీ మనం ఊహించవచ్చు. గ్రీక్‌లో కూడా ఇటువంటి మార్పు జరిగింది : సంస్కృతం బభూవకి తుల్యంగా గ్రీక్‌లో pephuka (< phephuka) ఉంది. ఇటువంటిచోట్ల ఆదిలో మహాప్రాణం ఉండేదనీ మూలరూపంలో వరసగా రెండు మహాప్రాణాలుంటే వాటిలో మొదటిది సంస్కృతం గ్రీకులలో మహాప్రాణత్వాన్ని కోల్పోతుందనీ గ్రాస్మన్ చెప్పిన వివరణ ఇతర ఇండో యూరోపియన్ భాషల వర్ణ పరిణామాలతో సమన్వయించింది.

తులన పద్ధతి వలన పునర్నిర్మించిన మూలభాషకు కూడా అంతరంగిక పునర్నిర్మాణాన్ని ఉపయోగించి ఇంకా ప్రాచీనమైన మూలరూపాలని కనుక్కోవచ్చునని దె సస్యూర్ 1879లో నిరూపించారు. మూల ఇండో యూరోపియన్‌లో చాలా ధాతువులు హల్లు ఎకారం హల్లు అనే రూపంలో ఉంటాయి. : భేర్ – 'భరించు', గ్వెమ్–'వచ్చు, పోవు', సెద్ – 'కూర్చుండు'. కాని అగ్ – 'తీసుకొని వెళ్లు', స్తా – 'నిలబడు, ఎస్–ఉండు' వంటి కొన్ని ధాతువులు ఒక హల్లు అలేకుండానే ఉన్నాయి. సస్యూర్ వీటిలో కూడా హల్లు ఉండి ఉంటాయనీ, అవి లోపించి ఉంటాయనీ, వాటి ప్రభావం వల్లనే ఎకారం అవర్ణంగా మారిందనీ ఊహించారు. ఈ ఊహ మొదట్లో ఎవరూ నమ్మలేరు. కాని హిట్టైట్ భాష వెలుగులోకి వచ్చాక ఈ ఊహ నిజమనీ, వీటిలో ప్రాచీన కాలంలో ఉండిన కంఠ మూలీయ హల్లులు (Laryngeals) లోపించాయనీ స్పష్టమైంది.

ఈ పద్ధతికి తెలుగులోకి కొన్ని ఉదాహరణలు. మొదట 'చేంతాడు' అనే పదం చూద్దాం. ఇది చేదకి కట్టేతాడు కాబట్టి చేద+తాడు > చేత్తాడు (ఊదుతాడు > ఊత్తాడు, రొద + తగ్గింది > రొత్తగ్గింది లాగ) కావలసి ఉండగా చేంతాడులో అనునాసికం ఎలా వచ్చింది) అనీ, చేంద+తాడు ⟶ చేంతాడు అయిందనీ ఊహించవచ్చు. అనునాసికం వ్యస్త రూపంలో లోపించినా సమస్త రూపంలో మిగిలిన ఉందన్న మాట. మరొక ఉదాహరణ, గోదావరి మాండలికాలలో గేది, పింది, బింది, గొర్రి అనే ఇకారాంత పదాలు ఉన్నాయి (ఇతర మాండలికాల్లో ఇకారం బదలు వీటిలో ఎకారం ఉంటుంది) సాధారణంగా బహువచన ప్రత్యయం ముందు ఇకారం ఉకారంగా మారుతుంది ( సూది + లు ⟶ సూదులు, పంది+లు⟶ పందులు) కాని పై పదాలలో ఇకారమే నిలిచి ఉంటుంది; గేదిలు, పిందిలు, బిందిలు, గొర్రిలు, దీనివల్ల ఈ పదాలలో ఇకారం చారిత్రకంగా సూదివంటి వాటిలో ఇకారం కన్న భిన్నమైనదని గోదావరి మాండలిక భాష ఆధారంతోనే నిర్ణయించవచ్చు. అంతరంగిక పునర్నిర్మాణ పద్ధతి వల్ల ఈ మాండలికాలలో రెండు రకాలు ఇకారాలు ( $ఇ_1$, $ఇ_2$) ఉన్నాయని చెప్పవచ్చు. ఈ మాండలికాలకి వర్ణనాత్మక వ్యాకరణం రాస్తే బహువచన రూపాలు సాధించడానికి కూడా అంతరంగిక పునర్నిర్మాణానికి ప్రాధాన్యం ఉందని దీనివల్ల స్పష్టమవుతుంది. అయితే అంతరంగిక పునర్నిర్మాణం రెండు రకాల ఇకారాలు ఉన్నాయని మాత్రమే గుర్తించగలదు కాని వాటి ప్రాచీన రూపాలు ఏమిటో సరిగా చెప్పలేదు. ఇతర మాండలికాలు, ప్రాచీన భాష ఆధారంగా సూది, పందిలలో ఇకారం ప్రాచీన ఇకారం నుంచి వచ్చిందనీ గేది, పింది వంటి వాటిలో ఇకారం ఎకారం (>*ఇయ;) ఉ. పిందియ, గొరియ మొ. నుంచి వచ్చిందనీ తెలుసుకోగలం.

ఈ పద్ధతి వలన ఇప్పటి భాషలో లోపించిన వర్ణాలని కూడా పునర్నిర్మించడానికి అవకాశం ఉంది. ప్రాచీనాంధ్రంలో విధ్యేకవచనంలో రా/రమ్ము, చెప్పు/చెప్పుములోలాగ ము వర్ణం వైభాషికంగా ఉండేది. ఇప్పటి భాషలో వీటిలో ము లేదు గాని, విధి రూపం తరవాత అను ధాతురూపం ఏదైనా వస్తే ఈ మకారం కనపడుతుంది : రమ్మను, అడగమంటే, చెప్పమన్నారు. ఇలా మకారం అధికంగా రావడం భాషలో ఇతరత్రా లేదు. దీనివలన రమ్ము, అడుగుము, చెప్పుము అనే రూపాలని పునర్నిర్మించవచ్చు (అనుధాతువులో అకారంలో వల్ల

దాని ముందు ఉకారాలు మారేయి). వ్యావహారిక తమిళంలో నేకాచ్కవదాలలో చివరి ల, ళలు లోపిస్తాయి; అవ 'ఆ స్త్రీ' ఇవ 'ఈ స్త్రీ', వందా 'వస్తే' చొన్నా 'చెప్తే' కాని అజాది ప్రత్యయాలు, ప్రశ్నార్థక అకారం మొదలైనవాటి ముందు ఈ ల, ళలు దర్శనమిస్తాయి; అవళా 'ఆ స్త్రీయా?', అవళె 'ఆ స్త్రీని' వందాలుం 'వచ్చినా', చొన్నాలుం 'చెప్పినా'. పూర్వకాలంలో ల, ళలు లేని పదాల్లో ఈ ప్రత్యయాల ముందు అవి రావు; వల 'చాలు' వలవా 'చాలానా' దీనవల్ల పై శబ్దాల పూర్వరూపాలు* అవళ్,* ఇవళ్,* వందాల్,* చొన్నాల్ అని మనం గ్రహించవచ్చు.

## 12.2. పరిమితి

అంతరంగిక పునర్నిర్మాణం ఒక పదానికిగాని ప్రత్యయానికిగాని రూపభేదాలు ఉన్నప్పుడే దాని పూర్వరూపం నిర్ణయించడానికి ఉపయోగిస్తుంది. సంధి పరివర్తన లేనిచోట్ల ఈ పద్ధతి ఉపయోగించదు. తులన పద్ధతి అనేక సోదర భాషల ఆధారంగా పూర్వరూపాలని పునర్నిర్మిస్తుంది కాబట్టి అది దీనికన్న శక్తిమంతమైనది. తెలుగులో మూలద్రావిడ *ళ (మూర్ధన్యోష్మ స్పృష్టం) అచ్చుల మధ్యా, పదాదినీ డగానూ, వర్ణవ్యత్యయంలో హల్లు తరవాత ర గానూ మారింది (ఏడు <*ఏళ్, డెబ్బది < *ఎళుపత్, క్రొవ్వు <*కొళువ్). సంధి పరివర్తనలో *ళ నించి వచ్చిన డ, రలూ, *ట్, *ర్ ల నించి వచ్చిన డ, రలూ వేరుగా ఉండవు కాబట్టి అంతరంగిక పునర్నిర్మాణ పద్ధతి ద్వారా తెలుగులో ప్రాచీన కాలంలో *ళ ఉండేదని చెప్పలేం. కాబట్టి ఈ పద్ధతి ద్వారా ప్రాచీన ధ్వనులన్నింటినీ పునర్నిర్మించడం సాధ్యం కాదు. పైన ఇచ్చిన సంస్కృతోదాహరణలో మహాప్రాణత్వం ఒక స్థానంలోనే లోపించి మరొక స్థానంలో మిగిలి ఉండడం వల్ల ప్రాచీన కాలంలో రెండు స్థానాలలోనూ మహాప్రాణం ఉండేదని చెప్పగలిగేం. రెండు స్థానాలలోనూ మహాప్రాణత్వం లోపించి సంధి పరివర్తనే లేకుండా ఉంటే అంటే లిట్ రూపాలు బబూవ ఇత్యాదిగానే ఉండి భూధాతు రూపం బూ గానే ఉంటే ఆంతరంగిక పునర్నిర్మాణం ద్వారా మహాప్రాణ ధ్వనులని పునర్నిర్మించడం అసంభవమయ్యేది.

గోదావరీ మాండలికాలలో పదాంతంలోని ఇకారం రెండు భిన్న ధ్వనుల నించి వచ్చిందని ఈ పద్ధతి వలన నిరూపించవచ్చునని పైన చూశాం. ధ్వనిలో గేదిలో ఇకారానికి పందిలో ఇకారానికీ భేదం లేదు. కాని బహువచన ప్రత్యయం

ముందు సంధి ప్రవర్తనలలో ఈ రెండింటికీ భేదం ఉంది. అందువల్ల ఈ రెండూ పూర్వాంలో విభిన్నంగా ఉన్న ధ్వనుల నించి వచ్చి ఉంటాయని ఊహించ గలిగేం. అంతరంగిక పునర్నిర్మాణ పద్ధతి ఇంతవరకే పోగలదు. అంతేకాని ఈ ధ్వనుల అసలు పూర్వరూపాలని చెప్పలేదు. కాని ఇతరాధారాల వల్ల మాత్రమే గేదిలో ఎ ఎకారం నించి వచ్చిందనీ, పందిలో ఎ కారం నించి వచ్చిందనీ తెలుసుకోగలం, అందువల్ల అంతరంగిక పునర్నిర్మాణం ఒక ధ్వని రెండు (లేక అంతకన్న ఎక్కువ) ప్రాచీన ధ్వనులనించి వచ్చిందని చెప్పగలదు గాని వాటి ప్రాచీన రూపాలని సరిగా చెప్పడానికి దీనికి శక్తి చాలదు. తులన పద్ధతి వాటి సరియైన ప్రాచీన రూపాలని చెప్పగలదు. ఇలాగే గోండీలో పదాంతరేఫ సంధిలో రెండు రకాలుగా ప్రవర్తిస్తుంది. విభక్తి ప్రత్యయాల ముందు కొన్ని పదాలలో ఇది తకారంగానూ (ఏర్ 'నీళ్లు' : ఏతె 'నీళ్లలో') మరికొన్నిటిలో ఇది టకారంగానూ (నార్ 'ఊరు' : నాటె 'ఊళ్లో') మారుతుంది. దీనివల్ల గోండీలో రేఫ మొదట్లో రెండు ధ్వనులుగా ఉండేదని మనం అంతరంగిక పునర్నిర్మాణ పద్ధతివల్ల ఊహించవచ్చు. తులనపద్ధతి ఏర్ లో ర ఆ నించి వచ్చిందనీ (త. యాఱు 'నది'). నార్ తో ర ట నించి వచ్చిందనీ (త. నాటు 'దేశం') స్పష్టం చేస్తుంది. కొడగు క్రియలలో శ సంధిలో రెండు విధాలుగా ప్రవర్తిస్తుంది : కేళ్ – 'విను – 'విను, అడుగు'. భూతప్రాతిపదిక కేట్ – కాని బూళ్ – 'పడు' భూతప్రాతిపదిక బుద్ – అంతరంగిక పునర్నిర్మాణం ఈ రెండు శకారాలూ ప్రాచీన కాలంలో భిన్నధ్వనులని చెప్తుంది. తులన పద్ధతి కేళ్ – లో శకారం *ళ నించి వచ్చిందనీ బూళ్ – లో శ కారం* ళ (త. వీళ్.) నించి వచ్చిందనీ వీటి అసలు ధ్వనిస్వరూపం స్పష్టం చేస్తుంది.

పై చర్చవల్ల అంతరంగిక పునర్నిర్మాణం సంధి పరివర్తన ఉన్నచోట్లనే సాధ్యమనీ, అందువల్ల ఇది ప్రాచీన ధ్వనులన్నింటినీ పునర్నిర్మించలేదనీ, ధ్వనులని పునర్నిర్మించగలిగిన చోట్లలో కూడా వాటి అసలు స్వరూపాలని చెప్పలేదనీ స్పష్టం. ఈ పరిమితులు ఉన్నా ఇది కొంత వరకూ భాష ప్రాచీన స్వరూపాన్ని ఊహించడానికి తోడ్పడుతుంది. ఇది తులన పద్ధతి అంత శక్తిమంతం కాకపోయినా తులన పద్ధతి వలన వచ్చిన ఫలితాలు సరియైనవే అని నిరూపించ డానికి తోడ్పడుతుంది. సంధి పరివర్తన ఉన్న రూపాలని అది లేని రూపాలతో పోల్చి చూడడం అంతరంగిక పునర్నిర్మాణంలో ముఖ్యాంశం.

# 13. వర్ణనిర్మాణ పరిణామం

## 13.1. ధ్వనిపరిణామం

భాష కాలక్రమేణ మారుతుందనే విషయం ప్రాచీన సాహిత్యం ఉన్న ఏ భాషను పరిశీలించినా స్పష్టమవుతుంది. ప్రతి భాషలోనూ మాండలిక భేదాలు ఉంటాయి. భాషావ్యవహర్తల సంఖ్య పెరిగి భాష అనేక ప్రాంతాలకు విస్తృతమవుతున్న కొద్దీ మాండలిక భేదాలు ఎక్కువ అవుతాయి. కాలక్రమేణ ఒక ప్రాంతం వారికీ మరొక ప్రాంతం వారికీ రాకపోకలు సన్నగిల్లిన కొద్దీ మాండలిక భేదాలు ఎక్కువై, ఒక ప్రాంతంవారి భాష మరొక ప్రాంతం వారికి అర్థం కాకుండా పోవడం జరుగుతుంది. ఒక మూలభాష అనేక దుహితృభాషలుగా కొన్నివేల సంవత్సరాలలో మారడం ఈ విధంగానే జరుగుతుంది. భాషలో మార్పు ఆకస్మికంగా కాక కాలక్రమంలో రావడంవల్ల ఏ కాలంలో భాషావ్యవహర్తలకీ తమ భాష మారుతున్నట్లు తెలియదు. కానీ ప్రాచీన సాహిత్య గ్రంథాలూ, ప్రాచీన శాసనాలూ మొదలైన ఆధారాలలో లభ్యమయ్యే ఒక బాషని ఈ కాలంలో వ్యవహారంలో ఉన్న అదే భాషతో పోల్చి చూస్తే అందులో వచ్చిన మార్పులు స్పష్టంగా కనిపిస్తాయి. భాషలో భేదం ఎక్కువగా కనిపిస్తుంది. తెలుగులో నన్నయాది ప్రాచీన కవులు వాడిన భాషతో ఇప్పటి భాషను పోల్చి చూస్తే తెలుగుభాష అన్ని విభాగాలలో వచ్చిన మార్పులు తెలుస్తాయి. ప్రాచీన భాషలో వాఁడు, మూఁడు, తూఁగు మొదలైన పదాలలో ఉన్న అరసున్న ఇప్పటి భాషలో లోపించింది; మాఱు, నూఱు, మఱఁది వంటి వాటిలో బండి ఱ ఇప్పటి భాషలో రేఫతో కలిసిపోయింది. నన్నయకు ముందుకాలపు శాసనాలలో ళచ్చు, ప్కొ.లు మొదలైన పదాలలోని ళ. అనే ధ్వని నన్నయ కాలానికే రూపు మరింది; ఆ శాసనాలలో పణి, కొణి మొదలైన మాటటలోని ణ కారం నన్నయ కాలానికే న కారంగా మారింది. ప్రాచీన భాషలో క్రొవ్వు, క్రొత్త, త్రాచు, ప్రొద్దు, మ్రోఁగు మొదలైన పదాలలో రేఫ ఇప్పటి భాషలో లోపించింది. పైన ఇచ్చినవి వర్ణనిర్మాణంలో మార్పులకు ఉదాహరణలు. ఇక పదాలు, పదనిర్మాణం, వాక్య

నిర్మాణం, అర్థనిర్మాణాలలో కూడా మార్పులు సహజంగా ఉంటాయి. ప్రాచీన భాషలోని తేరు, ఎలుగు, పలుకు, వీను. ఇడుము, ఏదు, మార్కొము, తునుము వంటి పదాలు ఇప్పటి భాషలో లేవు. ఈ అధ్యాయంలో వర్ణనిర్మాణంలో మార్పులకు కారణాలు, వాటిలో రకాలు మొదలైనవి చర్చించబడతాయి. మిగిలిన నిర్మాణాలలోమార్పులు తరవాత అధ్యాయాలలో చర్చించబడతాయి.

ఒక భాషలో ఒక కాలంలో ఉన్న ఒక ధ్వని తరవాత కాలంలో ఒకటి గాని లేక అంతకన్న ఎక్కువ ధ్వనులుగా మారడాన్ని ధ్వనిపరిణామం (Sound change) అంటారు. ధ్వని పరిణామాన్ని గురించిన విశేష చర్చ యూరప్‌లో 18వ శతాబ్ది ప్రారంభంలో మాత్రమే మొదలయింది. అంతకు ముందు యూరప్‌లో పండితులకు భాషాకుటుంబాలని గురించి కాని ధ్వని పరిణామాన్ని గురించి కాని స్పష్టమైన అభిప్రాయం లేదు. ప్రాచీన లాటిన్ వ్యాకర్తలు లాటిన్ గ్రీకునించి పరిణమించిందని అపోహపడ్డారు. యూరప్‌లో పండితులు చాలామంది బైబిల్ మొదటి హిబ్రూలో రాయబడడంవల్ల హిబ్రూయే అన్ని భాషలకీ మూలమని విశ్వసించారు. ఈ రెండు అపోహలనీ 16వ శతాబ్దికి చెందిన జె.జె. స్కాలిగర్ ( J.J. Scaliger, 1540–1609) మొట్టమొదట ఖండించారు. 1786లో సర్ విలియం జోన్స్ సంస్కృతం, గ్రీక్, లాటిన్ మొదలైన భాషలు ఒక మూలభాషనించి ఉత్పన్నమైనవని కనుగొన్నాక తులన పద్ధతి ప్రారంభమై, సజాతి శబ్దాలలో ధ్వనులోని భేదాలు వివరించవలసి వచ్చినప్పుడు పండితులకు ధ్వనిపరిణామం అనేది ఉందని తెలిసి వచ్చింది ( ఈ పరిశోధన చరిత్ర వివరాలు 17వ అధ్యాయంలో ఉన్నాయి).

16వ శతాబ్దికి చెందిన క్లాడియో టోలోమే (Claudio Tolomei, 1492–1555) అనే ఇటలీ దేశస్థుడు ధ్వని పరిణామంస్వభావాన్ని మొట్టమొదటగా కనుగొని దాన్ని చక్కగా వివరించారు. ఆయన ఇటాలియన్ భాష లాటిన్ భాషనించి వచ్చిందని చెప్పి, లాటిన్ లో ప్ల్ – అనే సంయుక్త హల్లు ఇటాలియన్ లో పి–గా మారుతందని వివరించాడు. లాటిన్ plus 'చాలా', ఇటాలియన్ piu: లాటిన్ plenus 'నిండు', ఇటాలియన్ pieno: ఇంతేకాక ఇటాలియన్ లో ప్ల్ – మిగిలిఉన్న మాటలు, plora : 'ఏడుస్తున్నాడు', plebe 'ప్రజలు', మొదలైనవి లాటిన్ నించి ఎరువుతెచ్చుకొన్నవని కూడా ఆయన చెప్పేరు.

టోలోమే చూపిన మార్గాన్ని తరవాత మూడు శతాబ్దుల వరకు ఎవరూ అనుసరించలేదు. 19వ శతాబ్దిలో రాస్క్, గ్రిమ్, గ్రాస్మన్, వెర్నర్, బ్రూగ్మన్ మొదలైన పండితులు ఇండో-యూరపియన్ భాషలపై పరిశోధనలు చేసి ధ్వని పరిణామం నియతంగా జరుగుతుందనీ దీనికి నిజమైన అపవాదాలు ఉండవనీ కనుగొన్నారు (వివరాలకు చూ. 17వ అధ్యాయం). ఈ విషయాన్ని విపులంగా చర్చించేముందు మన దేశంలో సంస్కృతంనించి పరిణమించిన ప్రాకృత భాషల వ్యాకరణాలు రచించిన వైయాకరణులు ధ్వనిపరిణామాన్ని గ్రహించడమేకాక సంస్కృత ధ్వనులు ప్రాకృతంలో పొందే మార్పులని సూత్రబద్ధంగా వివరించాడని తెలుసుకోవాలి. హేమచంద్రుడూ (12వ శతాబ్ది), త్రివిక్రమ దేవుడూ (13వ శతాబ్ది) ప్రాకృత వైయాకరణులలో ప్రథములు. వీరు యూరప్‌లోని పండితులకు చాలాకాలంముందే ధ్వనిపరిణామాన్ని గురించి తెలుసుకొన్నారనేది మనం ముఖ్యంగా గుర్తించవలసిన విషయం. వీరు సంస్కృత భాషాధ్వనులు ప్రాకృతభాషలో పొందే మార్పులు సూత్ర రూపంలో వివరించారు. ఒక ధ్వని భిన్నపరిసరాలలో భిన్నమైన మార్పులు పొందితే ఏ పరిసరంలో ఏ మార్పు పొందుతుందో కూడా వివరించారు. కొన్ని ఉదాహరణలు (కింద ఇచ్చిన సూత్రాలు త్రివిక్రమదేవుడి "ప్రాకృతశబ్దానుశాసనం"లోవి) :

శోః సల్ (1.3.87) "శ,షలు సగా మారతాయి": శబ్దః > సద్దో; వంశః > వంసో; అశ్వః > ఆసో; షండః > సండో; కషాయః > కసో; వర్షః > వాసో.

క్షః (1.4.8) "క్ష ఖకా మారుతుంది". క్షయః > ఖఓ; క్షీణం>ఖీణం.

త్యోఽచైత్యే (1.4.77) "చైత్యం అనే పదంలో తప్ప త్యచ్చగా మారుతుంది": సత్యం > సచ్చం; అమాత్యః > అమచ్చో (సంయోగే 1.2.40 అనే సూత్రంవల్ల సంయుక్త హల్లు ముందున్న దీర్ఘాచ్చు హ్రస్వమవుతుంది).

ఆదే ర్జః (1.3.74) "పదాది యకారం జగా మారుతుంది" : యశః> జసో; యువతిః > జువఈ (అచ్చుమధ్య ఉన్న అసంయుక్త యకారం ప్రయోలుక్ క గ చ జ త ద ప య వాం (1.3.8) అనే సూత్రంవల్ల బహుళంగా లోపిస్తుంది : వియోగః > విఓఓ; నయనం > ణఅణం).

ఋతోఽఒత్ (1.2.73) "పదాది హల్లు తరవాత ఉన్న ఋకారం అకారంగా మారుతుంది" : ఘృతం > ఘఅం; తృణం > తణం; కేవలస్య రిః (1.2.89) "కేవల ఋకారం రిగా మారుతుంది"; ఋద్ధిః > రిద్ధీ; ఋక్షః > రిచ్ఛో.

పై ఉదాహరణలలో సంస్కృతం య పరిసరానుగుణంగా ప్రాకృతంలో రెండు రకాల మార్పులు పొందింది; అది పదాదిని జగా మారింది; అచ్చుల మధ్య లోపించింది. అలాగే సంస్కృతం ఋ పదాదిని రిగానూ, పదాదివల్లి తరవాత అగానూ మారింది. ఇటువంటి పరిసరబద్ధమైన మార్పులను కూడా ప్రాకృతవైయాకరణులు సూత్రీకరించడం ప్రశంసనీయం.

19వ శతాబ్ది ముందుకాలంలో ప్రాకృతవైయాకరణులు, టోలొమీ వంటి కొందరు పండితులు ఒక భాషలోని ధ్వనులలో భిన్న కాలాలలో వచ్చిన మార్పులను గుర్తించారు. వారి కృషిని తరవాత కాలంవారు కొనసాగించలేదు. అంతేకాక, ఈ ప్రాచీనులు కొన్ని భాషలను భాషాకుటుంబాలుగా ఏర్పరిచి దుహితృ భాషలలో ధ్వని సంబంధాలని అన్వేషించి వివరించడం చెయ్యలేదు. కాని 19వ శతాబ్దంలో అనేక పండితులు ఇండో యూరోపియన్ భాషలలో ధ్వని సంబంధాలను పరిశోధించారు. ఒక పండితుడు పరిశోధించి చెప్పిన ధ్వని సూత్రాన్ని ఇతరులు పునఃపరిశీలించి దానికి అపవాదాలుగా కనపడే పదాలు నిజంగా అపవాదాలు కావనీ, వాటిలో మరొక ధ్వని సూత్రం ప్రవర్తిస్తోందనీ కనిపెట్టేరు. రాస్క్, గ్రిమ్‌లు జర్మానిక్ భాషలకు చెప్పిన ధ్వనిసూత్రాలకు అపవాదాలుగా కనపడేవాటిని పరిశీలించి గ్రాస్మన్, వెర్నర్ అవి అపవాదాలు కావనీ, వాటిలో వేరు సూత్రాలు ప్రవర్తిస్తున్నాయనీ కనిపెట్టేరు. ఇటువంటి ఫలవంతమైన పరిశోధనల వల్ల ఉత్తేజితులై ఆగస్ట్ లెస్కిన్, కార్ల్ బ్రూగ్‌మన్ మొదలైన యువ వ్యాకర్తలు (చూ. 17.4) "ధ్వని సూత్రాలకు అపవాదాలు ఉండవు" అనే అభిప్రాయం వ్యక్తీకరించారు. వీరి ఉద్దేశం ధ్వనిసూత్రాలకు అసలు అపవాదాలు ఉండవని కాదు. ఈ సిద్ధాంతాన్ని ప్రాతిపదికగా తీసుకొని పరిశోధన చేస్తే ఒక ధ్వని సూత్రానికి కొన్ని పదాలు ఎందుకు అపవాదాలుగా కనపడుతున్నాయో కనుక్కోవచ్చు. ఒక ధ్వని పరిణామం ఒక భాషలో ఒక మాండలికంలో ఒక నియతకాలంలో మాత్రమే జరుగుతుంది. (చూ. 13.8)

ఆ ధ్వని పరిణామం ఆగిపోయిన తరవాత వేరొక భాషలోనించి ఆ భాషలోకి ఎరువు తెచ్చుకొన్న పదాలలో ఆ ధ్వని పరిణామం ప్రభావం ఉండదు (ఎరువు తెచ్చుకొన్న పదాలు ఒక ధ్వనిపరిణామం జరిగిన కాలంలోనే ఉంటే దేశ్యపదాలతో బాటు ఎరువు పదాలు కూడా ఆ ధ్వని పరిణామానికి లోనవుతాయి). 11.3 లో మూల ద్రావిడ భాషలోని *క కారం అగ్రాచ్చుల ముందు తెలుగులో చకారంగా మారుతుందని చూశాం. ఈ ధ్వని పరిణామం ముగిసిన తరవాత కన్నడంలోనించి తెలుగులోకి కివియు, కిముక, కెంపు, కెడయు, కెలయు వంటి కొన్ని పదాలు వచ్చాయి. వీటిలో అగ్రాచ్చు ముందు కకారం మిగిలి ఉండడానికి కారణం ఇవి తెలుగులోకి వచ్చే కాలానికి పై ధ్వని పరిణామం ముగిసిపోవడమే అనేది స్పష్టం. తమిళం మొదలైన దక్షిణ ద్రావిడ భాషలలో మూలభాషలోని పదాది * చకారం కొన్ని మాటలలో లోపిస్తుంది. * చాఱ్ > ఆఱు '6' *చయంత్ > అయ్ంత్ '5',* చిల్ > ఇల్ 'లేదు'. ఈ పరిణామం కాలానికే తమిళంలో సంస్కృతం నుంచి సహస్ర -> ఆయిరం; సభా > అవై; చాప -> అవం (తమిళంలో చ, సలు ప్రత్యేక వర్ణాలు కావు). ధ్వన్యనుకరణ శబ్దాలు ఒక సహజ ధ్వనిని అనుకరించడానికి సృష్టించబడ్డాయి కాబట్టి అవి కూడా ధ్వని పరిణామానికి లోనుగావు. తెలుగులో కిలకిల, కీచుకీచు, కిర్రుకిర్రు మొదలైన ధ్వన్యనుకరణ పదాలలో కకారం అగ్రాచ్చుముందు చకారంగా మారలేదు. ఇక సామ్యం (Analogy) వల్ల కూడా ధ్వని సూత్రాలు సర్వ వ్యాపులు కావనీ, కొన్ని అర్థాలని సూచించే ధ్వనులు ధ్వనిసూత్రాలకి లోబడవనీ అన్నారు. కానీ ఈ ఊహ నిజం కాదు. ప్రాచీన గ్రీక్‌ ధ్వని సూత్రానుసారంగా భూతకాలిక సకారం కూడా మొదట లోపించే ఉంటుంది. హలంత ధాతువుల తరవాత ఈ భూత ప్రత్యయం పై సూత్రంవల్ల లోపించనక్కరలేదు. కాబట్టి అజంత ధాతువుల తరవాత కూడా హలంత ధాతువుల సామ్యంతో లోపించిన సకారం స్థానంలో మళ్ళీ సకారం వచ్చి చేరిందని చెప్పవచ్చు.

పై చర్చవల్ల ధ్వని సూత్రాలకి అపవాదాలు ఏర్పడడానికి మూడు ముఖ్య కారణాలు ఉన్నాయని తేలింది. అవి (1) ధ్వని పరిమాణం జరిగిన తరువాత భాషలోకి వచ్చి చేరిన ఎరువుమాటలు, (2) ధ్వన్యనుకరణ శబ్దాలు, (3) సామ్యం. కొన్ని సందర్భాలలో మొదట ఏర్పరచిన ధ్వనిసూత్రం అసమగ్రం కావడంవల్ల కొన్ని పదాలు అపవాదాలుగా కనపడవచ్చు. ఇటువంటి అపవాదాభాసాలని పునఃపరిశీలనచేసి, ధ్వనిసూత్రం నియతిని సంకుచితమో విస్తృతమో చేసి, అపవాద రహితం చెయ్యవచ్చు. మూలద్రావిడ * ఒకారం తొదలో వగా* అయ్ ముందు మారుతుందని ఎం.బి. ఎమెనో కనుగొన్నారు. తొద వడ్ – 'పగులు' < ఒటయ్. కాని తొద త్వట్ య్ 'దురద' < * చొటి అనే మాటలో రెండో అక్షరంలో * లేక పోయినా దాని ముందు * ఒ వగా మారింది. ప్రస్తుత గ్రంథకర్త పరిశీలనలో మూలద్రావిడ * ఒ తోదలో వగా * అయ్ ముందే కాక ణముందు కూడా మారుతుందని తేలింది. ఇలా పరిసర నియతిని విస్తృతం చెయ్యడంవల్ల త్వట్ య్‌లో పరిణామం అపవాదం కాదని స్పష్టమయింది. యువవ్యాకర్తల సిద్ధాంతాన్ని ప్రాతిపదికగా తీసుకొవడంవల్ల అపవాదాలకు కారణాలు కనుక్కోవడం అవసరమై, పరిశోధన విస్తృతమై భాషాపరిణామం సమగ్రస్వరూపం తెలుసుకొవడం సాధ్యవుతుంది. అందువల్లనే మొదట్లో కొందరు వ్యతిరేకించినా ఈ సిద్ధాంతం సర్వజనామోదం పొందింది. ధ్వని పరిణామం నియతిబద్ధంగా జరుగుతుందనే పరమ సత్యం వివిధ భాషలపై పరిశోధన చేసిన పండితుల చేత నిరూపించబడింది. ధ్వని పరిణామానికి అపవాదాలుగా కనపడేవి నిజంగా అపవాదాలు కావని పండితార్థం. ధ్వనిపరిణామం అన్ని భాషలలోనూ జరుగుతుందనే పరమ సత్యం వివిధ భాషలపై పరిశోధన చేసిన పండితులకు తెలుసు కాని అది ఎందుకు జరుగుతుంది అనే విషయం ఎవరికీ తెలియదు. ప్రజల అలవాట్లు, ఆచార వ్యవహారాలు మారినట్లుగానే బాషావ్యవహారం కూడా కాలక్రమేణ మారుతుంది. వర్ణ సమీకరణం మొదలైన కొన్ని ధ్వని పరిణామాలు ఉచ్చారణ సౌలభ్యం కోసం ఏర్పడినవని చెప్పవచ్చు (కింద చూడండి); కాని అన్ని ధ్వనిపరిణామాలకీ ఇటువంటి వివరణ ఇవ్వడం సాధ్యం కాదు. కన్నడంలో మూలద్రావిడ* ప హగా మారుతుంది; * పాల్ > హాలు, * పన్ణ్ > హంది; సంస్కృతంలో మూల ఇండో యూరోపియన్ భాషలోని* ఎ.* ఒలు గా మారతాయి : సప్త (లాటిన్ septem), అష్ట (లాటిన్ octo), ఇటువంటి పరిణామాలకి నిజమైన కారణం తెలియదు.

ధ్వనిపరిణామం అనియతికం (Unconditioned) అనీ, సనియతికం అనీ రెండు రకాలు. ప్రాచీన కాలపు ధ్వని ఒకటి తరవాత కాలంలో మరొక ధ్వనిగా అన్ని పరిసరాలలోనూ, అంటే పదాది, అచ్చుల మధ్య, పదాంతం ఇత్యాది సర్వస్థానాలలోనూ తుల్యంగా మారితే అది అనియతిక ధ్వని పరిణామం; మూల ఇండో యూరోపియన్ * ఎ, *ఒలు సంస్కృతంలో అగా అన్ని స్థానాలలోనూ మారతాయి; అలాగే సంస్కృతంలో * శ , * ష లు ప్రాకృతంలో సగా సర్వత్ర మారతాయి. ప్రాచీన కాలపు ఒక ధ్వని అర్వాచీన కాలంలో భిన్న స్థానాలలో రెండు లేక అంతకన్న ఎక్కువ ధ్వనులుగా మారితే అది సనియతిక ధ్వని పరిణామం ; మూల ద్రావిడంలో** ళ్ల తెలుగులో అచ్చుల మధ్యడగానూ, పదాది హల్లు తరవాత రగానూ మారడం దీనికి ఉదాహరణ : తె. కోడి: త. కోళ్లి;ఏడు:త. ఏళ్ల్.; ప్రొద్దు:త. పొ:ళ్లుత; మ్రోగు: త. ముళ్లంకు(ళ.=మూర్ధన్యోష్మత్ స్పృష్టం). ప్రాకృతంలో * య పదాదిని జగానూ, అచ్చుల మధ్యంలోవంగానూ మారడం కూడా ఇటువంటిదే (ఉదాహరణలకు పైన చూడండి).

ధ్వని పరిణామం జరిగినప్పుడు సాధారణంగా భాషలో వర్ణనిర్మాణంలో మార్పు, అంటే ఉన్న వర్ణాలు కొన్ని పోవడమో, లేక కొన్ని వర్ణాలు కొత్తగా వచ్చి చేరడమో, లేక కొన్ని పోవడమో, లేక కొన్ని వర్ణాలు కొత్తగా వచ్చి చేరడమో జరుగుతుంది. ప్రాచీన భాషలో రెండు లేక అంతకన్న ఎక్కువ వర్ణాలు అర్వాచీన భాషలో ఒకే వర్ణంగా మారడం వర్ణమేళనం (Merger).ప్రాచీన తెలుగులో ర, ఱలు ప్రత్యేక వర్ణాలు (పేరు, నూఱు); ఇప్పటి తెలుగులో ఱ, రతో కలిసిపోయింది (పేరు, నూరు). సంస్కృత శ, ష, స లు మూడూ ప్రాకృతంలో సగా మారడమూ ఇటువంటిదే. ప్రాచీన భాషలోని ఒక వర్ణం అర్వాచీన భాషలో రెండు లేక అంతకన్న ఎక్కువ వర్ణాలుగా మారడం వర్ణవిదళనం( Split). వర్ణవిదళనం జరిగినప్పుడు సాధారణంగా దాని వెనకాల వర్ణ మేళనం ఉంటుంది. తెలుగులో** ళ్ల డ, రలగా విదళనం చెందినప్పుడు (పైన చూడండి)* ళ, అచ్చుల మధ్య మూలభాషలోని* టతోనూ,(తె.పాడు:త. పాటు), పదాది హల్లు తరవాత మూలభాషలోని * ర తోనూ (తె. మ్రాను: త. మరం) కలిసిపోయింది. వర్ణవిదళనం వల్ల కొత్త వర్ణాలు భాషలోకి రావడం కూడా క్వాచిత్కంగా ఉంది; ఇది పరిసర భ్రంశం వల్ల ఏర్పడుతుంది. కొడగులో అగ్రాచ్చులు, మూర్ధన్యం

ముందు కేంద్రాచ్చులుగా మారేయి. అ తరవాత మూర్ధన్యం కొన్ని సందర్భాలలో లోపించింది. దీనివల్ల అగ్రాచ్చులకీ కేంద్రాచ్చులకీ పరిసర భేదం నశించి కేంద్రాచ్చులు ప్రత్యేక వర్ణాలు అయ్యాయి ; మూర్ధన్యం లోపించకపోతే కేంద్రాచ్చులకు ప్రత్యేక వర్ణ ప్రతిపత్తి ఏర్పడి ఉండక పోయేది. వర్ణ నిర్మాణంలో మార్పు కలిగించే ధ్వని పరిణామాన్ని వర్ణ పరిణామం (Phonemic change) అనీ, వర్ణ నిర్మాణంలో మార్పు కలిగించని దాన్ని సవర్ణపరిణామం (Allophonic/ Subphonemic change) అనీ అంటారు. తమిళంలో స్పర్శాలు పదాదిపీ, ద్విరుక్తిలోనూ శ్వాసాలు (క,చ,ట,త,ప,) గానూ అచ్చుల మధ్యా అనునాసికం తరువాత నాదాలు (గ,జ,డ, ద,బ) గానూ (అచ్చు ల మధ్య క,చలు మాత్రం ఖ (= x ), సలుగా ఉచ్చరించబడతాయి). పరిసర బేదం ఉంది కాబట్టి ఈ రెండు రకాల స్పర్శాలూ, అంటే క,గ, మొదలైన జంటలు ప్రత్యేకవర్ణాలు కావు. మూలభాషలో అపదాదిస్థానాలలో కూడా స్పర్శాలు శ్వాసాలుగా ఉండేవి అని అనుకొంటే తమిళంలో అవి ఈ స్థానాలలో నాదాలుగా మారడం సవర్ణ పరిణామానికి ఉదాహరణ అవుతుంది. అలాగే ఇంగ్లీషులో 18వ శతాబ్దివరకూ ఉన్న దీర్ఘాచ్చు లు ఈ తరవాత కాలంలో సంయుక్తాచ్చులుగా మారేయి.: geese, eitht. goose, goat వంటి పదాల లోని ఈ, ఏ,ఊ,ఓలు ఇప్పటి భాషలో క్రమంగా ఇయ్, ఎయ్, ఒవ్ లుగా మారేయి. సవర్ణ పరిణామంలో ఒక ధ్వని ఉచ్చారణలో మాత్రం మార్పు వస్తుంది. కాని దీనివల్ల వర్ణ నిర్మాణంలో మార్పు ఉండదు. తెలుగులో తాలవ్య చ, జ లు అనగ్రాచ్చుల ముందు దంతమూలీయాలుగా మారడం కూడా సవర్ణ పరిణామమే.

ధ్వనిపరిణామంలో ముఖ్యమైన రకాలని కింద పరిశీలిద్దాం.

## 13.2 వర్ణసమీకరణం

ఒక వర్ణం దాని పక్కన ఉన్న వర్ణం ఉచ్చారణకి అనుగుణంగా మారితే దాన్ని వర్ణసమీకరణం (Assimilation) అంటారు. ఇందులో రెండు రకాలు ఉన్నాయి : ఇక వర్ణం దానిముందు ఉన్న వర్ణానికి అనుగుణంగా మారితే దాన్ని పూర్వముఖ వర్ణసమీకరణం (Progressive Assimilation) అనీ, ఒక వర్ణం దాని తరువాత ఉన్న వర్ణానికి అనుగుణంగా మారితే దాన్ని పరముఖ వర్ణసమీకరణం

(Regressive Assimilation) అనీ అంటారు. పరముఖ సమీకరణమే పూర్వముఖ సమీకరణం కన్న ప్రచురం, అచ్చులు అచ్చులవల్లా కూడా ప్రభావితం కావచ్చు. అలాగే హల్లులు హల్లుల వల్లా అచ్చులవల్లా కూడా ప్రభావితం కావచ్చు. ప్రభావం కలిగించే వర్ణమూ, ప్రభావానికి లోనయ్యే వర్ణమూ పక్కపక్కనే ఉండవచ్చు; లేక వీటిమధ్య కొన్ని ఇతరవర్ణాలు ఉండవచ్చు. పూర్ణ సమీకరణం Total Assimilation) లో ఒక వర్ణం పక్క వర్ణంతో పూర్తిగా సమానంగా మారిపోతుంది; పాక్షిక సమీకరణం ( Partial Assimilation) లో ఒక వర్ణం కొంత వరకే పక్కవర్ణానికి అనుగుణంగా మారుతుంది.

సమీకరణంవల్ల సంయుక్తహల్లులు ద్విరుక్తహల్లులుగా మారడం సర్వ సాధారణం.

| సంస్కృతం | ప్రాకృతం |
|---|---|
| భుక్తం | భుత్తం |
| దుగ్ధం | దుద్ధం |
| ఖడ్గః | ఖగ్గో |
| ఉత్పలం | ఉప్పలం |
| విప్లవః | విప్పవో |
| పక్వం | పక్కం |
| నగ్నః | నగ్గో |
| రక్తః | రగ్గో |

పై ఉదాహరణలలో మొదటి నాలుగింటిలో సంయుక్తాక్షరంలో ప్రథమ హల్లు ద్వితీయహల్లుతో తుల్యంగా మారింది కాబట్టి ఇది పరముఖ సమీకరణం; చివరి నాలుగింటిలో ద్వితీయ హల్లు మొదటి హల్లుతో తుల్యంగా మారింది కాబట్టి ఇదిపూర్వముఖ సమీకరణం ; రెండింటిలోనూ పూర్ణసమీకరణమే జరిగింది. మాలయాళంలో సాధారణంగా అనునాసికం తరవాత స్పర్శం అనునాసికంగా మారుతుంది పంకు >. పొఙ్ఙ 'పొంగు' మరుంతు > మరున్న 'మందు'.ఇది కూడా పూర్ణపూర్వముఖ సమీకరణానికి ఉదాహరణ.

అచ్చులమధ్య శ్వాస స్పర్శం నాదంగా మారడమూ, కకారం అగ్రాచ్చుల ముందు చకారంగా మారడమూ అనేక భాషలలో ఉంది. అచ్చులు నాదాలు కాబట్టి వీటి మధ్య శ్వాసం నాదంగా మారడం సహజం (ప్రా.ఏగో సం. ఏకః, ప్రా.లోగో సం. లోకః). ఇటువంటివి పాక్షిక సమీకరణాలు.

తెలుగులో రెండో అక్షరంలో ఉకారం మూడో అక్షరంలో ఇకారంతో తుల్యంగా మారడం ప్రచురంః అడుగు + ఇ > అడిగి, ఎఱుఁగు + ఇ > ఎఱిఁగి, వ్యావహారికభాషలో ఇటువంటి మార్పు ఇంకా ప్రచురమైందిః అరిటి < అరఁటి, అడగ < అడుగవ్ (అడుగు అనే క్రియ తుమర్థక రూపం), చదవ < చదువన్, ఉడత < ఉడుత, చిలక < చిలుక, నడుచు < నడచు, అఱుగు < అడఁగు. పై సమీకరణాలు పూర్ణాలు; అడుగు + ఎను > అడిగెను, అడుగు + ఎడి > అడిగెడి వంటి వాటిలో ఉ ఎకారం ముందు ఇ గా మారడం పాక్షిక సమీకరణం. (వీటిలో అగ్రాచ్చైన ఎకారం వల్ల ఉ దానితో తుల్యమైన ఇ అనే అగ్రాచ్చుగా మారింది; ఎ గా మారలేదు కాబట్టి ఇది పాక్షిక సమీకరణం). ఈ అచ్చుల మధ్య హల్లు వ్యవధానం ఉంది కాబట్టి ఇవన్నీ దూర సమీకరణాలు.

సంస్కృతంలో ర, షల తరవాత నకారం ణగా మారుతుంది. ర, షలకీ నకారానికీ మధ్య అచ్చు, హ, య, వ, క వర్గాక్షరం, ప వర్గాక్షరం, ఆఙ్, నమ్‌లు ఉన్నా కూడా ఈ మార్పు జరుగుతుందిః రషాభ్యాం నోణః సమానపదే (అష్టాధ్యాయి 8.4.1) : ఆస్తీర్ణమ్, పుష్ణాతి, తిస్పృణామ్; అట్ కుప్వాఙ్ నుమ్ వ్యవాయేఽపి 18.4.2); హరణమ్, అర్కేణ, దర్పేణ, పర్యాణద్ధమే. ర, షలు మూర్ధన్యాలు కాబట్టి వాటి తరవాత వచ్చిన దంత్య నకారం మూర్ధన్యంగా మారింది. ఇది కూడా పూర్వ ముఖ సమీకరణానికి ఉదాహరణ.

పదాంతంలో నాదస్పర్శాలు శ్వాసాలుగా మారడం సంస్కృతం, జర్మన్ ఇత్యాది భాషలు చాలా వాటిలో ఉంది.శరత్ <* శరద్, వీరుత్ <* వీరుధ్, కకుప్ <* కకుభ్. పదం ఉచ్చారణ ముగిసేక నాదతంత్రులు విడిపోతాయి కాబట్టి ఈ విడిపోవడం పదాంత హల్లుకు కూడా వ్యాపించడం వల్ల అది శ్వాసమవుతుంది. ఇది కూడా సమీకరణంలో ఒక రకం.

కొడగు, తుళుభాషలలో అగ్రాచు ఓష్ఠ్యమూర్ధన్యాల మధ్య పశ్చిమాచ్చుగా మారుతుంది: * పెణ్ > పొణ్ణు 'స్త్రీ' * వీటు > బూడు 'ఇల్లు', * పెటి > పుడి 'పట్టుకొను', అచ్చులు హల్లుల వల్ల మారడానికి ఇది ఉదాహరణ.

పై చర్చ వల్ల స్థాన కరణ ప్రయత్నాలు మూడిటిలోనూ విడివిడిగా గాని రెండు మూడు కలిపి గాని సమీకరణం జరగవచ్చునని స్పష్టం.

సమీకరణమైనా ఇతర పరిణామాలైనా ఉచ్చారణ సౌలభ్యం కోసం జరుగుతాయి. పక్కపక్క వర్ణాలు తుల్యంగా మారితే ఉచ్చారణ సౌలభ్యం ఏర్పడుతుంది. అయితే ఉచ్చారణ సౌలభ్యం అనేది తర తమ భేదాన్ని ఆశ్రయించినది కాని స్థిరమైనది కాదు. ఒక్కొక్క భాషలో కొన్ని ధ్వనిపరిణామాలు ఏర్పడతాయి కాని అన్ని భాషలలోనూ అన్ని ధ్వని పరిణామాలూ ఉండవు. తాలవ్యీకరణం (Palatalization) లో తెలుగులో అగ్రాచ్చు ముందు క కారం చ కారంగా మారింది. చెవి < * కెవి, చీలు < * కీలు. కాని కన్నడంలో ఈ మార్పు లేదు. అంత మాత్రం చేత తెలుగులో ఉచ్చారణ సౌలభ్యం ఉంది, కన్నడంలో ఉచ్చారణ సౌలభ్యం లేదు అనుకోకూడదు. మనుష్యుల అభిరుచులలో వైవిధ్యం ఉన్నట్లే భాషల ధ్వనిపరిణామానికి సంబంధించిన అభిరుచులలో వైవిధ్యం ఉంటుంది. ఈ వైవిధ్యం భాషావ్యవహర్తల అంతర్మానసికాభిరుచులకు ప్రతీక.

మానవులు మాట్లాడేటప్పుడు ఉచ్చారణావయవాలు ఒక ధ్వనిని ఉచ్చరించేటప్పుడే దాని తరవాత ధ్వనులను ఉచ్చరించడానికి ఆయత్తమవుతూ ఉంటాయి. అలాగే ముందు ఉచ్చరించబడిన ధ్వనికి అవసరమైన భంగిమని నిలుపుకొంటూనే ఉచ్చారణావయవాలు తరవాత ధ్వనులను ఉచ్చరించే ప్రయత్నం చేస్తాయి. అందువల్లనే పూర్వ ధ్వనులు పరధ్వనులనీ, పరధ్వనులు పూర్వ ధ్వనులనీ ప్రభావితం చేస్తాయి. ఒక ధ్వని లక్షణాలు ఇలా సమీప ధ్వనులకు సంక్రమిస్తాయి. వర్ణ సమీకరణం జరగడానికి కారణం ఇదే.

## 13.3 వర్ణ విభేదనం

ఒక మాటలో ఒకే ధ్వని పక్క పక్కన రెండుచోట్ల ఉన్నప్పుడు వాటిలో ఒకటి వేరు ధ్వనిగా మారడం వర్ణ విభేదనం (Dissimilation). ఇది కూడా

ఉచ్చారణ సౌలభ్యం కోసం జరిగేదే. ఈ మార్పు సర్వసాధారణంగా ర, ల ల మధ్య జరుగుతుంది. లాటిన్ perigriinusలో మొదటి ర లగా మారి రొమాన్స్ భాషలలో *pelegriinus ఏర్పడింది; దీని నించి ఇంగ్లీషు pilgrim వచ్చింది. లాటిన్ quinque '5'లో ఉన్న రెండు క్వ ధ్వనులలో మొదటిది క గా మారి రొమాన్స్ భాషలలో * ki:nkweఏర్పడింది. సంస్కృతం, గ్రీక్ లలో రెండు మహాప్రాణాలు వచ్చినప్పుడు వాటిలో మొదటిది మహాప్రాణత్వం కోల్పోవడం కూడా వర్ణ విభేదనానికి మంచి ఉదాహరణ: బభార < భభార ( చూ. 12.1). ఇది వర్ణ సమీకరణమంత ప్రచురం కాదు.

## 13.4 వర్ణ వ్యత్యయం

ఒక మాటలో రెండు ధ్వనులు పరస్పరం స్థానం మార్చుకోవడం వర్ణ వ్యత్యయం (Metathesis). ఇది తెలుగులోనూ దాని సన్నిహిత భాషలైన గోండీ, కొండ, పెంగో, మండ, కూయి, కువిలలోనూ ప్రచురం. ఈ భాషలలో పదంలో మొదటి అచ్చూ, దాని తరవాత హల్లూ స్థానం మారతాయి. తెలుగులో పదాది హల్లులేని పదాలలో మొదటి అచ్చూ దాని తరవాత * ట (డ) * ఴ., * ళ * ల, * ర, * ఱలలో ఒకటి ఇలా స్థానం మారతాయి: వాఱగు < *అటంకు, డిగు, దిగు < *. ఇ. ఴి., లో < ఒక < * ఉళ, లే(దు) * < ఎల(దు) < * ఇల(దు), రోలు < * ఒరల్, ఱేడు < * ఎఱన్ట్. పదాది హల్లు ఉన్న పదాలలో దాని తరవాత అచ్చూ దాని తరవాత * ళ, * రలలో ఒకటి వర్ణవ్యత్యయం పొందుతాయి. మ్రాను < * మరన్, ప్రొద్దు < * పొఴుతు, వ్రేలు < * వెరల్. వర్ణ వ్యత్యయం వల్ల రెండు అచ్చులు అవ్యవహితంగా వచ్చినప్పుడు రెండో అచ్చు అకారమైతే అది లోపించి దాని ముందు అచ్చు దీర్ఘమవుతుంది: * ఒరల్ > * ర్ ఒ అల్ > రోలు; రెండో అచ్చు ఇ గాని ఉగాని అయితే అది లోపిస్తుంది కాని ముందు అచ్చు దీర్ఘం కాదు : * పొఴుతు < * ప్ ఴ్. ఒఉతు < ప్రొద్దు.

## 13.5 వర్ణాధిక్యం

సంయుక్త హల్లులు ఉచ్చారణలో క్లేశాన్ని తొలగించడానికి వాటి మధ్య అచ్చు చేరి వాటిని విడదీయడం సర్వ సాధారణం. దీన్ని స్వరభక్తి (Anaptyxi/s Epenthesis) అంటారు: తె. జతనము < సం. యత్నః; ప్రా. సలాహో

< సం. శ్లాఘా; ప్రా. దరిసణం < సం. దర్శనం; ప్రా. సిరీ < సం. శ్రీః ప్రా. భారిఆ < సం. భార్యా. ప్రాచీన తెలుగులో ఏండులు < ఏండ్లు కొడవళులు < కొడవళ్లు, ఊళులు < ఊళ్లు వంటి వాటిలో కూడా సర్వరభక్తి ఉంది. కొన్ని సందర్భాలలో పదాదిని కూడా ఇలా అచ్చు చేరడం ఉంది; దీన్ని ఆదిస్వరాగమం (Prothesis) అంటారు. తె. అరదము < సం. రథః ద్రావిడ భాషలలో పదాదిని ర, లలు ఉండవు గాబట్టి వీటిలో మొదలయ్యే సంస్కృత పదాలకు ముందు అచ్చు చేరుతుంది. పై ఉదాహరణలో అకారం చేరడానికి కారణం ఇదే. ఆది స్వరాగమం తెలుగులో కన్న తమిళంలో ప్రచురం: త. ఇరామన్ < సం. రామః త. ఉలకం < సం. లోకః, త. అరసన్, అరయ < సం. రాజా. సంయుక్తాక్షరం పదాదిని లేకుండా చెయ్యడానికి కూడా ఇది ఉపయోగిస్తుంది: ఇస్కూలు < ఇం. స్కూల్.

హలంత పదాల చివర ఉచ్చారణార్థక ఉకారం చేరడం చాలా ద్రావిడ భాషలలో ఉంది: తె. కన్ను (: త. కణ్) పాలు (:త. పాల్).

అచ్చు కొత్తగా వచ్చి చేరినట్లే కొన్ని సందర్భాలలో హల్లు చేరడం కూడా ఉంది. అనునాసిక హల్లు పదాంతంలో ఉన్నప్పుడు గాని, దాని తరవాత ఉచ్చారణలో దానికి సదృశం కాని హల్లు ఉన్నప్పుడు గాని దాని ఉచ్చారణ స్థానంలో పుట్టే స్పర్శం దాని తరవాత చేరుతుంది. ఇటువంటి స్పర్శాన్ని ఆగమస్పర్శం (Excrescent stop) అనవచ్చు. ప్రాచీన తెలుగులో మకారాంత పదాలు ము, మ్ము, ంబు అనే మూడు రూపాలలో ఉంటాయి: వనము. వనమ్ము, వనంబు; చుట్టము; చుట్టమ్ము, చుట్టంబు. వీటి పూర్వరూపం మ్; దీనికి స్పర్శం చేరి ంబు ఏర్పడింది; దీని సమీకరణం వల్ల మ్ము ఏర్పడింది; ఈ రెండు మార్పులూ వైభాషికం. పండు (ప్రా. క. పణ్), పుండు (:త. పుణ్) లలో డకారం కూడా ఆగమస్పర్శమే. ఇంగ్లీషు empty (> aemtig) లో పకారం కూడా ఇటువంటిదే. సంస్కృతంలో న కార స కారాల మధ్య చేరే తకారం ఆగమ స్పర్శానికి మరొక ఉదాహరణ: దేవాన్ సర్వాన్ > దేవాన్ త్సర్వాన్.

## 13.6. వర్ణ లోపం

వర్ణ లోపం (Phonemic Loss) కొన్ని పరిసరాలతో గాని అన్ని పరిసరాలలో గాని జరగవచ్చు. పదాది * చ తెలుగులోనూ దక్షిణ ద్రావిడ భాషలలోనూ లోపిస్తుంది: ఆటు < * చాట్ (:గోండి సారూజ్), కన్నడంలో పదాంతంలో *మ లోపిస్తుంది: మర < * మరమ్ 'చెట్టు'. తెలుగు మందు (:త.మరుంతు), విందు (: త. విరుంతు) వంటి పదాలలో పద మధ్య రేఫ, ఉకారాలు లోపించాయి. ప్రాచీన పదాది సంయుక్త హల్లులలో రేఫ ఇప్పటి భాషలో లోపించింది: ప్రాఁత > పాత, క్రొత్త > కొత్త, మ్రొక్కు > మొక్కు; వ్రాయు > రాయులో మాత్రం రేఫ బదులు వ కారం లోపించింది.

సంస్కృతంలో పదాంత హల్లు ప్రాకృతంలో లోపిస్తుంది; యావత్ > జావ; యశస్ > జసో; తమస్ > తమో.

సంయుక్తాక్షరంలో ఒక హల్లు లోపించినప్పుడు దాని ముందున్న అచ్చు సాధారణంగా దీర్ఘ మవుతుంది; ఇది హల్లోపకృత స్వరదీర్ఘత (Compensatory Lengthening) గుర్రములు > గుర్రాలు, మంచములు >మంచాలు ఇత్యాదులలో బహువచన ప్రత్యయం ముందు ము లోపించి దాని పూర్వ స్వరం దీర్ఘమయింది. కొన్ని ప్రాకృతోదాహరణలు: దాహిణో < దక్షిణః ఆసో < అశ్వః, వాసో < వర్షః, వీసా < వింశతిః, తీసా < త్రింశత్ (చూ. సంస్కృతం అగ్నిర్ -రథః < అగ్నీరథః, డ్రలోపే పూర్వస్య దీర్ఘోఽణః, అష్టాధ్యాయి 6.3.111).

పదాంత స్వరలోపాన్ని Apocope అనీ, పద మధ్య స్వరలోపాన్ని Syncope అనీ వ్యవహరిస్తారు. పదాంత హ్రస్వ స్వరలోపం హిందీ వంటి ఆర్య భాషలలో ప్రచురం; హాథ్ < హస్త-, ముహ్ < ముఖ-. పదాదిస్వర లోపం (Aphaeresis) కూడా కొన్ని భాషలలో ఉంది; మలయాళం రంటు < *ఇరంటు; ప్రా. రణ్ణం < సం. అరణ్యం.

వర్ణ లోపంలో సదృశ వర్ణలోపం (Haplology) ఒక రకం. ఒక పదంలో సదృశవర్ణాలు రెండు ఉంటే వాటిలో ఒకటి సాధారణంగా లోపిస్తుంది; haplology ని haplogy అని ఉచ్చరించడమే దీనికి ఒక ఉదాహరణం. ఇంగ్లీషులో

gently < * gentlely, simply < * simplely వంటి వాటిలో క్రియా విశేషణ ప్రత్యయమైన -ly కి ముందు ఉన్న le లోపించింది. లాటిన్‌లో nu : tri:- tri : x > nuitri : x 'దాది' ఒక tri : లోపించింది.

పద మధ్య హల్లు లోపించినపుడు దాని ముందు వెనకల ఉన్న అచ్చులు రెండూ కలిసి ఒక దీర్ఘాచ్చుగా మారడం సాధారణం; ప్రా. మోరో, మ ఊరో < సం. మయూరం, ప్రా. లోణం, లఅణం < సం. లవణం (చూ. 13.4. కూడా)

## 13.7. క్వాచిత్క - ధ్వనిపరిణామాలు

ఇంతవరకు మనం చర్చించిన ధ్వని పరిణామాలు సార్వత్రికమైనవి. అంటే వాటిలో ఒక్కొక్క ధ్వని పరిణామం దాని నియతికి లోబడిన పదాలు అన్నింటిలోనూ లేక ఇంచుమించు అన్నింటిలోనూ ప్రవర్తిస్తుంది. కాని కొన్ని పదాలలో ధ్వనుల మార్పు ధ్వని పరిణామం వల్ల కాక ఇతర కారణాల వల్ల జరుగుతుంది. ఇటువంటి మార్పు ఒకటి లేక రెండు మూడు పదాలకి మాత్రమే పరిమితమై ఉంటుంది.

సన్నిహిత పదమేళనం (Contamination), ఇటువంటి క్వాచిత్కమైన మార్పు, ఒక పదం అర్థరీత్యా దానికి సన్నిహితమైన మరొక పదం ప్రభావం వల్ల ధ్వనులలో మార్పు పొందుతుంది. మలయాళం, కొడగులలో ముప్పైకి 'ముప్పదు' అని ఉండవలసిన దానికి బదులు 'నుప్పదు' అని ఉంది. దీనిలో మకారం నకారంగా మారడం నాల్ పదు '40' అనే దాని ప్రభావం వల్ల సన్నమాట. తెలుగు ఎనిమిదిలో ఎన్-అంటేనే ఎనిమిది అని త. ఎట్టు, క. ఎంటు అనే రూపాల వల్ల తెలుస్తుంది. ఒదులోనూ తొమ్మిది (<* తొళ్-మిది, త. తొళ్ '9') లోనూ-మిది వీటి తరవాత వచ్చే సంఖ్య పది సాహచర్యం వల్ల వచ్చి చేరింది. ప్రపంచ భాషలలో సంఖ్యా వాచకాలలో సన్నిహిత పదమేళనం కనపడుతోంది. దీనికి కారణం వస్తువులు లెక్క పెట్టేటప్పుడు ఒకటి, రెండు, మూడు-ఇలా సంఖ్యావాచకాలు వరసగా రావడం. ఇంగ్లీషులో four లో f five లోని f ప్రభావం వల్ల వచ్చింది, five, < మూల ఇండో యూరోపియన్ * penkwe (సం. పంచ), four < * kwetwoores (సం. చత్వారః). * kw ధ్వని సూత్రానుసారంగ ఇంగ్లీషు f గా

మారదు. లాటిన్‌లో quinque '5'లో qu quattuor '4' ప్రభావం వల్ల ఏర్పడింది.

ఆభాస ప్రమాణీకరణం (Hyperstandardization) మరొక క్వాచిత్కమైన మార్పు. పామరులు ప్రమాణ మాండలికాన్ని మాట్లాడాలనే తాపత్రయంతో మార్పు అవసరం లేని పదాలలో కూడా ప్రమాణ మాండలికానికి సంబంధించిన ధ్వనులని వాడతారు. తెలుగులో పామర బాషలో అగ్రాచ్చుల ముందు వ కారం లోపిస్తుంది : విను > ఇను, వీలు > ఈలు, వేడి > ఏడి. వారు అగ్రజాతులతో మాట్లాడేటప్పుడు ఇటువంటి మాటలలోనే కాక ఈగ, ఎలుక మొదలైన వాటిలో కూడా పదాది వ కారం చేర్చవచ్చు. ప్రాచీన భాష రాసేటప్పుడు కూడా ఆభాస ప్రమాణీకరణం జరగడానికి అవకాశం ఉంది. ప్రాచీన తెలుగులో ఱ, రలు భిన్న వర్ణాలు; ఇప్పటి భాషలో ఈ భేదం లేకపోవడం వల్ల కొందరు నూఱు, వేఱు 'భిన్నం', అఱు వంటివాటిలో ఱ రాయడమేకాక ఇరు కొందరు నూఱు, వేఱు 'భిన్నం' అఱు వంటివాటిలో ఱ రాయడమేకాక ఇరువురు, ఊరు, (చెట్టు) వేరు ఇంటి పదాలలో కూడా రేఫ బదులు ఱ రాస్తారు.

చదువుకోనివారు ఇంగ్లీషు మాటలలో f కి బదలు వాడతారు: fees > ఫీజు; నిర్దుష్టంగా మాట్లాడాలని కొందరు చదువుకోని స్త్రీలు ప్రింటు చీరలు అనడానిక ఫ్రింటు చీరలు అంటారు.

## 13.8 తారతమ్య చరిత్ర

ఒక భాషలో ధ్వని పరిణామం ఏ కాలంలో జరిగిందో నిర్ణయించడానికి ప్రాచీన శాసనాలు, సాహిత్య గ్రంథాలు అవసరం. కన్నడంలో * ప హ గా పదో శతాబ్ది ప్రాంతంలో జరిగిందని శాసనాధారాలవల్ల తెలిసింది. కాని ప్రతిధ్వని పరిణామానికి ఇలా కాలం నిర్ణయించడం సాధ్యం కాదు. చారిత్రకాధారాలు దొరకని కాలంలో జరిగిన పరిణామాలకూ, చారిత్రకాధారాలు అసలే లేని ఆటవిక భాషలలో జరిగిన పరిణామాలకూ కాలం నిర్ణయించడం అసాధ్యం. కాని ఒక భాషలో పరస్పర సంబంధం గల పరిణామాలు జరిగినప్పుడు వాటిలో ఏది

ముందో ఏది వెనకో కొన్ని సందర్భాలలో నిర్ణయించవచ్చు. ఇలా ధ్వని పరిణామాల ముందు వెనకలు నిర్ణయించడమే తారతమ్య చరిత్ర (Relative Chronology).

తెలుగులో పదాది * క అగ్రాచ్చుల ముందు చగా మారింది. * కెటు > చెడు, * కిళి > చిలుక; ఈ మార్పు * కయ్ > చేయిలో కూడా ఉంది.కాని * కయ్‌లో అ అగ్రాచ్చు కాదు, కాబట్టి * కయ్ *కెయ్‌గా మారిన తరవాత అందులో * క కారం చగా మారిందన్న మాట.ఇక్కడ రెండు మార్పులు ఉన్నాయి.

1. * అయ్ >* ఎయ్ >* ఏయ్ ఏకాచ్కి పదాలలో*)

2. * క > చ/– అగ్రాచ్చు

ఈ రెండు మార్పులు పైన ఇచ్చిన క్రమంలో జరిగతేనే చేయి అనే రూపం సిద్ధిస్తుంది. తాలవ్యీకరణం ముందు జరిగి ఉంటే అప్పటికి * కయ్‌లో అగ్రాచ్చు లేదు కాబట్టి అది ఈ పదంలో జరిగి ఉండేది కాదు. ఏ ధ్వని పరిణామమైనా భాషలో కొంత కాలం పాటు జరిగి నిలిచిపోతుంది. కాబట్టి తరవాత కాలంలో పరిణామాల వల్ల దాని పరిధిలోకి వచ్చిన పదాలలో అది ప్రవర్తించదు.

తెలుగులో పదాది * చకారలోపం జరిగింది; ఆటు < * చాట్; ఉప్పు < * చుప్పు (: పర్జీ చుప్) కాని తాలవ్యీకరణం వల్ల * క చగా మారిన రూపాలలో చకారం లోపించలేదు. కాబట్టిపదాది చకారలోపం జరిగి ఆగిపోయాక తాలవ్యీకరణం జరిగిందని నిశ్చయించవచ్చు. సంస్కృతం చ < * kwe లో తాలవ్యీకరణం, * ఎ < అ అనే రెండు మార్పులు ఉన్నాయి. తాలవ్యీకరణం జరిగాకే * ఎ అగా మారి ఉండాలి. లేకపోతే * ఎ అగా మారేక తాలవ్యీకరణం జరిగే అవకాశం లేదు.

కింది కోత భాషలో ఉదాహరణలు పరిశీలించండి.

| కోత | తమిళం | తెలుగు |
|---|---|---|
| కెడ్(< * కొడై) | కుడై | గొడుగు |
| కిప్ | కుప్పై | కుప్ప |

| | | |
|---|---|---|
| పీచ్ | ప్యూచ్చె | (పిల్లి) |
| ఏడ్ట్ | ఓట్టై | (రెల్లుగడ్డి) |

1. ` * అయ్ (*ఐ) > * ఎ
2. *ఉ, * ఊ, * ఒ, * ఓ > ఇ, ఈ, ఎ, ఏ/– * ఎ
3. * ఎ > లోపం (పదాంతంలో).

పదాంతంలో * అయ్ ముందు అగ్రాచ్చైన ఎ గా మారింది ( ఈ మార్పు కన్నడం, వ్యావహారిక తమిళాలలో కూడా ఉంది). ఈ ఎతో మొదటి అక్షరంలో పశ్చిమాచ్చు సమీకరణం పొంది అగ్రాచ్చుగా మారింది. ఆ తరవాత పదాంతంలో ఎ లోపించింది. ఈ పరిణామాల వరస మార్చి చూస్తే పై కోత రూపాలు సాధించబడవే. (ఉదాహరణకి * అయ్ ఎ గా మారకుండానే ముందే లోపించింది అనుకొంటే పశ్చిమాచ్చు అగ్రాచ్చుగా మారడానికి కావలసిన పరిసరం ఉండదు).

పరస్పర సంబంధంలేని ధ్వని పరిణామాల విషయంలో తారతమ్య చరిత్ర కనుక్కోవడం అసాధ్యం.

# 14. వ్యాకరణ నిర్మాణ పరిణామం

## 14.11. వాక్య సంబంధ సూచకాలలో మార్పు

భాష కాలక్రమంలో మారేటప్పుడు వర్ణ నిర్మాణంలో మార్పులు వచ్చినట్లే వ్యాకరణ నిర్మాణంలో కూడా మార్పులు వస్తాయి. వ్యాకరణ నిర్మాణంలో మార్పులు ధ్వని పరిణామం వల్ల గాని సామ్యం (చూ॰ 14.6) వల్ల గాని పరిసర భాషా ప్రభావం (చూ. 9.5, 9.6, 16వ అధ్యాయం) వల్లగాని ఏర్పడతాయి. ఇటువంటి కారణాలు లేకుండా కూడా వ్యాకరణ నిర్మాణంలో మార్పు జరగవచ్చు; కొన్ని సందర్భాలలో ఇటువంటి మార్పుకి కారణం ప్రస్తుతానికి మనకు తెలియకపోయినా తరవాత పరిశోధనల వల్ల తెలియవచ్చు. ఈ విభాగంలో వాక్య సంబంధం సూచకాలలో మార్పు ఏర్పడే విధానం మొదట పరిశీలించి వ్యాకరణ నిర్మాణ పరిణామంలో మిగిలిన రకాలని తరవాత చూద్దాం.

ఒక వాక్యంలో పదాలకు ఉన్న పరస్పర సంబంధాలలో స్థాన సంబంధం ఒకటి అని 6.1లో చూశాం.ఉదాహరణకు తెలుగులో విశేషణాలు వాటి తరవాత ఉన్న నామవాచకానికి సంబంధిస్తాయి కాని వాక్యంలో మరొకచోట ఉన్న నామ వాచకాలకు సంబంధించవు. ఇటాలియన్, ఫ్రెంచి, ఇంగ్లీషు మొదలైన ఇప్పటి యూరోపియన్ భాషలలో వాక్యంలో పదాలస్థానం అర్థవ్యక్తికి ముఖ్యం॰ క్రియకు ముందున్న నామం కర్త, క్రియ తరవాత ఉన్నది కర్మ, ఇలా పదాల స్థానానికి ప్రాముఖ్యం విభక్తి ప్రత్యయాలు కాలక్రమంలో లోపించడం వల్ల ఈ భాషలో ఏర్పడిందని లాటిన్ భాషను చూస్తే మనకు తెలుస్తుంది. లాటిన్‌లో సంస్కృతంలో లాగే పదాల స్థానాన్ని యథేచ్ఛగా మార్చవచ్చు. సంస్కృతంలో "పుష్పధన్వాచ సంమోహనం నామ అమోఘం బాణం ధనుషి సమధత్త" (మన్మథుడు కూడా సమ్మోహనం అనే అమోఘమైన బాణాన్ని ధనుస్సులో సంధించాడు) అనే వాక్యాన్ని కాళిదాసు ఇలా చెప్పేడు-

"సంమోహనం నామచ పుష్పధన్వా ధనుష్యమోఘం సమధత్త బాణమ్"

పై శ్లోకంలో పదాలస్థానం మారినా విభక్తి ప్రత్యయాల వల్లా, విశేషణాలకీ నామవాచకాలకీ మధ్య ఉన్న లింగ వచన విభక్తుల్లో అన్వయం వల్లా ఏ పదం ఏ పదానికి సన్నిహితమో తెలుసుకోవడం కష్టం కాదు. లాటిన్‌లో కూడా ఇలాగే పదాల స్థానం నిర్ణీతం కాదు. కాని దాని నుంచి పుట్టిన ఫ్రెంచి, ఇటాలియన్ వంటి భాషలలో విభక్తి ప్రత్యయాలు ధ్వని పరిణామం వల్ల లోపించడంతో మొదట్లో అవి నిర్వహించే కారక సంబంధ సూచన ఇప్పుడు పదక్రమంపై పడింది. ఇలాగే ఫ్రెంచిలో విశేషణాల స్థానం కూడా నియతమైంది; చాలా విశేషణాలు నామవాచకం తరవాత వస్తాయి, కొన్ని మాత్రం నామవాచకం ముందు వస్తాయి. కాని దీని పూర్వ రూపమైన లాటిన్‌లో విశేషణాలు నామవాచకం పక్కనే ఉండాలనే నియమం లేదు.

సంస్కృతంలో ఉపసర్గల స్థానం కూడా కాలక్రమంలో నియతమైంది. వైదిక భాషలో ఉపసర్గలు ప్రత్యేక పదాలు; అవి క్రియకి ముందు ఉండవచ్చు, వెనక ఉండవచ్చు; క్రియకీ వాటికీ మధ్య ఇతర పదాలు ఉండవచ్చు – 'నియాతి హస్తినా'కి బదులు 'యాతి ని హస్తినా' అని వేదంలో 'ని' అనే ఉపసర్గ 'యాతి' అనే ఉపసర్గకీ 'యాహి' అనే క్రియకీ మధ్య ఇతర పదాలు ఉన్నాయి. (ఇంద్రుడా! వేగవంతమైన గుర్రాల మీద రా అని దీని అర్థం). లౌకిక సంస్కృతంలో ఉపసర్గ క్రియకి ముందే అవ్యవహితంగా ఉండాలనే నియమం ఏర్పడింది.

## 14.2 శబ్దావళీ పరిణామాలు

ఒక నామవాచకానికి గాని క్రియాధాతువుకు గాని వేరువేరు ప్రత్యయాలు చేర్చడం వల్ల ఏర్పడే రూపాల సముదాయం శబ్దావళి (Paradigm). శబ్దావళిలో ఒక ప్రత్యయం స్థానం మరొక ప్రత్యయం ఆక్రమించవచ్చు. ఇది సామ్యం వల్ల జరగవచ్చు. సామ్యం వల్ల కాక ఇతర కారణాలవల్ల కూడా ఇలా జరగవచ్చు. ప్రాచీన తెలుగులో భావార్థక ప్రత్యయం–ట, తిను–ట, చెప్పు–ట, అడుగుగ–ట ఇప్పటి తెలుగులో–ట బదలు (ఉత్తర మాం.) –అడం/దక్షిణమాం.)–అటం. ప్రత్యయం ఉంది. తినడం/తినటం, చెప్పడం/చెప్పటం, అడగడం/అడగటం.ఈ మార్పుకు సామ్యం కారణం కాదు. ఇలాగే ప్రాచీన తెలుగులో వ్యతిరేక భావర్థక

ప్రత్యయం - అ-మి (ఇందులో -అ- వ్యతిరేక ప్రత్యయం,-మి కృత్ప్రత్యం):తినమి, చెప్పమి, అడుగమి. ఇప్పటితెలుగులో దీనికి బదులు వ్యతిరేక క్త్వార్థకానికి 'పోవు' అనే సహాయక క్రియ భావార్థక రూపం చేర్చడం వల్ల ఈ అర్థం వ్యక్తీకరించబడుతోంది. తినకపోవడం, చెప్పకపోవడం, అడగకపోవడం. ఇందులో కూడా సామ్యం ప్రసక్తి లేదు.

ప్రాచీన తెలుగులో విధ్యేకవచన ప్రత్యయం- ము, ఇది వైభాషికం; విధి బహువచన ప్రత్యయం -ండు (దీని పూర్వ రూపం(*-మ్‌ట్). తమిళం వంటి ఇతర ద్రావిడ భాషలవల్ల మూలద్రావిడంలో విధ్యేకవచనానికి ప్రత్యయమేలేదనీ, విధి బహువచనానికి ప్రత్యం *-ఇమ్ (> త-ఉమ్) అనీ తెలుస్తుంది.

| ఏ.వ. | బ.వ. |
|---|---|
| తె. చేయు(ము) | చేయుఁడు |
| త. చెయ్ | చెయ్యుమ్ |
| క. గెయ్ | గెయ్యిమ్ |
| గోం.కీమ్ | కీమ్‌ట్ |

మూలభాషలో బహువచనానికి చెందిన మకారం తెలుగులో ఏకవచన ప్రత్యయంగా మారింది. (గోండీ, కూయి, కువి, పెంగోలలో కూడా ఇటువంటి మార్పు ఉంది కాబట్టి ఇవి మూల తెలుగు-కువి భాషలో జరిగి ఉండాలి). దీనికి కారణం బహువచనంలో ( * ట్ అనే కొత్త ప్రత్యయం రావడం కావచ్చు.

తెలుగులో ప్రాచీన భాషకీ ఆధునిక భాషకీ భూతభవిష్యత్కాల ప్రత్యయాలలో చాలా తేడా ఉంది. ప్రాచీన భాషలో భూత ప్రత్యయం -ఇతి- (~-టి-), ∞ -ఇ-∞ఎను; ఇప్పటి భాషలో ఏ-(∞-ఇన్-) (రాయలసీమలో -ఇనా- ∞ ఇన్-). ప్రాచీన భాషలో భవిష్యత్ప్రత్యయం -దు-/ -ఎద- ∞ -ఉను; ఇప్పటి -తా-(తున్-. వీటి మధ్య భేదం ధ్వని పరిణామం వల్ల వచ్చినది కాదని స్పష్టం.

| | భూతకాలం | | భవిష్యత్కాలం | |
|---|---|---|---|---|
| | ప్రా. | ఆ. | ప్రా. | ఆ. |
| నేను | చేసితిని | చేశాను | చేయుదును (/చేసెదను) | చేస్తాను |
| మేము | చేసితిమి | చేశాం | | |
| మనము | ,, | ,, | చేయుదుము | చేస్తాం |
| నీవు } నువ్వు } | _చేసితి(వి) | చేశావు | చేయుదము | చేద్దాం |
| | | | చేయుదు(వు) | చేస్తావు |
| మీరు | చేసితిరి | చేశారు | చేయుదురు | చేస్తారు |
| వాఁడు | చేసెను | చేశాడు | చేయును | చేస్తాడు |
| అది | ,, | చేసింది | ,, | చేస్తుంది |
| అవి | ,, | చేశాయి | ,, | చేస్తాయి |
| వారు } వాళ్లు } | చేసిరి | చేశారు | చేయుదురు | చేస్తారు |

పై శబ్దావళిలో ప్రాచీనాధునిక భాషలలో ప్రత్యయాలు వేరవడమే కాక మరొక విశేషం కూడా ఉంది. ప్రాచీన భాషలో రెండు కాలాలలోనూ వాడు, అది, అవి అనే మూడింటికీ ఒకే క్రియారూపం అన్వయిస్తుంది. ఆధునిక భాషలో ఈ మూడిటికీ అన్వయించే క్రియారూపాలు వేరు వేరుగా ఏర్పడ్డాయి. ఈ కొత్త క్రియారూపాలు మిగిలిన క్రియారూపాలలోని కాల ప్రత్యయాలకు ఈ మూడు సర్వనామాలకూ తగిన పురుష ప్రత్యయాలు చేర్చడం వల్ల ఏర్పడ్డాయి. ఇలా మొదట్లో ఒక రూపానికి బదులు ఇప్పుడు మూడు రూపాలు ఏర్పడడం వల్ల ప్రాచీన భాషలోని అర్థసందిగ్ధత తొలగి స్పష్టత ఏర్పడింది.

ప్రాచీన కాలంలో ప్రత్యయానికి సంబంధించిన ధ్వని తరవాత కాలంలో ధాతువులో భాగంగా చేరిపోవడం కూడా చాలా భాషలలో ఉంది. తెలుగులో

నిలుచు, వచ్చు, చూచువంటి క్రియలలో చువర్ణం మొదట్లో క్త్వార్థక ప్రత్యయానికి చెందినది. వీటిలో క్త్వార్థక ప్రత్యయం మొదట్లో – చి గాని – ఇ కాదు. తె. నిలిచి (గోండి నిల్–సీ–), వచ్చి (గోండి వా–సీ), చూచి (గోండి సూడ్–సీ). కాని తెలుగులో – ఇ క్త్వార్థక ప్రత్యయంగా చాలా క్రియలలో ఉండడం వల్ల (తివి, వివి, అడిగి మొ.) వీటిలో కూడా – ఇ యే క్త్వార్థక ప్రత్యయమని వ్యవహర్తలు భ్రమించి మిగిలిన చకారాన్ని ధాతువులలో కలిపివేశారు. ఇలాగే ఆధునిక పర్షియన్ భాషలో క్రియలలో మొదట్లో ప్రథమ పురుషకు చెందిన తకారం ఉత్తమ మధ్యమ పురుష రూపాలకు కూడా చేర్చబడింది. ఈ భాషలో రూపాలని సంస్కృతంతో పోలిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది:

| | సంస్కృతం | ఆధునిక పర్షియన్ | |
|---|---|---|---|
| (ఉ.పు.) | అస్మి | హస్తమ్ | 'ఉన్నాను' |
| (మ.పు.) | అసి | హస్తి | 'ఉన్నావు' |
| (ప్ర.పు.) | అస్తి | హస్త్ | 'ఉంది, ఉన్నాడు' |

## 14.3. సంవర్గసృష్టి

భాషా పరిణామంలో ఒక వ్యాకరణ సంవర్గాన్ని సూచించే ప్రత్యయాలు మారడం సమాజమని పై చర్చ వల్ల స్పష్టం. ఇంతే కాక ఒక భాషలో నూతన సంవర్గాలు పుట్టడం, ప్రాచీన దశలో ఉన్న సంవర్గాలు తరవాత దశలో లోపించడం అనేవి రెండూ కూడా ఉన్నాయి.

ద్రావిడ భాషలలో మొదట్లో వర్తమాన కాలానికి ప్రత్యేక క్రియా రూపాలు లేవు. భవిష్యత్కాల క్రియారూపాలే వర్తమానార్థంలో కూడా వాడబడుతూ ఉండేవి. తమిళంలో వర్తమాన కాలప్రత్యయం – కిన్ఱ్–. కాని ప్రాచీనమైన సంఘవాఙ్మయంలో దీనికి ప్రాచుర్యం చాలా తక్కువ. తెలుగులో వర్తమానార్థంశత్రర్థకానికి 'ఉండు' అనే క్రియ ధాతుజ విశేషణనామాలు చేర్చడం వల్ల వ్యక్తీ కరించబడుతుంది. చేయుచునున్నవాఁడు/ చేయుచున్నవాఁడు/ చేయుచున్నాఁడు, మొ. ఆధునిక భాషలో చేస్తున్నాడు మొదలైన రూపాలు

కూడా చేస్తూ+ఉన్నాడు మొదలైన రెండు పదాలనించి వచ్చినవే కాని ఏకపదంగా కలిసిపోయాయి. అందువల్ల ఇప్పుడు – తున్నా–, –తోన్– (వస్తోంది, మొ.) వర్తమాన కాల ప్రత్యయాలుగా కనపడుతున్నాయి. మొదట్లో బహుపద నిర్మాణంగా ఉన్నది ఏక పద నిర్మాణంగా మారడానికి ఇది మంచి ఉదాహరణ. వలయును అనే ప్రత్యేక క్రియ – ఆలి అనే ప్రత్యయంగా మారడం మరొక ఉదాహరణః చేయవలయును > చెయ్యాలి.

తమిళం మొదలైన దక్షిణ ద్రావిడ భాషలలో స్త్రీని సూచించడానికి ప్రత్యేక సర్వనామాలు ఉన్నాయిః త. అవళ్ 'ఆమె', ఇవళ్ 'ఈమె'. ఇంతేకాక వీటితో అన్వయించే ప్రత్యేక క్రియారూపాలు కూడా అళ్ ప్రత్యయంతో ఉన్నాయిః అవళ్/ఇవళ్ వంతాళ్ 'ఆమె/ఈమె వచ్చింది', వరుకిఱాళ్ 'వస్తోంది', వరువాళ్ 'వస్తుంది'. ఈ స్త్రీ వాచక సర్వనామాలూ, వాటికి సంబంధించిన క్రియారూపాలూ దక్షిణ ద్రావిడ భాషలలో కొత్తగా ఏర్పడ్డవనీ, మూలద్రావిడ భాషకు చెందినకావనీ పండితుల అభిప్రాయం. ఈ భాషలలో స్త్రీ లింగ సంవర్గం కొత్తగా సృష్టించబడిందన్నమాట. తెలుగులో ప్రాచీన భాషలో 'అది' అనేదే స్త్రీకీ, మనుష్యేతరాలకీ కూడా వాడబడేది. స్పష్టత అవసరమైతే 'అమ్మదిత' ఇలా స్త్రీ పర్యాయ పదం వాడబడేది. ఇప్పటి భాషలో ఆమె/ఆవిడ, ఆమె/ఈవిడ ఉన్నా ఇవి మొదట్లో రెండు పదాలుః ఆమె / ఆపె <* ఆ పెణ్, ఆవిడ < ఆ బిడ్డ. ఇలా సర్వనామాలలో తమిళానికీ ఇప్పటి తెలుగుకీ సమానత్వం ఏర్పడినా క్రియలలో ఇంకా భేదం మిగిలింది. తెలుగులో స్త్రీ వాచక సర్వనామాలకి సంబంధించిన ప్రత్యేక క్రియా రూపాలు ఏర్పడలేదుః ఆమె/ఆవిడ 'వచ్చారు' అనాలి, లేకపోతే 'వచ్చింది' అనాలి. 'వచ్చారు' 'వాళ్లు' అనే సర్వనామంతో కూడా అన్వయిస్తుంది; అలాగే 'వచ్చింది' 'అది'తో కూడా అన్వయిస్తుంది.

14.2లో వివరించినట్టు ఇప్పటి తెలుగులో క్రియలలో మహదేకవచనం (చేశాడు, చేస్తాడు), అమహదేకవచనం (చేసింది, చేస్తుంది), అమనుష్య బహువచనం (చేశాయి, చేస్తయి) అనే సంవర్గాలు కొత్తగా సృష్టించబడ్డాయి.

భాషలలో సహాయక క్రియలుగా ఉపయోగపడేవి చాలా వరకు మొదట్లో స్వతంత్ర క్రియలుగా ఉన్నవే అయి ఉంటాయి. ఇప్పటి ఇంగ్లీషులో

భవిష్యత్కాలాన్ని సూచించే సహాయక క్రియలు shall, will ల పూర్వరూపాలు sculan, willan. ప్రాచీనాంగ్లంలో sculan కు అర్థం 'చెయ్యవలసివచ్చు' willan కు అర్థం 'చేయగోరు'. ఇవి ఆ కాలంలో స్వతంత్ర క్రియలు.

తెలుగులో సామర్థ్యాన్ని సూచించే 'గల, గలుగు' అనే సహాయక క్రియ పూర్వరూపం 'కలుగు' (వాడు పాడగలడు, పాడగలిగేడు (భూతం), పాడగలుగుతున్నాడు (వర్తమానం), పాడగలుగుతాడు (భవిష్యత్తు). ప్రాచీన తెలుగులో 'కలుగు'కి అర్థం 'ఉండు, పుట్టు', ఇది ప్రాచీన భాషలో స్వతంత్ర క్రియగానూ, సహాయక క్రియగానూ కూడా ఉండేది. వాఁడు కలఁడు, వాఁడు నిన్నున్ ఓర్వఁగలఁడు/గలవాఁడు. ఇప్పుడు ఇది సహాయక క్రియగా మాత్రమే ఉపయుక్తమవుతోంది.కాబట్టి, 'వాడు పాడగలడు' అనే దాని ప్రాచీనార్థం 'వాడు పాడడానికి ఉన్నాడు' అని; దీని నించి సామర్థ్యం అనే అర్థం ఏర్పడింది, ప్రాచీన భాషలో దీనికి భవిష్యత్కాలార్థం కూడా ఉంది.కొన్ని క్రియలు స్వతంత్ర క్రియలుగానూ, సహాయక క్రియలుగానూ కూడా ఇప్పటి భాషలో ఉన్నాయి. ఉదాహరణకి వచ్చు, పోవు అనేవి స్వతంత్ర క్రియలుగా ఉన్నాయి; చెయ్యవచ్చు, చెయ్యబోయాను వంటివాటిలో ఇవి సహాయక క్రియలుగా ప్రయుక్తమవుతున్నాయి. వచ్చు సహాయక క్రియగా ఉన్నప్పుడు దీని అర్థాలు 'అభ్యజ్ఞ'( permission ) 'సంభావన' (Possibility) సహాయక క్రియ అయిన పోవుకి తమర్థకం తరవాత వస్తే 'ప్రయత్నించు' (చెయ్యబోయాను), 'ముఖ్య క్రియ చేసే పరిస్థితి ఏర్పడు '(పడబోయాను) అని అర్థం; అది క్త్వార్థకం తరవాత వస్తే 'ముఖ్యక్రియా సమాప్తి, శీఘ్రత' (వెళ్లిపోయాడు) అని అర్థం. 'పెట్టు'కి స్వతంత్ర క్రియగా 'ఒక చోట ఉంచడం, వడ్డించడం' అని అర్థం. ఇది సహాయక క్రియ అయినప్పుడు 'ముఖ్య క్రియ చేసి ఇతరులకు సహాయంచెయ్యడం' అని అర్థం ('ఆవిడ పక్కింటివాళ్లకి అన్నం వండి పెట్టింది' అన్నప్పుడు 'వండి'కీ 'పెట్టింది'కీ మధ్య వ్యవధానం ఉంటే 'అన్నం వండి ఒక చోట పెట్టింది లేక వడ్డించింది' అని అర్థం వ్యవధానం లేకపోతే 'అన్నం వండడం రూపంలో సాయం చేసింది' అని అర్థం). సహాయక క్రియల అర్థాలు అవి ముఖ్య క్రియలుగా ఉన్నప్పటి అర్థాలు నించి ఏదో ఒక విధంగా పరిణమించినవే అయి ఉంటాయి.

## 14.4 సంవర్గలోపం

సంస్కృతంలో మూడు లింగాలూ, మూడు వచనాలూ (ఏక, ద్వి, బహు) ఉన్నాయి. దీనినించి పుట్టిన హిందీలో రెండు లింగాలూ (పుంలింగం, స్త్రీ లింగం) రెండు వచనాలూ మాత్రమే ఉన్నాయి. ఇందులో నపుంసక లింగం, ద్వివచనం అనే రెండు సంవర్గాలూ లోపించాయి. ద్వివచనం సంస్కృతంలోనే కాక ప్రాచీన గ్రీక్‌లోనూ, ఇప్పటి భాషలైన లిథువానియన్, స్లొవేనియన్, వెండిష్‌లలోనూ ఉంది కాబట్టి ఇది మూల ఇండో యూరపియన్‌కు చెందినదై ఉండాలి. లాటిన్ మొదలైన ఇతర ఇండోయూరపియన్ భాషలలో (తరవాత కాలపు గ్రీక్‌తో సహా) ఇది లోపించింది.

మూడు లింగాలు సంస్కృతం, గ్రీక్, లాటిన్ లలోనే కాక ఇంకా చాలా ఇండోయూరపియన్ భాషలలో ఉన్నాయి. జర్మన్‌లో మూడు లింగాలు ఇప్పటికీ ఉన్నాయి. ఫ్రెంచి మొదలైన రొమాన్సు భాషలలో నపుంసకలింగం పుంలింగంలో కలిసిపోవడం వల్ల పుంలింగం, స్త్రీ లింగం అనేవి రెండే మిగిలాయి. ఇంగ్లీషులో లింగ భేదం సర్వనామాలలో మాత్రమే మిగిలింది. విశేషణాలలోనూ క్రియలలోనూ నశించింది.

మూల ఇండోయూరపియన్‌లో సంస్కృతంలోలా ఏడు విభక్తులు ఉన్నాయి (సంబోధన ప్రత్యేక విభక్తిగా పరిగణిస్తే ఎనిమిది). లాటిన్‌లో ప్రాచీన కాలపు తృతీయా, సప్తమీ విభక్తులు పంచమీ విభక్తితో కలిసిపోయాయి. అందువల్ల ఇందులో ఆరు విభక్తులే ఉన్నాయి. గ్రీకులో ప్రాచీన కాలపు పంచమీ విభక్తి షష్ఠీ విభక్తితో కలిసిపోయింది; ప్రాచీనకాలపు తృతీయా సప్తమీ విభక్తులు చతుర్థిలో కలిసిపోయాయి; అందువల్ల ఇందులో అయిదు విభక్తులే ఉన్నాయి. తరవాత కాలపు లాటిన్‌లో పదాంతంలో మకారం లోపించడం వల్ల ద్వితీయా పంచమీ విభక్తులు ఒకటిగా కలిసిపోయాయి. ధ్వని పరిణామం వల్ల వ్యాకరణంలో మార్పు ఏర్పడడానికి ఇది ఒక చక్కని ఉదాహరణ. లాటిన్ నించి వచ్చిన ఫ్రెంచి మొదలైన రొమాన్సు భాషలో విభక్తి ప్రత్యయాలు నశించి వాటి పనిని పూర్వ సర్గలు నిర్వహిస్తున్నాయి. అలాగే సంస్కృతంలోని విభక్తి ప్రత్యయాలు ఇప్పటి ఇండో ఆర్యన్ భాషలలో నశించడం వల్ల వాటి పనిని పరసర్గలు నిర్వహిస్తున్నాయి.

మూల ద్రావిడంలో ఉత్తమ పురుష బహువచనంలో రెండు సర్వనామాలు ఉన్నాయి; అందులో ఒకటి శ్రోతను కలుపుకోనిది (అనుభయార్థకం) * యామ్ (> తె. ఏము. మేము): రెండోది శ్రోతను కలుపుకొనేది (ఉభయార్థకం) * నామ్ (> తె. మనము). ఈ భేదం చాలా ద్రావిడ భాషలలో ఉంది కాని, ఆధునిక కన్నడంలో ఇది నశించింది; ఆధునిక కన్నడంలో నావు ( < * నామ్)కి అర్థం 'మేము', 'మనము' కూడా వర్ణ పరిణామం దృష్ట్యా కన్నడంలో * నామ్ మిగిలింది; * యామ్ నశించింది అని చెప్పాలి. బ్రాహుయీలో కూడా ఇటువంటి మార్పే జరిగింది; ఇందులోకూడా నన్ (* < నామ)కి అర్థం 'మేము, మనము, తెలుగులో మేము', 'మనము' తెలుగులో మేము, మనము అనే సర్వనామాలకి సంబంధించి భవిష్యత్కాలంలో రెండు ప్రత్యేక క్రియలు ఉన్నాయి; మేము చేస్తాం, మనం చేద్దాం; రాయలసీమ మాండలికంలో 'చేద్దాం' అనే రూపానికి బదులు 'చేస్తాం' అనేదే వాడబడుతుంది. ఈ మాండలికంలో ఉభయర్థక క్రియ అనే సంవర్గం నశించిందన్న మాట.

## 14.5. వాక్య నిర్మాణ పరిణామం

ప్రాచీన కాలంలో స్వతంత్ర క్రియ అర్వాచీనకాలంలో సహాయక క్రియగా మారడం వాక్య నిర్మాణ పరిణామంలో ఒక రకం; దీనికి ఉదాహరణలు 14.3 లో చూశాం (ముఖ్యంగా 'కలుగు' ఇప్పుడు సహాయక క్రియగానే మిగిలింది). ప్రాచీన తెలుగులో 'భీష్ముని చనుట', 'కోదండగురుని సమయుట', 'కర్ణుని పడుట' వంటివాటిల భావార్థక క్రియ ఉన్నప్పుడు కర్త షష్ఠీ విభక్తిలో ఉంటుంది.; ఇప్పటి తెలుగులో 'భీష్ముడు చచ్చిపోవడం' లా భావార్థక క్రియ కర్త ప్రథమా విభక్తిలోనే ఉంటుంది. ఇది. వాక్య నిర్మాణ పరిణామానికి మరొక ఉదాహరణ.

వలయు (> ఆలి) అనే సహాయక క్రియ వాక్యంలో ఉన్నప్పుడు ప్రాచీన భాషలో కర్త ప్రథమలోగాని చతుర్థిలోగాని ఉండవచ్చు; ఇప్పటి భాషలో కర్త ప్రథమలోనే ఉండుటంది: (ప్రా.) మనకు/మనము చేయవలయును; (ఆ.) మనం చెయ్యాలి. ఇలాగే 'వచ్చు' సహాయక క్రియ ఉన్నప్పుడు ప్రాచీన

తెలుగులో కర్త చతుర్థిలో ఉంటుంది; "కౌంతేయుల కెట్లు బ్రదుకఁగావచ్చు ననిన్"; ఇప్పటి భాషలో "కౌంతేయులు ఎలా బతకగలరు?"

వాక్య నిర్మాణంలో పరిణామాలు పరభాషా ప్రభావం వల్ల కూడా ఏర్పడవచ్చు; తెలుగు మొదలైన ద్రావిడ భాషలో 'పడు' అనే సహాయక క్రియతో కర్మణి ప్రయోగం సంస్కృత భాషా ప్రభావం వల్ల ఏర్పడింది.

## 14.6 సామ్యం

ఒక అర్థవంతమైన రూపం (అర్థకం, పదం లేక పదసముదాయం) దానితో ఏదో ఒక విధంగా సంబంధించిన మరొక అర్థవంతమైన రూపం ప్రభావం వల్ల వల్ల మారడం సామ్యం (Analogy). ధ్వని పరిణామం, సామ్యం అనేవి రెండూ భాషలో మార్పు కలగడానికి కారణమైన ముఖ్య క్రియలు. సామ్యం ముఖ్య లక్షణం, ప్రయోజనం భాషలోని అక్రమబద్ధత (Irregularity) ను తొలగించడం లేక తొలగించడానికి ప్రయత్నించడం. అయితే సామ్యం వల్ల భాషలోని అక్రమబద్ధత పూర్తిగా తొలగించబడుతుందని అనుకోకూడదు. ధ్వని పరిణామానికి అర్థంతో నిమిత్తం లేదు. అది ఒక పరిసరంలోని ఒక రూపం మీద ప్రవర్తించినపుడు ఆ రూపం ఇతర పరిసరాలలోని అదే రూపంతో భేదిస్తుంది. సామ్యం ఇలా ధ్వని పరిణామం వలన భేదించిన రెండు రూపాలని ఒకటిగా చెయ్యడానికి ప్రయత్నిస్తుంది. కొన్ని సందర్భాలలో సామ్యం ధ్వని పరిణామం (కొన్ని ప్రత్యయాలలో) జరగకుండా ఆపుతుంది. ఇది ప్రచురమైన ప్రత్యయాలని ఇంకా ప్రచురం చేసి ప్రాచుర్యం లేని ప్రత్యయాలని తొలగిస్తుంది.

సామ్యం వల్ల ప్రాతిపదికలో గాని ప్రత్యయాలలో గాని మార్పు ఏర్పడవచ్చు. ప్రాచీన తెలుగులో 'కూఁతురు' అనే పదంలో రు వర్ణం ప్రథమైక వచనంలో మాత్రమే ఉండేది, మిగిలిన చోట్ల అంటే బహువచనంలోనూ ప్రథమేతర విభక్తుల రు వర్ణం ప్రవేశించింది: కూతురు + లు < కూతుళ్లు, కూతురుని, కూతురుతో, ప్రథమైకవచనం నించి ఈ పదం అన్ని రూపాలకీ రు సామ్యం వల్ల వ్యాపించిందన్న మాట. ప్రాచీన భాషలో ప్రథమైక వచనంలో రు ఉండడం, మిగిలిన చోట్ల అది లేకపోవడం అనే అక్రమబద్ధతని సామ్యం

తొలగించింది.నన్నయభాషలో 'ఏను' 'నేను' కన్న ప్రచురం; అలాగే 'ఏము' 'మేము' కన్న ప్రచురం.వీటిలో పదాదిని కొత్తగా చేరిన నకార మకారాలు వీటి ఔపవిభక్తిక రూపాల సామ్యం వల్ల వచ్చాయి. వీటి ఔపవిభక్తిక రూపాలైన నా-, మా- క్రమంగా * అన-, * అమ-లనించి వర్ణ వ్యత్యయం వల్ల ఏర్పాడ్డాయి. (నాకు < * అనక్కు; మాకు < * అమక్కు). ఔపవిభక్తిక రూపాలు ప్రథమేతర విభక్తులు అన్నిటిలోనూ ఉంటాయి. కాబట్టి వీటికి ప్రథమావిభక్తి రూపాలైన 'ఏను', 'ఏము'లకికన్న ప్రాచర్యం ఎక్కువ. ఎక్కువ ప్రాచుర్యం ఉన్న రూపం తక్కువ ప్రచుర్యం ఉన్న దాని రూపాంతరాన్ని తొలగించి, దాని స్థానాన్ని ఆక్రమించుకోవడమో లేక దాన్ని వర్ణాంలో తనలో కొంతవరకు సమానం చేసుకోవడమో చేస్తుంది. పై సర్వనామాలలో ఇప్పుడు చెప్పిన వాటిలో రెండోది జరిగింది. నా-, మా-లు వాటి ప్రథమా విభక్తి రూపాలైన ఏను, ఏము లకు క్రమంగా నకార మకారాలు చేర్చి నేను, మేములుగా మార్చి తమకు సన్నిహితం చేసుకొన్నాయి. ప్రాచీన మలయాళంలో ఞాఙ్ఙళ్ 'మేము' ప్రథమావిభక్తి రూపం; దీని ఔపవిభక్తిక రూపం హ్రస్వాచ్చుతో ఞఙ్ఙళ్- అని ఉంది. ఇప్పటి మలయాళంలో ఔపవిభక్తిక రూపం పాత ప్రథమావిభక్తి రూపాన్ని తొలగించి దాని స్థానంలో ఇదే ప్రథమావిభక్తి రూపం అయింది. తెలుగు 'మనము' చరిత్ర కూడా ఇటువంటిదే. మూలద్రావిడంలో దీని రూపం * నామ్ (ఔపవిభక్తికం * నమ్ - (అ)). ఔపవిభక్తిక రూపమైన * నమ- వర్ణవ్యత్యయం వల్ల మన-గా మారింది; దీనపై 'ము' చేర్చడం వల్ల ఏర్పడిన 'మనము' అనే ప్రథమావిభక్తి రూపం ప్రాచీనమైన * నామ్ స్థానాన్ని ఆక్రమించింది. ఈ రెండు ఉదాహరణలలో ఔప విభక్తిక రూపం ప్రథమావిభక్తి రూపాన్ని భాసనించి తొలగించి దాని స్థానాన్ని ఆక్రమించింది. పై చర్చ వల్ల సామ్యం ప్రచురమైన రూపాలనించి ప్రాచుర్యం లేని వాటి రూపాంతరాలకు ప్రసరిస్తుందని స్పష్టమవుతుంది.

ప్రాచీన తెలుగులో నడచు, మఱచు, వచ్చు వంటి చువర్ణాంత ధాతువులలో చువర్ణం భూతవర్తమాన కాలరూపాలలోనే ఉంటుంది. కాని భవిష్యత్కాల రూపాలలో ఉండదు; నడచితిని, నడచుచున్నాను, కాని నడతును. ఇలాగే మఱతును, వత్తును మొదలైనవాటిలో చువర్ణం లేదు. కాని ఇప్పటి భాషలో భవిష్యత్కాల రూపాలలోకి కూడా భూత, వర్తమాన రూపాల సామ్యం వల్ల చు

(సకార రూపంలో) ప్రవేశించింది; నడుస్తాను, వస్తాను. ప్రాచీన భాషలో నడచును; మఱచును, వచ్చును వంటి ప్రథమ పురుష భవిష్యత్కాల రూపాలలో చు ఉంది. సామ్యం వల్ల ఆ కాలంలోనే చు ఈ రూపాలకి వ్యాపించింది అనుకోవాలి.

ప్రాచీన లాటిన్ భాషలో honos 'గౌరవం' వంటి సకారాంత పదాలు ఉన్నాయి. వీటికి అజాది విభక్తి ప్రత్యయాలు చేరి ఏర్పడిన చతుర్థి * honos-i, షష్ఠి * honos-is వంటి రూపాలలో "అచ్చుల మధ్య అద్విరుక్త సకారం రేఫగా మారుతుంది". అనే ధ్వని పరిణామం ప్రవర్తించి honour-i, honour-is వంటి రూపాలు ఏర్పడ్డాయి. ఇప్పుడు ధ్వని పరిణామం వల్ల ప్రథమావిభక్తిలో సకారమూ, ఇతర విభక్తులలో రేఫ ఉండడం వల్ల భాషలో అక్రమబద్ధత ఏర్పడింది. ఈ అక్రమబద్ధతని తొలగించడానికి సామ్యం ప్రవర్తించి ప్రథమా విభక్తిలో honos అనే రూపాన్ని కూడా honor గా తరవాత కాలపు లాటిన్ లో మార్చింది. ధ్వని పరిణామం వల్ల వ్యాకరణంలో మార్పు వస్తుంది అనడానికీ, వ్యాకరణంలోని అక్రమబద్ధతని సామ్యం తొలగిస్తుంది అనడానికీ ఇది చక్కని ఉదాహరణ.

పైవన్నీ ప్రాతిపదికలలో సామ్యానికి ఉదాహరణలు. ప్రత్యయాలలో సామ్యం ప్రభావం ప్రాతిపదికలలో కన్న ప్రచురం. తెలుగులో – లు బహువచన ప్రత్యయం చాలా ప్రచురం. ప్రాచీన భాషలో కొన్ని మనుష్య వాచకాలలో – రు బహువచన ప్రత్యయంగా ఉండేది. అల్లు – రు, కోడండ్ – రు, చెల్లెండ్ – రు. ఇప్పటి భాషలో – లు ఈ పదాలలోకి కూడా వ్యాపించింది. అల్లుళ్ళు, కోడళ్ళు, చెల్లెళ్ళు ప్రచురమైన – లు అంత ప్రాచుర్యం లేని – రు స్థానాన్ని ఆక్రమించింది. ఇప్పటి భాషలో – రు ప్రత్యయం కొన్ని సర్వనామాలలోనూ (మీ – రు, వా – రు, కొంద–రు, అంద–రు). సంఖ్యా వాచకాలలోనూ (ద్ద–రు, ముగ్గురు, నలు–గురు) మాత్రమే మిగిలింది.

ఒకటికన్న ఎక్కువ సార్థకాలు ఉన్నప్పుడూ వాటిలో అన్నిటికన్న ప్రచురమైన సార్థకం మిగిలినవాటిని తొలగించి వాటి స్థానాన్ని ఆక్రమించుకొంటుంది. ఇందువల్ల ప్రాతిపదికలలో వర్గ విభాగాలు తగ్గుతాయి.

ప్రాచీనాంగ్లంలో బహువచన ప్రత్యయానికి నాలుగైదు సార్థకాలు ఉండేవి. వాటిలో - as అనేది ప్రచురం, ఇప్పటి భాషలో – as - గా మారి ఇదే ఇంచుమించు అన్ని నామాలలోనూ బహువచన ప్రత్యయమైంది. కింది పదాలలో ప్రాచీనాధునిక కాలాలలో బహువచన ప్రత్యయాలని పరిశీలించండి.

| ప్రాచీనం | ఆధునికం |
|---|---|
| hand- a | hand- s |
| gear - ϕ | year - s |
| ee-ag - an | eye - s |
| st- aan - as | stone - s |

సామ్యం వల్ల -s మిగిలిన - a, ϕ, -an అనే ప్రత్యయాలని తొలగించి వాటి స్థానం ఆక్రమించింది. కాని ఇప్పటికీ men, children, sheep, oxen వంటి చాలా కొద్ది పదాలకు - s వ్యాపించలేదు. దీనివల్ల సామ్యం అన్ని పదాలకీ ఒకేసారి వ్యాపించదు అని స్పష్టం. భాషలో ఎప్పటికీ కొంత అక్రమబద్ధత మిగిలే ఉంటుంది.

సోదర భాషలలో సామ్యం ప్రవృత్తి ఒకేలా ఉండదు. ఒక సోదర భాషలో సామ్యం ఒక అర్థకం సార్థకాల సంఖ్యని తక్కువ చేస్తే మరొక సోదర భాషలో అదే అర్థకంలో సామ్యం ప్రవర్తించకపోవచ్చు. తెలుగులో భూతకాలిక ప్రత్యయం – ఇతి – అనేది ఒక్కటే ప్రచురం (అన్యాదులలో మాత్రం తి > టి). తమిళంలో -త్- (చెయ్-త్-ఏన్ 'చేసితిని'), –ంత్–(వ-ంత్ఏన్ 'వచ్చితిని')–త్త్– (కుటి–త్–ఏన్ 'కుడిచితిని'), ఇన్– (పాట్–ఇన్–ఏన్ 'పాడితిని') అనే నాలుగు భూతకాల ప్రత్యయాలు ఉన్నాయి. తమిళంలో వైవిధ్యమే మూల ద్రావిడ భాషలో కూడా ఉండి ఉండాలి. తెలుగులో –ఇతి– ( < *–ఇ–త్త్–) సామ్యం వల్ల ఇంచుమించు అన్ని క్రియలకీ (ఉత్తమ మధ్యమ పురుషలలో మాత్రం) వ్యాపించింది. ధ్వని పరిణామం ఏ భాషలో ఎప్పుడు ఎందుకు జరుగుతుందో (లేక జరగదో) ఎలా చెప్పలేమో అలాగే సామ్యం కూడా ఏ భాషలో ఎప్పుడు ఎందుకు జరుగుతుందో లేక ఎందుకు జరగదో చెప్పలేం.

అర్థం వల్ల సన్నిహితమైన రెండు పదాలలో ఒక పదం సామ్యం వల్ల రెండో పదంలో మార్పు రావచ్చు. ఇంగ్లీషులో father అనే పదంలో అసలు th కి బదలు d ఉండాలి; కాని mother సాహచర్యం వల్ల father లో మార్పు వచ్చింది (మధ్య కాలపు ఇంగ్లీషులో fader అనే ఉంది). సంఖ్యా వాచకాలలో సామ్యంలో ఒక రకమైన 'సన్నిహిత పదమేళనం' అనే మార్పుకు ఉదాహరణలు 13.7 లో చూశాం.

సామ్యం వల్ల అనుచిత విభాగం (Wrong Splitting) ఏర్పడుతుంది. తెలుగులో చిలుకలు (౹త కిళి-కళ్), ఏనుగులు (౹త య్యానై-కళ్) వంటి వాటిలో అసలు బహువచనం – కలు/ – గులు ( < * కళ్). కాని తెలుగులో బహువచన ప్రత్యయంగా – లు ప్రచురం కాబట్టి ఇతర పదాల సామ్యం వల్ల ప్రజలు పై పదాలలో కూడా – లు మాత్రమే బహువచన ప్రత్యయమని భ్రమించి దాని ముందున్న క/గు ని ప్రాతిపదికతో కలిపివేశారు. మూల ద్రావిడంలో అమహద్బహువచనానికి * –కళ్ * –ళ్ అనే రెండు ప్రత్యయాలు భిన్న పరిసరాలలో ఉండేవి. తుళు, కోలామి – పర్జీలలో ఇప్పటికీ ఈ రెండూ ఉన్నాయి. తమిళంలో అన్ని నామవాచకాలకీ * – కళ్ సాధారణీకరించబడింది; తెలుగులో అన్ని నామ వాచకాలకీ * – ళ్ సాధారణీకరించబడింది.కాని చిలుకలు, ఏనుగులు వంటి కొన్ని పదాలలో * -కళ్ నిగూఢంగా మిగిలింది.

సామ్యం వల్ల ఏర్పడ్డ రూపాలు మొదట్లో పామరుల భాషలోనో పిల్లల భాషలోనో మాత్రమే ఉండి ప్రామాణిక భాషలో అంగీకారయోగ్యాలుగా ఉండవు.కాని కాలక్రమాన ప్రాచీన రూపాలు నశించి సామ్యం వల్ల ఏర్పడిన రూపాలే ప్రమాణిక భాషలోకి కూడా ఎక్కుతాయి. చిన్న పిల్లలు చెయ్యలు ('చేతులు'కి బదులు), రాయిలు ('రాళ్ళు'కి బదులు) అనడం వింటూ ఉంటాం. ఇవే కొంతకాలానికి ప్రామాణిక రూపాలు కావచ్చు. ఇంగ్లీషులో ప్రాచీన భాషలో cow బహువచనరూపం kine కాని cows అనే సామ్యం వల్ల ఏర్పడిన రూపం kine అనే అక్రమబద్ధరూపాన్ని కాలక్రమంలో తొలగించింది.సామ్య ప్రవృత్తిని వివరించడానికి ఈ కింద విధంగా నిష్పత్తి రూపం వాడతారు:

వ్రేలు : వ్రేళ్ళు : : కోడలు : ?

ఇందులో మొదటి రెండూ భాషలో ప్రచురమైన నిర్మాణానికి ప్రతీకలు. వాటి సామ్యంతో నాలుగో రూపం పాత రూపాని (కోడం(డు)క బదులు కొత్తగా (కోడళ్లు) ఏర్పడిందని అర్థం చేసుకోవడం ఈ విస్తృతి వల్ల సులభమవుతుంది.

జెర్జీ కురిలోవిజ్ (Jerzy Kurylowicz) అనేక భాషలలో సామ్యం ప్రవృత్తిని పరిశీలించి దీని సాధారణ స్వభావాన్ని వివరిస్తూ కొన్ని ప్రతిపాదనలు చేశారు. వాటిని తెలుసుకునే ముందు అవి ప్రచురమైనవే అయినా అపవాదరహితాలు మాత్రం కావని గమనించాలి. వీటిలో మొదటిది: ప్రాతిపదికలో అచ్చులో మార్పు తెస్తుంది: Gast 'అతిధి'; బ.వ, Gaste ప్రాతిపదికలో మొదట్లో మార్పులేని చోట కూడా తరవాత కాలంలో ఇటువంటి మార్పు వచ్చింది. Baum 'చెట్టు' బహువచనరూపం Baume తరవాత కాలంలో Bäume గా మారింది. ప్రాచీన తెలుగులో 'తమ్ముడు' బహువచనం తమ్ములు. కాని త్రాడు: త్రాళ్లు వంటి రూపాలతో సామ్యం వల్ల 'తమ్ముడు'లో డు లోపించక ఈ కాలంలో దీని బహువచనం 'తమ్ముళ్లు' అయింది. కురిలోవిజ్ రెండో సూత్రం: ప్రాతిపదిక నించి సామ్యం నిష్పన్న రూపాలకి ప్రసరిస్తుంది.ఇది చాలా వరకు సత్యమే కాని అన్ని సందర్భాలలోనూ ఇలా మాత్రమే జరగదు. భాషలో కొత్త పదాలు చేరినప్పుడు వాటికి భాషలో ఉన్న ప్రత్యయాలు చేరతాయి; రేడియోలు రూళ్ళు, స్కేళ్ళు మొ. (పర భాషలోంచి ప్రత్యయాలు సాధారణంగా రావు). కాని సామ్యం వల్ల ప్రాతిపదిక రూపం మారడం కూడా ఉంది. 'కానిస్టేబుల్' అనే పదంలో చివరి లకారం బహువచనమని భ్రమించి 'కానిస్టేబు' ని ప్రాతిపదికగా తెలుగువాళ్లు తీసుకొన్నారు. ఇంగ్లీషులో Orator అనే నామం నించి Orate అనే క్రియ సృష్టించబడింది. (driver : drive ఇత్యాదులలో లాగా) ఇటువంటి ఉదాహరణల వల్ల ఆర్లటో (Arlotto) ఈ సూత్రాన్ని ఇలా మార్చవచ్చని సూచించారు. మూడో సూత్రం : ఒక సంవర్గాన్ని సూచించే ప్రత్యయం ఆ సంవర్గానికి చెందిన పదాలకి అవసరం లేకపోయినా చేరుతుంది. ఇంగ్లీషులో మొదట్లో slow అనేదే క్రియావిశేషం, కాని చాలా క్రియా విశేషణాలలో – ly అనే ప్రత్యయం ఉండడం వల్ల (quick-ly మొ.) slow-ly అనే రూపం ఏర్పడింది. తెలుగులో 'జనం' నిత్య బహువచనం: జనం ఉన్నారు. కొన్ని మాండలికాలలో దీనికి బహువచన ప్రత్యయం చేరి జనాలు అనే రూపం

ఏర్పడింది. నాలుగో సూత్రం : సామ్యం వల్ల ఏర్పడిన రూపం భాషలో ప్రధాన పాత్ర వహిస్తుంది; పాత రూపం ప్రత్యేకార్థంలో గాని ప్రత్యేకమైన నిర్మాణాలలో గాని మిగిలి ఉంటుంది. ఇంగ్లీషులో brothers అనే బహువచన రూపం సామ్యం వల్ల ఏర్పడింది; ప్రాచీన కాలపు బహవచన రూపమైన brethren ఇప్పుడు ఏక మతస్థులు అనే అర్థంలోనే మిగిలింది. అలాగే elder అనే ప్రాచీన రూపం స్థానాన్ని older ఆక్రమించుకొంది; ఇప్పుడు elder అనేది elder states-man వంటి పద బంధాలలో మాత్రమే మిగిలింది. తెలుగులో 'తమ్ములు' అనే రూపం 'అన్నదమ్ములు'లో మాత్రమే మిగిలింది. 'చిన్న' వల్ల ప్రాధాన్యం కోల్పోయిన 'చిఱు' ఇప్పుడు 'చిరునవ్వు', చిరుతిండి'లలో మాత్రమే మిగిలింది 'వచ్చును' అనే ప్రాచీన భవిష్యత్కాలిక రూపం ఇప్పుడు 'వచ్చు' సహాయక క్రియగా ఉన్నప్పుడే ఉపయోగించబడుతుంది: వాడు, చెప్పవచ్చు (ను). ప్రధాన క్రియ అయితే దీని బదులు సామ్యం వల్ల ఏర్పడిన 'వస్తాడు, వస్తుంది, వస్తాయి' అనే రూపాలు వాడబడుతున్నాయి. 'అడిగితే' 'చేస్తే', 'తింటే' వంటివి మిగిలి ఉన్నాయి (వీటికి ఏ (ని) చేరి చేదర్థకం ఏర్పడింది; తరవాత ఈ రూపం అన్ని పురుష వచనాలకీ సాధారణీకరించబడింది). ఈ చేదర్థకంలో తప్ప మిగిలినచోట్ల భూతకాల రూపాలు 'అడిగేవు', 'చేశాడు', 'తిన్నావు' – ఇలా ఉంటాయి.

సామ్యం ప్రవర్తిస్తే ఎటువంటి సందర్భాలలో ప్రవర్తిస్తుంది; దాని ఫలితాలు ఎలా ఉంటాయి అనే విషయాలని పై సూత్రాలు వివరిస్తాయి. కాని అవకాశం ఉన్న చోటల్లా సామ్యం ప్రవర్తించి తీరాలి అనే నియమం లేదు.

# 15. అర్థవిపరిణామం

## 15.1 అర్థవిపరిణామం – హేతువులు

భాష కాలక్రమాన మారే స్వభావం కలది కాబట్టి ఒక భాషలో కాలక్రమాన వర్ణాలు, వ్యాకరణ నిర్మాణమూ మారినట్టుగానే పదాల అర్థాలు కూడా మారతాయి. ఒక భాషలో పదాలకు కల అర్థాలలో వచ్చిన మార్పుని 'అర్థ విపరిణామం' (Semantic change) అంటారు. భాషలో అర్థవిపరిణామం ఏర్పడినట్లు తెలుసుకోవడానికి మూడు ఆధారాలు ఉన్నాయి. 'లావు' అనే పదానికి అర్థం ఇప్పటిలా 'స్థౌల్యం' అనికాక 'బలం' అని. "అనిల తనూజా లావుగలం(డందురు..." (భారతం, ద్రోణపర్వం, ఆశ్వాసం పద్యం 336), "లావొక్కింతయు లేదు..." (భాగవతం, స్కంధం 8, పద్యం 90) వంటి ప్రయోగాలవల్ల తెలుస్తుంది. ఇలాగే ప్రాచీన భాషకు ఆ కాలంవారు రాసిన నిఘంటువుల వల్ల కూడా కొన్ని పదాల అర్థాలు వేరుగా ఉండేవని తెలుస్తాయి. రెండోది – సజాతి శబ్దాల అర్థపరిశీలన. తెలుగులో 'ఓడు' అనే క్రియకి 'పరాజయం పొందు' అని అర్థం; కాని దీని సజాతి పదాలైన త. మ. ఓటు, క. ఓడు ల అర్థం 'పరిగెత్తు.' ఓడినవాడు చేసేపని పరిగెత్తడమే కాబట్టి ఈ శబ్దానికి తెలుగులో అర్థం 'పరిగెత్తు' నించి 'పరాజయం పొందు'గా మారిందని ఊహించవచ్చు (ఇటువంటి మరికొన్ని ఉదాహరణలకి చూ. 11.2). మూడోది – సమస్తపదం అంగాల అర్థపరిశీలన. కొన్ని సమస్త పదాలని మనం వాటి అర్థం అసలు ఎలా వచ్చిందో తెలీకపోయినా వాడుతూ ఉంటాం. అటువంటి సమస్త పదాలలో ఉన్న అంగాల అర్థాలని సూక్ష్మంగా పరిశీలిస్తే వాటి అర్థాలకీ సమస్త పదం అర్థానికీ ఉన్న సంబంధం బోధపడుతుంది, 'మొక్కాలిపీట' అసలురూపం 'ముక్కాలిపీట' అంటే మూడుకాళ్ల ఉన్నపీట అన్నమాట. ఇక్కడ ధ్వని పరిణామంవల్ల 'ము–' 'మొ–' గానూ, 'కాలి' 'కలి' గానూ మారడంవల్లసమస్తపదంలో అవయవాల అర్థం వెంటనే స్ఫురించదు. కొన్నిచోట్ల సమస్త పదం ఏర్పడినప్పుడు దానికున్న అసలు అర్థానికీ ఇప్పుడు దానికున్న అర్థానికీ కొంత భేదం ఉండవచ్చు. నానారకాలైన ధ్వనులు ఒకేసారి వినపడుతూ ఉంటే 'రణగొణధ్వని' అంటాం. ఇది అసలు 'రణ–గుణ–ధ్వని' అంటే 'యుద్ధంలో

వింటి త్రాళ్ల చప్పుడు.' ఇక్కడ అర్థవిపరిణామం వచ్చింది. ఇంగ్లీషులో understand అనే పదానికి 'మధ్య నిలబడు' అనే అర్థంనించి 'తెలుసుకొను' అనే అర్థం ఏర్పడింది; అలాగే సంస్కృతంలో 'అవగచ్ఛతి' అనే దానికి 'లోపలికి పోతున్నాడు' → 'తెలుసుకొంటున్నాడు' అనే అర్థవిపరిణామం ఏర్పడింది.

కొన్ని సమస్తపదాల అవయవాల అర్థాలు ఆ భాషని మాత్రమే పరిశీలిస్తే తెలియవు; తులనాత్మక పరిశోధన ఇటువంటప్పుడు ఉపయోగిస్తుంది. 'పులిహోర' కూ 'పులి'కీ ఏమిటి సంబంధం అని ఎంత ఆలోచించినా ఫలితం ఉండదు. ఇందులో 'పులి' తమిళం పుళి 'చింతపండు' కు సంబంధించినది. తెలుగు పులుపు, పులియు కూడా ఈ పులికి సంబంధించినవే. కాబట్టి 'పులిహోర' అంటే 'చింత పండురసంకలిపిన అన్నం' అని ఇప్పుడు మనకు తెలుస్తుంది. తెలుగులో 'పులి' అనేమాట 'చింతపండు' అనే అర్థంలో ప్రత్యేకంగా లేకపోవడంవల్ల తెలుగుకి మాత్రమే పరిశోధన పరిమితం చేసుకొని చూస్తే 'పులిహోర' అసలు అర్థం తెలుసుకోవడం కష్టసాధ్యం. 'ఇంటిల్లిపాదీ' అంటే 'ఇంటోల ఉన్న అందరూ' అనే అర్థం ఎలా వచ్చింది? ఇది 'ఇంటివేలుపు ఆదీ' అంటే 'ఇంట్లో ఉన్న మనుష్యులేకాక అచేతనమైన దైవవిగ్రహాలు కూడా' అనే దానినించి వచ్చి ఉండవచ్చు. 'కర్రిఆవు'లో కర్రికి అర్థం 'నలుపు' అని తమిళం కరు 'నల్లని' కరి 'బొగ్గు' అనే పదాలవల్ల ధ్రువపడుతుంది. కొన్నిపదాలు మొదట్లో సమస్తపదాలని తులన పరిశోధన వల్లనే తెలుస్తుంది : తె. కొడవలి : త. కొటువాళ్ (కొటా 'వంకర' + వాళ్ 'కత్తి'); వాలు 'కత్తి'అనే పదం ప్రాచీనభాషలో ఉన్నా 'కొడవలి'లో ఉన్న 'వలి' దీని రూపాంతరమే అని తులన పరిశోధన చేసిన తరవాతనే స్ఫురిస్తుంది.

భాషలలో అర్థవిపరిణామం ఎలా జరుగుతుంది అనేది ముందుగా నిర్ణయించి చెప్పలేము. పదాల అర్థాలకీ భాషను వాడేవారి సంస్కృతికీ సంప్రదాయాలకీ చాలా సన్నిహిత సంబంధం ఉంది.ఒక పదం అర్థానికి ఒక భాషలో వచ్చిన మార్పు మరొక భాషలో రాకపోవచ్చు. పాశ్చాత్యులకి గోధుమ రొట్టె ముఖ్యాహారం కాబట్టి ఇంగ్లీషులో bread అనే పదం 'రొట్టె' అనే అర్థంలోనే కాక 'ఆహారం' అనే సామాన్యార్థంలో కూడా వాడబడుతుంది. తెలువారికి రొట్టె ముఖ్యాహారం కాదు కాబట్టి ఇటువంటి అర్థవిపరిణామానికి తెలుగులో అవకాశం లేదు. ధ్వని

పరిణామం విషయంలో అచ్చులమధ్య శ్వాసాలు నాదాలుగా మారతాయి. పదాంతధ్వనులు లోపించడానికి అవకాశం ఉంది, ఇత్యాదిగా కొన్ని సాధారణ సూత్రాలు చెప్పవచ్చు (చూ. 13.2). కాని అర్థాలు సంస్కృతిపై ఆధారపడి ఉండడం వల్ల అర్థవిపరిణామం విషయంలో ఇటువంటి సాధారణ సూత్రాలు చెయ్యడం సాధ్యంకాదు.

ఒక పదానికి ముఖ్యార్థమే కాకుండా అనుషంగికార్థాలు కూడా ఉండవచ్చు. ఒకే అర్థాన్ని సూచించడానికి భాషలో ఒకటికన్న ఎక్కువ పదాలు ఉండవచ్చు; అటువంటివాటికి అనుషంగికార్థాలు ఉంటాయి. ఉదాహరణకు 'అబ్బాయి – కొడుకు', 'అమ్మాయి – కూతురు', 'ఇల్లు – కొంప' మొదలైన జంటలు పరిశీలించండి. వీటిలో రెండో పదానికి మొదటి పదానికి ఉన్నంత గౌరవంలేదు. ఇది ఇప్పటి తెలుగు పరిస్థితి. ప్రాచీన భాషలో కొడుకు, కూఁతురు అనే పదాలకి ఇప్పటిలా న్యూనార్థంలేదు. ఒకే అర్థాన్ని సూచించడానికి ఒకటి కన్న ఎక్కువ పదాలే ఉన్నప్పుడు వాటిలో ఒకదానికి లేక కొన్నింటికి అర్థవిపరిణామం జరుగుతుంది.

అన్ని అర్థవిపరిణామాలకి హేతువులు చెప్పలేకపోయినా, కొన్నింటికి హేతువులు చెప్పడానికి అవకాశం ఉంది. నాగరికతలో మార్పు రావడం అర్థ విపరిణామానికి దోహదం చేస్తుంది. ఇంగ్లీషులో pen కు అసలు అర్థం 'ఈక.' ఈకలని సిరాలో ముంచి రాసే కాలంలో ఈ పదం 'లేఖన సాధనం' అనే కొత్త అర్థాన్ని కూడా పొందింది. ఇప్పుడు ఈకలని లేఖన సాధనాలుగా మనం వాడక పోయినా ఈ పదం ఈ అర్థంలో రూఢమైపోయింది. కొన్ని చారిత్రక కారణాల వల్ల కొన్ని పదాలు ప్రసిద్ధిలోకి వచ్చి అర్థాంతరంలో వాడబడుతూ ఉండవచ్చు. ఇటీవలి కాలంలో బోయ్‌కాట్ చెయ్యడం అనే పదం (ఇంగ్లీషులోనూ దాని ద్వారా తెలుగులోనూ) ప్రసిద్ధమైంది. దీన్ని నిరసన చూపడంకోసం చేయవలసిన పని చెయ్యకపోవడం అనే అర్థంలో వాడుతున్నాం. అసలు ఇది ఐర్లండులో Charles C. Boycott (1832 1897) అనే ఒక భూస్వామి పేరు. ఆయన శిస్తు తగ్గించడానికి అంగీకరించకపోవడంవల్ల ఆయన భూములని సాగుచేసే రైతులు ఆ భూములని స్వాధీనం చేసుకొన్నారు. అప్పటినుంచీ ఈయన పేరు పైన ఇచ్చిన అర్థంలో రూఢమైంది. తెలుగులో 'పట్టుదల పట్టు' అనే అర్థంలో

వాడబడే 'భీష్మించు' అనే క్రియ చరిత్ర కూడా ఇటువంటిదే. భారతంలో ప్రతిజ్ఞ నిర్వహించుకొన్న భీష్ముడి పేరు ఆధారంగా ఈ క్రియ ఏర్పడింది. తెలుగులో 'బంగనపల్లి' అనే ఊరుకన్నా ఆచోట పుట్టిన మామిడికాయ రకం సర్వత్రా ప్రసిద్ధమైంది. సంకేతానికీ, సంకేతితానికి మధ్య భేదం పరిగణించకపోవడం వల్ల కూడా అర్థవిపరిణామం ఏర్పడవచ్చు. ఇంగ్లీషులో bead అనే పదానికి అసలు అర్థం ప్రార్థన. ప్రార్థనలని లెక్కపెట్టడానికి పూసల దండలలో పూసలని లెక్కపెడతారు కాబట్టి ఈ పదానికి 'పూస' అనే అర్థం వచ్చింది. తెలుగులో 'దేవుడు' 'దేవత' అనే పదాలకి కనపడని దైవమే కాక 'దేవతావిగ్రహం' అనే అర్థంకూడా వచ్చినట్లు "దేవుణ్ణి ఊరేగిస్తున్నారు", "దేవుణ్ణి కడిగేరు" మొదలైన ప్రయోగాలవల్ల తెలుస్తుంది.

రెండు పదాల మధ్య ఉన్న నిరంతర సాహచర్యంవల్ల ఒక పదం అర్థం రెండో దానికి సంక్రమించి మొదటి పదం సాధారణంగా లోపించడం జరగవచ్చు. "రాముడు సీతని చేసుకొన్నాడు" అన్న వాక్యంలో "చేసుకొన్నాడు" అనే పదానికి "పెళ్లి చేసుకొన్నాడు" అని అర్థం. ఇక్కడ "పెళ్ళి", "చేసుకొను" అనే రెండు పదాలకీ ఉన్న నిరంతర సాహచర్యంవల్ల "చేసుకొను" అనే క్రియకి "పెళ్ళి చేసుకొను" అనే అర్థం సంక్రమించింది; అందువల్ల "పెళ్ళి" అనే కర్మ వాచ్యం చెయ్యకుండా "వాడు తాగేడు" ఇత్యాదిగా ప్రయోగిస్తే "కల్లు లేక అటువంటి మత్తు కలిగించే పానీయం తాగు" అనే అర్థం వస్తుంది.

నిషిద్ధ ప్రయోగం, సభ్యోక్తి అనే ప్రక్రియవల్ల కూడా అర్థవిపరిణామం ఏర్పడుతుందని 15.3లో చూస్తాం.

## 15.2. పదసృష్టి – పదనాశం

నాగరికత పెరిగిన కొద్దీ కొత్త వస్తువులు తయారవడం, వాటికి పేర్లు పెట్టడం అవసరమవుతుంది. అంతకు ముందున్న వస్తువుల పేర్లను వాటిలా పనిచేసే కొత్త వస్తువులను వ్యాపింపజెయ్యడం ఇందులో ఒక పద్ధతి; 'బండి' అనే పదాన్ని ఎడ్లబండికే కాక 'సైకిలు', 'కారు', 'రైలు' మొదలైనవాటికి కూడా వాడతాయి. కొత్త వస్తువుల పేర్లను మరొక భాషనించి ఎరువు తెచ్చు కోవడం

మరొక పద్ధతి : లైటు, ఫోను, రేడియో మొ॥ ఇవికాక కొత్త పదాలు సృష్టించడం మూడో పద్ధతి. అంతరిక్ష నౌక, దూరదర్శని మొ. 'ఆకాశవాణి' అనే పదం ప్రాచీనార్థం 'ఆకాశంలో ఎవరో అదృశ్యవ్యక్తి మాట్లాడేది' అనేది; అది ఇప్పుడు "రేడియో (శబ్దాలు)' అనే అర్థంలో ప్రచురమైంది. gas, kodak అనే పదాలు నిధారంగానే సృష్టించబడ్డాయి. కొన్ని పదాల ప్రథమాక్షరాలు చేర్చి పదం సృష్టించడం కూడా ఆధునిక శాస్త్రవిజ్ఞానంలో సహజమయింది; bead సంగ్రహించబడిది.

ఇంగ్లీషు bus అనేది omnibus అనే దాని సంగ్రహరూపం. లాటిన్ లో omnibus అంటే 'అందరి కోసం' అని అర్థం. బస్సు అందరి కోసం ఉద్దిష్టమైంది కాబట్టి దానికి ఈ పేరు పెట్టారు. Omnibus ని busగా సంగ్రహించినపుడు bus అనే లాటిన్ చతుర్థీ బహువచన ప్రత్యయం (సం. సర్వే - భ్యః) ప్రత్యేక పదంగా రూపొంది కొత్త అర్థాన్ని గ్రహించింది.

వస్తువుల వాడకం తగ్గితే వాటిని సూచించే పదాలు భాషలో లోపిస్తాయి. ఈటె, డాలు, బల్లెం మొదలైన యుద్ధ పరికరాలు ఇప్పుడు వాడుకలో లేవు కాబట్టి ఈ పదాల ప్రాచుర్యం చాలావరకు తగ్గింది. విల్లు, బాణాలూ సినిమాలు, నాటకాలు, కథలలోనూ, ఆటవికుల దగ్గరా మాత్రం మిగిలేయి.

## 15.3 అర్థవిపరిణామమంలో రకాలు

అర్థవిపరిణామాన్ని ఏడు రకాలుగా విభజించవచ్చు. అవి - 1. అర్థ వ్యాకోచం (Semantic Extension), 2. అర్థసంకోచం (Semantic Narrowing), 3. ఆలంకారిక ప్రయోగం (Figurative Use), 4. అర్థగౌరవం (Elevation of Meaning), 5. అర్థాపకర్ష (Degradation of Meaning), 6. సభ్యోక్తి (Euphemism), 7. వస్తుపరిణామం (Subreption).

ఒక పదం అర్థం పాతకాంలో కన్నా తరవాత కాలంఓ విస్తృతమైతే అది అర్థవ్యాకోచం అవుతుంది. 'చెంబు' అనే పదంలో ధాతువైన చెమ్ >* కెమ్- కు 'ఎరుపు, ఎర్రని' అని అర్థం కాబట్టి రాగిచెంబే మొదట్లో చెంబు. కాని ఇప్పుడు మనం ఇత్తడి చెంబు, వెండి చెంబు ఇత్యాదిగా కూడా వ్యవహరిస్తున్నాం. నూనె (<*నువ్ + నెయ్) అసలు అర్థం 'నువ్వుల నూనె', కాని ఇది కొబ్బరి నూనె,

వేరుసెనగ నూనె ఇత్యాదిగా ఏ ద్రవ్యంలోంచి తీసిన ద్రవానికైనా వాడబడుతోంది.

పాతకాలంలో అర్థం కన్న అర్వాచీనకాలంలోఅర్థం సంకుచితమైతే అది అర్థసంకోచం అవుతుంది.

ప్రాచీన తెలుగులో 'చీర' అంటే స్త్రీ పురుషులందరూ ధరించే వస్త్రం; తరవాత కాలంలో ఇది స్త్రీలు ధరించే వస్త్రానికే పరిమితమైంది. అలాగే 'కంపు' అనే పదానికి ప్రాచీనార్థం 'వాసన (సువాసనకూడా)'; ఇప్పుడు దీని అర్థం 'దుర్వాసన' మాత్రమే. 'వ్యవసాయం' అసలు అర్థం 'ప్రయత్నం'; ఇప్పుడు దీనికి 'పొలంలో పంటలు పండించడం' అని మాత్రమే అర్థం. కర్మ 'పని > చేసుకొన్నదాని దుష్ఫలితం; చచ్చిపోయినవారికి చేసే పరలోక క్రియ'. తద్దినం 'ఆ రోజు > ప్రతి సంవత్సరమూ పెద్దలు చచ్చిపోయిన రోజున చేసే పైతృకవిధి'. ప్రారబ్ధం 'మొదలుపెట్టబడినది > దుష్ఫలితం' వంటి వాటిలో కూడా అర్థసంకోచం ఉంది.

'ఆమె రంభ,' 'వాడు మన్మథుడు' వంటి వాక్యాలలో ఉపమానానికి ఉపమేయార్థం సంక్రమించింది. ఇటువంటివి ఆలంకారిక ప్రయోగానికి ఉదాహరణలు. 'తీపి మాటలు', 'చేదు నిజం,' 'పచ్చి అబద్ధం' ఇత్యాదులలో తీపి, చేదు, పచ్చి అనే పదాలకి ఆలంకారికార్థం ఉన్నట్లు స్పష్టం. 'ఎండ నిప్పులు చెరుగుతోంది' అనేది కూడా అలంకారిక ప్రయోగమే.

పాతకాలంలో అర్థంకన్న తరవాతకాలంలో అర్థం ప్రశస్తమైనదైతే అర్థ గౌరవం (లేక అర్థోత్కర్ష), పాతకాలంలో అర్థంకన్న తరువాతికాలంలో అర్థం నీచమైనదైతే అర్థాపకర్ష ఏర్పడినట్లు చెప్పవచ్చు. ముహూర్తం 'నిమేషకాలం > శుభకార్యానికి తగిన కాలం'లో అర్థగౌరవం ఉంది. ఛాందసుడు 'వేదవేత్త > లోక జ్ఞానంలేనివాడు' (చాదస్తుడు); సన్యాసి 'ఇహలోక బంధాలను విడిచిపెట్టినవాడు> ఎందుకు పనికిరానివాడు' అనే పదాలలో అర్థాపకర్ష ఉంది.

పెద్దల సమక్షంలోనగాని సభలోగాని ఉచ్చరించకూడని పదాలకు గౌరవ సూచకమైన సభ్యోక్తులు అన్ని భాషలలోనూ ఉంటాయి. శారీరక బహిష్కరణ క్రియలకు ఇవి సర్వ సాధారణం : ఒకటికి వెళ్ళాడు, రెంటికి వెళ్ళాడు / దొడ్డికి వెళ్ళాడు / చెంబు పట్టుకు వెళ్ళాడు. 'చచ్చిపోయాడు' అనడానికి సభ్యోక్తి

'పోయారు'; దీనికన్నా గౌరవ సూచకాలు 'దివంగతులయ్యారు,' 'కాలధర్మం చెందారు' మొదలైనవి. కులాల పేర్లకు కూడా సభ్యోక్తులు ఏర్పడ్డాయి; చాకలి/ రజకుడు, కంసాలి/విశ్వకర్మ. మాలలు, మాదిగలు / హరిజనులు మొ. పై ఉదాహరణలవల్ల ఒక అసభ్య పదానికి లేక అశ్లీలపదానికి (Tabu) ఉన్న అసహ్యం, నీచవృత్తి, అగౌరవం మొదలైన గౌణార్థాలవి నివారించడానికి దానికి బదులు సభ్యోక్తులు ఏర్పడతాయి అని తెలుస్తుంది.

ఒక పదం భాషలో మిగిలినా అది సూచించే వస్తువు రూపం, నిర్మాణం మొదలైనవాటిలో కాలక్రమేణ చాలా భేదం రావచ్చు; ఇటువంటిది వస్తుపరిణామం. పాతకాలంలో పాకలు, పెంకుటిళ్ళకి ఇప్పటి రెండు అంతకన్న ఎక్కువ అంతస్తుల మేడలకి రూపంలోనూ కట్టడానికి ఉపయోగించే సరుకులలోనూ చాలా తేడాఉన్నా ఈ అన్ని రకాలకి 'ఇల్లు' అనే పదం వాచకమే. అలాగే 'ఆయుధం' అనే మాట సూచించే పరికరంలో పాతకాలానికి ఇప్పటికీ ఎంతో భేదం వచ్చింది. పిల్లలు ఆడుకొనే లక్కపిడతలు పూర్వం లక్కతో చేయడంవల్ల కాబోలు వాటికి ఆ పదం రూఢమైంది; ఇప్పుడు కర్రతో చేసినవికూడా ఆ పేరుతోనే వ్యవహృతమవుతున్నాయి.

## 15.4. లోకవిరుక్తి

ఒక పదానికి అది సూచించే వస్తువుకి లేక క్రియకి మరింత సాన్నిహిత్యం ఉండాలి అనే ఉద్దేశంతో ప్రజలు ఆ పదంలో అక్షరాలను కొద్దిగా మారుస్తారు. ఇలా ఏర్పడానికి ఆ వస్తువు గుణానికి లేక క్రియకి సంబంధమున్న మరొక పదం ఆధారమవుతుంది. ఇటువంటిమార్పుని లోకవిరుక్తి (Folk Etymology) అంటారు. ఒక పిల్లవాడు బోరన్‌విటా పొడిని 'బోరన్‌మిఠాయి'గా మార్చాడు. ఇక్కడ ఆ పొడి తియ్యగా ఉంటుంది కాబట్టి అర్థరహితమైన 'విటా'కి బదులు తీపిని సూచించే 'మిఠాయి' ఉండాలని ఆ పిల్లవాడి మనోఽంతరంలో ఆలోచన ఇలా మార్చి ఉంటుంది. Overhauling కి బదులు చాలామంది Overoiling అంటారు. ఈ క్రియలో చేసేపని ఒక యంత్రాన్ని విప్పి దానిలో భాగాలకి మానెవేసి శుభ్రం చెయ్యడం కాబట్టి ఇందులో అర్థం స్పష్టంకాని hauling కి బదులు oiling ఉంటే బాగుంటుందని ప్రజలు అనుకోవడంవల్ల ఈ మార్పు

వచ్చింది. అరుంధతి > అరంజోతి, మక్కాజొన్న > మొక్క జొన్న, శర్కారకేళి > చక్రకేళి వంటి వాటిలో మార్పులుకూడా లోకనిరుక్తి వల్ల నే ఏర్పడ్డాయి.

లోక నిరుక్తిలో అర్థపరిణామం లేదుకాని అర్థసాన్నిహిత్యం ఉన్న లేక ఉందనుకొన్న మరొకపదంవల్ల ఒక పదంలో మార్పు వస్తుంది. అందువల్ల దీన్ని సామ్య పరిణామం (చూ. 14.6)లో ఒక రకంగా పరిగణించడం సముచితం.

# 16. ఆదానం

## 16.1. ఆదానానికి అనుకూల పరిస్థితులు – కారణాలు

ప్రతిభాషకీ కొద్దిగానో గొప్పగానో అన్యభాషాసంపర్కం ఉంటుంది. ఇటువంటి భాషాసంపర్కానికి కారణాలు రాజకీయంగా రెండు లేక అంతకన్న ఎక్కువ భాషలు మాట్లాడేవారు కలిసి ఉండడం, ఒక భాషవారు మరొక భాషా ప్రాంతానికి వలస పోవడం, రెండు లేక అంతకన్న ఎక్కువ భాషలు మాట్లాడే వారు ఒకే మతాన్ని అవలంబించినవారు కావడం, ఒక భాషవారు వాణిజ్యం కోసం ఇతర భాషాప్రాంతాలకు వెళ్ళిరావడం మొదలైనవి. ఇటువంటి సంపర్కం వల్ల ఒక భాషలోని పదాలూ నిర్మాణాలూ మరొక భాషలోకి సంక్రమిస్తాయి. ఒక భాషలోని పదాలూ, నిర్మాణాలూ మరొక భాషలోనికి ఎరువు తెచ్చుకోవడాన్నే ఆదానం (Borrowing) అంటారు. రెండు భాషలు మాట్లాడే వారి మధ్య వ్యాపారరీత్యా అత్యధిక సంపర్కం ఏర్పడినప్పుడు పరిమిత ప్రయోజనం గల వ్యాపార భాషలు ఏర్పడతాయని 9.7 లో చూశాం. ఇది ఆదానంలో పరాకాష్ఠ కాబట్టి ఇటువంటి పరిణామం విరళం.

ఆదానానికి అనుకూల పరిస్థితి భాష మధ్య సంపర్కం ఉండడం అని పైన చూశాం. భాషల మధ్య సంపర్కం లేవిదే ఒక భాషలో పదాలు మరొక భాషలోకి వెళ్లవు. ఆదానానికి రెండు ముఖ్యమైన ప్రేరకాలు ఉన్నాయి. అవి 1. ఆవశ్యకతా పూరణం (Need - filling motive), 2. ప్రతిష్ఠా పాదనం (Prestige motive). ఒక భాష మాట్లాడేవారికి అంతకుముందు పరిచితం కాని వస్తువుకాని భావంకాని పరభాషాసంపర్కంవల్ల పరిచయమైతే దానికి ఒక కొత్త పదం అవసరం మవుతుంది. సాధారణంగా అటువంటప్పుడు పరభాషలో దాన్ని సూచించే పదాన్నే ఎరువు తీసుకొంటారు. ఇటువంటి ఆవశ్యకతాపూరణం కోసం తెలుగులో ఇంగ్లీషు నించీ (రేడియో, రైలు, టెలివిజన్, స్టేషను, టిక్కెట్టు, మొ), ఉర్దూనించీ (దర్యాప్తు, జమీందారు, జగడం, పసందు, షరతు, హాజరు, అమలు, రొట్టె మొ.) వందలకొద్దీ పదాలు వచ్చిచేరాయి. ఇంగ్లీషు వారికన్న ముందు పోర్చుగీసులు మన దేశంలో ప్రవేశించి దక్షిణ భారత రాజకీయాల్లో

జోక్యం చేసుకోవడంవల్ల వారి భాష నుండి కూడా కొన్ని పదాలు తెలుగులోకి వచ్చాయి. అనాస, బొప్పాయి, (తాళం) చెవి, కమీజు, బొత్తాం. అల్మారా, బాల్చీ, మేస్త్రీ, ఇస్త్రీ వంటి పదాలు పోర్చుగీసునుంచి వచ్చినవి. అనాదినించీ తెలుగుకి సంస్కృత ప్రాకృతాలతో గల సబంధంవల్ల తెలుగులో చేరిన సంస్కృత ప్రాకృత పదాలు పరస్సహస్రాలు. వివిధ శాస్త్రాలకి సంబంధించిన పారిభాషిక పదాలు తెలుగు మొదలైన భారతీయ భాషలలో మొదట సంస్కృతంనించి వచ్చాయి; ఇప్పటి కాలంలో ఇంగ్లీషునించి వస్తున్నాయి. ఇంగ్లీషులోని శాస్త్రీయ పదాలు లాటిన్, గ్రీకు భాషా పదాలనించి సృష్టించబడుతున్నాయి. దీనికి కూడా కారణం ఆవశ్యకతాపూరణమే. ఆవశ్యకతాపూరణ కోసం పదాలు ఎరువు తెచ్చుకోవడమే కాక దేశ్యపదాల ఆధారంతో కొత్త పదాలు లేక పదబంధాలు సృష్టించబడడం కూడా జరుగుతుందని 16.2. లో చూస్తాం.

సంఘంలో ఉన్నత స్థాయిలోని వారి భాషను ప్రతిష్ఠ కోసం ఇతరులు అనుకరించడం జరుగుతుంది. ఇలా ఉన్నత స్థాయిలో ఉన్నవారు వేరుభాష మాట్లాడే పాలకులు కావచ్చు. అటువంటప్పుడు పాలకుల భాషలోని పదాలను నుడి కారాలను పాలితులు తమ భాషలోకి తీసుకొంటారు. 9–11 శతాబ్దుల మధ్య ఇంగ్లండుపై డెన్మార్కు దేశస్థులు దండయాత్రలు జరిపేరు. ఈ కారణంగా ఇంగ్లీషులోకి డెన్మార్కు దేశీయుల భాష అయిన స్కాండినేవియన్ నించి they, them, their, are call, die, egg, law, sister, skirt, skin, sky వంటి పదాలు వచ్చిచేరేయి. ఆ తరవాత (12–14 శతాబ్దుల మధ్య) ఫ్రెంచివారు ఇంగ్లాండును పాలించారు. ఈ కాలంలో వందల కొద్దీ ఫ్రెంచిపదాలు ఇంగ్లీషులో వచ్చి చేరాయి. పాలితులు పాలకులను భాషలోనే కాక ఆచార వ్యవహారాలలో కూడా అనుకరిస్తారు. ఆచారవ్యవహారాలలో ఉన్నతులను అనుకరించడంవల్లనే భాషలో ఆదానం జరుగుతుందని చెప్పవచ్చు. ఫ్రెంచి భాషా ప్రభావంవల్ల ఇంగీషులో ఆహారంగా ఉపయోగించే జంతువులు మాంసానికి ఫ్రెంచి పేర్లు వచ్చాయి; ఇంగ్లీషు మాటలు జంతువుల పేర్లుగా మాత్రమే మిగిలేయి : ox - beef, calf - veal, swine - pork, sheep - mutton (ఈ జంటలలో రెండో పదం ఫ్రెంచినించి వచ్చినది).

ప్రతిష్ఠ కోసమే కాకుండా సభ్యతను సూచించే ఉద్దేశంతో కూడా మనం ఇతర భాషా పదాలని వాడుతూ ఉంటాం. 'ఉచ్చ' అనడానికి బదులు సంస్కృత పదమైన 'మూత్రం' కాని ఇంగ్లీషు పదమైన 'Urine' కాని వాడతాం. ఇటువంటివే మలం, సంభోగం, భార్య, భర్త మొదలైనవి.

ఉన్నత స్థాయిలో వారు పరభాషావ్యవహర్తలు కాక దేశభాషావ్యవహర్తలే అయినపుడు వారి మాండలికంలో పదాలు ఇతర మాండలికాలలోకి వ్యాపిస్తాయి: కూడు / అన్నం / భోజనం, (ఇంటి) కాడ : (ఇంటి) దగ్గర మొ.

సభలలోనూ మర్యాదాయుతమైన సంభాషణలోనూ విద్యావిషయక చర్చలోనూ ప్రతిష్ఠాపాదకమైన పరభాషాపదాలు దేశ్యపదాలకి బదులుగా వాడడం పరిపాటి : మిమ్మల్ని చూడడానికి వచ్చాను – తమ దర్శనానికి వచ్చాను ; పిలుపు – ఆహ్వానం, పెళ్ళి – వివాహం. ఇంగ్లీషులో ఇటువంటి భేదానికి ఉదాహరణలు: bead మొదట్లో ఇలా ప్రతిష్ఠాపర్యాయపదాలుగా వచ్చిన పరభాషాపదాలు కాలక్రమాన దేశభాషా పదాలని పూర్తిగా నిర్మూలించవచ్చు : లేక దేశభాషాపదాలు అనుషంగికార్థంలో మాత్రం మిగలవచ్చు : ఎఱుక–జ్ఞానం, అలుక – కోపం, పోరు–యుద్ధం. పై దేశ్య పదాలు ఇప్పుడు అనుషంగికార్థాలో మాత్రమే (ఎరుక చెప్పడం, అలకపాన్పు, పిల్లవాడు పోరుపెట్టడం) మిగిలేయి.

ఆదానం పరభాషలనించీ, ప్రమాణ మాండలికాలనించే కాక ఒక భాష ప్రాచీన మాండలికం నించి కూడా ఉండవచ్చు : కలిమిలేములు కావడి కుండలు, తప్పులెన్నువారు తమ తప్పు లెఱుఁగరు, ఇత్యాదులు మనం మామూలు సంభాషణలో ఉదాహరిస్తూ ఉంటాం.

సాధారణంగా ఉన్నతస్థాయి భాషనించే ఆదానం సాధారణ స్థాయిభాషకు ఎక్కువగా పోతూ ఉంటుంది. సాధారణ స్థాయి భాషనించి ఉన్నత స్థాయి భాషకుపోయే ఆదత్త పదాల సంఖ్య స్వల్పంగా ఉంటుంది. ఇటువంటి పదాలు దేశీయమైన చెట్లు, జంతువులు, వస్తువులు మొదలైనవాటికి చెంది ఉంటాయి. ఆర్యులు భారతదేశంలోకి ప్రవేశించినప్పుడు వారు పాలకులు, ద్రావిడులు పాలితులు. సంస్కృతం నించి అసంఖ్యా పదజాలం ద్రావిడభాషలలోకి వచ్చింది. కాని ద్రావిడభాషల నించి మయూర – 'నెమలి', ఉలూఖల – 'రోలు',

బిల్వ – 'మారేడు', హేరంబ – 'గేదె', సీర – 'నాగలి' వంటి దేశీయ సంస్కృతికి చెందిన కొన్ని పదాలే సంస్కృతంలోకి వెళ్ళాయి.

## 16.2. ఆదత్తపదాలలో రకాలు

సాధారణంగా నామవాచకాలు మిగిలిన భాషాభాగాల కంటె ఎక్కువగా ఎరువు తెచ్చుకోబడతాయి. దాతృభాషకీ స్వీకారకభాషకీ లింగభేదంలో తేడా ఉన్నప్పుడు ఆదత్తపదాలు స్వీకారభాష లింగభేదానికి అనువుగా మారతాయి. సంస్కృతంలో వృక్షశబ్దం పుంలింగమైనా తెలుగులోకి వచ్చినపుడు 'వృక్షము' అని అమహత్తు మారుతుంది. అలాగే నపుంసకమైన మిత్ర శబ్దానికి తెలుగులో మిత్రము అనే దానికన్న మిత్రుడు అనే మహద్రూపమే ప్రచురంగా ఉంది.

ఆదత్తపదాలు సాధారణంగా ఉన్నత స్థాయి సంస్కృతికి సంబంధించినవిగా ఉంటాయి. ఇంగ్లీషులో ఫ్రెంచి భాషనించి వచ్చిన పదాలు ప్రభుత్వం, పరిపాలన (state, prince, duke, court), యుద్ధం (war, soldier enemy), మతం, నీతి (religion), angel, preach, mercy), వేట, ఆటలు (sport, cards, dice), సంస్కృతి (honour, noble art, castle), గృహోపకరణాలు, భోజ్యపదార్థాలు (chair, table, jelly, roast, toast), పేర్లు (John, Helen) మొదలైనవాటికి చెందినవిగా ఉంటాయి. అరుదుగా సర్వనామాలు, సంఖ్యావాచకాలు మొదలైన ప్రాథమిక శబ్దజాలంలో కూడా ఆదానం ఉండవచ్చు. ఇంగ్లీషులో they అనే సర్వనామం స్కాండినేవియన్ భాషనించి వచ్చిందని పైన చూశాం. తమ సంస్కృతిని నిలుపుకోవాలనే ప్రత్యేక ప్రయత్నం చెయ్యలేని ఆటవికుల భాషలలో ప్రాథమిక శబ్దజాలంలో కూడా ఆ ఆదానం ఎక్కువగా ఉంటుంది. గోండీలో ఏడు వరకే ద్రావిడ సంఖ్యాపదాలు, ఆ పైన మరాఠీ పదాలు వాడతారు (కాని మళ్లీ నూర్ '100' అనే పదం ఇందులో మిగిలి ఉంది) బ్రాహుయీలో మూడు వరకే ద్రావిడ సంఖ్యావాచక పదాలు మిగిలేయి.

ఇంగ్లీషు వంటి భాషలు కొన్ని ఇతర భాషలనించి పదాలు ఎరువు తెచ్చుకోవడానికి సుముఖంగా ఉంటాయి. కాబట్టి వీటిలో ఆదత్తపదాలు అనేక భాషలనించి వచ్చి చేరతాయి, కాని జర్మన్, ఫ్రెంచి, తమిళం (లిఖిత ప్రమాణభాష) వంటి మరికొన్ని భాషలు నూతన భావాలను సూచించడానికిఅంతకుముందున్న

పదాలకి అర్థవ్యాకోచం చేసిగాని రెండు దేశ్యపదాలకి సమాసం చేసి కాని ఆదత్త పదాలని వీలైనంత వరకు పరిహరించడానికి ప్రయత్నం చేస్తాయి; అంత మాత్రాన వీటిలో ఆదత్త పదాలు అసలులేవని అనుకోకూడదు. భాషలో ఉన్న పాత పదానికి పరభాషాపదం ప్రాతిపదికపై కొత్త అర్థం కల్పించి వాడడాన్ని ఆదాన విక్షేపం (Loan shift) అనవచ్చు. విద్యుత్తు అనేదాని అసలు అర్థం మేఘాలలో పుట్టే మెరుపు; దీన్ని ఇప్పుడు electricity అనే అర్థంలో కూడా పలికే పలుకులు; అది ఇప్పుడు రేడియో ద్వారా వినిపించే ధ్వనులకు పర్యాయంగా వాడబడుతోంది. ప్రసారం అనే పదం radio broadcast అనే అర్థంలో కూడా ఆదాన విక్షేపమే. పరభాషలోని పదబంధంలోఇన పదాల సమానార్థకాలని కలిపి వేరొక భాషలో దానికి తుల్యమైన పదబంధాన్ని సృష్టించడం ఆదాన భాషాంతరీకరణం (Loan - translation). Television కి దూరదర్శని, telephoneకి దూరశ్రవణ యంత్రంవంటి పదాలు దీనికి ఉదాహరణలు. ఆదత్త పదానికి దేశ్యపదంగాని ప్రత్యయంగాని చేర్చి కొత్తపదాన్ని సృష్టించడం ఆదాన మిశ్రమం (Loan blend). మన పూర్వవైయాకరణులు చెప్పిన వైరిసమాసం (కలకంఠుఁడు, మొ.) దీని కిందకే వస్తుంది. గర్భగుడి, అనేకసార్లు అనేక రకాలు మొదలైన పదాలు దీనికి ఉదాహరణలు. వీటిలో మొదటి పదం సంస్కృతం, రెండోది తెలుగు.

## 16.3. భాషానిర్మాణంపై ఆదానం ప్రభావం

పరభాషాపదాలు ఒక భాషలో ప్రవేశించడంవల్ల ఆ భాషలో ధ్వని నిర్మాణ, పద నిర్మాణ, వాక్య నిర్మాణాలలో మార్పులు కలగడానికి అవకాశం ఉంది.

స్వీకారక భాషలోలేని ధ్వనులు పరాభాషా పదాలలో ఉన్నప్పుడు అవి యథాతథంగానే మిగలవచ్చు లేక అవి స్వీకార భాషలో వాటికి సన్నిహితమైన ధ్వనులుగా మారవచ్చు. తెలుగులో సంస్కృత ప్రాకృతాలనించి వచ్చిన పదాలని ఈ భేదం ఆధారంతోనే వైయాకరణులు, తత్సమాలు, తద్భవాలు అనిరెండు రకాలుగా విభజించారు - ధ్వనులలో మార్పు లేనివి తత్సమాలు, మార్పు వచ్చినవి తద్భవాలు. ఆకాశము, అక్షరము, ఈర్ష్య, ఇచ్ఛ వంటివి

తత్సమాలూ; ఆకసము, అక్కరము, ఈను, ఇచ్చ వంటివి తద్భవాలు. పరభాషా వ్యవహర్తలతో ప్రత్యక్ష సంబంధం ఉన్నంతవరకూ స్వీకారక భాష మాట్లాడే వారిలో కనీసం ఉన్నత వర్గాలవారు పరభాషా పదాలు ఉచ్చారణలో మార్పు రాకుండా ఉచ్చరించడానికి ప్రయత్నం చేస్తారు. ప్రత్యక్ష సబంధం తగ్గితే తత్సమాలు తద్భవాలుగా మారడానికి ఎక్కువ అవకాశం ఉంది. పరభాషా పదాలలోని ధ్వనులు ఒక్కొక్కప్పుడు స్వీకారక భాషలో అంతకుముందు ఆ ధ్వనులు లేని స్థానాలలోకి ప్రవేశిస్తాయి. ఇంగ్లీషులో v, z, j అనే ధ్వనులు మొదట్లో పదాదిని ఉండేవి కావు; కాని ఫ్రెంచి పదాలైన very, zest, just వంటి పదాలు ఇంగ్లీషులోకి రావడంవల్ల ఈ ధ్వనులు పదాది స్థానానికి కూడా వచ్చాయి. ద్రావిడ భాషలో తమిళం, ఈ ధ్వనులు పదాది స్థానానికి కూడా వచ్చాయి. ద్రావిడ భాషలలో తమిళం, మలయాళం, తొదతప్ప దేశ్యపదాలలోనే గ, జ, డ, ద, బలు పదాది స్థానంలోకి రావడానికి సంస్కృతం నించి ఈ ధ్వనులు పదాదిలో ఉన్న పదాలు రావడం కొంత ప్రోత్సాహమిచ్చిందని పండితుల విశ్వాసం.

ఒక్కొక్కప్పుడు ఒక ప్రత్యేక ధ్వని ఉచ్చారణలో మార్పు పరభాషా ప్రభావంవల్ల రావచ్చు. ఫ్రెంచి ప్రమాణ మాండలికంలో రేఫని కొండనాలుకతో ఉచ్చరించడం రెండు మూడు శతాబ్దాల కింద మొదలైంది; ఈ నూతనోచ్చారణ విధానం ఫ్రెంచినించి జర్మన్ ప్రమాణమాండలికంలోకి కూడా వ్యాపించింది (చూ. 3.3).

ప్రత్యయాలు ఒక భాషనించి మరొక భాషకు పోవడం చాలా అరుదు. సాధారణంగా ఎరువు తెచ్చుకొన్న పదానికి మన భాషలో ప్రత్యయాలే చేర్చి వాడతాం; స్టేషన్లు, థీసిస్సులు అని తెలుగు బహువచన ప్రత్యయంతోనే వాడతాం కాని స్టేషన్స్, థీసెస్ అని ఇంగ్లీషు ప్రత్యయాలతో వాడం. కాని పరభాషా సంపర్కం అత్యధికంగా ఉన్నప్పుడు పరభాషా పదాలలోని ఒకటి రెండు నిష్పాదక ప్రత్యయాలు స్వీకారకభాషాపదాలకి కూడా వచ్చి చేరవచ్చు. ఇంగ్లీషులోకి వచ్చిన ఫ్రెంచి పదాలలో - able -Lible (agreeable, edible) అనే ప్రత్యయం అర్థార్థంలో ఉంది; దీని ప్రాచుర్యంవల్ల ఇది కొన్ని దేశ్య క్రియలకి కూడా చేరి bearable, eatable, drinkable అనే కొత్త పదాలు

సృష్టించబడ్డాయి. ఇలాగే గోండీలో ఆర్యభాషా పదాలలో ఉన్న - వాల్ (<వాలా) అనే కర్త్రర్థక ప్రత్యయం ద్రావిడ క్రియలకి కూడా చేరి వెహ్వాల్ 'చెప్పేవాడు' (వహ్-'చెప్పు'). ఆట్వాల్ 'వండేవాడు' (ఆట్ - 'వండు') ఇత్యాది రూపాలు ఏర్పడ్డాయి.

పరభాషా ప్రభావంవల్ల వాక్యనిర్మాణంలో మార్పు రావడం, కొత్త రకం పదబంధాలు ఏర్పడడం సర్వసహజం. ద్రావిడ భాషలలో అస్త్యర్థక క్రియలేని వాక్యాలు (వాడు రాముడు) ప్రచురం కాబట్టి ఇటువంటి వాక్యనిర్మాణం సంస్కృతంలోకి కూడా ప్రవేశించింది (స రామః). తెలుగులో 'వచ్చినవాడు' అనడానికి బదులు 'ఎవడు వచ్చాడో వాడు' - ఇటువంటి ప్రయోగాలు సంస్కృతంలోని యత్తదర్థక సర్వనామాల ప్రభావంవల్ల ఏర్పడ్డాయి (కావ్య భాషలో ఇటువంటి ప్రయోగాలకి ఎక్కువ వ్యాప్తి ఉంది). ఇంగ్లీషులో It goes without saying అనే ప్రయోగం ఫ్రెంచి భాషను అనుకరించడంవల్ల ఏర్పడిందని అంటారు.

# 17. పాశ్చాత్య దేశాలలో భాషాశాస్త్ర పరిణామం

## 17.1 గ్రీక్ వ్యాకరణాలు

యూరప్ ఖండవాసుల సంస్కృతి మొదట గ్రీసు దేశంలో వృద్ధి చెందింది. గ్రీసుదేశ పండితులు వేదాంతశాస్త్రం, న్యాయశాస్త్రం, రాజకీయ శాస్త్రం, అలంకార శాస్త్రం మొదలైన అనేక విజ్ఞానశాస్త్ర శాఖలలో పరిశ్రమ చేశారు. వారు భాషని గురించీ వ్యాకరణాన్ని గురించీ చేసిన చర్చ వేదాంత శాస్త్రంలో అంతర్భూతమవుతుంది. ఆ కాలంలో ఇతర యూరప్ దేశీయులు అంతగా పట్టించుకోని విషయాలనుగూర్చి ఆలోచించి సిద్ధాంతాలు ప్రతిపాదించిన ప్రాచీన గ్రీసు దేశీయుల విజ్ఞాన సముపార్జన కాంక్ష ప్రశంసనీయం.

మానవుడికి తన భాష పుట్టుకని గురించి, స్వభావాన్ని గురించీ తెలుసుకోవాలనే ఆసక్తివల్ల అతడు చేసిన ఊహాగానాలు మత గ్రంథాలలో ప్రతిబింబిత మయ్యాయి. బైబిల్ (జెనిసిస్ 11వ అధ్యాయం) లోని టవర్ ఆఫ్ బేబెల్ కథ ఇటువంటిదే. ఇందులో మానవులంతా ఆదిలో ఒకే భాష మాట్లాడేవారనీ, వారు షినార్ అనే దేశంలో ఒక పట్టణమూ స్వర్గమంత ఎత్తు శిఖరమూ కట్టడం ప్రారంభించారనీ, అది చూసి దేవుడు మానవులు ఐకమత్యంతో దేన్నైనా సాధించగలరు కాబట్టి దాన్ని భంగం చెయ్యడం కోసం ఒకరి భాష ఒకరికి అర్థం కాకుండా చేసి మానవులని భూమిలో అన్ని ప్రాంతాలకీ చెల్లాచెదరు చేశాడనీ చెప్పబడింది. భాష పుట్టుకను గూర్చి తెలుసుకోవడానికి ఒక ఈజిప్టు రాజు చేసిన ప్రయత్నాన్ని హెరొడోటస్ (Herodotos) అనే గ్రీకు చారిత్రకుడు (క్రీ.పూ. 5వ శతాబ్ది) ఉదాహరించాడు. ప్సమ్మెతికోస్ (Psammetichos) అనే ఈజిప్టు రాజు ప్రపంచ భాషలలోకెల్లా ప్రాచీనమైన భాష ఏదో తెలుసుకోవాలనే ఉద్దేశంతో అప్పుడే పుట్టిన ఇద్దరు పిల్లలని మాటలు వచ్చేవరకూ వేరుగా

ఉంచాడట. కొంతకాలానికి వాళ్లు బెకోస్ అనే మాటని ఉచ్చరించారట. ఈ మాటకి ఫ్రిజియన్ భాషలో "రొట్టె" అని అర్థం కాబట్టి మానవుల ప్రథమ భాష ఫ్రిజియన్ అని ఆ రాజు నిశ్చయించారట. ఇటువంటి అభిప్రాయాలు శాస్త్రీయమైనవి కావు.

ప్రాచీన గ్రీసు దేశ పండితులు తమ భాషపైనే దృష్టి కేంద్రీకరించి భాషా శాస్త్ర సిద్ధాంతాలు ప్రతిపాదించారు. గ్రీకుభాషకు లిపి ఏర్పడడం వీరి ప్రథమ పరిశోధనా ఫలితం. క్రీస్తుపూర్వం వేయి సంవత్సరాలకు ముందే వీరు ఫొనీషియన్ (Phonecian) లిపి ఆధారంగా గ్రీకు లిపి ఏర్పరిచారు. ఫొనీషియన్ లిపిలో హల్లులకు మాత్రమే సంకేతాలు ఉండేవి. అచ్చులను సందర్భానుసారంగా ఊహించుకొనేవారు. గ్రీకులు ఈ లిపిని తమ భాషకు ఉపయోగిస్తూ తమ భాషకు అవసరం లేని ఫొనీషియన్ హల్లుల సంకేతాలని అచ్చులకు సంకేతాలుగా మార్చి గ్రీకుకు అచ్చులనూ హల్లులనూ విడివిడిగా సూచించే లిపిని ఏర్పరుచుకొన్నారు.

ఇప్పుడు మనకు దొరికే గ్రంథాలలో భాషని గురించిన చర్చ ఉన్న వాటిలో ప్రాచీనమైనది ప్లేటో (Plato, క్రీ.పూ. 425-348/47) సంభాషణలలో ఒకటైన క్రటిలస్ (Cratylus). ఇందులో ఈయన "భాష ప్రకృతి సిద్ధమైనది" అనే పూర్వుల సిద్ధాంతాన్ని ప్రవచించారు. భాషలో పదాలకీ అర్థాలకీ సహజ సంబంధం ఉందని ఈయన నమ్మారు. భావాలు లేక అర్థాలు శాశ్వతమైనవనీ వాటికీ అవి సూచించే వస్తువులకీ అవినాభావ సంబంధం ఉందని ఈయన వాదం. దీనికి ఉప సిద్ధాంతం భాష తర్క సహజంగానూ న్యాయ సమ్మతంగానూ ఉంటుంది అనేది. ఈ సిద్ధాంతాన్ని నిరూపించడానికి ఈయన కొన్ని పదాలకి వ్యుత్పత్తులు ఇచ్చారు. అయితే ఈయన ఇచ్చిన వ్యుత్పత్తులు సరి అయినవి కావని తరువాత పరిశోధనల వల్ల తేలింది.

ప్లేటో శిష్యులలో ఒకడైన అరిస్టాటిల్ (Aristotle, క్రీపూ. 384-322/21) ప్రాచీన కాలపు పండితులలో అగ్రగణ్యుడు. ఈయన విజ్ఞాన శాస్త్రం అన్ని శాఖలపైనా పరిశోధన చేశారు. భాషోత్పత్తి విషయంలో ఈయన తన గురువుతో ఏకీభవించలేదు. ఈయన భాష సహజసిద్ధమైనది కాదనీ, అది

సంప్రదాయ సిద్ధమైనదనీ చెప్పారు. ఈయన భాషేకాక ఏ వస్తువైనా మూల పదార్థమూ, ఆకృతీ అనే రెండింటి సమ్మేళనం వల్ల ఏర్పడిందని చెప్పారు. ఈయన వాదమే అంగీకార యోగ్యం. ఎందువల్లనంటే, తెలుగు గుర్రం, తమిళం కుదిరై, హిందీ ఘోడా, ఇంగ్లీషు (Horse) – ఇవన్నీ ఒక జంతువునే సూచిస్తాయి. ఈ పదాలకీ అవి సూచించే జంతువుకీ సహజ సంబంధం ఉందని చెప్పలేం. భాషలలో ధ్వన్యనుకరణ వల్ల ఏర్పడిన శబ్దాలు కొన్ని ఉన్నా వాటి సంఖ్య అతి స్వల్పం. ఈయన సిద్ధాంతం ప్రకారం పదాల అసలు అర్థాన్ని అన్వేషించడం అనవసరం కాబట్టి ఈయన సిద్ధాంతం ప్రకారం పదాల అసలు అర్థాన్ని అన్వేషించడం అనవసరం కాబట్టి పదవ్యుత్పత్తి జోలికి పోలేదు. ఈయన గ్రీకు భాష గురించి కొన్ని ప్రమాణ పూర్వకమైన అభిప్రాయాలను వెల్లడించారు. ఈయన నామాలు, క్రియలు, సంయోజకాలు (Conjunctions) అనే మూడు భాషాభాగాలు గుర్తించారు.

ఈయన తరువాత ఏథెన్స్‌లో జెనో (Zeno) క్రీ.పూ. 308లో స్థాపించిన స్టోయిక్ శాఖ (Stoic School)లో భాషా విషయాలకు సంబంధించిన ప్రత్యేక గ్రంథాలు వెలువడ్డాయి. పాశ్చాత్య వ్యాకరణ మూల పద్ధతులను స్థాపించినవారు వీరే. నామ విభక్తులకు వీరు పెట్టిన పేర్లే అనువాదాల ద్వారా అన్ని పాశ్చాత్య భాషలకూ వ్యాపించాయి.

గ్రీకు పండితులు సహజసిద్ధ – సంప్రదాయసిద్ధ వాదాలలాగే మరొక విప్రతిపత్తిని కూడా చర్చించారు. భాష క్రమబద్ధమైనదని కొందరు వాదిస్తే మరికొందరు అది క్రమరహితమని వాదించారు. మొదటి రకం వారిని సామ్య సిద్ధాంతవాదులు (Analogists) అనీ, రెండో రకం వారిని క్రమరాహిత్య సిద్ధాంతవాదులు (Anomalists) అనీ అంటారు. మొదటి రకం వారు చాలా ధాతు ప్రాతిపదికలకి చేరే ప్రత్యయాలు తుల్యంగా ఉన్నాయన్న విషయానికి ప్రాధాన్యం ఇచ్చారు. రెండో రకంవారు భాషలో ఉన్న ప్రతిషేధ రూపాలూ, పట్టణాల పేర్లూ బహువచనంలో ఉండడమూ, పుంలింగ స్త్రీలింగ పదాలూ అప్రాణి వాచకాలని కూడా సూచించడమూ మొదలైన అసహజంగా కనపడే విషయాలకు ప్రాధాన్యం ఇచ్చారు.

అలెగ్జాండ్రియాలో పండితులు హోమర్ మొదలైన ప్రాచీన కవుల కావ్యాలలో భాషని గురించి చర్చించి ఆ కావ్యాలకి వ్యాకరణాలు రాశారు. వీరిలో అరిస్టార్కస్ (Aristarchus క్రీపూ 2వ శతాబ్ది) ముఖ్యుడు. మిగిలిన గ్రీకు వ్యాకరణాలలో ప్రాచీనతమమైన దాని కర్త అయిన డయనాసియస్ థ్రేక్స్ (Dionysius Thrax, క్రీ.పూ. 1వ శతాబ్ది)కి ఈయన గురువు.

థ్రేక్స్ గ్రంథం పేరు టెక్నే గ్రమాటికే (Techne grammatike). 15 పేజీల ఈ గ్రంథంలో 25 భాగాలు ఉన్నాయి. ఇందులో గ్రీకు భాషా నిర్మాణం సంగ్రహంగా వివరించబడింది. కాని వాక్య నిర్మాణ చర్చ లేదు. ఇది చాలా శతాబ్దాల వరకూ గ్రీకు భాషకు ప్రమాణ వ్యాకరణమూ, పాశ్చాత్య భాషా వ్యాకరణాలకు ఆదర్శమూ అయింది. థ్రేక్స్ ఇలా చెప్పేరు : "వ్యాకరణం కవుల వ్యవహారానికి సంబంధించిన జ్ఞానం. ఇందులో ఆరు భాగాలు ఉన్నాయి: 1. సరిగా ఉచ్చరించడం, 2. పూర్వ కవుల భాషని వివరించడం, 3. పూర్వ కవుల వ్యవహారం పైనా, కావ్య వస్తువుపైనా వ్యాఖ్య 4. వ్యుత్పత్తులు కనుగొనడం, 5. భాషలో ఉన్న నియమాలు నిర్దేశించడం, 6. సాహిత్య విమర్శ (ఇదే వ్యాకరణంలో ముఖ్యాంగం)". ఇందులో ఐదవ భాగమే మనకు ముఖ్యం. ఈయన గ్రీకు లిపులకు ఉన్న ఉచ్చారణలు వివరించారు కాని సవర్ణాలకు సంబంధించిన వివరణ ఇవ్వలేదు. ఈయన వాక్యాన్ని "పూర్తి భావాన్ని వ్యక్తీకరించేది" అని నిర్వచించారు. ఈయన ఎనిమిది భాషా భాగాలని గుర్తించి ఒక్కొక్క భాషా భాగానికి ఉండే ప్రత్యేక లక్షణాలను వివరించారు. ఈయన భాషాభాగాలని ఈ కింది విధంగా నిర్వచించారు.

1. నామం : ఇది వ్యక్తిని కాని వస్తువుని కాని సూచిస్తుంది. దీనికి విభక్తులు చేరతాయి.
2. క్రియ : ఇది పనినిగాని పరిణామాన్నిగాని తెలుపుతుంది. దీనికి విభక్తులు చేరవుగాని కాల, పురుష, వచన ప్రత్యయాలు చేరతాయి.
3. అసమాపక క్రియ (Participle) : క్రియా లక్షణాలూ, నామ లక్షణాలూ ఉన్నవి.

4. విహితం (Article) : నామం ముందుగాని వెనక గాని ఉండేది; విభక్తులు చేర్చుకొనేది.
5. సర్వనామం : నామం స్థానంలో ఆదేశంగా వచ్చేది; పురుష భేదం గంది.
6. పూర్వసర్గ : వాక్య నిర్మాణంలో ఇతర పదాలముందు వచ్చేది.
7. క్రియా విశేషణం : ప్రత్యయాలు చేరనిది; క్రియను వ్యవస్థీకరించేది.
8. సంయోజకం : చర్చను ఏకీకరించేది; అర్థ వివరణలో ఖాళీలను పూరించేది.

థ్రేక్స్ వదిలివేసిన గ్రీకు వాక్య నిర్మాణాన్ని అపొలోనియస్ డిస్కొలస్ (Apollonius Dyscolus, క్రీ.శ. 2వ శతాబ్ది) విపులంగా వర్ణించారు.

మొత్తానికి ప్రాచీన గ్రీకు పండితులు ధ్వని నిర్మాణం, వ్యుత్పత్తి, వ్యాకరణం అనే మూడు విషయాలు చర్చించారు. మొదటి రెండింటిలో వారు ప్రాచీన భారతీయులు సాధించినంత శాస్త్రీయత సాధించలేక పోయారు. కాని వ్యాకరణంలో వారి పరిశ్రమ శాస్త్రీయమైనది. అది తరవాత చాలాకాలం వరకూ పాశ్చాత్య పండితులకు ఆదర్శప్రాయమైంది.

## 17.2 లాటిన్ వ్యాకరణాలు

రోమన్లకు గ్రీసు దేశంతో సంబంధం చాలా పురాతన కాలం నించీ ఉంది. క్రీ.పూ. 2–3 శతాబ్దులలో రోమన్ సామ్రాజ్యం విస్తరించి గ్రీసు కూడా దాని ఆధిపత్యంలోకి వచ్చింది. విద్య, కళలు మొదలైన విషయాలలో గ్రీకులు తమకన్న అధికులని రోమన్లు గుర్తించి వారిని అనుకరించారు. "గ్రీకులు కళలలో ఆధిక్యం సంపాదిస్తే, రోమ్ ప్రపంచ శాంతిని కాపాడుతుంది" అని వెర్గిల్ అన్నారు. ఇతర రంగాలలో లాగే వ్యాకరణంలోకూడా రోమన్లు గ్రీకులను అనుకరించి గ్రీకుల సిద్ధాంతాలను, మతభేదాలను పద్ధతులను లాటిన్ భాషకు అన్వయించారు. వ్యుత్పత్తి విషయంలో గ్రీకులు పొరబడినట్లే రోమన్లు కూడా విశృంఖలమైన ఊహాగానం చేశారు. వుల్పేస్ (vulpees) 'నక్క' అనేమాట

వొలో (voloo) 'ఎగురుతున్నాను', పేస్ (pees) 'పాదం' అనే మాటలనించి వచ్చిందన్నారు. ఇంతేకాక వ్యతిరేకార్థక పదాలకు కూడా పరస్పర సంబంధం ఉన్నట్లు వాదించారు. బెల్లమ్ (bellum) 'యుద్ధం' అనే పదం బెల్లస్ (bellus) 'అందమైన' అనే పదం నించి వచ్చిందిట; యుద్ధం అందమైనది కాదు గదా అని దీనికి సమర్థన. వ్యాకరణంలో కూడా గ్రీకుల వలె వీరు పదాన్నే మూలాంశంగా తీసుకొన్నారు కాని పదానికి ప్రకృతి ప్రత్యయ విభాగం చెయ్యలేదు. గ్రీకు పదానికి లాటిన్ పదాలకి సామ్యాలు ఉన్నచోట అటువంటి పదాలన్నీ గ్రీకు భాష నించి వచ్చాయని అపోహ పడ్డారు. కాని వాటిలో ఏవి నిజమైన ఎరువు పదాలు, ఏవి సజాతి పదాలు అని గ్రహించలేక పోయారు. గ్రీకుకీ, లాటిన్‌కీ చాలా విషయాలలో సామ్యం ఉందని గ్రహించినా అవి సోదర భాషలనే సత్యం వారికి తట్టలేదు.

లాటిన్ వ్యాకరణాలలో ప్రథమం వారో (Varro, క్రీ.పూ. 116–27) రచించినది. దీని 26 భాగాలలో ఇప్పుడు అయిదు నించి పది వరకూ ఉన్న విభాగాలే దొరుకుతున్నాయి. వారో లాటిన్ పదాలని నామాలు (విభక్తులు చేరేవి), క్రియలు (కాల ప్రత్యయాలు చేరేవి), అసమాపక క్రియలు (కాలవిభక్తి ప్రత్యయాలు రెండూ చేరేవి), క్రియా విశేషణాలు (రెండు రకాల ప్రత్యయాలూ లేనివి) అని నాలుగు రకాలుగా విభజించారు. గ్రీకులో అయిదు విభక్తులే కాని లాటిన్‌లో ఆరు విభక్తులు ఉన్నాయని ఈయన గుర్తించారు. ఇంతేకాక ప్రత్యయాలలో నిష్పాదక ప్రత్యయాలు, విభక్తి ప్రత్యయాలు అని రెండురకాలు ఉన్నట్లు ఈయన గుర్తించారు. వారో కాక ఇతర లాటిన్ వైయాకరణులలో క్వింటిలియన్ (Quintilian, 1వ శతాబ్ది) ప్రసిద్ధులు. వీరు గ్రీకుల పద్ధతులని వారోకన్నా ఎక్కువగా అనుకరించారు కాబట్టి వీరి రచనలలో కొత్తదనం ఏమీలేదు. ప్రిసియన్ వ్యాకరణం ప్రమాణ గ్రంథంగా అంగీకరించబడింది. ఇందులో పద్దెనిమిది విభాగాలు భాషా భాగాలకు సంబంధించినవి, రెండు వాక్య నిర్మాణానికి సంబంధించినవి.

## 17.3 మధ్యకాల గ్రంథాలు

రోమన్ సామ్రాజ్యం అంతరించిన తర్వాత క్రీస్తు ఆదేశం ప్రకారం

క్రైస్తవ పండితులు తమ మతం ప్రపంచం అంతటా వ్యాప్తి చేయడం ప్రారంభించారు. దీనివల్ల పండితులు పారంపర్యంగా గ్రీకు, లాటిన్ భాషలను గురించి చర్చించడమేకాక అనేక ఇతర భాషలపై వారి దృష్టి పడింది. బైబిల్ ఆర్మేనియన్‌లోకి 5వ శతాబ్దిలోనూ, గాథిక్‌లోకి 4వ శతాబ్దిలోనూ ఓల్డ్ చర్చ్ స్లావోనిక్‌లోకి 9వ శతాబ్దిలోనూ అనువదించబడింది. క్రైస్తవ మత వ్యాపకుల సౌకర్యం కోసం లాటిన్ పదాలకి ఇతర భాషలలోని సమానార్థకాలని ఇచ్చే నిఘంటువులు కూర్చబడ్డాయి. ఇటువంటి నిఘంటువులే జర్మన్ వంటి కొన్ని భాషలకి మిగిలిన ప్రాచీనాధారాలు అయ్యాయి. లాటిన్ భాషకు కూడా ఈ కాలంలో మరికొన్ని వ్యాకరణాలు రచించబడ్డాయి. 16వ శతాబ్దిలో అచ్చు యంత్రం కనిపెట్టబడడంతో అనేక భాషలకి వ్యాకరణాలూ, నిఘంటువులూ తయారయి వ్యాప్తిలోకి వచ్చాయి.

16–18 శతాబ్దాల మధ్య అప్పటి కాలానికి తెలిసిన భాషలపై పరిశోధన జరిగింది. జర్మన్ యాత్రికుడైన పి.ఎస్. పల్లాస్ (పద్దెనిమిదో శతాబ్ది) చాలా భాషలకి తులనాత్మక పద పట్టిక తయారు చేశారు. ఈయన ముందు కాలంలో కూడా ఒకరిద్దరు ఇటువంటి ప్రయత్నం చేశారు. 1800–1805లో హాండురో అనే ఆయన సుమారు 800 భాషలకి ఇటువంటి పట్టిక తయారు చేశారు. అదెలుంగ్ Mithridates అనే గ్రంథంలో క్రైస్తవుల ప్రార్థనని సుమారు ఐదు వందల భాషలూ, మాండలికాలలో ఇచ్చారు.

భాష స్వభావాన్ని గురించి చర్చించిన గ్రంథాలలో ముఖ్యమైనది Port Royal Grammar (1660). లాటిన్, గ్రీక్, హిబ్రూ, నవీన యూరోపియన్ భాషలు ఆధారంగా దీని కర్తలు సర్వ భాషా లక్షణాలకు వర్తించే వ్యాకరణం రాయడానికి ప్రయత్నించారు. కాని వీరు ఇతర ఖండాల భాషలను తమ పరిధిలోకి తీసుకోలేదు. మాతృభాషా భక్తితో వీరు ఫ్రెంచి భాష స్పష్టమైనది, సర్వాంగ సుందరమైనది అని నిరూపించుకోడానికి ప్రయత్నించారు.

ఈకాలంలో భాషోత్పత్తి విషయకచర్చ కూడా మూఢ నమ్మకాలపై ఆధారపడింది. చాలామంది హిబ్రూయే మానవుడి ప్రథమ భాష అని నమ్మి మిగిలిన అన్ని భాషలూ దానినించే పుట్టేయని నిరూపించడానికి

ప్రయత్నించారు. స్కాట్లండ్ దేశానికి చెందిన నాలుగో జేమ్స్ (1488-1513) ఇద్దరు పిల్లలని మాటలు వచ్చేదాకా వేరుగా ఉంచి, వాళ్లు మరిచి హిబ్రూ మాట్లాడుతున్నారని అనుకొన్నారు. మాతృభాషా భక్తులు కొందరు తమ భాషే అన్నిటికీ మూలభాష అని వాదించారు. స్వీడన్ దేశానికి చెందిన ఆంద్రియస్ కెమ్కే (Anderas Kemke) ఈడెన్ ఉద్యానవనంలో దేవుడు స్వీడిష్, ఆడామ్ డేనిష్, సర్పం ఫ్రెంచి మాట్లాడేవారని వాదించారు.

పద్దెనిమిదో శతాబ్ది చివర వరకూ అనేక భాషలపై వివరాలు తెలిశాయి కాని వ్యాకరణ పద్ధతులూ, అవగాహనా పరంపరాయతంగానే ఉన్నాయి. కాని పందొమ్మిదో శతాబ్దంలో ఏర్పడిన శాస్త్రీయ దృక్పథానికి మార్గదర్శకులు అంతకుముందు కాలంలో ముగ్గురు ఉన్నారు. వారు లైబ్నిజ్, హెర్డర్, సర్ విలియం జోన్స్.

లైబ్నిజ్ (Leibniz, 1646-1716) సర్వ శాస్త్రాలలోనూ ముఖ్యంగా వేదాంత, గణిత శాస్త్రాలలో నిష్ణాతుడు. ఆకాలపు పండితులలో ప్రధానుడు కాబట్టి ఈయనకు సమాజంలో ముఖ్య వ్యక్తులతో పరిచయం ఉండేది. ఈయన భాషలని పరిశోధించి వాటి పరస్పర సంబంధాలని నిర్ణయించడంలో ఆసక్తి చూపి సమకాలీన పండితులని ప్రోత్సహించారు. అన్ని భాషలకూ హిబ్రూ మూలమనే వాదాన్ని ఈయన ఖండించారు. యూరప్, ఆసియాలలో భాషలు పరస్పర సంబంధం గలవి అనీ, వీటన్నిటికీ మూలం ఒకటి ఉండేదనీ ఈయన మొదట ప్రతిపాదించారు. యూరప్, ఆసియా, ఈజిప్టులలో భాషల పరస్పర సంబంధాలపై ఈయన రాసిన గ్రంథం 1710లో ప్రచురితమైంది. ఈయన రష్యన్ చక్రవర్తులను తమ సామ్రాజ్యంలో భాషలకు వ్యాకరణాలూ, నిఘంటువులూ తయారు చేయించమనీ, పి.ఎస్. పల్లాస్ 200 భాషలపై చేసిన పరిశోధనకు ఆర్థిక సహాయ్యం చేయమనీ కోరేరు. ఈయన జర్మన్ భాషకు లాటిన్, ఫ్రెంచిలతో సమాన. స్థానం కల్పించడానికి పాటుపడి, స్వయంగా జర్మన్ భాషలో అనేక వ్యాసాలు రాసి ఆ భాషాభివృద్ధికి తోడ్పడ్డారు.

హెర్డర్ (Herder, 1744-1803) భాషోత్పత్తిపై ఒక వ్యాసం రాసి భాష దైవదత్తమనే వాదాన్ని ఖండించారు; భాష దైవదత్తమైతే అది తర్కా-

సహజంగానూ అపవాద రహితంగానూ ఉండి ఉండేదని ఈయన వాదించారు (ఈయన జర్మనీ దేశస్తుడు). అయితే భాషను మానవుడు సృష్టించాడని కూడా ఈయన చెప్పలేదు. మాట్లాడాలనే ప్రకృతి సిద్ధమైన కాంక్షవల్ల భాష పుట్టిందనీ, ఈ కాంక్ష దైవదత్తమైతే అయి ఉండవచ్చు కాని భాష వృద్ధి చెందడం మానవుడివల్లే జరిగిందని ఈయన చెప్పేరు. మాట్లాడాలనే మానవుడి ప్రకృతిసిద్ధమైన కాంక్ష గర్భస్థ శిశువుకి పుట్టాలనే కాంక్ష వంటిదని ఈయన అన్నారు. అయితే, హిబ్రూ ప్రథమ భాష అనే అభిప్రాయాన్ని ఈయన అంగీకరించారు.

సర్ విలియం జోన్స్ (Sir William Jones, 1746-94) అనే ఆంగ్లేయుడు చేసిన పరిశోధన లైబ్నిజ్, హెర్డర్‌ల పరిశోధనలకన్న భాషా శాస్త్రాభివృద్ధికి ముఖ్యమైనది కాబట్టి అది చారిత్రక భాషా శాస్త్రానికి నాందీ ప్రస్తావన అనవచ్చు. పై ఇద్దరివలెనే జోన్స్ కూడ వృత్తిరీత్యా భాషా శాస్త్రజ్ఞుడు కాడు. ఆయన న్యాయశాస్త్రం చదివి, 1783 నించి మరణ కాలం వరకు కలకత్తా హైకోర్టులో న్యాయమూర్తిగా ఉండేవారు. ఈయన జీవితంలో చివరి తొమ్మిది ఏళ్లూ సంస్కృతాన్ని క్షుణ్ణంగా అభ్యసించడమేకాక సంస్కృతానికీ ప్రాచీన యూరపియన్ భాషలకీ గల సంబంధాన్ని మొట్టమొదటిసారిగా ఈయన ఊహించ గలిగారు. అంతకుముందు పండితులు కొందరు ఈ భాషల మధ్య పోలికలున్నట్లు కనిపెట్టేరు గాని అవన్నీ ఒక మూలభాష నుండి పుట్టినట్లు ఎవ్వరూ చెప్పలేదు. ఈ సత్యాన్ని మొదట కనుగొని చారిత్రక భాషా శాస్త్రానికి అంకురార్పణ చేసినది సర్ విలియం జోన్స్. ఆయన 1786వ సంవత్సరం ఫిబ్రవరి 2వ తేదీన ఏషియాటిక్ సొసైటీలో ఇచ్చిన ఉపన్యాసంలోని కింది వాక్యాలలో సంస్కృతం, గ్రీక్, లాటిన్, గాథిక్, కెల్టిక్, పర్షియన్ భాషలు ఆధారాలు మిగలని ఒక మూలభాష నించి పుట్టేయని ప్రమాణపూర్వకంగా నిర్ణయించారు.

**"The Sanscrit language, whatever be its antiquity, is of a wonderful structure; more perfect than the Greek, more copious than the Latin, and more exquisitely refined than either, yet bearing to both of them a stronger affinity, both in the roots of verbs and in the forms**

of grammar, than could possibly have been produced by accident; so strong indeed, that no philologer could examine them all three, without believing them to have sprung from some common source, which, perhaps, no longer exists: there is a similar reason, though not quite so forcible, for supposing that both the Gothick and the Celtick, though blended with a very different idiom, had the same origin with the Sanscrit; and the old Persian might be added to the same family".

## 17.4 పందొమ్మిదో శతాబ్దిలో పరిణామాలు

సర్ విలియం జోన్స్ పరిశోధనల వల్ల భాషకు చరిత్ర ఉందని పండితులకు తెలియగానే ఈ చరిత్రను తెలుసుకొందుకు సాధనమైన తులనాత్మక పద్ధతిని విపులంగానూ శాస్త్రీయంగానూ రూపొందించి, తులనాత్మక పరిశోధనలు ఇండో యూరోపియన్ భాషలలోనూ ఇతర భాషా కుటుంబాల లోనూ చెయ్యడం ప్రారంభించారు. వీరిలో ప్రథముడు డెన్మార్కు దేశీయుడైన రాస్మస్ రాస్క్ (Rasmus Rask, 1787–1832) ఈయన డేనిష్ భాషలో 1814లో "ప్రాచీన నోర్స్ లేక ఇస్లాండిక్ ఉత్పత్తిపై పరిశోధన" అనే వ్యాసం రాసి దానిని డేనిష్ ఎకాడమీ ఆఫ్ సైన్స్‌కు బహుమతి నిమిత్తం ఇచ్చారు. ఇందులో ఈయన తులనాత్మక పద్ధతికి మౌలికమైన కొన్ని సూత్రాలు ప్రతిపాదించడమే కాక జర్మానిక్ భాషల పరస్పర సంబంధంపై శాస్త్రీయమైన పరిశోధనకు మార్గం చూపేరు. భాషలకు పదాదానం సహజం కాబట్టి భాషల జన్మ సంబంధాన్ని నిర్ణయించడానికి పదాలలో సామ్యం కన్న ప్రత్యయాలలోనూ నిర్మాణంలోనూ ఉన్న సామ్యం ముఖ్యమని ఈయన చెప్పేరు. రెండు భాషలలో సర్వనామాలు సంఖ్యా వాచకాలు మొదలైన నిత్యావసరమైన పదాలు సమానంగా ఉంటే, ముఖ్యంగా వాటి మధ్య ధ్వనులలో భేదాలు ధ్వని సూత్రాల రూపంలో వివరణకు సాధ్యమయితే వాటికి జన్మ సంబంధం ఉంటుందని ఈయన చెప్పేరు. ఈయన జర్మానిక్ భాషలకు కొన్ని ధ్వని సూత్రాలు ఇచ్చారు. ఈయన ఐస్లాండిక్, డేనిష్, స్పానిష్ ఇటాలియన్ మొదలైన భాషలకి రచించిన వ్యాకరణాలు దోష రహితత్వానికీ, విషయ సమగ్రత్వానికీ, శాస్త్రీయ పరిశీలనకీ మచ్చుతునక అనవచ్చు.

వ్యాకరణాంశాలకి చారిత్రకమైన కారణాలని అన్వేషించడం అనే పద్ధతికి కూడా ఈయనే ప్రథముడు. జర్మన్, ఫ్రెంచి అంత విశేష వ్యాప్తిలో లేని డేనిష్ భాషలో ఈయన రాయడంవల్లా, పరిశోధనాంశం పరిమితమైన దవడం వల్లా ఆధునిక భాషాశాస్త్ర స్థాపకుడుగా కీర్తి ఈయనకు కాక ఈయన సిద్ధాంతాలని అనుసరించి, విపులీకరించిన యాకోబ్ గ్రిమ్‌కు దక్కింది. అయినా విశాల దృక్పథం, విమర్శనాత్మక దృష్టి, పరిశీలనా నైపుణ్యం కలిగి ఉండడంవల్ల రాస్క్ భాషాశాస్త్ర సృష్టికి కారకులైన అగ్రగణ్యులో ఒకరని మనం నిస్సందేహంగా చెప్పవచ్చు.

యాకోబ్ గ్రిమ్ (Jacob Grımm, 1785-1863) జర్మనీ దేశస్థుడు. ఈయన 1819లో "జర్మన్ వ్యాకరణం" అనే పేరుగల గ్రంథం మొదటి భాగం ప్రచురించారు. ఈయన "జర్మన్" అనే పదాన్ని ఒక జర్మన్ భాషకే పరిమితం చెయ్యక జర్మానిక్ భాషా కుటుంబానికి చెందిన భాషలన్నిటికీ వర్తించేటట్లు ప్రయోగించారు. కాబట్టి ఈ గ్రంథం జర్మానిక్ భాషలన్నిటికీ తులనాత్మక వ్యాకరణం. ఈ గ్రంథం మొదట రాసినప్పుడు ఈయన రాస్మస్ రాస్క్ గ్రంథం చూడలేదు. కాబట్టి సోదర భాషలలో సమాన పదాలలో ధ్వనులలో వ్యత్యాసం యథేచ్ఛగా కాక నియమబద్ధంగా ఉంటుందని రాస్క్ నిరూపించిన పరమ సత్యం ఈయన గ్రహించలేదు. అందువల్లనే ఈ గ్రంథం మొదటి ప్రచురణలో ధ్వనులలో గురించిన చర్చ లేక పద నిర్మాణ చర్చే ఉంది. పద నిర్మాణంలోని సామ్యాలని పరిశీలించేటప్పుడు ధ్వనుల మార్పులిన్నీ గమనించినా వాటిలో గల నియమబద్ధతని ఈయన అప్పుడు గమనించలేదు. కాని ఇది ప్రచురించిన వెంటనే రాస్క్ గ్రంథం చూడడం తటస్థించింది. రాస్క్ తన గ్రంథంలో ఇచ్చిన "ధ్వని సూత్రాలు", వాటికి జర్మానిక్ భాషలలో కొన్ని మంచి ఉదాహరణలు చూచిన వెంటనే గ్రిమ్‌కి ధ్వనుల మార్పులలోని నియమబద్ధత తెలిసి, ధ్వని పరిణామ పరిశోధన ప్రాధాన్యం తెలియవచ్చింది. కాబట్టి మొదటి ప్రచురణలో అసలే లేని ఆ ధ్వని పరిణామ చర్చ 1822లో వచ్చిన రెండవ ప్రచురణలో 595 పేజీలు ఆక్రమించుకొంది. ఈయన ఈ గ్రంథంలో తన పరిశోధన జర్మానిక్ భాషలకే పరిమితం చేసుకోవడం భాషా శాస్త్రాభివృద్ధికి రెండు విధాలుగా ఉపయోగించింది. రాస్క్ అంతకుముందు

సూచన ప్రాయంగా తెలిపిన ధ్వని సూత్రాలకి ఈయన విరివిగా ఉదాహరణలిచ్చి, ధ్వని సూత్రాలు ఒక భాషలోని కొన్ని పదాలకి కాక ఆ ధ్వనులు గల అన్ని పదాలకీ వర్తిస్తాయి అనే సత్యాన్ని తరవాతవారు గ్రహించడానికి దోహదం చేశారు. అంతేకాకుండా సదృశమైన ధ్వనులు సదృశమైన మార్పులు చెందుతాయి అనే విషయాన్ని కూడా ఈయన నిరూపించారు.

ఈ గ్రంథంలో గ్రిమ్ జర్మానిక్ భాషలలో కనిపించే అనేకమైన ధ్వని పరిణామాలు, వాటికి గల కారణాలు సమగ్రంగా పరిశోధించారు. వీటిలో తరవాత వారు గ్రిమ్ సూత్రం (Grimm's Law) అనే పేరుపెట్టిన ధ్వని పరిణామ సూత్రం అతి ముఖ్యమైనది. ఈ సూత్రాన్ని ఇట్లా చెప్పవచ్చు :

| గ్రీక్ | | గాథిక్ | |
|---|---|---|---|
| ప | (pous) | ఫ | (footus 'పాదం') |
| త | (treis) | థ | (Øreis 'మూడు') |
| క | (kardiaa) | ఖ | (hairtoo 'గుండె') |
| బ | (kánnabis) | ప | (ఇంగ్లీషు (hemp) 'గోగుచెట్టు) |
| ద | (déka) | త | (taihun 'పది') |
| గ | (génos) | క | (kuni 'జాతి') |
| ఫ | (phēroo) | బ | (bairan 'భరించు') |
| థ | (thygâteer) | ద | (dauhtar 'కూతురు') |
| ఖ | (chortos) | గ | (gards 'గజం') |

(గ్రీక్ ఫ < *భ, థ <*,ధ, ఖ <*ఘ)

ఈ ధ్వని పరిణామాలన్నీ రాస్మస్ రాస్క్ సూచించినవే, కాని గ్రిమ్ వీటన్నిటినీ ఒకచోట చేర్చి వీటిలో అంతర్లీనమై ఉన్న సమానత్వాన్ని గ్రహించి వెలిబుచ్చడం వల్ల ఈ సూత్రం ఈయన పేరుమీదుగా వెలిసింది. ఈ పరిణామాల్లో సమానత్వం ఏమిటంటే, గ్రీక్‌లో శ్వాస స్పర్శాలు (Voiceless stops; గ్రిమ్ వాడిన పదం Tenues) గాథిక్‌లో శ్వాస ఊష్మ స్పర్శాలు (Voiceless Spirants; గ్రిమ్ (పొరపాటుగా) వాడిన పదం Aspiratae)గానూ,

గ్రీక్‌లో నాదస్పర్శాలు (Voiced stops; గ్రిమ్ వాడిన పదం Mediae) గాథిక్‌లో శ్వాస స్పర్శాలుగానూ, గ్రీక్‌లో మహా ప్రాణశ్వాస స్పర్శాలు (Aspiraed voiceless stops; గ్రిమ్ వాడిన పదం Aspiratae) గాథిక్‌లో నాదస్పర్శాలుగా మారడమే. అంతేకాకుండా ఈ మార్పులన్నీ ఒక చక్రభ్రమణంలో జరిగినట్లు ఈయన అభిప్రాయపడ్డారు. ఈ చక్రభ్రమణం ఈకింది విధంగా చూపవచ్చు:




ఈ ధ్వని పరిణామాలు మూల జర్మానిక్ భాషలో జరిగినవి. మళ్ళీ హై జర్మన్ అని చెప్పబడే దీని ఒక మాండలికంలో పై మార్పుల వంటివే, అంటే, శ్వాస స్పర్శాలు ఈషత్ స్పర్శాలుగా మారడం వంటికి కొన్ని జరిగాయి. వీటికీ ఇంతకిముందు జరిగిన వాటికీ సాదృశ్యం ఉండడంవల్ల ఇవికూడా ఈ చక్రం ఇంకొకసారి తిరిగినట్లు ఉన్నాయని గ్రిమ్ సూచించారు. ఈ వివరణ ఇప్పుడు ఆమోదయోగ్యం కాదు. సమాన పద నిర్ణయంలో ధ్వని సూత్రాల ప్రాధాన్యం మొదట గుర్తించినవారు ఈయనే.

గ్రిమ్ ఈ ధ్వని సూత్రమే కాకుండా జర్మానిక్ భాషలలో జరిగే మరికొన్ని ధ్వని పరిణామాలనికూడా కనుగొన్నారు. వీటిలో ప్రధానమైనవి 'ఉమ్‌లౌట్' (Umlaut), 'ఎబ్‌లౌట్' (Ablaut) అనేవి. అచ్చులు వాటి తరవాత అక్షరంలో వచ్చే ఇ/య, ఉ/వ ల వల్ల పొందే మార్పులకి గ్రిమ్ ఉమ్‌లౌట్ అని పేరు పెట్టేరు; ఈ పేరే నేటికీ వాడుకలో ఉంది. begin, began, begun మొదలైన ఇంగ్లీషు క్రియలలో కనపడే అచ్చులలో మార్పే ఎబ్‌లౌట్ (ఈ

పదం సృష్టించినదీ, ఇది ఉండే క్రియలకి Strong verbs అని పేరు పెట్టినదీ ఈయనే).

ఈయనగాని రాస్క్ గాని తాము గుర్తించిన ధ్వని సూత్రాలకి అనువాదాలు ఉండవని అనలేదు. ధ్వని సూత్రాలు చాలా పదాలకి వర్తించినా వాటికి కొన్ని అపవాదాలుండటం సహజమనే వీరు అనుకొని అట్టి అపవాదాలని కూడా ఎత్తి చూపేరు. కాని ధ్వని సూత్రాలకి అపవాదాలుండవనే విషయం వీరి తరవాత చాలాకాలానికి గాని తెలియలేదు.

జర్మనీ దేశీయుడైన ఫ్రాంజ్ బొప్ (Franz Bopp. 1791–1867) సంస్కృత భాష అభ్యసించి, ఇండో యూరపియన్ భాషలకి తులనాత్మక వ్యాకరణం రాశారు. ఇది మొదట 1833–1852ల మధ్యకాలంలో భాగాలుగా ప్రచురింపబడింది. దీన్ని మళ్లీ రెండుసార్లు 1857, 1868లలో మార్పులు చేసి ఈయన ప్రచురించారు. ఈయన ప్రత్యయాలన్నీ మూలపదాలనించి పుట్టేయని నిరూపించడానికి వ్యర్థ ప్రయత్నం చేశారు. సకారం ఉన్న ప్రత్యయాలన్నీ లాటిన్ ఎస్ (సంస్కృతం అస్) నించీ బకారం ఉన్న ప్రత్యయాలన్నీ సంస్కృతం భూధాతువునించీ వచ్చేయని ఈయన చెప్పేరు. ఇటువంటి పరిశోధన ఊహామూలకమే అయినా ఈయన ఇండో యూరపియన్ తులనాత్మక వ్యాకరణ రచనలో సంస్కృత భాష ప్రాధాన్యాన్ని ఎత్తి చూపేరు కాబట్టి చిరస్మరణీయులు.

ఆగస్ట్ ఫ్రెడ్రిక్ పాట్ (August Friedrich Pott) కూడా 1833–36 లలో ఇండో యూరపియన్ తులనాత్మక వ్యాకరణంపై ఒక గ్రంథం రాశారు. ఇందులో ఈయన ధ్వనిసూత్ర చర్చకి ప్రాధాన్యమివ్వడమే కాక 375 ధాతువులకు ఇండో యూరపియన్ భాషలలో సమాన పదాలు ఇచ్చారు.

ఈకాలంలో అందరి పండితులకన్నా ఇండో యూరపియన్ భాషల లోనూ భాషా శాస్త్రంలోనూ ఎక్కువ కృషి చేసినవారు ఆగస్ట్ ష్లైషర్ (August Schleicher, 1821-68). ఈయన భాషా శాస్త్రంలోనే కాక ప్రకృతి శాస్త్రంలోకూడా ఆసక్తి కలవారు. డార్విన్ పరిణామవాదం వల్ల ప్రభావితులై

ఈయన భాషకు కూడా వృద్ధి క్షీణతలు సహజంగా ఏర్పడతాయని నమ్మేరు. ఈయన 1. భాషల పరస్పర సంబంధం, 2. మూలభాషని పునర్నిర్మించే తులనాత్మక పద్ధతి, 3. భాషల జన్మ, పరిణామం, వినాశం అనేవి ప్రాణుల జన్మ, పరిణామం, వినాశం వలెనే ఉంటాయని నమ్మేరు. ఈనాడు దీన్ని ఎవరూ అంగీకరించక పోయినా ష్లైషర్ వాడిన 'సోదర భాషలు' 'పితృభాష' లేక 'మూలభాష' అనే పదాలు ఇప్పటికీ సాంకే'ేక పదాలుగా వాడబడుతున్నాయి. ఈయన 'ఇండో యూరోపియన్ భాషల తులనాత్మక వ్యాకరణం' (1861-62)లో భాషల ఉపకుటుంబ విభజనను మొట్టమొదటిసారిగా 'భాషా కుటుంబ వృక్షపటం' ద్వారా సూచించారు. మూలపదాలని పునర్నిర్మించడం అనే పద్ధతి కూడా ఈయనే ప్రారంభించారు. కాని ష్లైషర్ ఈ పునర్నిర్మాణ పద్ధతిని చాలా ఎక్కువగా నమ్మేరని చెప్పాలి. ఎందువల్లనంటే, ఈయన ఈ పద్ధతి ననుసరించి మూలభాషలో వాక్యాలూ, కథలూ కూడా రాయడం సాధ్యమవుతుందని అనుకొన్నారు. కాని ఇది ఎప్పటికీ సాధ్యం కాని పని. ఈయనకి పూర్వులైన హంబోల్ట్ (Humboldt), ఆగస్ట్ పాట్ (August Pott)ల వలె ఈయన కూడా ప్రపంచ భాషలని ప్రత్యయ రహితాలు, సంయోజనాత్మకాలు, సంశ్లేషాత్మకాలు అని మూడు రకాలుగా విభజించారు. మూలభాష అంతకుముందు ఏమీ మార్పులు పొందనిదిగానూ, అపవాద రహితంగానూ, సమగ్రంగానూ ఉంటుందని ఈయన నమ్మేరు. ఈయన గ్రంథంలో కొత్తగా చెప్పిన విషయాలు లేకపోయినప్పటికీ అంతవరకు తెలిసిన విజ్ఞానాన్ని విపులీకరించడంవల్లా, అవలంబించిన పద్ధతులవల్లా దీనికి విశేష వ్యాప్తి వచ్చింది.

ఈకాలంలోనే ఆగస్ట్ ఫిక్ (August Fick, 1833-1916) మూల భాషలో పదాల్ని పునర్నిర్మించడానికి ప్రయత్నించారు. ఈయన ఇండో-యూరోపియన్ భాషల తులనాత్మక నిఘంటువు మొదట 1868లో ముద్రించబడింది. దీని మూడవ ఎడిషన్ 1874-76లోనూ, అసమాప్తమైన నాలుగవ ఎడిషన్ 1890లోనూ ముద్రించబడ్డాయి. ఈయనకాలంనాటి వరకూ పండితులు మూల ఇండో-యూరోపియన్ భాష మొట్టమొదట ఇండో-ఇరానియన్, యూరోపియన్ అనే రెండు భాగాలుగా విడిపోయిందని నమ్మేవారు. ఈ అపోహ ననుసరించి ఫిక్ తన నిఘంటువులో ఈ రెండు ప్రధాన భాగాలలోనూ

సమంగా ఉన్న పదాలనే మూలభాషకు చెందినవిగా సూచించారు. ఒక పదం యూరోపియన్ భాషలన్నింటిలోనూ ఉన్నా అది ఇండో-ఇరానియన్ భాషల్లో లేకపోతే దానిని మూలభాషకు చెందినదిగా ఈయన పరిగణించలేదు. కాని మూల ఇండో-యూరోపియన్ భాష మొదట ఇండో-ఇరానియన్, యూరోపియన్ అనే భాగాలుగా విడిందనడం సత్యదూరమని తరవాత తెలియడంవల్ల ఫిక్ అనుసరించిన ఈ పద్ధతి నిర్దుష్టమైనది కాదు. ఫిక్ నిఘంటువుకన్న ఉత్తమమైన తులనాత్మక నిఘంటువుని ఆల్వాల్డ్ (Alois Walde), జూలియస్ పొకొర్నీ (Julius Pokorny) 1927--32లలో ప్రచురించారు. దీనిలో తరవాత జరిగిన పరిశోధన ఫలితాలను ఆధారంగా చేసుకొని మార్పులు కూర్పులు చేసి, జూలియస్ పొకొర్నీ మళ్లీ 1947-60 లలో ప్రచురించారు.

1870 నించి తులనాత్మక భాషాశాస్త్రంలో నవీనయుగం ప్రారంభమైందని చెప్పవచ్చు. అంతవరకు నియమం లేకుండా ఉన్నట్టు కనపడే ధ్వని పరిణామాలలో అంతర్లీనమై ఉన్న నియమాలని ఈ కాలంలో పండితులు క్రమక్రమంగా కనిపెట్టటం ప్రారంభించారు. అంతేకాకుండా అంతవరకూ తెలిసిన ధ్వని సూత్రాలకి అపవాదాలుగా కనపడే పదాలలో మరొక ధ్వని సూత్రం అంతర్లీనమై ఉన్నట్లుగా కూడా వారు కనిపెట్టేరు. వీరిలో ఇటలీ దేశీయుడు అస్కొలీ (Ascoli), డెన్మార్క్ దేశీయులు విల్‌హెల్మ్ థామ్సన్ (Vilhelm Thomsen), కారల్ వెర్నర్ (Karl Verner), ఫ్రాన్స్, స్విట్జర్లండ్‌లకు చెందిన ఫెర్డినాండ్ దె సస్యూర్ (Ferdinand de Saussure), జర్మనీ దేశీయుడు కారల్ బ్రూగ్‌మన్ (Karl Brugmann) ముఖ్యులు. ఆశ్చర్యకరమైన వీరి పరిశోధనలవల్ల ధ్వని సూత్రాలకి నిజమైన అపవాదా లుండవని తేలింది. అందువల్ల వీరిలో ఒకరైన అగస్ట్ లెస్కీన్ (August Leskien) 1876లో 'ధ్వని సూత్రాలకి అపవాదాలుండవు' అనే నినాదం సృష్టించారు. కాని వీరి ఈ అభిప్రాయాన్ని కూర్తియస్ (Curtius) మొదలైన వృద్ధ పండితులు తీవ్రంగా వ్యతిరేకించారు. లీప్‌జిగ్ విశ్వవిద్యాలయంలో కూర్తియస్‌కి వ్యతిరేకులైన ఈ యువ పండితుల్ని హేళనగా 'యువ వ్యాకర్తలు' (ఇంగ్లీషులో Neo-grammarians, జర్మన్‌లో Junggrammatiker) అని పిలిచేవారు. కాని బ్రూగ్‌మన్ ఈ పదమే తమ అందరికీ గౌరవదాయకమని అనుకొని దీనినే

వాడడం మొదలు పెట్టేరు. దానితో 'ధ్వని సూత్రాలకి అపవాదాలు ఉండవు' అని నమ్మేవారినందరినీ ఈ పదంతో సూచించడం పరిపాటి అయిపోయింది. ఆకాలంలో కొందరు వృద్ధ పండితులు ఈ సిద్ధాంతాన్ని వ్యతిరేకించినా ఇది భాషా పరిణామం నియమ రహితమైనది కాక కొన్ని సూత్రాలకి కట్టుబడి ఉంటుందని చెప్పడంవల్ల దీనిని అనుసరించి సాగిన పరిశోధనలు శాస్త్రీయమూ, ఫలవంతమూ అయ్యాయి. ఈ సిద్ధాంతాలని ఆధారంగా చేసుకోవడం వల్లనే భాషా శాస్త్రజ్ఞులు ఒక ధ్వని సూత్రానికి లోబడని పదాలలో వేరొక ధ్వని సూత్రం ప్రవర్తిస్తూ ఉందనో లేక అవి వేరొక భాష నించి ఎరువు తెచ్చుకొన్నవనో లేక అవి సామ్యం, ధ్వన్యనుకరణ వంటి కారణాలవల్ల అపవాదాలయ్యాయనో కనిపెట్ట గలుగుతున్నారు. కాబట్టి యీ సిద్ధాంతం శాస్త్రీయమైన భాషా పరిశోధనకి ప్రాతిపదిక అని చెప్పవచ్చు. ఈ సిద్ధాంతాన్ని అనుసరించి ఉండకపోతే భాషా శాస్త్రజ్ఞులకి భాషల నిర్మాణంలోనూ పరిణామంలోనూ గల నియతి, క్రమబద్ధత తెలియకపోయేది. వారి పరిశోధన శాస్త్రీయం కాక యథేచ్ఛగా సాగి ఉండేది. ఇంక పైన పేర్కొన్న శాస్త్రజ్ఞుల పరిశోధనలు ఈ సూత్రాన్ని కనుగొనడానికి ఎలా హేతుభూతాలయ్యాయో దిఙ్మాత్రంగా చూద్దాము.

1870లో అస్కోలీ సంస్కృతంలో కకారం మూలభాషలో క, క్వ అనే రెండు వర్ణాలనించి పుట్టిందని కనుగొన్నారు (లాటిన్ లో ఈ రెండు వర్ణాలూ వేరువేరుగానే ఉన్నాయి).

| | | |
|---|---|---|
| సం. | గ్రీక్ | లాటిన్ |
| క్రవిస్ 'పచ్చి మాంసం' | kreas | cru̧ 'పాడుచు' |
| కః 'ఎవరు' | tis | quis |

దీనితోబాటు ఈయన సంస్కృతంలో చకారం కూడా మూలభాషలో మరొక ధ్వని నించి పుట్టిందని అనుకున్నారు. కాని ఈ ఊహ తప్పనీ, తాలవ్యీకరణం వల్ల మూలభాషలో క లేక క్వ అగ్రాచ్చుల ముందు సంస్కృతంలో చకారంగా మారిందనీ 1878లో మొదట విలియం థామ్సన్, వెర్నర్, సస్యూర్ మరికొందరు (ఎవరికి వారు ప్రత్యేకంగా) కనుగొన్నారు. ఉదా:

| సం. | గ్రీక్ | లాటిన్ |
|---|---|---|
| చ | te | -que |
| కః 'ఎవరు' | pente | quinque |

అంతవరకూ సంస్కృతంలో మూలభాషా వర్ణాలు యథాతథంగానే ఉన్నాయి కాని మారలేదు అని నమ్ముతూ ఉన్న పండితులకి యీ పరిశోధన దిగ్భ్రాంతి కలిగించింది. అంతేకాక దీనివల్ల మూలభాషలో ఎ, ఏ లు సంస్కృతంలో అ, ఆలుగా మారేయని స్పష్టమైంది.

ఈ తాలవ్యీకరణ సూత్రాన్ని కనుగొనడానికి ముందు 1875లో కారల్ వెర్నర్ 'మొదటి హల్ పరిణామానికి ఒక అపవాదం' అనే ప్రసిద్ధమైన వ్యాసం ప్రచురించారు. జర్మానిక్ భాషలలో మూలభాషలో ప, త, క లు f, θ, x లుగా మారతాయనే సూత్రం రాస్క్, గ్రిమ్‌లు కనుగొన్నట్టు ఇంతకుముందే చూశాం. కాని వారే ఈ సూత్రానికి చాలా అపవాదాలున్నట్టు గుర్తించారు. వారు అపవాదాలుగా పరిగణించిన పదాలలో ఇవి బ, ద, గ లుగా మారతాయి. ఈ భేదానికి నిజమైన కారణం ఈ ధ్వనుల పక్కనున్న అచ్చులో ఉదాత్తానుదాత్త భేదమే అని వెర్నర్ నిరూపించారు. వెర్నర్ జర్మానిక్ భాషలలో మాటల్ని సంస్కృత పదాలతో పోల్చిచూసి మూలభాషలో ధాతువులో అచ్చు అనుదాత్తమైతే దాని తరవాత ఉన్న ప, త, క లు బ, ద, గ లుగానూ ఆ అచ్చు ఉదాత్తమైతే అవి f, θ, x గానూ జర్మానిక్ భాషలలో మారతాయని కనిపెట్టేరు. (మూలభాషలో ఏ అచ్చు ఉదాత్తమో సంస్కృతం వల్ల తెలుస్తుంది).

| సం. | లా. | గాథిక్ |
|---|---|---|
| భ్రాతా | frater | broθar |
| పితా | parter | fadar |

ఈ వెర్నర్ పరిశోధనలవల్ల రాస్క్, గ్రిమ్‌లు అపవాదాలని భ్రమించిన పదాలు నిజంగా అపవాదాలు కావనీ వాటిలో మరొక ధ్వని సూత్రం ప్రవర్తిస్తూ ఉందనీ పండితులకి తెలిసిపోయింది. దీనితో ధ్వని పరిణామం అనేది నియమరహితంగా యథేచ్ఛగా సాగే మార్పు కాదనీ, అది సూత్రబద్ధంగా ఉంటుందనీ, ధ్వని సూత్రాలకి నిజమైన అపవాదాలుండవనీ స్పష్టమైంది.

ఆ తరవాత సంవత్సరం (1876) కారల్ బ్రూగ్‌మన్ మూల ఇండో యూరోపియన్‌లలో ఋ, ౡ అనే అచ్చులతో బాటు న, మ లు కూడా అచ్చులుగా ఉండేవని ప్రతిపాదించారు. బ్రూగ్‌మన్ సిద్ధాంతాన్ని చాలామంది సమకాలికులూ, తరవాత ఆమోదించినా కూర్తియస్ వంటి వృద్ధ పండితులు మాత్రం తీవ్రంగా వ్యతిరేకించారు. బ్రూగ్‌మన్ తన స్నేహితుడైన ఓస్థోఫ్ (Osthoff)తో కలిసి 1878లో స్థాపించిన పత్రిక ఉపోద్ఘాతంలో 'ధ్వని సూత్రాలకి అపవాదాలుండవు' అనే సిద్ధాంతాన్ని కృత నిశ్చయంతో ప్రతిపాదించారు. ఇదే అభిప్రాయాన్ని వెర్నర్ 1872లో వ్రాసిన ఒక లేఖలో 'అపవాదం లేని సూత్రం లేదు' అనే ప్రాచీనుల అభిప్రాయాన్ని 'సూత్రం లేని అపవాదం లేదు' అని మార్చాలని చెప్పడంలో వ్యక్తీకరించారు. 1875లో షేరర్ (Scherer) 'ధ్వని పరిణామాలు కొన్ని సూత్రాలకు లోబడి ప్రవర్తిస్తాయి; అవి అటువంటి వేరు సూత్రాల చేతనే బాధించబడతాయి' అని చెప్పడంలోనూ అదే అభిప్రాయం వ్యక్తమవుతోంది. 1876లో లెస్కీన్ కూడా ఇదే అభిప్రాయం వ్యక్తం చేశారు. 1886లో బ్రూగ్‌మన్ డెల్‌బ్రూక్ (Delbrúch)తో కలిసి 'ఇండో యూరోపియన్ తులనాత్మక వ్యాకరణం' ప్రచురించడం ప్రారంభించారు. ఇది ప్రామాణిక గ్రంథం. దీని రెండవ ఎడిషన్ 1897–1916లో ప్రచురితమైంది. దీనిలో ఉన్న చిన్న చిన్న లోపాలు తొలగించి ఆంత్వాన్ మెయ్యే (Antoine Meillet) మరొక ప్రామాణిక గ్రంథం రచించారు.

సంక్షేపానికి పందొమ్మిదో శతాబ్దిలో తులనాత్మక వ్యాకరణ పద్ధతులు శాస్త్రీయమైనవిగా రూపొందేయని, ఈ పరిశోధనలవల్ల భాష క్రమబద్ధమై నడచే సత్యం తెలిసి వచ్చిందనీ సంగ్రహంగా చెప్పవచ్చు. ఈ శతాబ్దిలో తులనాత్మక పద్ధతిలో సాధించిన శాస్త్రీయత 20వ శతాబ్దిలో వర్ణనాత్మక వ్యాకరణ వృద్ధికి దోహదమయింది.

## 17.5 ఇరవయ్యో శతాబ్దిలో పరిణామాలు

ఇరవయ్యో శతాబ్దిలో భాషా శాస్త్రాధ్యయనం అన్ని దేశాలకీ వ్యాపించింది. అందువల్ల పండితులు వివిధ దేశాలలో ఉన్న భాషలకి వ్యాకరణాలూ, నిఘంటువులూ రచించడం మొదలుపెట్టేరు. దీనివల్ల అంతవరకు పేరు తెలియని

ఆటవిక భాషలు వెలుగులోకి రావడమేకాక ప్రసిద్ధిమైన భాషలకు కూడా శాస్త్రీయ పద్ధతిలో సమగ్రమైన వ్యాకరణాలూ, నిఘంటువులూ తయారవడం మొదలయింది. అంతేకాక, పాణిని అష్టాధ్యాయి వంటి ప్రాచీన వ్యాకరణాలలో ఉపయోగించబడిన పద్ధతుల అనుశీలన, తద్వారా వాటి వైశిష్ట్యం గ్రహించడం మొదలైంది. అందువల్ల భాషా శాస్త్రంలో పాత కొత్తల మేలు కలయిక ఏర్పడి పాత గ్రంథాలలో మంచి ఆధారంగా భాషా శాస్త్రం శాఖోపశాఖలుగా వర్ధిల్లుతోంది. ఈ శాఖలేమిటి, వీటిలో అవలంబించబడుతున్న పద్ధతులేమిటి అనే విషయం ముందు అధ్యాయాలలో విపులంగా వివరించబడింది కాబట్టి దాన్ని ఇక్కడ పునరుక్తం చెయ్యనక్కరలేదు. అయినా వర్ణనాత్మక వ్యాకరణ పద్ధతులని శాస్త్రీయం చెయ్యడానికి మూలభూతులైన ప్రముఖులను స్మరించి వారిలో ఒక్కొక్కరు ప్రవచించిన సిద్ధాంతాలను సంగ్రహంగా సమీక్షించడం మనం చెయ్యవలసిన పని. అయితే ఈకాలంలో భాషా శాస్త్రజ్ఞులు వివిధ దేశాలలో అసంఖ్యాకులు ఉన్నారు కాబట్టి ఒక్క వర్ణనాత్మక శాఖే కాక తులనాత్మక శాఖ మొదలైన ఇతర శాఖలలో కూడా పరిశోధన వివిధ భాషా కుటుంబాలలో శరవేగంగా జరుగుతోంది. ఈ శాఖలన్నీ ఇప్పుడు వేటికవి వేరువేరు గదులలో బంధించబడినవి కావు. ఒక శాఖలో జరిగే పరిశోధనలు ఇతర శాఖలలో జరిగే పరిశోధనలకు ఉపోద్బలకంగా ఉండి మొత్తం భాషాశాస్త్ర సిద్ధాంతానికి శాస్త్రీయత, సమగ్రత చేకూర్చడానికి తోడ్పడుతున్నాయి.

ఇరవయ్యో శతాబ్ది ప్రారంభంలో ఫెర్డినాండ్ దె సస్యూర్ వర్ణనాత్మక వ్యాకరణ వృద్ధికి బీజావాపం చేశారు. ఈయన ఇండో యూరోపియన్ తులనాత్మక వ్యాకరణంలో మొదట కృషి చేసి, తరవాత తన దృష్టి భాషా నిర్మాణంపై కేంద్రీకరించారు. ఈయన ఉపన్యాసాలని ఈయన విద్యార్థులు ఒకచోట చేర్చి 1916లో Cours de linguistique generale అనే గ్రంథంగా ప్రచురించారు. ఈయన వ్యక్తీకరించిన అభిప్రాయాలలో మూడు ముఖ్యమైనవి. ఒకటి, భాష నిర్మాణాన్ని వివరించే వర్ణనాత్మక వ్యాకరణం, భాష చరిత్రను వివరించే చారిత్రక వ్యాకరణం. రెండు వేరువేరు విభాగాలని ఈయన స్పష్టీకరించారు. రెండు, భాషకి langue, parole అనే రెండు స్థాయిలున్నాయని ఈయన చెప్పారు. సమగ్రమైన భాష langue; వ్యక్తుల వ్యవహారంలో

ఒక్కొక్కప్పుడు భాష అసమగ్రంగానూ, అస్పష్టంగానూ ఉండి అసాధురూపాలు ఉచ్చరించబడవచ్చు; ఇటువంటిది Parole. మూడు, భాషలో వర్ణాలు, ప్రత్యయాలు, పదాలు– వీటిలో ఒక్కొక్క దానికి చెందిన అంశాలు పరస్పర సాపేక్షంగా ఉంటాయి. ఈయన భాషాశాస్త్రం ప్రత్యేకమైన శాస్త్రమనీ దీనిలో పరిశోధన ఇతర శాస్త్రాలతో ముడిపెట్ట నక్కరలేదని చెప్పేరు.

హెమ్స్‌లేవ్ (Hjelmslev) glossematics అనే శాఖ స్థాపించారు. ఈయన భాషకు అర్థస్థాయి (అర్థం, వ్యాకరణం), ఉచ్చారణ స్థాయి (వర్ణ నిర్మాణం) అని రెండు స్థాయిలు ఉన్నాయనీ, మొదటి దానిలో అర్థ లక్షణాలు, రెండో దానిలో వర్ణాలు మూలకాంశాలనీ చెప్పేరు.

ఇంగ్లండులో ధ్వని శాస్త్ర చర్చ సర్ విలియం జోన్స్ కాలం నించి ప్రారంభమైంది. జోన్స్ సంస్కృతం, పర్షియన్ మొదలైన భాషలను ధ్వన్యాత్మక లిపిలో ఎలా వ్రాయాలి అనే విషయం చర్చించారు. ఆయన తరవాత ప్రసిద్ధులైన ధ్వని శాస్త్రవేత్తలు హెన్రీ స్వీట్ (Henry Sweet), డేనియల్ జోన్స్ (Daniel Jones).

జెకొస్లొవేకియాలో నికొలాయ్ ట్రుబెట్‌కోయ్ (Nikolai Trubetzkoy) స్థాపించిన శాఖ పేరు ప్రాగ్ శాఖ. ఈ శాఖలో పండితులు వర్ణ నిర్మాణ సిద్ధాంతంపై కృషి చేశారు. వర్ణాలని భేదక లక్షణాలు ఆధారంగా ఇంకా చిన్న అంశాలుగా విభజించడం ఈ శాఖ ప్రత్యేకత. పరివర్తన వైయాకరణులు దీన్ని అంగీకరించి వృద్ధి చేశారు. (చూ. 4.5)

యూరప్‌లో సస్యూర్ తరవాత ఎన్నదగిన వైయాకరణుడు యెస్పర్సన్ (Jespersen), ఈయన Language, Its Nature and Development అనే గ్రంథమే కాక ఇంగ్లీషు భాషకి ఒక పెద్ద ప్రామాణికమైన వ్యాకరణం కూడా రాశారు.

ఇంగ్లండులో జె.ఆర్. ఫర్త్ (J.R. Firth) భాషాశాస్త్రాచార్యులలో ప్రథముడు. ఈయన 1944 నించి 1956 దాకా లండన్ విశ్వవిద్యాలయంలో పనిచేశారు. ఈయన వర్ణ నిర్మాణంపై ఎక్కువ కృషిచేసి Prosodic analysis

అనే శాఖ స్థాపించారు. ఒక వర్ణం లక్షణం కొంతవరకు వాక్యంలో (లేక పదంలో) దానిపక్క వర్ణాలకు కూడా వ్యాపిస్తుందనే విషయానికి ఈయన ప్రాధాన్యం ఇచ్చారు.

అమెరికాలో 1920 ప్రాంతం నించి భాషా శాస్త్రం మిగిలిన అన్ని దేశాలలో కన్న బాగా విస్తరిల్లింది. వందల కొలది ఉన్న అమెరికన్ ఇండియన్ భాషలపై అమెరికాలో భాషా శాస్త్రజ్ఞులు పరిశోధన చెయ్యడమే దీనికి ముఖ్య కారణం. అమెరికాలో విస్తరిల్లిన భాషాశాస్త్ర పద్ధతులే మిగిలిన అన్ని దేశాలకీ వ్యాపించాయి, వ్యాపిస్తున్నాయి. అమెరికాలో భాషా శాస్త్రానికి మూలపురుషులు ముగ్గురు. వారు ఫ్రాంజ్ బోస్ (Franz Boas), ఎడ్వర్డ్ సపీర్ (Edward Sapir), లియొనార్డ్ బ్లూమ్‌ఫీల్డ్ (Leonard Bloomfield). బోస్ అమెరికన్ ఇండియన్ భాషలపై పరిశోధన చేసి వర్ణనాత్మక భాషాశాస్త్ర పద్ధతులు ఏర్పరిచారు. సపీర్ కూడా అమెరికన్ ఇండియన్ భాషలు పరిశోధించారు. ఈయన రాసిన Language (1921) అనే గ్రంథం ముఖ్యమైనది. బ్లూమ్‌ఫీల్డ్ భాషా శాస్త్రానికి శాస్త్రీయత చేకూర్చారు. ఈయన వ్రాసిన Language (1933) ఇప్పటికీ పరమ ప్రామాణిక గ్రంథం. ఇందులో ఈయన భాషాశాస్త్ర పద్ధతులు విపులంగా మనోహరమైన శైలిలో విభిన్న భాషలనించి ఉదాహరణలతో వివరించారు. ఈ గ్రంథం ప్రచురణ తరవాత దీనివల్ల ప్రభావితుడు కాని భాషా శాస్త్రజ్ఞుడు లేడంటే అతిశయోక్తి కాదు.

నోమ్ చోమ్‌స్కీ (Noam Chomsky) గ్రంథం Syntactic Structures (1957)తో పరివర్తన వ్యాకరణ శాఖ మొదలైంది. అంతవరకూ చిన్నచూపు చూడబడిన వాక్య నిర్మాణం ఈ శాఖలో ప్రధాన స్థానం ఆక్రమించుకొంది. వాక్య నిర్మాణమే కాక మొత్తం భాషా నిర్మాణమంతా సూత్ర రూపంలో వ్యాకరణం వర్ణించాలని పరివర్తన వైయాకరణుల ఆశయం. పై గ్రంథ ప్రచురణ తరవాత అనేకుల బహుముఖ పరిశోధనల వల్ల ఈ సిద్ధాంతంలో చాలా మార్పులు వచ్చాయి. చోమ్‌స్కీయే Aspects of the Theory of Syntax (1965) అనే మరొక గ్రంథంలో ఈ సిద్ధాంతాన్ని నూతన రూపంలో ప్రతిపాదించారు. అర్థ నిర్మాణానికీ దానికి సంబంధించిన వర్ణ నిర్మాణానికీ సంబంధం ఏర్పరిచేదిగా

వ్యాకరణం ఉండాలని పరివర్తన వైయాకరణుల మూలసిద్ధాంతం. అర్థ నిర్మాణం నించి వర్ణ నిర్మాణాన్ని సూత్రాల ద్వారా వీరు సాధిస్తారు. చోమ్‌స్కీకి ముందు అమెరికాలో భాషా శాస్త్రజ్ఞులు అర్థ నిర్మాణ చర్చకు ప్రాధాన్యం ఇవ్వలేదు. అంతేకాక వారు భాషలో ఒక నిర్మాణానికీ, మరొక నిర్మాణానికీ పరస్పర సంబంధం లేదనీ, వ్యాకరణంలో ఉండకూడదనీ అనేవారు. ఈ రెండు లోపాలనీ పరివర్తన వ్యాకరణం సవరించింది. అర్థ నిర్మాణం మీద కూడా ఇప్పుడు విశేష పరిశోధన జరుగుతోంది. పరివర్తన వ్యాకరణ సిద్ధాంతాలకీ అంతకుముందు అమెరికన్ భాషా శాస్త్రజ్ఞుల పద్ధతులకీ మధ్య భేదం స్పష్టంగా ఉన్నా ఇది మరీ అంత కొత్తది కాదనీ దీని పద్ధతులకీ యూరప్‌లోని ప్రాచీన వైయాకరణుల సిద్ధాంతానికీ పాణిని అవలంబించిన పద్ధతులకీ మధ్య సాజాత్యం ఉందనీ విమర్శకులు ఎత్తిచూపేరు. పరివర్తన వ్యాకరణ శాఖ ఇంతకుముందు అనేక శాఖలలో జరిగిన పరిశోధనలలో మంచివి తనలో ఇముడ్చుకోగలిగిన శక్తి గలది. ఇది భాషా నిర్మాణంలో అన్ని అంగాలకీ ప్రాముఖ్యం ఇస్తుంది. కాబట్టి ఇది ఇంకా బాగా వృద్ధి పొందగలదని పండితుల ఆశయం. (చూ. 7వ అధ్యాయం).

# 18. భారతదేశంలో భాషాశాస్త్ర పరిణామం

## 18.1 శిక్షా ప్రాతిశాఖ్యలు

"చత్వారి శృంగా త్రయో అస్య పాదా
ద్వే శీర్షే సప్త హస్తాసో అస్య
త్రిధా బద్ధో వృషభో రోరవీతి
మహోదేవో మర్త్యాం అవివేశ"
ఋగ్వేదం (మండలం4, అధ్యాయం 5, సూక్తం 58, ఋక్ 3)

(మహాదేవుడైన శబ్దం కామాలను వర్షించే వృషభం. దీనికి నామం, అఖ్యాతం (క్రియ), ఉపసర్గ, నిపాతం అనే నాలుగు రకాల పదాలు నాలుగు కొమ్ములు; భూత భవిష్య ద్వర్త మానాలనే మూడూ పాదాలు; నిత్యం (వ్యంగ్యం), కార్యం (వ్యంజకం) అనే రెండు రకాల శబ్దాలు రెండు తలలు; ఏడు విభక్తులు ఏడు చేతులు. ఇది ఉరమూ, కంఠమూ, శిరస్సూ అనే మూడు స్థానాలలో కట్టబడింది. ఇది శబ్దం చేస్తుంది, ఇటువంటి మహాదేవుడైన శబ్దం మనుష్యులను ఆవేశించింది).

ఒకటి, రెండు అధ్యాయాల మొదట్లోనూ, పైనా ఇచ్చిన ఋక్కుల వల్ల మనదేశంలో వేదకాలంనించీ భాషను దైవంగా భావించే వారనీ, భాషను పరిశీలించే వ్యాకరణ శాస్త్రానికి ప్రాముఖ్యం ఇచ్చేవారనీ తెలుస్తుంది. వేదకాలపు భాష కాలక్రమాన మార్పులు చెందుతూ ఉండడంతో వేదమంత్రాల ఉచ్చారణను యథాతథంగా పరిరక్షించడమూ వాటిలో శబ్దాల అర్థాలను తెలుసుకోవడమూ తరవాత కాలం పండితులకు ఆవశ్యకం అయింది. వేదమంత్రాల ఉచ్చారణలో కొంచెం తప్పు వచ్చినా దాని ఫలితం లేకపోగా దుష్టోచ్చారణ అపకారం

కలిగిస్తుందని వారి నమ్మకం. అందువల్ల వేదోచ్చారణలో లోపాలను
నివారించడానికి ధ్వనులు ముఖ యంత్రంలో ఎలా పుడతాయి? ఒక్కొక్క 13
ధ్వనికి గల స్థానకరణ ప్రయత్నాలేవి? ఇటువంటి చర్చ మొదలయింది.
ధ్వనులని గురించి చర్చించే గ్రంథాలు శిక్షా ప్రాతిశాఖ్యలు. వైదిక భాషలో
పదాల వ్యుత్పత్తీ, వాటి అర్థాలూ, నిర్ణయించేది నిరుక్తం. వ్యాకరణం ప్రకృతి
ప్రత్యయ సమ్మేళనంలో పదాలు ఏర్పడే విధానాన్నీ పదాల సమ్మేళనంతో
సమాసాలూ, వాక్యాలూ ఏర్పడే విధానాన్ని వర్ణిస్తుంది. నిరుక్తంకన్న వ్యాకరణం
పరిధి ఎక్కువ. ఈ అన్ని శాఖల లోనూ మన పూర్వులు కేవలం వేద
పరిరక్షణకు మాత్రం అవసరమైన జ్ఞానంతో సంతృప్తి చెందక సునిశిత పరిశీలనతో
వీటికి సూత్రలాఘవాన్నీ, శాస్త్రీయతనీ సంపాదించి భాషా శాస్త్రాభివృద్ధికి గట్టి
పునాది ఏర్పరిచారు. వారి కృషిని సమీక్షించడంలో ముందుగా శిక్షా ప్రాతిశాఖ్యలని
గురించి ఈ విభాగంలో చర్చిద్దాం.

ప్రాతిశాఖ్యలు వేదాల ఉచ్చారణలోని గుణదోషాలు సంధులు మొదలైన వాటిని వివరించే గ్రంథాలు. అవి –

ఋక్ ప్రాతిశాఖ్య (ఋగ్వేదానికి)
ఋక్ తంత్ర వ్యాకరణం (సామవేదానికి)
తైత్తిరీయ ప్రాతిశాఖ్య (కృష్ణ యజుర్వేదానికి)
వాజసనేయీ లేక కాత్యాయనీయ ప్రాతిశాఖ్య (శుక్ల యజుర్వేదానికి)
అథర్వ ప్రాతిశాఖ్య (అథర్వ వేదానికి)

శిక్షలు ఏ ఒక్క వేదానికీ పరిమితం కాక ధ్వన్యుత్పత్తి చర్చని చేస్తూ ప్రాతిశాఖ్యలలో చెప్పబడని విషయాలను వివరిస్తూ వాటికి అనుబంధప్రాయంగా ఉంటాయి. ప్రాతిశాఖ్యలన్నిటికీ మూలమైన ఒక శిక్ష ఉండి ఉండాలని తైత్తిరీయా రణ్యకంలోని "అథశీక్షాం వ్యాఖ్యాస్యామః" అనే వచనం వల్ల తెలుస్తుంది. ఇప్పుడు మనకు దొరికే శిక్షలన్నీ ప్రాతిశాఖ్యలకన్న అర్వాచీనాలే. వీటిలో

ముఖ్యమైన "పాణినీయ శిక్ష" అనే పేరుగలది ప్రాచీనతమమైనదని కొందరి అభిప్రాయం. కాని ఇది పాణినీయ విరచితమనే విషయమూ, ఇదే ప్రాచీనతమ మైనదనే అభిప్రాయమూ రెండూ వివాదాస్పదాలే. శిక్షలు చాలా ఉన్నాయి. సిద్ధేశ్వర వర్మకి తెలిసినవి 65 ఉన్నాయి; వీటిలో వారు ఏభైవాటిని స్వయంగా పరిశీలించారు. వీటిలో పాణినీయ శిక్ష తప్ప మిగిలినవన్నీ ఏదో ఒక వేదంలో విశేషాంశాలను వివరించేవే.

ప్రాతిశాఖ్యలూ వాటికాధారమై ఇప్పుడు అలభ్యమైన శిక్షా పాణిని కాలానికి ముందువి. వీటిలో ధ్వన్యుత్పత్తి క్రమమూ, స్థానకరణ ప్రయత్న భేదాలూ, సంధులూ వివరించబడ్డాయి. ఆధునిక కాలంలో ధ్వని శాస్త్రవేత్తలు శిక్షా ప్రాతిశాఖ్యలలోని సిద్ధాంతాలను క్షుణ్ణంగా పరిశీలించి ఆమోదించి వాటిని తమ పరిశోధనకు ప్రాతిపదికగా గ్రహించారు. విట్నీ (Whitney) మొదలైన కొందరు మొదట్లో మన శిక్షా ప్రాతిశాఖ్యల వ్యాకరణాల పద్ధతులూ, సిద్ధాంతాలూ కొన్ని ఆమోదించకపోయినా, పరిశోధన సాగినకొద్దీ మన పూర్వుల సిద్ధాంతాలే ఆమోద యోగ్యాలనీ విట్నీ వంటివారు గాఢ పరిశీలన చేయక వాటిని విరసించడానికి సాహసించారనీ స్పష్టమవుతోంది.

పాణిని తమ అష్టాధ్యాయిలో ధ్వనుల సావర్ణ్యం, అంతర తమత్వం మొదలైన ధ్వన్యుత్పత్తి సంబంధి విషయాలు శిక్షా ప్రాతిశాఖ్యలలో అంతకు ముందే వివరించబడి ఉన్నాయి కాబట్టి వీటిని వివరించలేదు గాని వీటిని తమ వ్యాకరణ రచనకు ఉపయోగించుకొన్నారు (చూ. తుల్యాస్య ప్రయత్నం సవర్ణమ్ 1.1.9, స్థానేఽంతర తమః 1.1.50).

కాకలకంలో నాదతంత్రులు తెరుచుకొని ఉన్నప్పుడు శ్వాస ధ్వనులూ, అవి మూసుకొని ఉన్నప్పుడు (గాలి పైకి వచ్చినప్పుడు) నాద ధ్వనులూ ఏర్పడతాయని మన ప్రాచీనులు గ్రహించారు (వాయుః ప్రాణతః కోష్ఠ్యం అనుప్రదానం కంఠస్యఖే వివృతే సంవృతేవా అపద్యతే శ్వాసతాం నాదతాంవా వక్త్రీహాయామ్ - ఋక్ ప్రాతిశాఖ్య 13:1-2). ఈ శ్వాసనాద భేదానికి అసలు కారణం ప్రాచీన పాశ్చాత్య వైయాకరణులకు తెలియలేదు. స్థానకరణాల నిర్వచనమూ, అచ్చులకూ హల్లులకూ గల భేదమూ తైత్తిరీయ ప్రాతిశాఖ్య

(2.31–34)లో చక్కగా వివరించబడ్డాయి (స్వారాణాం యత్రోపసంహారః తత్ స్థానం; యదుప సంహరతి తత్కారణం; అన్యేషాంతు యత్ర స్పర్శనం తత స్థానం; యేన స్పర్శయతి తత్ కరణమ్). ధ్వనులు సమీప ధ్వనుల వలన ప్రభావితమవుతాయనే విషయం కూడా మన ప్రాచీనులు గుర్తించారు. అచ్చుల మధ్యనున్న శ్వాస స్పర్శాలకు కొంచెం నాదత సంక్రమిస్తుందని పతంజలి మహాభాష్యం (అష్టాధ్యాయి 1.4.09 కింద)లో సూచించారు (ఏకః పూర్వపరయోః ప్రోదేన ప్రచ్ఛాద్యతే). అభ్యంతరం, బాహ్యం అనే ప్రయత్న భేదాలు గుర్తించడం, ఒక ధ్వనికీ మరొక ధ్వనికీ భేదం ఏర్పడడానికి గల వివిధ కారణాలు గమనించడం వీరి సూక్ష్మ పరిశీలనకు తార్కాణాలు. అభ్యంతర ప్రయత్నంలో స్పృష్టం, ఈషత్ స్పృష్టం, సంవృతం, వివృతం అని నాలుగు రకాలు ఉన్నాయి. బాహ్య ప్రయత్నం పదకొండు రకాలుగా ఉంటుంది. అవిః వివారం, సంవారం, శ్వాసం, నాదం, ఘోషం, అఘోషం, అల్పప్రాణం, మహాప్రాణం, ఉదాత్తం, అనుదాత్తం, స్వరితం.

> అనుప్రదానాత్ సంసర్గత్ స్థానాత్ కరణవిన్యయాత్
> జాయతే వర్ణవైశేష్యం పరిమాణాచ్చ పంచమాత్.
>
> (తైత్తిరీయ ప్రాతిశాఖ్య 13:2)

పై శ్లోకంలో ధ్వనికీ ధ్వనికీ మధ్య భేదం ఏర్పడడానికి ఐదు కారణాలు చెప్పబడ్డాయి. అవి అనుప్రదానం (శ్వాసత, నాధత వంటిది), సంసర్గం (మహా ప్రాణత, అనునాసిక్యం వంటిది), స్థానం, కరణవిన్యయం (స్పృష్టం, వివృతం వంటిది), పరిమాణం (హ్రస్వ దీర్ఘప్లుత భేదం). స్థలాభావం వల్ల మన ప్రాచీనుల ధ్వని శాస్త్ర వైదుష్యానికి కొన్ని ముఖ్యోదాహరణలు మాత్రమే ఇవ్వబడ్డాయి.

## 18.2 నిరుక్తం

యాస్కుడి నిరుక్తం ముఖ్యంగా వేదభాషలో ఉండి తరవాత కాలంలో వ్యవహార భ్రష్టమైన పదాల వ్యుత్పత్తినీ వాటి అర్థాలనూ గూర్చి చర్చిస్తుంది. ఇది నిఘంటువు అనే ఐదు అధ్యాయాల గ్రంథానికి విపుల వ్యాఖ్యానం. ఈ నిఘంటువు కర్త ఎవరో తెలియదు. ఇందులో వైదిక భాషలోని పదాలు

సమానార్థక సముదాయాలుగా ఇవ్వబడ్డాయి. యాస్కుడు ఈ పదాలు ఏయే ధాతువుల నించి వచ్చాయో సూచించి వాటి అర్థాలు నిర్వచించారు. పదాల అర్థాన్ని నిర్వచించడానికి అవి వేదమంత్రాలలో ఏఏ సందర్భాలలో ఉపయుక్త మయ్యాయో పరిశీలించి ఈ పరిశీలన సాహాయ్యంతో పదాల అర్థ నిర్ణయం చేశారు. పద వ్యుత్పత్తి పరిశీలన యాస్కుడికి ముందుకాలంలోనే ప్రారంభమైనట్లు ఆయన స్మరించిన గార్గ్య గాలవ శాకటాయనాది ఋషి నామాల వల్ల తెలుస్తుంది. యాస్కుడు ఒక పదం ఏ ధాతువు నించి వచ్చింది అని చర్చించారే కాని ఆయన పాణినిలా పదాలకి ప్రకృతి ప్రత్యయ విభాగం చేసి, అందులో వచ్చే సంధి మార్పులు వివరించలేదు. అందువల్ల యాస్కుడు పాణినికి ప్రాచీనుడై ఉంటాడని పండితుల నిర్ణయం. పాణిని క్రీ.పూ. 6వ శతాబ్ది వాడైతే, యాస్కుడు క్రీ.పూ. 7–8 శతాబ్దుల ప్రాంతానికి చెందినవాడై ఉంటాడు.

పదాలని నామాఖ్యాతో పసర్గనిపాతాలని నాలుగు రకాలుగా విభజించినది యాస్కుడే. ఆయన కాలానికే కాల ప్రత్యయాలకీ పురుష ప్రత్యయాలకీ మధ్య భేదమూ, తద్ధిత ప్రత్యయాలకీ కృత్ ప్రత్యయాలకీ మధ్య ఉన్న భేదమూ పండితులకి తెలిసింది.

శాకటాయనుడూ నిరుక్తకారులూ అన్ని నామాలూ క్రియలనుంచి పుట్టేయని నమ్మేరు. గార్గ్యాది వైయాకరణులు కొందరు ఇది సరికాదన్నారని యాస్కుడే చెప్పేడు : తత్రి నామాన్యాఖ్యాతజానీతి శాకటాయనో నైరుక్త సమయశ్చ, న సర్వాణీతి గార్గ్యో వైయాకరణానాం చైకే (నిరుక్తం 1.12)

## 18.3 అష్టాధ్యాయి

పాణిని మహర్షి విరచితమైన అష్టాధ్యాయి ప్రపంచంలో ఉన్న వ్యాకరణ గ్రంథాలన్నింటిలోనూ ప్రశస్తమైనదని ప్రాచ్య పాశ్చాత్య విద్వాంసులంతా అంగీకరించారు. ఈయన క్రీ.పూ. 6–7 శతాబ్దులకు చెందినవారనీ, ప్రస్తుతం పాకిస్తాన్‌లో ఉన్న లాహోర్ పట్టణానికి సమీపంలో ఉండిన 'శాలాతురా' అనే గ్రామానికి చెందినవారనీ పండితుల అభిప్రాయం. ఈయన వ్యాకరణానికి

ముఖ్యాధారం ఆ కాలంలో వ్యవహారంలో ఉన్న సంస్కృత భాష. ఈ భాషకీ వేదాలలో ఉన్న భాషకీ భేదం ఉన్నచోట్ల వైదిక భాషారూపాలు కూడా ఈయన వ్యాకరణంలో సాధించబడ్డాయి. ఈ వ్యాకరణం పరమ ప్రమాణ గ్రంథమై ఇంతటి ప్రాశస్త్యాన్ని పొందడానికి కారణం దీనిలోని సమగ్రత, నిర్దుష్టత, సూత్ర లాఘవం, శాస్త్రీయ వర్ణనం మొదలైన గుణాలు. అష్టాధ్యాయిలో ఉపయుక్తమైన పద్ధతులకీ ఆధునిక భాషాశాస్త్ర సిద్ధాంతాలకీ చాలా పోలికలు ఉన్నాయి. ఈ విషయంపై సమగ్ర చర్చా ఆధునిక భాషా శాస్త్రజ్ఞులు దీనిని ప్రశంసించిన తీరూ తరవాత అధ్యాయంలో ఉన్నాయి. కాబట్టి ఇక్కడ అష్టాధ్యాయీ నిర్మాణాన్ని గురించిన కొన్ని ముఖ్య విశేషాలు చర్చిద్దాం.

పేరులో సూచితమైనట్లుగా ఇందులో ఎనిమిది అధ్యాయాలు ఉన్నాయి. ఒక్కొక్క అధ్యాయానికి నాలుగు పాదాలు. మొత్తం గ్రంథంలో సుమారు నాలుగు వేల సూత్రాలు ఉన్నాయి. పాణినికి ముందు కాలంలో శిక్షా ప్రాతిశాఖ్యాలలో ధ్వని శాస్త్రం క్షుణ్ణంగా చర్చించబడిందనీ ఆ శాస్త్ర సిద్ధాంతాలని పాణిని అవసరమైనంత వరకూ వాడుకొన్నారనీ ఇంతకుముందే చూశాం. పాణినికి ముందు కాలంలో వైయాకరణులు కూడా కొందరు ఉన్నారని చెప్పడానికి ఆధారాలు ఉన్నాయి. కాని వారి గ్రంథాలేవీ ఇప్పుడు మిగలలేదు. పాణినీయాదిత్యుని తేజస్సులో ఆ నక్షత్రాల వెలుగు అంతరించింది. పాణినే స్వయంగా పదిమంది పూర్వ వైయాకరణుల పేర్లు చెప్పి, వారి అభిప్రాయాలు సూచించారు. వీరు –

1. ఆపిశలి (వాసుప్యాలే 6.1.92)
2. కాశ్యప (తృషి మృషి కృశేః కాశ్యపస్య 1.2.25; నోదాత్త స్వరితోదయ మగార్గ్య కాశ్యప గాలవానామ్ 8.4.67)
3. గార్గ్య (అడ్ గార్గ్యగాలవయోః 7.3.99, ఓతో గార్గ్యస్య 8.3.20; 8.4.67
4. గాలవ (ఇకో హ్రస్వోఽఙ్యో గాలవస్య 6.3.61; తృతీయాదిషు భాషిత పుంస్కం పుంవద్ గాలవస్య 7.1.74, 7.3.99, 8.4.67)
5. చాక్రవర్మణ (ఈ 3 చాక్రవర్మణస్య 6.1.130)
6. భారద్వాజ (ఋతో భారద్వాజస్య 7.2.63)

7. శాకటాయన (లఙః శాకటాయనస్యైవ 3.4.111, వ్యోర్లఘు ప్రయత్నతరః శాకటాయనస్య 8.3.18, త్రిప్రభృతిషు శాకటాయనస్య 8.4.50)
8. శాకల్య (సంబుద్ధౌ శాకల్య స్యేతా వనార్షే 1.1.16; ఇకోఽసవర్ణే శాకల్యస్య హ్రస్వశ్చ 6.1.127; లోపశ్శాకల్యస్య 8.3.19; సర్వత్ర శాకల్యస్య 8.4.51)
9. సేనక (గిరేశ్చ సేనకస్య 5.4.112)
10. స్ఫోటాయన (అవఙ్ స్ఫోటాయనస్య 6.1.123)

పైన పేర్కొన్నవారినే కాక ఉదీచాం, ఆచార్యాణాం, ఏకేషాం, ప్రాచాం మొదలైన సర్వ నామాలతో మరికొందరు పూర్వ వైయాకరణుల మతాలని పాణిని ప్రస్తావించారు. దీనివల్ల పాణిని నాటికే వ్యాకరణ చర్చ విస్తృతంగా ఉండేదని తెలుస్తుంది. అయితే పాణిని ప్రతిభ పూర్వ వైయాకరణుల మతాలని సమన్వయం చెయ్యడంలోనూ, వ్యాకరణాన్ని లౌకిక వైదిక భాషలు రెండింటికి విస్తృతం చెయ్యడంలోనూ, వీటికన్న ముఖ్యంగా కొన్ని సిద్ధాంత ప్రాతిపదికలపై వ్యాకరణ రచన సాగించడంలోనూ ఉందని అనుకోవాలి. పాణిని వ్యాకరణంలో పునరుక్తి దోషం ఉండదు. సదృశమైన వ్యాకరణ కార్యాలు వీలైనంత వరకూ ఒక వ్యాకరణ కార్యంగానే గ్రహించబడతాయి (గుణం, వృద్ధి, సంప్రసారణం, మొ॥) పారిభాషిక సంజ్ఞలు, పరిభాషలు, అధికార సూత్రాలు, అనువృత్తి, ప్రత్యాహారం మొదలైన వాటివల్ల లాఘవం సాధించబడింది. ప్రత్యాహారం ధ్వనులకీ, ప్రత్యయాలకీ కూడా ఉంది. ధ్వనుల ప్రత్యాహారానికి ఆధారభూత మైనవి 14 ప్రత్యాహార సూత్రాలు (వీటికి శివ లేక మహేశ్వర సూత్రాలని అర్వాచీన వ్యవహారం). ఇవి –

1. అ ఇ ఉ ణ్ 2. ఋ ఌ క్ 3. ఏ ఓ ఙ్ 4. ఐ ఔ చ్ 5. హయవరట్ 6. లణ్ 7 ఞమఙణనమ్ 8. ఝభఞ్ 9. ఘఢధష్ 10. జబగడదశ్ 11. ఖఫఛఠథచటతవ్ 12. కపయ్ 13. శషసర్ 14. హల్.

వీటిలో ఒక్కొక్కదానికి చివరనున్న హల్లు ఇత్సంజ్ఞ. ఒక ధ్వనీ అది ఉన్న సూత్రంలోని ఇత్సంజ్ఞగాని దాని తరవాత సూత్రాల్లో ఒకదాని ఇత్సంజ్ఞ

గానీ కలిపి ప్రత్యాహారం చేసి ఏర్పరిచిన సంజ్ఞ ఆ ధ్వనికీ ఆ ఇత్సంజ్ఞ దాకా ఉన్న ఇతర ధ్వనులకీ కలిపి సంజ్ఞ అవుతుంది. ఉదాహరణకి అణ్ అంటే అ, ఇ, ఉ లు మూడింటికి సంజ్ఞ. 'ఇక్' అంటే ఇ, ఉ, ఋ, ఌలకు నాలుగింటికీ సంజ్ఞ (ప్రత్యాహారంలో మధ్యనున్న ఇత్సంజ్ఞలు కలపకూడదు). ఇదేవిధంగా 'అచ్చులు' అ నించి చ్ వరకూ ఉన్నవి, 'హల్లులు' హ నించి ల్ వరకూ ఉన్నవి. ఈ ప్రత్యాహార పద్ధతి సంధి విధానాన్ని వర్ణించడానికి పాణిని ఏర్పరిచారు. అందువల్లే ఈ సూత్రాలలో ధ్వనులు అక్షర సమామ్నాయంలో ఉన్న వరసలో ఉండవు. ప్రత్యాహారం ధ్వనులకే కాక ప్రత్యయాలకూ ఉంటుంది. నామ విభక్తి ప్రత్యయాలన్నిటికీ సంజ్ఞ 'సుప్', క్రియావిభక్తి ప్రత్యయా లన్నిటికీ సంజ్ఞ 'తిఙ్'.

పాణినీయాన్ని 'శబ్దానుశాసనం' అంటారు కాబట్టి ఇందులో పద నిర్మాణం మాత్రమే వర్ణించబడింది కాని, వాక్య నిర్మాణం వర్ణించబడలేదని కొందరు పండితులు అపోహ పడ్డారు. కాని ఏ ప్రత్యయం ఏ అర్థంలో వస్తుందో చెప్పడానికి వాక్య నిర్మాణం కూడా దృష్టిలో పెట్టుకోవాలి. కాబట్టి పాణిని వాక్య నిర్మాణాన్ని కూడా వర్ణించారని ఇటీవలి పండితులు నిరూపించారు. కారక ప్రక్రియా, లకార విధాన ప్రక్రియా మొదలైనచోట్ల వాక్య నిర్మాణం కూడా ప్రముఖపాత్ర వహిస్తుంది.

అష్టాధ్యాయికి మూలాధారం అర్థ నిర్మాణం. ఈ వ్యాకరణం అర్థ నిర్మాణాన్నించి దానికి తగిన వాక్యం లేక వాక్య భేదాలు ఉత్పత్తి చేస్తుంది. సూత్రంలో పదాల వాడుకే దానికి సాక్ష్యం. సాధారణంగా సూత్రాలు 'ఫలానా ప్రత్యయం ఫలానా అర్థంలో వస్తుంది' అనికాక 'ఫలానా అర్థాన్ని సూచించడానికి ఫలానా ప్రత్యయం వస్తుంది' అనే విధంగా ఉంటాయి (ఉదా. వర్తమానే లట్ 3.2.123)

పాణిని పద్ధతి ఆదేశపద్ధతి. వర్ణనిర్మాణ ప్రక్రియలోనూ, పదనిర్మాణ ప్రక్రియలోనూ కూడా ఇదే పద్ధతి అనుసరించ బడింది. ఒక స్థానానికి వివిధ పరిసరాలలో వివిధాలైన ఆదేశాలు వస్తాయి. 'తత్ చరతి' అనేది స్తోఃశ్చునా శ్చుః (8.4.40) అనే సూత్రం వల్ల 'తచ్ చరతి'గా మారుతుంది; ఇందులో

స్థాని అయిన తకారానికి చకారం ముందు చకారం ఆదేశంగా వచ్చింది. ఇదేవిధంగా తృతీయా బహువచన ప్రత్యయమైన 'భిస్'కి హ్రస్వమైన అకారం తరవాత ఐస్ అనే ఆదేశం వస్తుంది (అతోభిస ఐస 7.1.9; రామ + భిస్ = రామైః). ఒక స్థానికి పరిసరానుగుణంగా అనేకాదేశాలు ఉండవచ్చు.

అష్టాధ్యాయిలో ఒకరకం వ్యాకరణ కార్యం ఒకచోటే చెప్పబడుతుంది. ఆ వ్యాకరణ కార్యం క్రియ, నామం మొదలైన అన్ని పద వర్గాలకీ లేక అందులో కొన్నిటికీ వర్తించవచ్చు. కాబట్టి ఒక పదాన్ని నిష్పన్నం చెయ్యడానికి వివిధ ప్రదేశాలలో ఉన్న సూత్రాలు అవసరమవుతాయి. ప్రక్రియలో ఇటువంటి క్లిష్టత ఏర్పడడానికి కారణం పాణిని అవలంబించిన పునరుక్తి రహిత శాస్త్రీయ దృష్టి. అందువల్ల ఇది వైయాకరణులకు ఉపయోగించే వ్యాకరణం కాని, భాషను సులభంగా నేర్పడానికి ఉద్దిష్టమైనది కాదు అని అంటారు. ప్రక్రియా పద్ధతిని ఉదాహరించడానికి రామశబ్దం తృతీయా విభక్తి రూపాలు ఎలా నిష్పన్న మౌతాయో చూద్దాం.

(i) రామ+టా (టాలో టకారం ఇత్సంజ్ఞ) = రామ+ఇన (టాఙసి ఙసామి నాత్స్యాః 7.1.12 వల్ల టాకు ఇనాదేశం) = రామేన (ఆద్గుణః 6.1.87 వల్ల గుణం) = రామేణ (అట్కుప్వాఙ్ నుమ్ వ్యవాయేఽపి 8.4.2 వల్ల నకారానికి ణకారాదేశం).

(ii) రామ+భ్యాం = రామాభ్యాం (సుపిచ 7.3.102 వల్ల మకారంలో అకారానికి దీర్ఘం).

(iii) రామ+భిస్ = రామ+ఐస్ (అతో భిస ఐస్ 7.1.9 వల్ల భిస్‌కు ఐస్ ఆదేశం) = రామైస్ (వృద్ధిరేచి 6.1.88 వల్ల వృద్ధి) = రామైర్ (ససజు షోరుః 8.2.66 వల్ల సకారానికి ర్ ఆదేశం) = రామైః (ఖరవసానయోర్వి సర్జనీయః8.3.15 వల్ల ర్‌కి విసర్గాదేశం).

అష్టాధ్యాయిలో ఎనిమిది అధ్యాయాలలో వివిధ వ్యాకరణాంశాలు ఏ క్రమంలో చర్చించబడ్డాయి అనే విషయం కింద స్థూలంగా వివరించబడుతుంది.

I. పారిభాషిక పదాల నిర్వచనం, పరిభాషలు
ఒక వచనానికి మరొక వచనం ఉపయోగించడం (1.2.58-63)
ఏకశేషం (1.2.64-73)
ఆత్మనేపద పరస్మైపద క్రియారూప ప్రయోగం (1.3.12-77)
కారకాలు (1.4.2-55)
నిపాతలు (1.4.56-98)
కర్మ ప్రవచనీయలు (1.4.88-98)

II. సమాసాలు (2.1.3-2.2.38)
కారకాలకు ఆదేశంగా వచ్చే విభక్తులు (2.3.1-73)
సమాసాల లింగ వచనాలు (2.4.1-31)
ఆర్ధధాతుక ప్రత్యయాలముందు ధాత్వాదేశాలు (2.4.35-57)
లోపాదేశం (2.4.58-82)
(III, IV, V అధ్యాయాలు మూడింటిలో ప్రత్యయాలు విధించబడ్డాయి).

III. ధాతువుకి చేరే వివిధ ప్రక్రియలు.

IV. విభక్తి ప్రత్యయాల స్థానిరూపాలు (4.1.2)
స్త్రీ ప్రత్యయాలు (4.1.3-75)
తద్ధిత ప్రత్యయాలు (4.1.76-5.4.67)

V. తద్ధిత ప్రత్యయాలు (5.4.67 వరకూ)
సమాసాంతాలు (5.4.68-160)

VI. ధాతువులో ప్రథమాక్షరం లేక ద్వితీయాక్షరం ద్విరుక్తమవడం (6.1.1-12)
సంప్రసారణం (6.1.13-44)
ధాతువులు, ప్రత్యయాలలో మార్పులు (6.1.45-71)
సంహిత (6.1.72-157)
ఉదాత్తత (6.1.158-6.2.199)
అలుక్ సమాసం (6.3.1-24)

సమాసావయవాలలో మార్పులు (6.3.25-110)
పూర్వపదాంత్యాచ్చు దీర్ఘమవడం (6.3.111-139)
అంగాధికారం (6.4.1-74.97. ధాతు ప్రాతిపదిక ప్రత్యయాలలో ఆగమాదేశాలు, గుణవృద్ధులు, అభ్యాసలో మార్పులు)

VII. అంగాధికారం (చూ.పైన)

VIII. పదాల ద్విరుక్తి (8.1.1-15)
వాక్యంలో అనుదాత్త పదాలు (8.1.18-74)
2, 3, 4 పాదాలు త్రిపాది (ఇందులో పూర్వత్ర అసిద్ధమైన సంధులు, ఆగమాదేశాలు).

అష్టాధ్యాయికి అనుబంధ గ్రంథాలుగా గణపాఠం, ధాతుపాఠం అనే రెండు ఉన్నాయి. గణపాఠంలో వ్యాకరణ కార్యాలు తుల్యంగా ఉండడంవల్ల సముదాయాలు లేక గణాలుగా కూర్చబడ్డ పదాలు ఉన్నాయి (ప్రాదులు, సర్వాదులు, మయూర వ్యంసకాదులు, మొ॥). సంస్కృత భాషలో ధాతువులన్నీ భూవాదులు, అదాదులు మొదలైన పది గణాలుగా విభజించబడి ధాతుపాఠంలో ఇవ్వబడ్డాయి.

## 18.4 అష్టాధ్యాయీ వ్యాఖ్యలు, ఇతర సంస్కృత వ్యాకరణాలు

పాణినికి తరవాత ముఖ్యమైన వైయాకరణుడు కాత్యాయనుడు (వరరుచి). ఈయన పాణిని సూత్రాలలో సుమారు 1500 వాటికి మార్పులు చేర్పులు సూచించే వార్తికాలు రచించారు (ఉక్తానుక్త దురుక్తానాం చింతా యత్ర ప్రవర్తతే, తంగ్రంథం వార్తికం ప్రాహుః వార్తికజ్ఞా మనీషిణః). ఈయన వార్తికాలు సుమారు 4000 ఉన్నాయి; ఇవి మనకు పతంజలి మహాభాష్యం ద్వారానే లభ్యం అవుతున్నాయి. ఈయన కాలం క్రీ.పూ. 500-350 అని పండితుల అంచనా. ఈయన ప్రథమంలో రచించిన వాజసనేయీ ప్రాతిశాఖ్య వాజసనేయీ సంహిత వ్యాకరణం ధ్వనులకు సంబంధించినది. అందులో కొన్ని పాణిని వైదికభాషా సూత్రాలని ఈయన విమర్శించారు. ఈ గ్రంథ రచనలో అంకురించిన పాణిని

సూత్ర విమర్శని మొత్తం అష్టాధ్యాయికి విస్తరించి వార్తికాలు రచించారు. ఈయన వాజప్యాయన, వ్యాడి, పౌష్కరసాది అనే పూర్వ వైయాకరణులనూ, మరికొంత మందిని పేరు సూచించకుండానూ స్మరించారు. ఈయన దాక్షిణాత్యుడని పతంజలి సూచించారు. పాణిని కాలానికీ ఈయన కాలానికీ

* పై పతంజలి వాక్యానికి అర్థం: "వ్యాకరణానికి 1. రక్ష, 2. ఊహ, 3. ఆగమం, 4. లఘుత్వం, 5. అసందేహం అనే అయిదు ప్రయోజనాలు ఉన్నాయి". 1. రక్ష అంటే వేదంలోని శబ్దాలని మార్పులు చెయ్యకుండా రక్షించడం. ఉదాహరణకి, వేదంలో గృభ్ణామి 'తీసుకొంటున్నాను' అని ఉంటుంది. దీన్ని ఇలాగే ఉచ్చరించాలి కాని లౌకిక భాషలోలా గృహ్ణామి అని ఉచ్చరించ కూడదు. 2. ఊహ: "అగ్నయేత్వా జుష్టం నిర్వపామి" – ఇది అగ్నికి ఉద్దిష్టమైన మంత్రం; ఇందులో 'అగ్నయే' అనే అగ్ని శబ్దం చతుర్థ్యేక వచన రూపం ఉంది. ఈ మంత్రాన్నే సూర్యుడికి ఉపయోగించేటప్పుడు 'అగ్నయే' స్థానంలో 'సూర్యాయ' అనే పదం వాడాలి. సూర్య శబ్దం చతుర్థ్యేక వచనం "సూర్యాయ' అనే విషయం వ్యాకరణం చదువుకొన్న వాడికే తెలుస్తుంది. 3. ఆగమం: "బ్రాహ్మణేన నిష్కారణో ధర్మః షడంగో వేదోఽధ్యేయో జ్ఞేయశ్చ"(పండితుడు ప్రయోజనాన్ని ఆశించకుండానే ఆరు లింగాలతోపాటు వేదం చదివి అర్థం తెలుసుకోవాలి) అనేది వేదవాక్యం. దీన్ని పాటించడానికి కూడా ఆరు వేదాంగాలలో ముఖ్యమైనది అయిన వ్యాకరణాన్ని చదువుకోవాలి. 4. లఘుత్వం: వ్యాకరణం సంగ్రహమైన సూత్రాల రూపంలో భాషలో ఉన్న అనంత శబ్దరాశిని సాధిస్తుంది. కాబట్టి భాషని నేర్చుకోవడానికి వ్యాకరణం చదవడం సులభమైన ఉపాయం. 5. అసందేహం: వేదంలో శబ్దాల అర్థాన్ని సందేహానికి తావు లేకుండా నిర్ణయించడానికి వ్యాకరణం ఒక సాధనం. "స్థూల పృషతీ" అనే పదంలో లకారం తరవాత అకారం ఉదాత్తం కాబట్టి ఇది బహువ్రీహి; అందువల్ల దీని అర్థం "పెద్ద చుక్కలు గల ఆవు" అని. ఇందులో తకారం మీద ఈకారం ఉదాత్తమైతే దీని అర్థం "చుక్కలు కలిగి లావుగా ఉన్న ఆవు" అని అవుతుంది (అప్పుడు ఇది కర్మధారయం). కాని ఈ రెండో అర్థం ఇక్కడ ఉద్దిష్టం కాదు. ఇటువంటి విషయాలు వ్యాకరణం వల్లనే తెలుస్తాయి కాబట్టి వ్యాకరణం చదువుకోవాలి.

మధ్య సంస్కృత భాషలో చాలా మార్పులు వచ్చాయి. ఈ మార్పులని వర్ణించ డానికీ, పాణినిలో క్వాచిత్కంగా ఉన్న లోపాలని సవరించడానికీ ఈ వార్తికాలు ఉద్దిష్ట మయ్యాయి. పాణినిపై ఈయన విమర్శ పురోభాగిత్వంలో చేసినది అనడం అసమంజసమనీ అది తత్వ నిర్ణయ దృష్టితో జరిగిందనీ పండితుల అభిప్రాయం. కాత్యాయనుడి వార్తికాలు చాలావరకు అనావశ్యకమైనవని పతంజలి మహాభాష్యంలో నిర్ణయించారు. పతంజలి భారద్వాజీయ, సెనాగ, కుణరవాదవ, వాదవ, సౌర్య భగవత్, కుణి అనే ఇతర వార్తికకారులని కూడా పేర్కొన్నారు.

మునిత్రయంలో చివరివాడైన పతంజలి రచించిన మహాభాష్యం వ్యాఖ్యానాలు అన్నిటిలోకీ శ్రేష్ఠమైనది. ఈ గ్రంథంలో పాణిని సూత్రాలూ, కాత్యాయనుడి వార్తికాలూ కలిపి వ్యాఖ్యానించబడ్డాయి. ఈయన ముఖ్యోద్దేశం పాణిని సూత్రాలు సమగ్రం అని చెప్పడం; కాబట్టి కాత్యాయనుడి వార్తికాలు చాలావరకు అనావశ్యకమనీ అవి చెప్పే విషయాలు పాణిని సూత్రాలలోనే అంతర్భూతమై ఉన్నాయనీ ఈయన వివరించారు. కొన్నిచోట్ల ఈమాత్రం ఆయన కాత్యాయనుడి వార్తికాలని తోసిపుచ్చడం అసమంజసమని అనిపిస్తుంది. పతంజలి పాణిని అన్ని సూత్రాలనీ వ్యాఖ్యానించలేదు. వార్తికాలు ఉన్నవాటినీ, మరికొన్ని ముఖ్యమైన వాటినీ మాత్రమే ఈయన వ్యాఖ్యానించారు. ఈయన వ్యాఖ్య కూలంకషంగానూ తర్కసహంగానూ ఉంటుంది కాబట్టి ఈయన తరవాతి వైయాకరణులకు పరమ ప్రామాణికులు అయ్యారు. ఈయన గ్రంథంలో మొదటి అహ్నికమైన పస్పశాహ్నికంలో వ్యాకరణ ప్రయోజనాలూ (రక్షోహాగమ లఘ్వ సందేహాః ప్రయోజనం) వ్యాకరణం రచించవలసిన పద్ధతి మొదలైన విషయాలను గూర్చి చర్చ ఉంది. పతంజలి కాలం క్రీ.పూ 150 అని చెప్పడానికి బలమైన ఆధారాలు ఉన్నాయి. 'ఇహ పుష్పమిత్రం యాజయామః' అనే పతంజలి వాక్యం వల్ల ఈయన పుష్పమిత్రుడి సభలో ఉండేవారనీ, 'అరుణద్యవనః సాకేతం', 'అరుణద్యవనో మధ్యమికాం' అనే ఉదాహరణవల్ల మినాండర్ దండయాత్ర సూచితం కాబట్టి ఈయన కాల నిర్ణయం సులభసాధ్యమయింది. ఈయనకి ముందు కాలంలో వ్యాడి అనే ఆయన రచించిన 'సంగ్రహం' అనే గ్రంథంలోని అభిప్రాయాలు ఈయన కొన్ని

పేర్కొన్నారు. ఈ గ్రంథం పతంజలి తరవాత కొంతకాలానికే అలభ్యమయి పోయింది. పతంజలి మహాభాష్యం కూడా కాశ్మీర రాజైన అభిమన్యుని కాలానికి పఠన పాఠానాలు లోపించి ఒక తాళపత్ర ప్రతిలోనే మిగిలిందనీ దాని ఆధారంతోనే తరవాత కాలంలో ప్రతులు రాయబడ్డాయనీ భర్తృహరి వాక్యపదీయంలో చెప్పేరు. జటిలమైన వ్యాకరణ విషయాలను లౌకిక వ్యవహారాలకు సమన్వయిస్తూ బహుళోదాహరణలతో ప్రశ్నోత్తర పద్ధతిలో మహాభాష్యంలో చర్చ సాగింది. పాణిని కాత్యాయనుల మతాలకు భిన్నంగా పతంజలి తాను చెప్పిన విషయాలను శ్లోకరూపంగా యిచ్చారు. ఇటువంటి శ్లోకాన్ని 'ఇష్టి' అంటారు.

పతంజలి తరవాత ముఖ్య వైయాకరణుడు చంద్ర లేక చంద్రగోమిన్, ఈయన బౌద్ధుడు. ఈయన రచించిన వ్యాకరణం చాంద్ర వ్యాకరణం. ఇది బౌద్ధులు సంస్కృతం నేర్చుకోవడానికి ఉద్దిష్టమైనది కాబట్టి అష్టాధ్యాయిలో వైదిక భాషకు సంబంధించిన సూత్రాలు ఇందులో తొలగించబడ్డాయి. ఈయన కాలం క్రీ.శ. 470–650 మధ్య. ఈయన వ్యాకరణ రచనా పద్ధతి అష్టాధ్యాయీ పద్ధతే అయినా ఈయన 35 సూత్రాలు కొత్తవి చేర్చారు (ఇవి కాశికలో స్వీకృతాలు). ఈయన సూత్రాల సంఖ్య 3,100. ఇందులో ఆరు అధ్యాయాలు, ఒక్కొక్క అధ్యాయానికి నాలుగు పాదాలూ ఉన్నాయి. ఈయన పాణిని సూత్రాలను కొన్నింటిని ఉచ్చారణ సౌకర్యార్థం కొంత మార్చారు.

జయాదిత్య వామన విరచితమైన కాశిక (కాశికావృత్తి) అష్టాధ్యాయికి ప్రథమ సమగ్ర వ్యాఖ్య. చైనీయ యాత్రికుడైన ఇత్సింగ్ జయాదిత్యుడు 660 ప్రాంతంలోమరణించారని చెప్పేరు. వామనుడు కూడా జయాదిత్యుడికి ఇంచుమించు సమకాలికుడే అయి ఉంటాడు. జయాదిత్యుడు మొదటి ఐదు ధ్యాయాలకీ వామనుడు మిగిలిన మూడు అధ్యాయాలకీ వ్యాఖ్య రచించారు. కాశికలో అన్ని సూత్రాలకీ వ్యాఖ్య ఉండడమే కాక ప్రతి సూత్రానికీ ముందు సూత్రాలనించి వచ్చే అనువృత్తులూ సూచించబడి, ఉదాహరణలూ, ప్రత్యుదాహరణలూ పుష్కలంగా ఇవ్వబడ్డాయి. ఇందులో పతంజలి, చంద్రగోమిన్ మొదలైన పూర్వాచార్యుల మతాలు స్వీకరించబడ్డాయి. దీనికి జినేంద్రబుద్ధి

విరచితమైన న్యాసమూ (750 ప్రాంతం), హరదత్త విరచితమైన పదమంజరీ (1100 ప్రాంతం) అనే రెండు వ్యాఖ్యానాలు ఉన్నాయి.

భర్తృహరి వాక్యపదీయం శ్లోక రూపంలో మూడు కాండలలో ఉంది. ఇత్సింగ్ ఈయన 650లో మరణించారని చెప్పేరు కాబట్టి ఈయన జయాదిత్యుడి సమకాలికుడు. వాక్యపదీయంలో బ్రహ్మ లేక ఆగమకాండ, వాక్యకాండ, పద లేక ప్రకీర్ణకాండ అనే మూడు కాండలు ఉన్నాయి. ఈయన ప్రతిపాదించిన స్ఫోట సిద్ధాంతం ప్రసిద్ధమైనది. వైయాకరణులు వాక్యాన్ని పదాలుగానూ పదాలని ప్రకృతి ప్రత్యయాలుగానూ విభజించడం కృత్రిమ మైనదని ఈయన గుర్తించారు.

పదే నవర్ణా విద్యంతే వర్ణేష్వ వయావా నచ
వాక్యాత్ పదానా మానంత్యం ప్రవివేకో న కశ్చన (1.73)

ఇది నిరుక్తంలో స్మరించబడిన ఔదంబరాయణుని సిద్ధాంతం. అవిభక్తమైన వాక్యమే అర్థాన్ని ఇస్తుందని స్ఫోట సిద్ధాంత సారాంశం. భర్తృహరి స్ఫోట (అర్థవంతమైన వాక్యం), ప్రాకృత ధ్వని (దాని వర్ణ నిర్మాణం), వైకృత ధ్వని (దాని ఉచ్చారణలో ఉన్న ధ్వని రూపం) – ఈ మూడింటికీ భేదం పాటించారు. ఇంతేకాక, ఇందులో కారక సిద్ధాంతం, వాక్య నిర్వచనం మొదలైన విషయాల మీద కూడా చర్చ ఉంది. ఈయన మహా భాష్యానికి మొదటి మూడు పాదాల వరకూ వ్యాఖ్య కూడ ఒక ప్రత్యేక గ్రంథంగా రచించారు.

కైయుటుడి ప్రదీపం (11–13 శతాబ్దుల మధ్య కాలం) మహా భాష్యానికి మంచి వ్యాఖ్య; దీనికి నాగోజీభట్టు ఉద్యోతమనే వ్యాఖ్య రచించారు.

అష్టాధ్యాయిలో ప్రక్రియా కాఠిన్యాన్ని తొలగించే ప్రయత్నంలో సూత్రక్రమాన్ని పూర్తిగా మార్చివేసి రూపసాధనకు అనుగుణంగా సూత్రాలని ఒకచోట చేర్చే సంప్రదాయం 14వ శతాబ్దిలో ప్రారంభమైంది. ఈ సంప్రదాయంలో రచితమైన గ్రంథాలలో ముఖ్యమైనది భట్టోజీ దీక్షితుడి సిద్ధాంత కౌముది (1630 ప్రాంతం). ఈ సంప్రదాయం విమల సరస్వతి రూపమాలతో ప్రారంభమైంది (1350 ప్రాంతం). రూపమాలకీ సిద్ధాంత

కౌముదికీ మధ్యకాలంలోది రామచంద్రుడు రచించిన ప్రక్రియా కౌముది (15వ శతాబ్ది పూర్వభాగం). సిద్ధాంత కౌముది ప్రాచుర్యం అష్టాధ్యాయీ సూత్రాల క్రమాన్నే మరిచిపోయేటట్లు చేసింది. సిద్ధాంత కౌముదిలో సంజ్ఞా ప్రకరణం, పరిభాషా ప్రకరణం, అచ్‌సంధి ప్రకరణం, హల్సంధి ప్రకరణం, విసర్గ సంధి ప్రకరణం, స్వాది సంధి ప్రకరణం ఇత్యాదిగా సూత్రాలు ప్రకరణానుగుణంగా ప్రవేశపెట్టబడినా, ఒకచోట చెప్పబడిన సూత్రం పునరుక్తం కాకపోవడం వల్ల ప్రక్రియా గౌరవం తగ్గలేదు. పైగా దీనివల్ల అష్టాధ్యాయిలో సూత్రాలు ఉన్న క్రమం విద్యార్థులు మరచిపోవడం తటస్థించింది. భట్టోజీ దీక్షితుడే దీనికి ప్రౌఢ మనోరమ, దానికంటె చిన్నదైన బాల మనోరమ అనే వ్యాఖ్యలు రచించారు. ఇవికాక ఈయన కాశికా పద్ధతిలో అష్టాధ్యాయికి శబ్ద కౌస్తుభమనే విపుల వ్యాఖ్య రచించారు. కాని, ఇది అపరి సమాప్తం. సిద్ధాంత కౌముదికి వ్యాఖ్యలు అనేకం. వీటిలో జ్ఞానేంద్ర సరస్వతి తత్త్వ బోధిని ప్రసిద్ధం. కాని ఇందులో స్వర వైదిక ప్రకరణాలకు వ్యాఖ్య లేదు; ఈ రెండింటిమీదా జయకృష్ణుడు వ్యాఖ్య రచించారు. వీరిద్దరూ 18వ శతాబ్దికి చెందినవారు. భట్టోజీ దీక్షితుడి కాలంలోనే కేరళ దేశానికి చెందిన నారాయణ భట్టతిరి (1560–1666) ప్రక్రియా సర్వస్వం రచించారు. అది కూడా విషయానుక్రమణికలో సిద్ధాంత కౌముది వంటిదే. మహాకవులు చేసిన అపాణినీయ ప్రయోగాలని ఈయన సమర్థించారు. నారాయణ భట్టతిరీ, భట్టోజీ దీక్షితుడూ ఒకరి గ్రంథం ఒకరు చూడడంగాని, కలుసుకోవడం గాని తటస్థించలేదు.

నాగోజీభట్టు లేక నాగేశుడు 18వ శతాబ్దికి చెందిన ప్రసిద్ధ వైయాకరణుడు. ఈయన భట్టోజీ దీక్షితుడి మనుమడైన హరి దీక్షితుడి శిష్యుడు. ఈయన వ్యాకరణ శాస్త్రంలో పన్నెండు గ్రంథాలు కాక ధర్మ యోగాలంకార శాస్త్రాలలోనూ గ్రంథాలు వ్రాశారు. ఇంతేకాక, ఈయన వాల్మీకి రామాయణం, ఆధ్యాత్మ రామాయణం, గీత గోవిందం మొదలైన వాటికి కూడా వ్యాఖ్యలు రాశారు. ఈయన వ్యాకరణ గ్రంథాలలో ముఖ్యమైనవి కైయటుడి మహాభాష్య ప్రదీపానికి వ్యాఖ్య అయిన ఉద్యోతం, వ్యాకరణ శాస్త్రంలో పరిభాషలన్నీ ఏర్చికూర్చిన పరిభాషేందు శేఖరం, వైయాకరణ సిద్ధాంత మంజూష. సిద్ధాంత కౌముదిని సంగ్రహ పరిచి వరదరాజా మధ్య సిద్ధాంత కౌముది, లఘు సిద్ధాంత కౌముది,

సారసిద్ధాంత కౌముది అనే మూడు గ్రంథాలు రాశారు. వీటిలో రెండోది ప్రసిద్ధం. దీనికన్న మొదటిదాంట్లో సూత్రాల సంఖ్య కొంచెం ఎక్కువ; మూడోదాంట్లో తక్కువ.

ఇంతవరకు మనం చర్చించినది పాణినీయ వ్యాకరణ శాఖ అభివృద్ధి చెందిన విధానం. పై గ్రంథాలన్నీ అష్టాధ్యాయికి వ్యాఖ్యాప్రాయాలే. వీటిలో అష్టాధ్యాయిలోని సూత్రాల రూపం మార్చకుండా వాటిపై వ్యాఖ్యానం జరిగింది. కాని మరికొందరు వైయాకరణులు అష్టాధ్యాయి మీదనే ఆధారపడినా అందులో సూత్ర సంఖ్యను సంగ్రహించి సూత్రాల స్వరూపాన్ని మార్చి వ్యాకరణాలు రచించారు. ఈ అపాణినీయ వ్యాకరణాలు తొమ్మిది ముఖ్య శాఖలకు చెందుతాయి. వీటిని గురించి సంగ్రహంగా కింద చూద్దాం.

i) చాంద్రశాఖ : దీని ప్రవర్తకుడైన చంద్రగోమిన్ వ్యాకరణం ప్రత్యేకతలు పైన చూశాం. చాంద్ర వ్యాకరణం బౌద్ధమతం వ్యాప్తి చెందిన టిబెట్, శ్రీలంకలోనే వ్యాప్తిలో ఉండేది. దీనికి కొన్ని వ్యాఖ్యలూ, వాటికి టిబెట్ భాషలో అనువాదాలు ఉన్నాయి. శ్రీలంకలో 12వ శతాబ్ది ప్రాంతంలో కశ్యపుడనే బౌద్ధాచార్యుడు దీన్ని కొంత మార్చి బాలావబోధం అనే గ్రంథం రాశాడు. ఈ గ్రంథం వ్యాప్తిలోకి వచ్చాక శ్రీలంకలో అసలు చాంద్ర వ్యాకరణం మరుగుపడింది.

ii) జైనేంద్రశాఖ : దేవనంది లేక పూజ్యపాదుడు రాసిన జైనేంద్ర వ్యాకరణం (5వ శతాబ్ది పశ్చిమ భాగం) ఇందులో ముఖ్య గ్రంథం. దీనికి రెండు పాఠాంతరాలు ఉన్నాయి. 3700 సూత్రాలు ఉన్న గ్రంథానికి సోమదేవుడు (1205) శబ్దార్ణవ చంద్రిక అనే వ్యాఖ్య రచించారు. 3000 సూత్రాలు మాత్రమే ఉన్న గ్రంథాన్ని అభయనంది (750) వ్యాఖ్యానించారు. ఇందులో విషయంలో కొత్తదనం లేదు కాని, పాణిని సూత్రాలు, వార్తికాలలో పదాలకి బదులు చిన్న పదాలు వాడబడ్డాయి. మనుష్యకి బదులు నృ. పారిభాషిక సంజ్ఞలలో కూడా ఇటువంటి లాఘవం పాటించబడింది. ప్రత్యయ = త్య, కర్మధారయ= య, పరస్మైపద = మ. దీనికి 'పంచవస్తు' అనే సంగ్రహ గ్రంథం కూడా ఉంది.

iii) శాకటాయన శాఖ : శాకటాయనుడి (9వ శతాబ్ది) శబ్దాను శాసనం ఇందులో మూల గ్రంథం. ఈయన యాస్క-పాణినులు స్మరించిన ప్రాచీన శాకటాయనుడు కాదు. ఈ గ్రంథం శ్వేతాంబర జైనులకు ఉద్దిష్టమైంది. ఇది నాలుగు అధ్యాయాలలో ఉంది. ఒక్కొక్క అధ్యాయానికి పాదాలు 4; మొత్తం సూత్రాలు 3,200. ఈయన పాణిన్యాది పూర్వాచార్యులచే కాక చంద్ర గోమిన్, పూజ్యపాదులను కూడా అనుసరించారు. దానికి అనేక వ్యాఖ్యలూ, సంగ్రహ గ్రంథాలూ ఉన్నాయి. ఈయన అమోఘ వృత్తి అనే గ్రంథం కూడా రాశారు.

iv) హేమచంద్ర శాఖ : హేమచంద్రుడి (11వ శతాబ్ది) శబ్దాను శాసనంలో 4,500 సూత్రాలు, ఎనిమిది అధ్యాయాలలో ఉన్నాయి. (ఒక్కొక్క అధ్యాయానికి 4 పాదాలు). ఇందులో చివరి అధ్యాయంలో ఉన్న సుమారు 100 సూత్రాలు ప్రాకృత భాషలకి సంబంధించినవి. దీనికి ఆయనే బృహద్వృత్తి అనే వ్యాఖ్య వ్రాశారు. ఇది కూడా శ్వేతాంబర జైనులకే ఉద్దిష్టమైంది. దీనికి కూడా అనేక వ్యాఖ్యలూ, సంగ్రహాలూ ఉన్నాయి.

v) కాతంత్ర శాఖ : కాతంత్ర వ్యాకరణకర్త శర్వవర్మ. ఈయన దక్కన్ రాజైన శాతవాహనుడి (1వ శతాబ్ది) ఆస్థాన పండితుడు. ఈయన ఇతర శాస్త్రాలు చదువుకొనేవారూ, వాణిజ్యాది వృత్తులు చేసేవారూ, స్వల్పమతులూ సంస్కృతాన్ని స్వల్ప కాలంలో నేర్చుకోవడానికి ఈ వ్యాకరణాన్ని రచించినట్లు చెప్పుకొన్నారు. శాతవాహన మహారాజు జలకేళిలో ఆయన రాణిమీద నీళ్ల చల్లుతుండగా ఆమె 'మోదకం దేహి రాజన్' (మా+ఉదకం దేహి రాజన్ - అంటే 'నీళ్ల చల్లకు' అంటే, ఆయన ఆమె మోదకం (ఉండ్రాళ్లు) ఇమ్మంటోంది అనుకొని ఉండ్రాళ్ల తెప్పించాడట. రాణిగారు దీనికి నవ్వగా ఆయన సిగ్గుపడి శర్వవర్మని స్వల్పకాలంలో సంస్కృతం నేర్చుకోడానికి వ్యాకరణం రచించమని అడగగా శర్వవర్మ ఈ గ్రంథాన్ని రచించినట్లు ఐతిహ్యం. సౌలభ్యం కోసం ఈయన ప్రత్యాహారాలు పరిహరించి స్వరం, వ్యంజనం మొదలైన పూర్వాచార్య సంజ్ఞలే వాడారు. వ్యాకరణ విషయాలు కూడా కౌముది పద్ధతిలో కూర్చబడ్డాయి. ఇందులో సంధి ప్రకరణం, నామ ప్రకరణం, ఆఖ్యాత ప్రకరణం, కృత్ప్రకరణం అని నాలుగు ప్రకరణాలు ఉన్నాయి. వీటిలో కృత్ప్రకరణమూ,

నామ ప్రకరణంలో తద్ధిత, స్త్రీప్రత్యయ పాదాలూ తరవాత కాలంలో చేర్చబడినవి. ఇందులో వైదిక ప్రక్రియా, అపవాద సూత్రాలూ విసర్జించబడ్డాయి. దీనికి దుర్గాసింహుడి (8వ శతాబ్ది) వృత్తి ఉంది. ఈ దుర్గాసింహుడి వృత్తికి అనేక వ్యాఖ్యలు ఉన్నాయి. ఇందులో సూత్రాల సంఖ్య కృత్ప్రకరణంతో కలిపి 1400, అది కాకుండా 855 మాత్రమే. ఇది పాణిని వ్యాకరణంకన్న సులభమైనది కాబట్టి చాలా వ్యాప్తిలోకి వచ్చింది. ఇది ముఖ్యంగా కాశ్మీర్, బెంగాల్, శ్రీలంకలలో వ్యాప్తిలోకి వచ్చింది. కాతంత్ర వ్యాకరణానికి కౌమార, కాలాప అనే మారుపేర్లు కూడా ఉన్నాయి.

vi) సారస్వత శాఖ : సారస్వత వ్యాకరణం మహమ్మదీయ రాజాల ప్రాద్బలం వల్ల రచించబడింది. ఇందులో 700 సూత్రాలే ఉన్నాయి. కర్తపేరు తెలియదు. ఈ సూత్రాలని అనుభూతి స్వరూపాచార్యుడు వార్తికాలు, వ్యాఖ్య సారస్వత ప్రక్రియ (13–15 శతాబ్దుల మధ్యకాలం) అనే గ్రంథంలో రాశారు. దీనికి అనేక వ్యాఖ్యానాలు ఉన్నాయి. అందులో ప్రతాపరుద్రుడి కాలంలో ఓరుగల్లు నివాసి అయిన రామభట్టు రాసిన విద్వత్ ప్రబోధిని ఒకటి. ఈయన తీర్థయాత్రలు చేస్తూ మధ్య దొరికిన విరామ సమయంలో ఈ వ్యాఖ్యానం రచించారు. విల్కిన్స్ సంస్కృత వ్యాకరణానికి మూలం ఈ సారస్వత వ్యాకరణం.

vii) బోపదేవశాఖ : బోపదేవుడి ముగ్ధబోధ (13వ శతాబ్ది) ఈ శాఖలో ముఖ్య గ్రంథం. ఈయన మహారాష్ట్ర ప్రాంతానికి చెందినవాడు కాబట్టి ఈ వ్యాకరణం ఆ ప్రాంతంలోనే వ్యాప్తిలో ఉండేది. సిద్ధాంత కౌముది వచ్చాక దీని ప్రభావం తగ్గింది. కాని ఇప్పటికీ ఇది బెంగాల్‌లో కొన్ని ప్రాంతాలలో వ్యాప్తిలో ఉంది. రామతర్క వాగీశుడి వ్యాఖ్యానం దీనికున్న వ్యాఖ్యలలో ముఖ్యమైనది. కాతంత్ర వ్యాకరణంలోలా ఇందులో కూడా లాఘవమే ప్రాముఖ్యం వహించింది.

viii) జౌమరశాఖ : వాదీంద్ర చక్ర చూడామణి అనే బిరుదుగల క్రమదీశ్వరుడు రచించిన సంక్షిప్త సారం ఈ శాఖలో ప్రథమ గ్రంథం. ఇందులో అష్టాధ్యాయిలో సూత్రాల క్రమం మార్చబడి ఇవి సంధి, తిజంత, కృదంత,

తద్ధిత, కారక, సుబంధ, సమాస అనే ఏడు పాదాలలో ఇవ్వబడ్డాయి. ఇందులో ఉదాహరణలు భట్టి కావ్యం నించి తీసుకోబడ్డాయి. భర్తృహరి మహాభాష్య దీపిక అనుసరించ బడింది. జుమరనంది దీన్ని సంస్కరించి రసవతి అనే వ్యాఖ్య రాశారు. ఈ వ్యాఖ్య ప్రాచుర్యంవల్ల దీని కర్త పేరనే ఈ శాఖ వెలసింది. జుమరనందికి తరవాత గోయీచంద్రుడు కూడా దీనికి వ్యాఖ్య వ్రాశారు.

కారకపాదంపై గోయీ చంద్రుడి వ్యాఖ్య ప్రశస్తమైనది; దీన్ని అన్ని శాఖలవారూ కారక సిద్ధాంతాన్ని క్షుణ్ణంగా తెలుసుకోవడానికి చదువుతారు. ఇది ఇప్పటికీ బెంగాల్‌లో కొంత వ్యాప్తిలో ఉంది.

క్రమదీశ్వరుడు ఇంచుమించు బోపదేవుడి కాలంవాడు అయి ఉంటారు.

ix) సౌపద్మశాఖ : ఈ శాఖకు మూల గ్రంథం పద్మనాభ దత్తుడి వ్యాకరణం (బహుశా 14వ శతాబ్ది). ఇందులో పాణిని సూత్రాలు కొన్ని మార్పులతో సంజ్ఞ, సంధి, కారక, ఆఖ్యాత, కృత్ (ఉణాది), తద్ధిత అనే ఐదు అధ్యాయాలలో సుపద్మపంజిక అనే వ్యాఖ్యతో ఇవ్వబడ్డాయి. దీనికి కొన్ని వ్యాఖ్యానాలు కూడా ఉన్నాయి.

ఇది ఇప్పటికీ బెంగాల్‌లో కొంత వ్యాప్తిలో ఉంది.

## 18.5 తొల్కాప్పియం

ద్రావిడ భాషలన్నిటికీ ఉన్న వ్యాకరణాలలో అతి ప్రాచీనమైనది తమిళ భాషా వ్యాకరణమైన తొల్కాప్పియం. దీని రచయిత తొల్కాప్పియనార్. ఈయన కాల నిర్ణయ విషయంలో వాదోపవాదాలు ఉన్నాయి కాని ఇది క్రీస్తు కాలానికి కొంచెం ముందు కాలంలోనే కొంచెం వెనక కాలంలోనో రచితమై ఉండవచ్చు. ఆంధ్రశబ్ద చింతామణి (ఇది నన్నయ కర్తృకమా అనే విషయం వివాద గ్రస్తం) కాలం నించి ఉన్న తెలుగు వ్యాకరణాలూ, రెండో నాగవర్మ (1150 ప్రాంతం) రచించిన కర్ణాటక భాషా భూషణంతో మొదలైన కన్నడ వ్యాకరణాలూ, లీలా తిలకం (14వ శతాబ్ది)తో మొదలైన మలయాళ వ్యాకరణాలూ, తొల్కాప్పియం తప్ప మిగిలిన తమిళ వ్యాకరణాలూ ఎంతో

కొంత పాణిన్యాది సంస్కృత వైయాకరణుల పద్ధతులను అనుసరించినవే. కాని ఈ ద్రావిడ భాషలు నిర్మాణంలో సంస్కృత భాషకన్న భిన్నమైనవి కనుక అవసరమైన చోట్ల ఈ వ్యాకర్తలు కొద్ది మార్పులు చేసి తమతమ భాషల స్వభావాన్ని వీలైనంతవరకు ఆవిష్కరించారు. తొల్కాప్పియంలో మాత్రం పాణిని ప్రభావము లేదు. అందవల్ల తొల్కాప్పియాన్ని గురించి మాత్రం ఇక్కడ చర్చిద్దాం.

తొల్కాప్పియానికి ఉపోద్ఘాతం (పాయిరం) రాసిన పనం పారనార్ తొల్కాప్పియనార్ అంతకుముందున్న తమిళ వ్యాకరణాలు అన్నింటినీ పరిశీలించి ఐంద్ర వ్యాకరణ పద్ధతిలో ఈ గ్రంథం రచించినట్లు చెప్పేరు. ఐంద్ర వ్యాకరణము ఇప్పుడు అలభ్యం; కాని ఐంద్ర వ్యాకరణం అనే గ్రంథం ఉన్నా లేకపోయినా ఆ సంప్రదాయమూ, దాని ప్రత్యేక పద్ధతులూ ఉండేవని ఈ వాక్యం వల్ల మనకు తెలుస్తుంది. కాబట్టి ఐంద్ర వ్యాకరణ పద్ధతిని గూర్చి తెలుసుకొందుకు మనకు తొల్కాప్పియం ముఖ్యాధారం. తొల్కాప్పియనార్‌కి ప్రాతిశాఖ్యలతోనూ నిరుక్తంతోనూ పరిచయం ఉన్నట్లు ఆ గ్రంథంవల్ల తెలుస్తుంది. తొల్కాప్పియంలో 1600 సూత్రాలు మూడు అధికారాలలో ఉన్నాయి. అవి ఎళుత్తదికారం (వర్ణాధికారం), చొల్లదికారం (పదాధికారం), పొరుళదికారం (అర్థాధికారం) పొరుళదికారం అలంకార శాస్త్రం, ఛందస్సు మొదలైన వాటికి సంబంధించినది. వ్యాకరణం మొదటి రెండు అధికారాలలోనే ఉంది. ఎళుత్తది కారంలో 480 సూత్రాలు 9 విభాగాలలో ఉన్నాయి. మొదటి మూడు విభాగాలలో తమిళ ధ్వనులు (వాటి గుర్తులు), వాటి ఉచ్చారణ విధానం, పదంలో వివిధ స్థానాలలో ధ్వనులు ఉండడంలో నియమాలు అనే విషయాలు ఉన్నాయి. చివరి ఆరు విభాగాలలో సంధి వర్ణించబడింది. సంధి పాణినీయంలోలా సాధారణీ కరణాలతో లకాక వివరణాత్మక దృష్టితో, అంటే, ఒక్కొక్క పదాంత ధ్వనికీ ప్రత్యేకంగా వివరించబడింది.

చొల్లదికారంలో 460 సూత్రాలు తొమ్మిది విభాగాలలో ఉన్నాయి. వీటిలో మొదటి నాలిగింటిలో వాక్య నిర్మాణమూ, చివరి అయిదింటిలో పద నిర్మాణమూ వర్ణించబడ్డాయి.

తొల్కాప్పియం వ్యాఖ్యాతలలో ఇళంపూరణర్, పేరాసిరియర్, పేరాసిరియర్, నచ్చినార్కినియర్, దెయ్వచ్చిలెయార్, కల్లాడనార్ ముఖ్యులు.

తొల్కాప్పియంలో పద నిర్మాణానికన్న వాక్య నిర్మాణానికి ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వబడిందని ఆధునిక పరిశోధకుల అభిప్రాయం.

# 19. అష్టాధ్యాయి – ఆధునిక భాషాశాస్త్రం

## 19.1 ఉపోద్ఘాతం

పాణిని మహర్షి సంస్కృత భాషకి రచించిన "అష్టాధ్యాయి" వంటి వ్యాకరణం ప్రాచీన కాలంలోగాని భాషా శాస్త్రం వృద్ధి పొందుతున్న ఈ కాలంలోగ్గాని మరి ఏ భాషకీ ఎవరూ రచించలేదనే విషయం భాషా శాస్త్రవేత్త లందరూ అంగీకరించినదే.[1] యూరప్ ఖండవాసుల సంస్కృతికి గణిత శాస్త్రం

1. దీనికి ఈక్రింద ఇచ్చిన కొందరు ప్రముఖ పండితుల అభిప్రాయాలు ఉదాహరణలు :

"This (i.e. Panini's) grammar, which dates from somewhere round 350 to 250 B.C. is one of the greatest monuments of human intelligence. It describes with the minutest detail, every inflection, derivation and composition, and every syntactic usage of its author's speech. No other language, to this day, has been so perfectly described".

— L. Bloomfield, Language P. 11.

"This scientific condensation which places every feature into its proper setting is one of the two virtues which make Indian grammar a model for us. The other is completeness. Panini gives the formation of every inflected, compounded or derived word with an exact statement of the sound variations (including accent) and of the meaning".

— L. Bloomfield, Lg. 5 (1929), P. 274.

"The Romans ... did not know how to derive the stem of the word from a comparison of the various inflectional forms, and

మూలకందమైనట్లు భారతీయుల సంస్కృతికి వ్యాకరణ శాస్త్రం మూలకందకమైనది. మనదేశంలో వ్యాకరణ శాస్త్రవృద్ధికి మూలకారణం వేద పరిరక్షణే అయినా, పాణినీ, తదనుయాయులైన వైయాకరణులూ వ్యాకరణాన్ని స్వతంత్రమూ పరిపూర్ణమూ అయిన శాస్త్రంగా తీర్చిదిద్దేరు. కాని ఈ మహత్తర కృషిలో వారు అనుసరించిన సూత్రాలూ, అవలంబించిన పద్ధతులూ వారు సమగ్రంగా వివరించ లేదు. కాబట్టి అష్టాధ్యాయీ నిర్మాణానికి పాణిని మహర్షి

---

the Greeks in this respect were no wiser. But the Indian grammarians were never capable of floundering in such confusion. They derived the stem correctly from inflectional forms, the root from the several groups of the related words; they ascertained the laws of derivation and composition and so forth".

— Holger Pedersen, The Discovery of Language, pp. 22-3.

"First of all, the importance of the great grammarian (i.e., Panini) is considerable, due to the synchronic view which he gives of the language of his time and due to the method which he uses in the description of this language. This method is in certain respects archaic, but often surprisingly modern, and always precise and rigorous. Furthermore, the technique of Panini (and his school) is of interest for those who are working toward an axiomatization of grammar; in this respect Panini's grammar represents a model that has no equal in antiquity"

— L. Renou, Panini, Current Trends in Linguistics 5, P. 481.

"The Hindu achievements in morphological description were of a kind that we have only just begun to rival in modern western descriptive linguistics and that we have not yet bettered".

— M.B. Emeneau, "India and Linguistics", P. 191.
(Collected Papers, Annamalai University)

"What is more, it seems that even Panini's grammar can be interepreted as a fragment of such a "generative grammar", in essentially the contemporary sense of this term".

— Noam Chomsky, Aspects (1965), Preface.

ప్రాతిపదికగా తీసుకొన్న సిద్ధాంతాలని పరిశోధించి వివరించవలసిన బాధ్యత సంస్కృత వ్యాకరణమూ, ఆధునిక భాషాశాస్త్ర సిద్ధాంతాలూ తెలిసిన పండితులమీద ఉంది. భాషాశాస్త్ర పరిశోధన వృద్ధి పొందుతున్నకొద్దీ పాణినీయానికి ప్రాతిపదికలైన సిద్ధాంతాలకీ, ఆధునిక భాషాశాస్త్ర సిద్ధాంతాలకీ అత్యధిక సాన్నిహిత్యం ఉందనే విషయం స్పష్టమవుతోంది. ఈ సాన్నిహిత్యాన్ని గురించిన చర్చ కింద పేరాలలో ఉంది.

## 19.2 వ్యాకరణ రచనలో లాఘవం

అష్టాధ్యాయిలో సూత్రాల సంఖ్య సుమారు నాలుగు వేలే అయినా అది లౌకిక భాషకీ వైదిక భాషకీ కూడా పరిపూర్ణమైన వ్యాకరణం. ఇంత చిన్న గ్రంథంలో పరిపూర్ణత పాణిని మహర్షి సాధించగలగడానికి ఆయన అనుసరించిన సూత్ర పద్ధతే కారణం. సూత్రానికి నిర్వచనం –

"అల్పాక్షర మసందిగ్ధం
సారవ ద్విశ్వతోముఖం
అస్తోభ మనవద్యం చ
సూత్రం సూత్రవిదో విదుః"

(తక్కువ అక్షరాలు కలిగినదీ, సందేహానికి తావులేనిదీ, సారవంతమైనదీ, సర్వ వ్యాప్తమైనదీ, వ్యర్థ పదాలు లేనిదీ, దోష రహితమైనదీ సూత్రం అని సూత్రవేత్తల అభిప్రాయం.) వ్యాకరణ శాస్త్రంలో ఆరు రకాల సూత్రాలు ఉన్నాయని ఈకింది శ్లోకంవల్ల తెలుస్తుంది :

"సంజ్ఞా చ పరిభాషా చ
విధి ర్నియమ ఏవ చ
ప్రతిషేధోఽధికారశ్చ
షడ్విధం సూత్ర లక్షణం"

వీటిలో విధి సూత్రాలూ, నియమ సూత్రాలూ, ప్రతిషేధ సూత్రాలలోనే వ్యాకరణం ఇమిడి ఉంటుంది. మిగిలిన మూడు రకాల సూత్రాలూ, అంటే,

సంజ్ఞా సూత్రాలూ, పరిభాషా సూత్రాలూ, అధికార సూత్రాలూ వ్యాకరణ సత్యాలని సంక్షేప రూపంలో వివరించడానికి కూర్చడానికి ఏర్పడినవి. దీనివల్ల పాణిని మహర్షి సూత్ర నిర్మాణంలోనే కాక గ్రంథ నిర్మాణంలో కూడా లాఘవాన్ని పాటించినట్లు తెలుస్తుంది. "అర్థమాత్రా లాఘవేన పుత్రోత్సవం మన్యన్తే వైయాకరణాః" అనే ఉక్తి వల్ల కూడా మన వైయాకరణులు లాఘవానికి ఎంత ప్రాముఖ్యమిచ్చారో మనకు విశదమవుతుంది.

పూర్వకాలంలో మనదేశంలో రాత లేకపోవడంవల్ల కంఠస్థం చేయడానికి అనువుగా సంగ్రహంగా ఉండడానికే ఈ లాఘవాన్ని మన పూర్వులు ఆశ్రయించారని చాలామంది పాశ్చాత్య పండితుల అభిప్రాయం. ఇది నిజమైనా కాకపోయినా భాషా తత్వాన్ని గ్రహించడంలో ఇది మన వైయాకరణులకి చాలా ఉపయోగించింది. దీనివల్లనే వారు భాషలో అన్ని అంతరువులలోనూ, అంటే, వర్ణ నిర్మాణం, పద నిర్మాణం, వాక్య నిర్మాణం మొదలైన వాటి అన్నిటిలోనూ కొన్ని నిర్ణీత సూత్రాలూ, వ్యవస్థా ఉంటాయనీ, కొన్ని అంశాలకి తుల్య ప్రవర్తన ఉంటుందనీ గ్రహించగలిగేరు. ఉదాహరణకి 'ఇకోయణచి' (6.1.77) అనే సూత్రం తీసుకొందాం. దీని అర్థం 'అచ్చు పరమైనప్పుడు ఇ, ఉ, ఋ, ఌ ల స్థానంలో వరుసగా య, వ, ర, ల, లు వస్తాయి' అని. ఇందులో నాలుగు అచ్చులకు సంబంధించిన సంధి కార్యాలు ఒకే సూత్రంగా చెప్పబడ్డాయి. ఇ, ఉ, ఋ, ఌ అని ఒక సముదాయంగా గ్రహించి, వాటికి ఇక్ అనే ప్రత్యాహార సంజ్ఞ చెయ్యడం, య, వ, ర, ల లకు యణ్ అనే ప్రత్యాహార సంజ్ఞ చెయ్యడం కేవలం లాఘవం కోసమే కాదు, ఇటువంటి ప్రత్యాహారాలు వాటికి చెందిన వర్ణాలు ఒకేవిధంగా ప్రవర్తిస్తాయి అనే సత్యాన్ని స్పష్టం చేస్తాయి. పై సూత్రం ఈ నాలుగు అచ్చులూ (సవర్ణం కాని) అచ్చుముందు అంతస్థలుగా మారతాయని సూచిస్తుంది. ఇదేవిధంగా 'స్త్రీభ్యో ఢక్' (4.1.120) 'స్త్రీవాచక శబ్దాలకి అపత్యార్థంలో ఢక్ ప్రత్యయం వస్తుంది' అనే సూత్రంలో వినతా, గంగా మొదలైన స్త్రీ వాచకాల నన్నింటినీ సంగ్రహించకుండా స్త్రీవాచక శబ్దాలు అని అనడంవల్ల వాటిలోని సాధారణ ధర్మాన్ని గ్రహించి, వ్యాకరణంలో లాఘవం సాధించబడింది. దీనివల్ల వ్యాకరణం భాషా వ్యవహర్తల మానసాంతరాలలో ఉండే సాధారణీకరణాలకి సన్నిహితమైంది.

ఇక వ్యాకరణ రచనలో లాఘవం సాధించిన సంజ్ఞా సూత్రాలూ, పరిభాషా సూత్రాలూ, అధికార సూత్రాలూ కూడా కేవలం లాఘవం కోసమే కాక భాషా తత్వాన్ని నిరూపించడానికే ముఖ్యంగా ఏర్పరచబడ్డాయని చెప్పవచ్చు. ఉదాహరణకి 'తరప్ తమపౌ ఘః' (1.1.22) 'తరప్, తమప్ ప్రత్యయాలు రెండిటినీ 'ఘ' అనే సంజ్ఞ సూచిస్తుంది' – ఈ సూత్రంలో భాషలో తర, తమ ప్రత్యయాలకి సంబంధించిన కార్యాలు తుల్యంగా ఉండడం వల్లనే ఆ రెండిటికీ 'ఘ' అని ఒకే సంజ్ఞ విధించబడింది. ఇక 'సమర్థః పదవిధిః' (2.1.1,) 'పదాకు సంబంధించిన విధి సమర్థాశ్రితమై ఉంటుంది'. మొదలైన పరిభాషా సూత్రాలు భాషా తత్వాన్ని స్పష్టీకరించేవే అనడంలో సందేహమే లేదు. ఈ సందర్భంలో 'పరిభాషా పునరేక దేశస్థాసతీ కృత్స్నంశాస్త్ర మభిజ్వలయతి ప్రదీపవత్ తద్యథా – ప్రదీపః సుప్రజ్వలిత ఏకదేశస్థః సర్వం వేశ్మాభిజ్వలయతి' అనే పతంజలి మహర్షి వాక్యాలు స్మరించదగినవి. అధికార సూత్రాలూ సమాసాలూ, తద్ధితాలూ వంటి ఒక వ్యాకరణాంశానికి సంబంధించిన సూత్రాల మొదట ఉండి, అనువృత్తి ద్వారా వాటి తరవాత వచ్చే కొన్ని సూత్రాలలోకి వ్యాపిస్తూ, అవి ఏ విభాగం కిందకి వస్తాయో సూచిస్తాయి. ఉదాహరణకి 'ప్రాక్కడారాత్ సమాసః' (2.1.3) అనే అధికార సూత్రం దీని తరవాత 'కడారాః కర్మధారయే' (2.2.38) అనే సూత్రం వరకూ ఉన్న సూత్రాలు సమాసాలకి సంబంధించినవి అని సూచిస్తుంది.

## 19.3 వర్ణం–సవర్ణం–సంధివర్ణం

పాణినీయానికి ఆధార భూతాలైనవి పదునాలుగు మహేశ్వర సూత్రాలనే విషయం అందరికీ తెలిసినదే. (18.3). ఈ సూత్రాలలో అక్షర సమామ్నాయంలోని అక్షరాలు పదునాలుగు సముదాయాలుగా విభజింపబడి ఒక్కొక్క సముదాయం చివర ప్రత్యాహారం కోసం ఇత్సంజ్ఞలు చేర్చబడ్డాయి. వీటిలో వర్ణాలు అక్షర సమామ్నాయంలో ఉన్న క్రమంలో కాక చాలాచోట్ల క్రమం మార్చి కూర్చబడ్డాయి. అక్షర సమామ్నాయంలో వర్ణాలు స్థాన ప్రయత్న భేదాన్ని అనుసరించి ధ్వని శాస్త్రానుసారంగా 'క' వర్గ, 'చ' వర్గ మొదలైన వరసలో కూర్చబడ్డాయి కాని, పాణిని మహర్షి మహేశ్వర సూత్రాలు అనబడే

వాటిలో వర్ణాలని వ్యాకరణ రచనకి అనువైన రీతిగా క్రమం మార్చి ఇచ్చారు. ఉదాహరణకి 'హయవరట్, లణ్' అనే సూత్రాలలో వర్ణాల క్రమం గమనించవచ్చు. ఇంతేకాకుండా హకారం 'హయవరట్' సూత్రంలోనూ 'హల్' సూత్రంలోనూ రెండుసార్లు వచ్చింది. దీనికి కారణం హకారం సంధిలో కొన్నిచోట్ల కొన్ని వర్ణాలతోనూ, మరికొన్నిచోట్ల మరికొన్ని వర్ణాలతోనూ తుల్యంగా ప్రవర్తించడమే. మహాభాష్యంలో పూర్వ హకారం 'అట్', 'హశ్' ప్రత్యాహారాల కోసమూ, పర హకారం 'రల్', 'శల్', 'వల్', 'ఝల్' ప్రత్యాహారాల కోసమూ ఉపదేశించబడినట్లు చెప్పబడింది. మాహేశ్వర సూత్రాలు వ్యాకరణంలో సాధించవలసిన సంధుల కోసం కూర్చబడినవి కాని, సంస్కృత భాషలోని వర్ణాల పట్టిక ఇవ్వడానికి ఉద్దేశించబడినవి కావు. వాటిలోని అంశాలు 'వర్ణాలు' అనడం కన్న 'సంధి వర్ణాలు' అనడం సముచితం.

మాహేశ్వర సూత్రాలలో ఆ, ఈ, ఊ, ఋూ అనే దీర్ఘాచ్చులు లేవు. సంధిలో చాలాచోట్ల హ్రస్వాచ్చులూ, దీర్ఘాచ్చులూ తుల్యంగా ప్రవర్తించడం వల్ల హ్రస్వాచ్చులు దీర్ఘాచ్చులకి కూడా గ్రాహకాలని 'అణుదిత్ సవర్ణస్య చాప్రత్యయః' (1-1-69) అనే సూత్రం చెప్తుంది. అవసరమైనచోట్ల తపర కరణం దీర్ఘాచ్చులకీ హ్రస్వాచ్చులకీ భేదం సూచించబడింది; 'తపర స్తత్కాలస్య' (1-1-70). వీటిలో విసర్జనీయం, ఉపధ్మానీయం (ఃప), జిహ్వామూలీయం (ఃక), అనుస్వారం కూడా చేర్చబడలేదు. ఈ ధ్వనులకి పాణినీయ శిక్షలో 'పరాశ్రయాలు' (అనుస్వారో విసర్గశ్చ ఃకః పౌ చాపి పరాశ్రయౌ) లేక 'అయోగ వాహాలు' అని పేర్లు ఉన్నాయి. పతంజలి మహర్షి 'అయోగ వాహాలు' అంటే 'ఉపదేశించకపోయినా భాషలో వినబడేవి' అని అర్థం చెప్పేరు. (య దయుక్తా వహంత్యనుపదిష్టాశ్చ శ్రూయన్తే). వీరి మతంలో ఆనునాసిక్యానికీ యమ హల్లులకీ (అంటే కొన్ని సందర్భాలలో పాక్షికంగా ద్విత్వం పొందే హల్లులు) కూడా ఈ సంజ్ఞ వర్తిస్తుంది. వాజసనేయా ప్రాతిశాఖ్య వ్యాఖ్యాత అయిన ఉవటుని మతంలో 'అయోగ వాహాలు' అంటే అకారాది వర్ణాల యోగంతో ఉచ్చరించ బడేవి, స్వయంగా ఉచ్చారణ యోగ్యాలు కానివి అని అర్థం. వీటిలో మొదటి మూడూ హకారానికీ, అనుస్వారం మకారానికీ రూపాంతరంగా కొన్ని సందర్భాలలో వస్తాయి. పాణిని మహర్షి యీ విషయం తమ వ్యాకరణంలో

సూచించేరు కాని వాటికి ప్రత్యేక ప్రతిపత్తి ఇవ్వలేదు. ఆధునిక భాషా శాస్త్రం ప్రకారం కూడా ఇటువంటి పరాశ్రయాలైన ధ్వనులకి వర్ణ ప్రతిపత్తి ఉండదనీ, వీటిని 'సవర్ణాలు' అంటారనీ నాలుగో అధ్యాయంలో చూశాం.

## 19.4 సంధి

పాణిని మహర్షి పూర్వం శిక్షాప్రాతిశాఖ్యలలో ధ్వనుల ఉత్పత్తి, స్థానకరణ ప్రయత్నాలు మొదలైన విషయాలను వివరించే ధ్వని శాస్త్రం పరిపూర్ణంగా వృద్ధి పొందింది. ఆకాలంలో ఐంద్ర వ్యాకరణమనే పేరుగల వ్యాకరణం కూడా ఉన్నట్లు పతంజలి మహాభాష్యంలో చెప్పేరు. కాని ఈ ఐంద్ర వ్యాకరణం సూత్ర రూపంలో కాక భాషలోని ప్రతి శబ్దానికీ గల భిన్న రూపాలని పారాయణ చేసేవిధంగా ఉండేదనీ, అందువల్ల దానిని పూర్తిగా నేర్చుకోవడానికి ఇంద్రుడికి కూడా సాధ్యం కాలేదనీ వారి వాక్యాలవల్ల తెలుస్తుంది. కాబట్టే అది నిజమైన వ్యాకరణం కాదనే చెప్పాలి. సూత్ర రూపమైన వ్యాకరణం పాణిని మహర్షికి కొంచెం ముందు కాలానికి చెంది, వారిచే స్మరించబడిన గార్గ్య గాలవ శాకటాయన చాక్రవర్మణాదులచే ప్రారంభించబడి, పాణిని మహర్షి చేతిలో శాస్త్రీయతనీ, సంపూర్ణతనీ పొందినదని చెప్పవచ్చు.

మన కాలానికి ముందే ధ్వని శాస్త్రం వృద్ధి పొంది ఉండడంవల్లా, వ్యాకరణం ధ్వని శాస్త్రం కన్న భిన్నమైనదవడంవల్లా పాణిని మహర్షి అష్టాధ్యాయిలో ధ్వనులని గురించి చర్చించలేదు. అష్టాధ్యాయిలో 'ముఖనాసికావచనోऽనునాసికః' (1.1.8) అనే అనునాసిక సంజ్ఞని వివరించే సూత్రమొక్కటే ధ్వనులకి సంబంధించినదని అంటారు. కాని అష్టాధ్యాయిలో సంధి విధానానికి అవసరమైనచోట్ల ధ్వని శాస్త్ర సిద్ధాంతాలు ఉపయోగించ బడ్డాయి. ఉదాహరణకి 'తుల్యాస్య ప్రయత్నం సవర్ణం' (1.1.9) సదృశమైన ఆస్య ప్రయత్నం గల వర్ణాలు సవర్ణాలు', స్థానేऽంతరతమః' (1.1.50) 'స్థానిక వర్ణానికి సదృశతమమైన వర్ణం ఆదేశంగా వస్తుంది' మొదలైన సూత్రాలు తీసుకోవచ్చు. ఒక వర్ణానికి సవర్ణమైన వర్ణాలనీ, సదృశతమమైన వర్ణాలనీ నిర్ణయించడానికి మనకి ధ్వని శాస్త్రమే ఆధారం.

ఒక పదంలోని ధ్వనులు ఆ పదానికిగాని లేక వాక్యంలో దానిపక్కనున్న పదాలకి గాని చెందిన సమీప ధ్వనుల వల్ల మార్పు చెందుతాయి అనేదే సంధి ప్రక్రియ మూలసూత్రం. సంస్కృత వైయాకరణులు సంధి ప్రక్రియని క్షుణ్ణంగా చిన్న చిన్న అంశాలతో సహా వివరించారు. కాని ప్రాచీన గ్రీక్, రోమన్ వైయాకరణుల గ్రంథాలలో దీనిని గురించిన చర్చ లేదు. సంధిలో పదమధ్య సంధి, పదాంత సంధి అని రెండు రకాలు ఉన్నాయి. ఒక వర్ణమే పద మధ్య సంధిలో ఒకవిధంగానూ, పదాంత సంధిలో వేరొక విధంగానూ ప్రవర్తిస్తుంది. ఉదాహరణకి సంస్కృతంలో పదాంతమైన మకారం హల్లుకి ముందు అనుస్వారంగా మారుతుంది (మోఽనుస్వారః 8.3.23) : హరిం వందే; కాని పద మధ్యంలో మకారం అనుస్వారంగా మారదు; గమ్యతే.

సంధి ప్రక్రియలో కొన్ని సదృశ వర్ణాలు తుల్యంగా ప్రవర్తిస్తాయి. అనే విషయం కూడా సంస్కృత వైయాకరణులు గుర్తించారు. ఇటువంటి సదృశ వర్ణాలకి లాఘవార్థం సంజ్ఞ ఏర్పరచడమే మాహేశ్వర సూత్రాల ప్రయోజనమని పైన (18.3) చూశాం. కాబట్టి వీలైనంత వరకూ వారు ఒక్కొక్క వర్ణానికి వచ్చే మార్పుల్ని వర్ణ సముదాయాలకి వచ్చే తుల్యమైన మార్పులుగా వర్ణించారు. ఉదాహరణకి 'అకస్సవర్ణే దీర్ఘః' (6.1.101) అనే సవర్ణదీర్ఘ సంధి సూత్రం తీసుకోవచ్చు. ఇందులో అ, ఇ, ఉ, ఋ, ఌ అనే అయిదు అచ్చులకి సవర్ణం పరమైతే రెండింటికీ దీర్ఘం ఏకాదేశ మవుతుందని చెప్పబడింది. పాణిని మహర్షి అయిదు అచ్చులకీ అయిదు సూత్రాలు వ్రాయకుండా వీటిలో గల సాధారణాంశాన్ని ఒకే సూత్రంగా చెప్పడం భాషా శాస్త్రజ్ఞులు మెచ్చుకోవలసిన విషయం. ఇటువంటిదే 'ఙమో హ్రస్వాదచి ఙముణ్నిత్యం' (8.3.32) 'పదాంతంలో హ్రస్వాచ్చు తరవాత ఉన్న ఙ, ణ, న అనే మూడు అనునాసికాలకీ సంబంధించిన సంధి ఒకటిగా వర్ణించబడింది. వర్గానుసారంగా 'ఙ, ఞ, ణ, న, మ' అని ఉండవలసిన వరస ఈ సూత్రం కోసమే 'ఞమఙణనమ్' అనే మాహేశ్వర సూత్రంలో మార్చబడిందని గమనించాలి. ఇలా మార్చడం వల్లనే ఙ, ణ, న, లు మూడింటికీ ఙమ్ అనే ప్రత్యాహారం చెయ్యడానికి వీలయింది. సాధారణీకరణం సాధ్యం కానప్పుడు మాత్రమే 'హోఢః' ('హకారానికి పదాంతంలోనూ ఝల్ పరమైనప్పుడూ

మాటలలో విభక్తి ప్రత్యయం లోపించినా అవి సుప్తిజన్తం పదం (1.4.14) అనే సూత్రం వల్ల పదసంజ్ఞ కలవే అవుతాయి. ఉచ్చైః నీచైః, సాయం, చిరం మొదలైన అవ్యయాలు కూడా వాటి తరవాత వచ్చే స్త్రీ ప్రత్యయ, విభక్తి ప్రత్యయాలు లోపించినా పద సంజ్ఞ గలవే అవుతాయి. దీనివల్ల లోపాన్ని కూడా పాణిని ఒకవిధమయిన ప్రత్యయ రూపంగా తీసుకొన్నారని తెలుస్తుంది. అదర్శనం లోపః (1.1.60) 'కనపడక పోవడం, అంటే వర్ణ వినాశమే (కాని ప్రత్యయ వినాశం కాదు) లోపం' అనే సూత్రం కూడా ఈ ఉద్దేశాన్నే బలపరుస్తుంది. ప్రత్యయం కనపడకపోయినా దానికి సంబంధించిన వ్యాకరణ కార్యాలు జరుగుతూ ఉండడమే పాణిని మహర్షి లోప విధానాన్ని అవలంబించ డానికి మార్గదర్శకమై ఉండవచ్చు.

## 19.6 ఆర్థిక సంవర్గాల ప్రాధాన్యం

ఆధునిక భాషా శాస్త్రంలో అతి నవీనమైనదీ, పటిష్ఠమైనదీ అయిన శాఖ పరివర్తన (ఉత్పాదన) వ్యాకరణం. దీనిలో వాక్య నిర్మాణానికీ అర్థ నిర్మాణానికీ మిగిలిన శాఖలలో కన్న ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వబడుతోంది. ఈ శాఖకు చెందిన భాషా శాస్త్రజ్ఞుల అభిప్రాయంలో ఒక భాషకి ఉన్న వ్యాకరణం అంటే ఆ భాషా నిర్మాణానికి ఆధారభూతమైన సిద్ధాంతం. వీరి దృష్టిలో ప్రతి భాషకీ మూలమైన వక్తృమనోగతమైన అర్థ నిర్మాణమూ, వ్యవహారంలో ధ్వనిరూపం గాని లిపి రూపం గాని అయిన బహిరంగ నిర్మాణమూ ఉంటాయి. అర్థ నిర్మాణాన్ని ఆలంబనగా తీసుకొని దానితో ప్రారంభమై దానికి తగిన బహిరంగ నిర్మాణాన్ని సాధించేది లేక ఉత్పత్తి చేసేదే వ్యాకరణమని వీరు నమ్ముతారు.

పరివర్తన వ్యాకరణవేత్తల దృష్టిలో వ్యాకరణానికీ అష్టాధ్యాయికీ చాలా దగ్గర పోలికలు ఉన్నాయనే మాట ఆశ్చర్యకరమైనా సత్యమే. అష్టాధ్యాయీ నిర్మాణం చూస్తే ఈ విషయం మనకి స్పష్టమవుతుంది. అష్టాధ్యాయి మొదటి అధ్యాయాలలో అర్థ నిర్మాణాన్ని వివరించే సూత్రాలు ఉన్నాయి. అంటే, ఆత్మనే పదం, పరస్మై పదాలు ఏ అర్థాలలో వాడతారు, ఒక్కొక్క విభక్తి ప్రత్యయం ఏయే అర్థాలలో వాడతారు, ఎటువంటి అర్థాలల్లో పదాలు ఒకదానితో ఒకటి సమసిస్తాయి మొదలైనవి. ఈ అర్థాలకు సంబంధించిన

ప్రత్యయాలూ, వాటి భిన్న రూపాంతరాలూ, ఉదాత్తానుదాత్త స్వరిత స్వరాలకి సూత్రాలూ, సంధి సూత్రాలూ మొదలైన బహిరంగ నిర్మాణానికి సంబంధించిన విషయాలు అష్టాధ్యాయి చివరి భాగంలో ఇవ్వబడ్డాయి. ఇంతేకాకుండా ప్రత్యయాలని విధించే సూత్రాలు 'ఈ ప్రత్యయానికి అర్థం ఇది' అని కాకుండా 'ఈ అర్థాన్ని వాచ్యం చెయ్యడానికి ఈ ప్రత్యయం వస్తుంది' అనేవిధంగా ఉంటాయి. ఉదా. బహుషు బహువచనం 1.4.21 'బహుత్వాన్ని ద్యోత్యం చెయ్యడానికి బహువచన ప్రత్యయం వస్తుంది'. వర్తమానే లట్ 3.2.123 'వర్తమానాన్ని ద్యోత్యం చెయ్యడానికి లట్ వస్తుంది', దీనివల్ల పాణిని మహర్షి వ్యాకరణాన్ని అర్థ నిర్మాణానికి తగిన బహిరంగ నిర్మాణాన్ని ఉత్పత్తి చేసే సాధనంగా పరిగణించారని మనం తెలుసుకోవచ్చు.

## 19.7 కారక సిద్ధాంతం

అష్టాధ్యాయిలో రచనా పద్ధతి 'ఫలానా అర్థంలో ఫలానా ప్రత్యయం వస్తుంది' అనేవిధంగా ఉంటుంది అని పైన చూశాం. (నామ) విభక్తి ప్రత్యయాలకు గల అర్థాలను వర్గీకరించడానికే కారక ప్రక్రియ సృష్టించబడింది అని చెప్పవచ్చు. కారకం అంటే వాక్యంలో నామ పదాలకీ క్రియకీ మధ్య గల పరస్పర సంబంధం అని స్థూలంగా చెప్పవచ్చు (క్రియా న్వయత్వం కారకత్వం). దీనివల్ల రెండు నామాల మధ్య గల సంబంధాన్ని తెలిపే షష్ఠీ విభక్తి కారకం కాదని తెలుస్తుంది. పాణిని చేసిన కారక విభాగం సంస్కృతానికే కాక అన్ని భాషలకీ వర్తిస్తుంది. కాబట్టి ఇది విశ్వజనీన లక్షణం (Universal Feature) అని చెప్పవచ్చు. అష్టాధ్యాయిలో ఆరు రకాల కారకాలు ఉన్నాయి. అవి పాణిని ఇచ్చిన వరసలో – 1. అపాదానం (ధ్రువమపాయేఽపాదానం 1.4.24 'విశ్లేషం సంభవించినపుడు దేనినించి విశ్లేషం జరుగుతుందో (ధ్రువం) అది అపాదానం'; ఈ అర్థంలో సాధారణంగా పంచమీ విభక్తి వస్తుంది; పర్వతాత్ అవరోహతి). 2. సంప్రదానం (కర్మణా య మభిప్రైతి స సంప్రదానం 1.4.32 'కర్మచేత కర్త ఎవరిని ఉద్దేశిస్తాడో ఆ కారకం సంప్రదానం'; ఈ అర్థంలో సాధారణంగా చతుర్థీ విభక్తి వస్తుంది. విప్రాయ గాం దదాతి), 3. కరణం (సాధకతమం కరణం 1.4.42. 'క్రియాసిద్ధిలో ప్రకృష్టోపకారకంగా వివక్షించబడినది కరణం'. ఈ అర్థంలో

సాధారణంగా తృతీయా విభక్తి వస్తుంది. పరశునాచ్ఛినత్తి). 4. అధికరణం (ఆధారోఽధికరణం 1.4.45 'కర్తకిగాని కర్మకిగాని ఆధారమయినది అధికరణం'. ఈ అర్థంలో సాధారణంగా సప్తమీ విభక్తి వస్తుంది. కటే, శేతే, స్థాల్యాం పచతి). 5. కర్మ (కర్తు రీప్సితతమం కర్మ 1.4.49. 'కర్తకి ఇష్టతమమైనది కర్మ', తథాయుక్తం చానీప్సితం 1.4.50 'కర్మకి ఇష్టతమమయిన దానికీ క్రియకీ గల సంబంధం వంటి సంబంధం గల అనిష్టమైనది కూడా కర్మ అవుతుంది'. అకథితంచ 1.4.51 'అపాదానాది కారకాలచే చెప్పబడనిది కూడా కర్మ అవుతుంది. ఈ అర్థంలో సాధారణంగా ద్వితీయా విభక్తి వస్తుంది. కటం కరోతి, విషం భక్షయతి, గాం దోగ్ధిపయః). 6. కర్త (స్వతంత్రః కర్తా 1.4.54 'క్రియాసిద్ధిలో స్వాతంత్ర్యం ఉన్నదిగా వివక్షించబడినది కర్త'. తత్ప్రయోజకో హేతుశ్చ 1.4.55 'కర్తకి ప్రయోజకమైనది కర్తా, హేతువూ అవుతుంది. ఈ అర్థంలో సాధారణంగా తృతీయా విభక్తి వస్తుంది. దేవదత్తేన కృతం, దేవదత్తేన యజ్ఞదత్తేన కారితం).

కారకాలకి పైన ఇచ్చిన అర్థాలు సాధారణమైనవి అని గమనించాలి. కొన్ని సందర్భాలలో ఈ కారకాలకి ప్రత్యేకార్థాలు కూడా ఉన్నాయి. ఉదాహరణకి స్పృహధాతువు ఉన్న వాక్యంలో కర్తకి ఈప్సితమైనది సంప్రదానమవుతుంది (స్పృహేరీప్సితః 1.4.36 : పుష్పేభ్యః స్పృహయతి). కారకాలకీ విభక్తులకీ స్థిర సంబంధం లేదు. వాక్య నిర్మాణానుసారంగా ఒకే కారకం భిన్న విభక్తులవల్ల వ్యక్తీకరించబడుతుంది. అనభిహితే 2.1.1 సూత్రం వల్ల తిఙ్, కృత్, తద్ధిత, సమాసాల వల్ల కర్మాదులు చెప్పబడకపోతే ద్వితీయాది విభక్తులు వస్తాయనీ, చెప్పబడితే ప్రథమా విభక్తే వస్తుందనీ తెలుస్తుంది. ఉదాహరణకి క్రియతే కటః, ఇక్కడ క్రియావిభక్తి (తిఙ్) వల్ల కర్మ చెప్పబడింది కాబట్టి కర్మార్థంలో ప్రథమే వచ్చింది. కాని కటం కరోతి అనేచోట క్రియా విభక్తి వల్ల కర్మ చెప్పబడలేదు కాబట్టి కర్మార్థంలో ద్వితీయ వచ్చింది. ఇంతేకాకుండా పతంజలి 'వివక్షాతః కారకాణి భవన్తి' అనీ చెప్పినట్లు వక్తృవివక్షని అనుసరించి కారకాలు వస్తాయి. దేవదత్తః స్థాల్యాం పచతి – ఇందులో స్థాలి అధికరణంగా వివక్షించబడింది కాబట్టి దానికి సప్తమీ విభక్తి వచ్చింది. కాని స్థాలినే కర్తగా వివక్షించి 'స్థాలీ పచతి' అనికూడా అనవచ్చు. తెలుగులో 'ఈ

గిన్నె శేరు బియ్యం ఉడుకుతుంది', 'ఈ పెన్ను బాగా రాస్తోంది' అన్నట్లు. మహాభాష్యకర్త మంత్రులు రాజు ఉన్నప్పుడు అస్వతంత్రులై ఆయన లేనప్పుడు స్వతంత్రులైనట్లు అసలు కర్త ఉన్నప్పుడు మిగిలిన కారకాలు అస్వతంత్రాలై అది లేనప్పుడు స్వతంత్రాలై ప్రథమా విభక్తిని పొందుతాయి అని చెప్పేరు (ఏవం తర్హి ప్రధానేన సమవాయే స్థాలీ పరతంత్రా, వ్యవాయే స్వతంత్రా; తద్యథా - అమాత్యానాం రాజ్ఞాసహ సమవాయే పారతంత్ర్యం, వ్యవాయే స్వాతంత్ర్యం). రామేణ బాణేన హతో వాలీ, రామో బాణేన వాలిన మహనత్ - ఈ రెండు వాక్యాలలో రామ వాలి శబ్దాలు భిన్న విభక్తులలో ఉన్నా ఈ వాక్యాల అర్థం ఒకటే. ఈ సత్యాన్ని నిరూపించడానికే కారక ప్రక్రియ ఉపయోగిస్తుంది - రెండింటిలోనూ రామశబ్దం కర్తృకారకంలోనూ వాలి శబ్దం కర్మ కారకంలోనూ మార్పు లేకుండా ఉన్నాయి. పై చర్చవల్ల కారకాలు స్థిరమైనవనీ అవి అర్థ నిర్మాణానికి చెందినవనీ, వాటిని వ్యక్తీకరించే భిన్న విభక్తులు బహిరంగ నిర్మాణానికి చెందినవనీ పాణిని ఉద్దేశించినట్లు తెలుస్తుంది. ఆధునిక భాషా శాస్త్రజ్ఞులు కారక సిద్ధాంతాన్ని ప్రశంసించి, దీనికి భాషా శాస్త్రంలో స్థానం కల్పించారు.

## 19.8 వాక్య నిర్మాణ పరిశోధన

సంస్కృత వ్యాకరణంలో వాక్య నిర్మాణాన్ని గూర్చి చర్చ లేదని ఇటీవలి కాలందాకా పాశ్చాత్య పండితులు అంటూ ఉండేవారు. వారి ఈ అభిప్రాయం తప్పు అనీ వారి భ్రమకి కారణం సంస్కృత భాషలో వాక్యంలో పదక్రమం ఇంగ్లీషులో వలె స్థిరమైనది కాకపోవడమేననీ ఇప్పటి పండితులకి తెలిసింది. భాషా శాస్త్రంలోకూడా వాక్య నిర్మాణాన్ని గురించిన పరిశోధన ఇటీవలనే వృద్ధి చెందింది. వాక్య నిర్మాణతత్వం తెలిసిన తరవాతనే పండితులకి అష్టాధ్యాయిలో కూడా వాక్య నిర్మాణ చర్చ ఉంది అని తెలిసింది. అష్టాధ్యాయిలో అవసరమైనచోట్ల పదక్రమాన్ని గురించిన చర్చ కూడా ఉంది. ఉదాహరణకి ఉపసర్గలు లౌకిక భాషలో ధాతువుకి ముందు వస్తాయి. వైదిక భాషలో అవి ధాతువుకి ముందుకాని వెనుకకాని రావచ్చు. వాటిమధ్య ఇతర పదాల వ్యవధానం కూడా ఉండవచ్చు. ఈ విషయమే ఈ సూత్రాలలో

ప్రత్యయం అణ్ః వసిష్ఠేన దృష్టం సామ – వాసిష్ఠం; దీని తరవాత కలేర్ఢక్ 4.2.8 అనే అపవాద సూత్రం వల్ల కలినాదృష్టం సామ–కాలేయం అని ఢక్ ప్రత్యయం 'దృష్టంసామ' అనే అర్థంలో వస్తుంది. పాణిని దృష్టిలో అణ్, ఢక్ ప్రత్యయాలకి రూపభేదం ఉన్నా అవిరెండూ అర్థం దృష్ట్యా ఒకటేనని దీనివల్ల స్పష్టం.

3. సమాసాలు : రెండు సమానార్థకమైన[3] పదాలు (బహువ్రీహిలో మాత్రం రెండు లేక అంతకన్న ఎక్కువ పదాలు) ఏ సందర్భాలలో సమసిస్తాయో వివరించే సూత్రాలు అష్టాధ్యాయిలో రెండో అధ్యాయం మొదటి రెండు పాదాలలో ఉన్నాయి. సమాసాలని విధించే సూత్రాలు 'ఫలానా పదం ఫలానా పదంతో సమసిస్తుంది' అనేవిధంగా ఉంటాయి : పంచమీ భయేన 2.1.37, విశేషణం విశేష్యేణ బహులం 2.1.57. సూత్రంలో ప్రథమా విభక్తిలో ఉన్న పదమే సమాసంలో మొదట వస్తుంది. సమాసంలో పదాలకి ఉన్న విభక్తులు లోపిస్తాయి. (సుపోధాతు ప్రాతిపదికయోః 2.4.71). ఈ సూత్రం వల్లనే సమాసాలకి వాటి విగ్రహ వాక్యాలు ప్రాతిపదికలుగా తీసుకోబడ్డాయని తెలుస్తుంది. దీనికి ఇంకా దృష్టాంతం కావాలంటే ఉపమితం వ్యాఘ్రాదిభిః సామాన్యా ప్రయోగే 2.1.56 'ఉపమితం వ్యాఘ్రాది శబ్దాలతో సామాన్య ధర్మం ప్రయోగింపబడనప్పుడు సమసిస్తుంది' అనే సూత్రం తీసుకోవచ్చు. దీనివల్ల పురుషః వ్యాఘ్ర ఇవ = పురుష వ్యాఘ్రః అవుతుంది; కాని పురుషః వ్యాఘ్ర ఇవ శూరః అనేదాంట్లో సామాన్య ధర్మం (శూరః) ఉంది కాబట్టి దీనినించి సమాసం నిష్పన్నం కాదు.

4. ఏకశేషం : సంస్కృతంలో ఒకేమాట దాని అర్థాన్నీ దానితో కూడిన మరొకమాట అర్థాన్నీ కూడా సహితంగా కొని సందర్భాలలో సూచిస్తుంది : పితరౌ = మాతాపితరౌ (పితామాత్రా 1.2.70), భ్రాతరౌ =

---

3. సమర్థః పదవిధిః 2.1.1. 'పదవిధి సమర్థాశ్రితమై ఉంటుంది'. 'సమర్థమైన పదాలు' అంటే మూల వాక్యంలో సన్నిహితావయవాలు (Immediate constituents) అని భాషా శాస్త్రం ప్రకారం అర్థం చెప్పడం సమంజసమని తోస్తుంది.

భ్రాతాచస్వసాచ, పుత్రౌ = పుత్రశ్చ దుహితాచ (భ్రాతృపుత్రౌ స్వసృ దుహితృభ్యాం 1.2.68) ఇటువంటివి సాధించడానికి పాణిని పైన సూచించినట్లు – పితామాత్రా 1.2.70 'మాతృశబ్దంతో కూడినప్పుడు పితృశబ్ద మొక్కటే విభాషగా మిగులుతుంది' – ఇలా రెండు శబ్దాలూ గల నిర్మాణం నించి దానికి తుల్యమైన అర్థం గల ఒక శబ్దాన్ని ఏకశేషం (రెండింటిలో ఒకటి మిగలడం) ద్వారా సాధించారు. భ్రాతరౌ అనే వృత్తిలో గల అనేకార్థత దీనికి మూలమైన విగ్రహ వాక్యాల (భ్రాతాచ భ్రాతాచ, భ్రాతాచ స్వసాచ)లో లేదు.

5. సనాద్యంత రూపాలు : సనాది ప్రత్యయాలు 3.1.5–30 సూత్రాలలో ఇవ్వబడ్డాయి. ఇవి నామ పదాలకి గాని ధాతువులకి గాని 'ఇచ్ఛ', 'ఆచారం మొదలైన అర్థాలలో చేరి క్రియా ప్రత్యయాలని పొందడానికి తగినవి అవుతాయి. వీటిని సాధించడానికికూడా పాణిని అర్థానికి సన్నిహితమైన పూర్ణ వాక్యాన్నే మూలంగా గ్రహించారు. ధాతోః కర్మణః సమాన కర్తృకా దిచ్ఛాయాం వా 3.1.7 'ఇష్ ధాతువుకి కర్మయై దానితో సమాన కర్తృకమైన ధాతువుకి ఇచ్ఛార్థంలో విభాషగా సన్ ప్రత్యయం వస్తుంది'. కర్తుం ఇచ్ఛతి = చికీర్షతి; ఉపమానా దాచారే 3.1.10 'కర్మ అయి ఉపమానమైన సుబంతానికి ఆచారార్థంలో విభాషగా క్యచ్ ప్రత్యయం వస్తుంది'; పుత్రమివ ఆచరతి ఛాత్రం = పుత్రీయతి ఛాత్రం.

## 19.9 సూత్రాల క్రమం

ఆధునిక భాషా శాస్త్రంలో సంధి ప్రక్రియకి సంబంధించిన సూత్రాలూ, పరివర్తన సూత్రాలూ ఒక నిర్దిష్ట క్రమంలో ప్రవర్తించేటట్లు చేస్తే అది వ్యాకరణంలో శాస్త్రీయతనీ లాఘవాన్నీ సాధిస్తుందని చెప్పారు. (చూ. 5.5) అష్టాధ్యాయిలో కూడా సూత్రాల క్రమానికి ప్రాధాన్యం ఉంది. విప్రతిషేధే పరం కార్యం 1.4.2 'తుల్యబల విరోధం గల రెండు సూత్రాలు ఒకచోట ప్రవర్తించడానికి అవకాశం ఉంటే వాటిలో పరమైనదే ప్రవర్తిస్తుంది' అనే

* ఈ సూత్రం మొత్తం అష్టాధ్యాయి అంతకీ వర్తించనక్కర్లేదనీ, ఇది ప్రథమాధ్యాయం చతుర్థ పాదానికి మాత్రమే పరిమితమనీ ఫాడెగన్, కర్డోనా వంటి ఆధునికుల అభిప్రాయం. (చూ. కర్డోనా 1976:190)

పరిభాష. అష్టాధ్యాయి అంతటికీ వర్తిస్తుందో. 'వృక్షేభ్యః' అనే పదం సాధించడంలో 'వృక్ష' అనే దానికి సుపిచ 7.3.102 అనేదానివల్ల ఆకారానికి దీర్ఘమూ, బహువచనే ఝుల్యేత్ 7.3.103 అనే దానివల్ల దానికి ఏకారమూ ప్రాప్తించడానికి అవకాశం ఉండగా ఈ రెండింటిలో పరమైన బహువచనే ఝుల్యేత్ అనే సూత్రమే ప్రవర్తిస్తుంది.

ఇంతేకాకుండా అష్టాధ్యాయి ఎనిమిదో అధ్యాయంలో 2, 3, 4 పాదాలను త్రిపాది అంటారు. పూర్వత్రా సిద్ధం 8.2.1 అనే సూత్రం సపాద సప్తాధ్యాయీ సూత్రాలు ప్రవర్తించడానికి త్రిపాది అసిద్ధమనీ (అంటే త్రిపాదిలో ఒక సూత్రం ప్రవర్తించిన తరవాత అవకాశమున్నా సపాద సప్తాధ్యాయీ సూత్రాలు ప్రవర్తించవు). త్రిపాదిలో కూడా పూర్వ సూత్రం వర్తించడానికి పరసూత్రం అసిద్ధమనీ చెప్తుంది. అసౌ+ఆదిత్యః = అసావాదిత్యః (ఏచోఽయ వాయావః 6.1.78) = అసా ఆదిత్యః (లోపః శాకల్యస్య 8.3.19). ఇక్కడ అకస్సవర్ణే దీర్ఘః 6.1.101 ప్రవర్తించడానికి వీలున్నా వకార లోపానికి కారణమైన సూత్రం త్రిపాదిలోది కాబట్టి దాని తరవాత ఇది ప్రవర్తించదు. అదేవిధంగా రాజన్+భిః = రాజభిః (నలోపః ప్రాతిపదికాంతస్య 8.2.7) ఇప్పుడు అతో భిస ఐస్ 7.1.9 'హ్రస్వ ఆకారం తరవాత భిస్‌కి ఐస్ ఆదేశమవుతుంది' అనే సూత్రం ప్రవర్తించడానికి అవకాశం ఉన్నా న లోపానికి కారణమైన సూత్రం త్రిపాదిలోది కాబట్టి దాని తరవాత ఇది ప్రవర్తించదు. త్రిపాదిలో సూత్రాలన్నీ క్రమబద్ధమైనవీ, పదాంత పదమధ్య సంధులకి సంబంధించినవీ. సపాద సప్తాధ్యాయీ, త్రిపాదీ విభజనవల్ల పాణిని సంధి ప్రక్రియా వర్ణనలో శాస్త్రీయతని సాధించడం. "పాణిని పద్ధతి తరచు ఆశ్చర్యకరంగా, నవీనంగా ఉంటుంది" అన్న ప్రొఫెసర్ రెనూ వర్ణనకు ఒక మంచి ఉదాహరణ.

# ముఖ్యాధార గ్రంథ పట్టిక

## (సంగ్రహ వ్యాఖ్యలతో కూడినది)

Allen, William Sidney. 1953. Phonetics in Ancient India. London : Oxford University Press. (reprint 1963)
ఇది మన శిక్షా ప్రాతిశాఖ్యాలలో ధ్వనిశాస్త్ర సిద్ధాంతాలని సమీక్షిస్తూ అవి ఆధునిక కాలంలో ధ్వని శాస్త్ర సిద్ధాంతాలకి ఎలా ప్రాతిపదికలు అయ్యాయో వివరిస్తుంది.

Antilla, Raimo, 1972. An Introduction to Historical and Comparative Linguistics. New Yark : Macmillan.
ఇది చారిత్రక వ్యాకరణ సిద్ధాంతాలని కూలంకషంగా వివరించే ఉన్నత స్థాయి గ్రంథం.

Arlotto, Anthony, 1972. Introduction to Historical Linguistics. Boston : Houghton Mifflin.
ఇది చారిత్రక వ్యాకరణ సిద్ధాంతాలని సులభ శైలిలో వివరించే గ్రంథం.

Bach, Emmon and Harms, Robert T. (eds.) 1968. Universals in Linguistic Theory, New York : Holt.
ఇది ఉత్పాదక వ్యాకరణ నవీన సిద్ధాంతాలని ప్రతిపాదించిన కొన్ని వ్యాసాల సంకలనం.

Baker, Carl L. 1978. Introduction to Generative-Transformational Syntax. New Jersey : Prentice-Hall, Inc.
ఇది ఉత్పాదక వ్యాకరణ సిద్ధాంతాలని అత్యాధునిక ప్రతిపాదనలతో సహా కూలంకషంగా చర్చించే గ్రంథం.

Bauer, Laurie, 1988. Introduction Linguistic Monphology. Edinburgh

: University Press.
ఇది పద నిర్మాణ శాస్త్రంలో నూతనాంశాలతో కూడిన గ్రంథం.

Belvalkar, Sripad krishna. 1915. An accont of the different existing systems of Sanskrit grammar, being the Vishwanath Narayan Mandlik gold medal prize essay for 1909. Poona.
ఇది సంస్కృత భాషలో వైయాకరణులను గురించీ, వారి గ్రంథాల స్వరూప స్వభావాలను గురించి సంగ్రహంగా వివరిస్తుంది.

Bloch, B. and Trager, G.L. 1942. (Indian Edition 1972). Outline of Linguistic Analysis. Baltimore : Linguistic Society of America.
ఇది ఆధునిక వర్ణనాత్మక వ్యాకరణ సిద్ధాంతాలని సంగ్రహ శైలిలో వివరించే గ్రంథం.

Bloomfield, Leonard, 1933. Language. New York : Holt.
భాషా శాస్త్రజ్ఞులకి పరమ ప్రమాణమైన గ్రంథాలలో ఇది ముఖ్యమైనది. భాషా శాస్త్రంలో అన్ని శాఖలలోనూ 1933 వరకూ జరిగిన పరిశోధనా ఫలితాలని సమగ్రంగా వివరిస్తుంది. సులభ శైలిలో సమగ్ర చర్చ, విభిన్న భాషల నించి ఉదాహరణలూ దీనిలో ప్రత్యేకతలు.

Bynon, Theodora. 1977. Historical Linguistics. Cambridge : Cambridge University Press.
చారిత్రక భాషా శాస్త్రానికి ఇది ఒక మంచి ప్రవేశక గ్రంథం.

Cardona, George, 1976. (Indian reprint 1980). PaaNini A Survey of Research. The Hague : Mouton.
ఇందులో పాణిని అష్టాధ్యాయిపై ఇంతవరకూ జరిగిన పరిశోధన సమీక్షే కాక అష్టాధ్యాయిపై వచ్చిన పరిశోధన గ్రంథాల, వ్యాసాల సమగ్ర పట్టిక ఉంది.

Catford, J.C. 1988. A Practical Introduction to Phonetics. Oxford : Clarendon Press
ధ్వని శాస్త్రానికి ఇది ఒక మంచి ప్రవేశక గ్రంథం.

Chomsky, Noam. 1957. Syntactic Structures. The Hague: Mouton.
ఇది ఉత్పాదక వ్యాకరణ సిద్ధాంతాలని మొట్టమొదట ప్రతిపాదించిన గ్రంథం.

1965. Aspects of the Theory of Syntax. Cambridge, Mass : M.I.T. Press.
పై గ్రంథం ఆధారంగా ఈ కాలో పరిశోధనల వల్ల వచ్చిన మార్పులు, చేర్పులు ఈ గ్రంథంలో విపులంగా చర్చించబడ్డాయి.

Crystal, David. 1985. A First Dictionary of Linguistics and Phonetics. New Delhi : Select Book Service Syndicate.
ఇది భాషా శాస్త్రంలోని పారిభాషిక పదాలని వివరించే నిఘంటువు.

Gleason, H.A. 1961. (Indian edition 1968). An Introduction to Descriptive Linguistics. (2nd revised edition). New York : Holt.
వర్ణనాత్మక భాషా శాస్త్రానికి ఇది ఒక మంచి ప్రవేశక గ్రంథం.

Hall, Robert A., Jr. 1964 (Indian edition 1969). Introductory Linguistics. Philadelphia : Chilton.
ఇది భాషా శాస్త్రం అన్ని శాఖల విషయాలనూ సమగ్రంగా వివరించే గ్రంథం.

Heffner, R-M.S. 1950. General Phonetics. Wisconsin : University of Wisconsin Press.
ఇది ధ్వని శాస్త్రాన్ని వివరించే ప్రమాణ గ్రంథాలలో ఒకటి.

Hockett, Charles F. 1958. (Indian edition 1970). A Course in Modern Linguistics. New York : Macmillan.
ఇది భాషాశాస్త్రం అన్ని శాఖల అంశాలనూ సమగ్రంగా వివరించే గ్రంథం.

Hoenigswald, Henry M. 1960. Language Change and Linguistic Reconstruction. Chicago : University of Chicago Press.
ఇది చారిత్రక వ్యాకరణంలో పునర్నిర్మాణ పద్ధతులను శాస్త్రీయంగా వివరిస్తుంది.

Hyman, Larry M. 1975. Phonology : Theory and Analysis. New York : Holt.
ఇది వర్ణ నిర్మాణ శాస్త్ర సిద్ధాంతాలని వివరించే ఒక ప్రమాణ గ్రంథం.

Radford, Andrew. 1981. Transformational Syntax. Cambridge : University Press.
ఇది చోమ్‌స్కీ నూతన సిద్ధాంతాలని సులభశైలిలో వివరించే గ్రంథం.

Robins, R.H. 1964. General Linguistics : An Introductory Survey. London : Longmans.
ఇది అన్ని భాషా శాస్త్ర శాఖలనీ సులభశైలిలో వివరించే గ్రంథం.

——— 1967. A Short History of Linguistics. London : Longmans.
ఇది ప్రాచీన కాలం నుంచీ ఇప్పటివరకూ వివిధ ఖండాలలో జరిగిన భాషా శాస్త్రాభివృద్ధిని సమీక్షించే చక్కని ప్రమాణ గ్రంథం.

Sapir, Edward. 1921. Language : An Introduction to the Study of Speech. New York : Harcourt, Brace & World.
ఇది వివిన్న కుటుంబాలకు చెందిన భాషల నించి ఉదాహరణలతో మానవ భాషా తత్వాన్ని వివరించే గ్రంథం.

Schane, Sanford A. 1973. Generative Phology. New Jersey : Prentice-Hall, Inc.
ఉత్పాదక వర్ణ నిర్మాణానికి ఇది మంచి ప్రవేశక గ్రంథం.

Sturtevant, Edgar H. 1947. An Introduction to Linguistic Science. New Haven and London : Yale University Press.
ఇందులో భాషాశాస్త్ర సిద్ధాంతాల వివరణ సంగ్రహ రూపంలో ఉంది.

Subrahmanyam, P.S. 1977. ద్రావిడ భాషలు. Annamalainagar.
ఇది ద్రావిడ భాషల తులన వ్యాకరణం.

Trudgill, Peter, 1974. Sociolinguistics : An Introduction. Harmondsworth : Penguin.
సాంఘిక భాషా శాస్త్రానికి ఇది మంచి ప్రవేశక గ్రంథం.

Warchaugh, Ronald. 1972. Introduction to Linguistics. New York : McGraw-Hill.

భాషాశాస్త్రంలో అన్ని శాఖలలో ఇది చక్కని వివరణ గ్రంథం.

Watterman, John T. 1963. Perspectives in Linguistics. Chicago : University of Chicago Press.

ఇది భాషాశాస్త్ర సిద్ధాంతాల పరిణామాన్నీ, మత భేదాలని సంగ్రహంగా వివరించే గ్రంథం.

# సాంకేతిక పద పట్టిక

| | |
|---|---|
| అక్రమబద్ధత | Irregularity |
| అక్షరత | Syllabicity |
| అక్షర నిర్మాణం | Syllable Structure |
| అగ్రాచ్చులు | Front Vowels |
| అంగవాక్యం | Embedded Sentence |
| అంగివాక్యం | Matrix Sentene |
| అచ్చులు | Vowels |
| అజాకర్షణ | Vowel Harmony |
| అతిశయ ద్యోతకం | Intensifier |
| అతి సంశ్లేషణాత్మక భాషలు | Polysynthetic Languages |
| అధికరణం | Locative |
| అధికరించు | Dominate |
| అధిక జిహ్వా కంపితం | Uvular Trill |
| అధ్యాంశిక వర్ణాలు | Suprasegmental Phonemes |
| అనంతః కేంద్రక నిర్మాణం | Exocentric Construction |
| అనియతికం | Unconditioned |
| అనిర్దిష్టం | Indefinite |
| అనుగతి | Entailment |
| అనుచిత విభాగం | Wrong Splitting |
| అనునాసికాచ్చు | Nasalized Vowel |
| అనునాసికాలు | Nasals |
| అనోష్ఠీకృతాలు | Unrounded |
| అంతరంగ నిర్మాణం | Deep Structure |
| అంతరంగ విభక్తి/కారకం | Deep Case |

| | |
|---|---|
| అంతరంగిక పరిణామం | Internal Change |
| అంతర్జాతీయ ధ్వని శాస్త్రజ్ఞుల సంఘం | International Phonetic Association |
| అంతర్దంత్యాలు | Inter-dentals |
| అంతర్వర్గత | Subordination |
| అంతస్థలు | Frictional Continuants, Semi-vowels |
| అంతస్స్ఫోటాలు | Implosive Stops |
| అంతఃకేంద్రక నిర్మాణం | Endo-Centric Construction |
| అంతఃప్రత్యయాలు | Infixes |
| అన్వయం | Agreement/Concord |
| అన్వాదేశ సంబంధం | Binding |
| అపహారక సూత్రం | Bleeding Rule |
| అప్రామాణిక మాండలికం | Non-standard Dialect |
| అభిధ | Conceptual Meaning |
| అభ్యనుజ్ఞ | Permission |
| అర్థకం | Morpheme |
| అర్థ క్షేత్రం | Semantic Field |
| అర్థ గౌరవం | Elevation of meaning |
| అర్థ భేదం | Semantic Difference |
| అర్థ నిర్మాణం | Semantic Structure |
| అర్థ లక్షణాలు | Semantic Features |
| అర్థవత్త | Meaningfulness |
| అర్థ విపరిణామం | Semantic Change |
| అర్థ వ్యాకోచం | Semantic Extension |
| అర్థ సంకోచం | Semantic Narrowing |
| అర్థ సందిగ్ధత | Semantic Ambiguity |
| అర్థ సాదృశ్యం | Semantic Similarity |

| | |
|---|---|
| అర్థానిర్దిష్ట సత్యాసత్యత | Semantically undertermined truth or falsehoold; Syntheticity |
| అర్థాపకర్ష | Degradation of Meaning |
| అర్థా సంబద్ధత | Semantic Anomoly |
| అర్థ సంవృతాచ్చులు | Half-close Vowels |
| అవరోహ స్థాయి | Falling Pitch |
| అవశిష్ట ప్రదేశం | Relic Area |
| అసాధువు | Ungrammatical |
| ఆకృతి | Form |
| ఆఖ్యాత పదబంధం | Predicate Phrase |
| ఆగమ స్పర్శం | Excrescent Stop |
| ఆదానభాషాంతరీకరణం | Loan-translation |
| ఆదానం | borrowing |
| ఆదాన మిశ్రమం | Loanblend |
| ఆదాన విక్షేపం | Loanshift |
| ఆదిస్వరాగమం | Prothesis |
| ఆదేశం | Substitution |
| ఆదేశ సంబంధం | Relation of Substitutability |
| ఆనుషంగికోచ్చారణ | Secondary Atriculation |
| ఆనుషంగిక లక్షణం | Accident/Accidence |
| ఆంతరంగిక పునర్నిర్మాణం | Internal Reconstruction |
| ఆంశిక వర్ణాలు | Segmental Phonemes |
| ఆభాస ప్రమాణీకరణం | Hyperstandardization |
| ఆరోహస్థాయి | Rising Pitch |
| ఆరోహ స్వరం | Rising Tone |
| ఆర్థికాంగం | Semantic Component |
| ఆలంకారిక ప్రయోగం | Figurative Use |
| ఆవశ్యకత | Necessity/Obligation |
| ఆవశ్యకతాపూరణం | Need-filling Motive |

| | |
|---|---|
| ఆశీస్సు | Wish |
| ఆశ్చర్యార్థకం | Interjection |
| ఇచ్ఛ | Mood |
| ఈషదున్నతం | Lower High |
| ఈషన్నిమ్నం | Higher Low |
| ఈషత్ స్పృష్టాలు | Fricatives |
| ఉచ్చారణాత్మక ధ్వనిశాస్త్రం | Articulatory Phonetics |
| ఉచ్చారణ ప్రయత్నం | Manner of Articulation |
| ఉచ్చారణ స్థానం | Point of Articulation |
| ఉచ్చస్వరం | High Tone |
| ఉత్తమ పురుష | First Person |
| ఉత్పాదక వర్ణ నిర్మాణం | Generative Phonology |
| ఉత్పాదక వ్యాకరణం | Generative grammar |
| ఉత్పాదక వ్యాకరణవేత్తలు | Generative Grammarians |
| ఉత్పాదన శక్తి | Productivity |
| ఉదాత్తత | Stress |
| ఉద్దేశ్యం | Subject |
| ఉద్దేశక్రియ | Modal Verb/Auxiliary |
| ఉన్నతాచ్చులు | High Vowels |
| ఉన్నతస్థాయి భాష | Prestige Language |
| ఉప కుటుంబాలు | Subgroups |
| ఉప పదం | Article |
| ఉపరివర్గత | Superordination |
| ఉపహారక సూత్రం | Feeding Rule |
| ఎత్తు | Height |
| ఓష్ఠ్యాలు | Bilabials |
| ఓష్ఠ్యీకరణం | Labialization |
| ఓష్ఠ్యీకృతం | Rounded |

| | |
|---|---|
| కంఠమూలం | Glottis |
| కంఠమూలీకృతస్పర్శం | Glottalized Stop |
| కంఠమూలీయాలు | Glottals |
| కంఠమూలీయ స్పర్శం | Glottal Stop |
| కంఠమూలీయ హల్లులు | Laryngeals |
| కంఠ్యం | Velar |
| కంపితాలు | Trills |
| కరణం | Articulator |
| కరణం (కారకం) | Instrumental |
| కర్త | Agentive |
| కర్మ | Objective |
| కారణం | Reason |
| కాలం | Tense, Time |
| కింది పెదవి | Lower lip |
| కుటుంబ వృక్షపటం | Family Tree Diagram |
| కులమాండలికం | Social Dialect |
| కేంద్రాచ్చులు | Central Vowels |
| కేంద్ర ప్రదేశం | Focal Area |
| కొండనాలుక | Uvula |
| క్రమ విపర్యయం | Rearrangement |
| క్రమబద్ధ సూత్రాలు | Ordered Rules |
| క్రియ | Verb |
| క్రియాపద బంధం | Verb Phrase |
| క్రియా విశేషణం | Adverb |
| క్రియాస్థితి | Aspect |
| క్వణం | Click |
| గుణం | Quality |
| గుసగుస | Whisper |
| చేర్పు | Addition |

| | |
|---|---|
| చోటు | Place |
| జనాత్మక విభజన | Genetic Classıfication |
| జిహ్వాగ్రం | Apex, Tip of the Tongue |
| జిహ్వాగ్రేయం | Coronal |
| జిహ్వోపాగ్రం | Lamina, Blade of the tongue |
| జిహ్వామధ్యం | Dorsum |
| జిహ్వామూలం | Root of the tongue |
| తద్ధర్మం | Habitual |
| తరంగ న్యాయం | Cyclic principle |
| తాడితాలు | Flaps |
| తాలవ్యం | Palatal |
| తాలవ్యీకరణం | Palatalization |
| తాలువు అగ్రభాగం | Front of the hard palate |
| తాలువు మధ్యభాగం | Centre of the hard palate |
| తారతమ్య చరిత్ర | Relative chronology |
| తులన పద్ధతి | Comparatıve Method |
| తుల్యవర్ణాత్మక భిన్నార్థకాలు | Homophonous Morphemes/Forms |
| దత్తం | Input |
| దంతమూలం | Alveolar |
| దంత్యాలు | Dentals |
| దంతోష్ఠ్యాలు | Labiodentals |
| దీర్ఘం | Long |
| దీర్ఘీకరణం | Continuant |
| దుహితృ భాషలు | Daughter Language |
| దూరస్థం | Remote |
| దృఢం | Tense (Oppo. lax) |
| దృఢీకరణం | Strengthening |
| ద్విభాషా వ్యవహారం | Bilingualism |
| ద్విమాండలికత | Diglossıa |

| | |
|---|---|
| ద్విరుక్తి | Reduplication |
| ద్విస్థానోచ్చారణ | Double articulation |
| ద్రోణీకృతేషత్ స్పృష్టాలు | Groove Fricatives |
| ధాతువులు | Roots |
| ధ్వని | Reflected meaning |
| ధ్వని | Sound |
| ధ్వని తరంగాత్మక ధ్వనిశాస్త్రం | Acoustic Phonetics |
| ధ్వని పరిణామం | Sound Change |
| ధ్వని సూత్రాలు | Phonetic Laws |
| ధ్వన్యంగం | Phonetic Component |
| ధ్వన్యాత్మక లిపి | Phonetic Transcription |
| ధ్వని శాస్త్రం | Phonetics |
| నరాల బిగింపు | Muscular Tension |
| నాదం | Voice |
| నాదత | Voicing |
| నాద తంత్రులు | Vocal Cords |
| నాద ధ్వనులు | Voiced Sounds |
| నామపద బంధం | Noun Phrase |
| నామవాచకం | Noun |
| నాలుక నరాల దృఢత | Tenseness |
| నిక్షిప్త సమాధాన ప్రశ్న | Self-answered Question |
| నిమ్నాచ్చులు | Low Vowels |
| నిమ్నేతర మధ్యమం | Lower mid |
| నియతి | Pattern |
| నియంత్రణ | Government |
| నిరుద్ధ స్ఫోటనం | Delayed Release |
| నిర్దిష్టం | Definite |
| నిర్దేశక వాక్యాలు | Declarative Sentences |
| నిర్మాణ క్రమం | Pattern |

| | |
|---|---|
| నిర్మాణ ద్వైవిధ్యం | Duality |
| నిర్వర్త్యం | Factitive |
| నిశ్చయం | Certainity |
| నిష్పన్న(రూప)ం | Output |
| నిష్పాదకాలు | Derivatives |
| నైఘంటుకార్థం | Lexical Meaning |
| నైఘంటుకా పదం | Lexeme |
| పదం, మాట, శబ్దం | Word |
| పదాత్మకం | Morphological |
| పదాంత సంధి | External Sandhi |
| పద నిర్మాణం | Morphology |
| పదప్రయోగ నిషేధం | Taboo |
| పదమధ్య సంధి | Internal Sandhi |
| పదమధ్య స్వరలోపం | Syncope |
| పదబంధ నిర్మాణం | Phrase Structure |
| పదబంధ నిర్మాణ సూత్రాలు | Phrase Structure Rules |
| పదసంహిత | Word Juncture |
| పదాది స్వరలోపం | Aphaeresis |
| పదాంత స్వరలోపం | Apocope |
| పదార్థం | Matter |
| పదాల వరస | Word Order |
| పద్ధతి | Manner |
| పరముఖ వర్ణసమీకరణం | Regressive Assimilation |
| పరస్పరార్థావగతి | Mutual Intelligibility |
| పరసర్గ | Post-position |
| పరిపూరక ప్రవృత్తి | Complementary Distribution |
| పరివర్తన వ్యాకరణం | Transformational grammar |
| పరివర్తన సూత్రాలు | Transformations |
| పరిసరం | Conditioning |

| | |
|---|---|
| పశ్చాత్కంఠ్యాలు | Uvulars |
| పశ్చిమం | Back |
| పశ్చిమాచ్చులు | Back Vowels |
| పాక్షిక సమీకరణం | Partial Assimılation |
| పార్శ్వికాలు | Laterals |
| పునర్నిర్మిత రూపం | Reconstructed Form |
| పురుష | Person |
| పురస్సం | Anterior |
| పురోనునాసిక్యత స్పర్శాలు | Prenasalized Stops |
| పూరకం | Complement |
| పూర్ణ సమీకరణం | Total Assimilation |
| పూర్వ ప్రత్యయాలు | Prefixes |
| పూర్వముఖ వర్ణ సమీకరణం | Progressive Assimilation |
| పూర్వసర్గ | Preposition |
| పూర్వోద్దేశం | Presupposition |
| పై పెదవి | Upper Lıp |
| పౌనఃపున్య సూత్రాలు | Recursive Rules |
| ప్రక్రియా పద్ధతి | Item and Process |
| ప్రతిరూపాలు | Reflexes |
| ప్రతిష్ఠాపాదనం | Prestige Motive |
| ప్రత్యయాలు | Affixes, Suffixes |
| ప్రత్యయ పునర్నిర్మాణం | Morphologıcal Reconstruction |
| ప్రత్యయ రహిత భాషలు | Analytic/Isolatıng/Root Languages |
| ప్రత్యేకత | Specialisation |
| ప్రథమ పురుష | Third Person |
| ప్రధానవయవం | Head |
| ప్రధాన వ్యాకరణ వర్గాలు | Primary Grammatical Categoı. |
| ప్రమాణోచ్చారణ | Received Pronunciation |
| ప్రమాణ భాష | Standard language |

| | |
|---|---|
| ప్రవృత్తి | Performance |
| ప్రశ్న వాక్యాలు | Interrogative Sentences |
| ప్రాగ్‌శాఖా వర్ణ నిర్మాణం | Prague School Phonology |
| ప్రాథమికాచ్చులు | Cardinal Vowels |
| ప్రాథమిక రూపాలు | Basic or Underlying Forms |
| ప్రామాణిక మాండలికం | Standard dialect |
| ప్రేరణ దూరత | Displacement |
| బంధువాచక పదాలు | Kinship terms |
| బహిరంగ విభక్తి | Surface Case |
| బహిరంగ నిర్మాణం | Surface Structure |
| బహుభాషా ప్రదేశం | Linguistic area |
| బహుభాషా వ్యవహారం | Multilingualism |
| బహు వ్యాపకాలు | Prosodies |
| బహువ్యాపక వర్ణ నిర్మాణం | Prosodic Phonology |
| భంగ్యంతర వాక్యం | Paraphrase |
| భవిష్యత్తు | Future |
| భావన | Concept |
| భాషా కుటుంబం | Language Family |
| భాషాభాగాలు | Parts of Speech |
| భిన్న పరిసరాలు | Different Environments |
| భూతం | Past |
| భూతార్థం | Past Meaning |
| భేదకత్వం | Contrast |
| భేదకత్వ నివృత్తి | Neutralization |
| భేదక యుగ్మం | Minimal Pair |
| మంద్రం | Sonorant |
| మాధ్యమాచ్చులు | Mid Vowels |
| మధ్యమ పురుష | Second Person |
| మధ్యమ స్వరం | Mid Tone |

| | |
|---|---|
| మహా ప్రాణాలు | Aspirated Stops |
| మాండలికం | Dialect |
| మాండలిక పటం | Dialect Atlas |
| మిశ్ర వ్యవహార ప్రదేశం | Transition Area |
| మిశ్రితార్థకం | Portmanteau Morph |
| ముఖ్య క్రియ | Main Verb |
| మూలభాష | Parent/Proto Language |
| మూల వాక్యాంశం | Proposition |
| మూర్ధన్యం | Retroflex |
| మృదు తాలువు | Soft palate |
| మౌఖికాచ్చులు | Oral Vowels |
| మౌలిక పదజాలం | Basic Vocabulary |
| యోగ్యతా నియమాలు | Selectional Restrictions. |
| యోగ్యతా సంబంధం | Relation of Co-occurrence |
| లక్షణ | Connotative Meaning |
| లక్షణాత్మక విభజన | Typological Classification |
| లింగం | Gender |
| లోకనిరుక్తి | Folk Etymology |
| లోపం | Deletion |
| లోపం | Zero |
| లోప సార్థకం | Zero Allomorph |
| వక్తృమనః ప్రవృత్తి | Affective Meaning |
| వక్తృశ్రోతృ పరిణామం | Interchangeability |
| వక్త్రిచ్ఛ | Modality |
| వచనం | Number |
| వర్తమానం | Present |
| వర్తులం | Round |
| వర్ణ కల్పం | Archiphoneme |
| వర్ణం | Phoneme |

| | |
|---|---|
| వర్ణ పరిణామం | Phonemic Change |
| వర్ణ పునర్నిర్మాణం | Phonological Reconstruction |
| వర్ణ ప్రవృత్తి | Distribution of Phonemes |
| వర్ణ మేళనం | Merger |
| వర్ణ లోపం | Phonemic Loss |
| వర్ణ విదళనం | Split |
| వర్ణ విభేదనం | Dissimilation |
| వర్ణ వ్యత్యయం | Methathesis |
| వర్ణ సమీకరణం | Assimilation |
| వర్ణ స్థాయి | Phonemic Level |
| వర్ణాత్మకం | Phonological |
| వస్తు పరిణామం | Subreption |
| వాక్యం | Sentence |
| వాక్య నిర్మాణం | Syntax |
| వాక్య నిర్మాణ సంబంధాలు | Syntractic Relations |
| వాక్య సంబద్ధత | Inconsistency |
| వికరణాత్మక భాషలు | Agglutinative/Affixing Languages |
| విధి వాక్యాలు | Imperative Sentences |
| విధేయం | Predicate |
| విభక్తి | Case |
| విభక్తి వ్యాకరణం | Case Grammar |
| విభక్తి సంయోజకాలు | Inflectional Suffixes |
| విభక్తి సంయోజన | Inflection |
| విరుద్ధార్థకత | antonymy |
| వివరణాత్మక సత్యం | Analytic Truth |
| వివృతాచ్చులు | Open Vowels |
| విశేషణం | Adjective |
| విశేషణం | Attribute |
| విశ్లేషణం | Subordinate |

| | |
|---|---|
| విశ్లేషణాత్మక భాషలు | Analytic Languages |
| విశ్వజనీన లక్షణం | Universal Feature |
| విహిత క్రమం | Extrinsic Ordering |
| వైయక్తిక మాండలికం | Idiolect |
| వ్యతిరేకత | Contradictoriness |
| వ్యధికరణ నిర్మాణం | Subordinate Construction |
| వ్యర్థపద ప్రయోగం | Semantic Redundancy |
| వ్యవహార రేఖలు | Isoglosses |
| వ్యాకరణార్థం | Grammatical Meaning |
| వ్యాకరణ లింగం | Grammatical Gender |
| వ్యాకరణ వర్గాలు | Grammatical Categories |
| వ్యాపార భాష | Pidgin Language |
| వ్యాపార మాతృభాష | Creole |
| వ్యుత్పత్త్యాభాసం | False Etymology |
| వ్యుత్పత్తి పరిశోధన | Etymological Study |
| శబ్దార్థ సంబంధ కృత్రిమత | Arbitrariness |
| శబ్దావళి | Paradigm |
| శాఖామూలం | Node |
| శైలీ గతార్థం | Stylistic Meaning |
| శ్రవణాత్మక ధ్వని శాస్త్రం | Auditory Phonetics |
| శ్రుతి | Intonation |
| శ్లథ (ం) | Lax |
| శ్లథీకరణం | Weakening |
| శ్వాస ధ్వనులు | Voiceless Sounds |
| సజాతి శబ్దాలు | Cognates |
| సదృశ వర్ణ లోపం | Haplology |
| సంధ్యక్షరాలు | Diphthongs |
| సంధి వర్ణాలు | Morphophonemes |
| సనియతికం | Conditioned |

| | |
|---|---|
| సన్నివేశ పద్ధతి | Item and Arrangement (IA) |
| సన్నిహితావయవాలు | Immediate Constituents |
| సన్నిహిత పదమేళనం | Contamination |
| సభ్యోక్తి | Euphemism |
| స్పర్శాలు | Plosives/Stops |
| స్పృష్టోష్మం | Affricate |
| సప్తపథ | Pharynx |
| సంబద్ధ శబ్దావళీ పద్ధతి | Word and Paradigm (WP) |
| సంబంధ లక్షణాలు | Relational Components |
| సంభావన | Possibility |
| సమానాధికరణం | Coordinate |
| సమానార్థకత | Synonymy |
| సమీకరణం | Assimilation |
| సముచ్చయం | Conjunction |
| సంప్రదానం | Dative |
| సంయుక్త వాక్యం | Compound/Conjoined Sentence |
| సంయోజనాత్మక భాషలు | Aggulutinative Languages |
| సంవృతాచ్చులు | Close Vowels |
| సంశ్లిష్ట వాక్యం | Complex Sentence |
| సంశ్లేషణాత్మక భాషలు | Synthetic/Inlexional Languages |
| సమస్థాయి | Level Pitch |
| సమేషత్ స్పృష్టాలు | Slit Fricatives |
| సవర్ణాలు | Allophones |
| సవర్ణ పరిణామం | Allophonic/Subphonemic Change |
| సర్వనామం | Pronoun |
| సర్వ దేశాలు | Suppletives |
| సహజ క్రమం | Intrinsic Orders |
| సహజ లింగం | Natural Gender |
| సహాయక క్రియ | Auxiliary Verb |

| | |
|---|---|
| సాంఘిక భాషా శాస్త్రం | Sociolinguistics |
| సాధ్యత | Possibility |
| సామర్థ్యం | Competence |
| సామీప్యం | Proximate |
| సామ్యం | Analogy |
| సాంస్కృతిక ప్రసరణ | Cultural Transmission |
| సార్థకం | Allomorph |
| సాహచర్యం | Collocative Meaning |
| సూచక విశేషణాలు | Determiners |
| సోదర భాషలు | Sister Languages |
| స్థల మాండలికం | Regional Dialect |
| స్మారక సూత్రం | Global Rule |
| స్వరం | Pitch |
| స్వరపేటిక | Larynx |
| స్వర భక్తి | Anaptyxis/Epenthesis |
| స్వర శ్రుతి | Glide |
| స్వాభావిక పరివర్తనం | Automatic Alternation |
| స్థాన సంబంధం | Positional Relation |
| స్వేచ్ఛా ప్రవృత్తి | Free Variation |
| హల్లులు | Consonants |
| హల్లోపకృత స్వరదీర్ఘత | Compensatory Lengthening |